*'....as it teaches words, it moulds the mind.'*

*- SAMUEL BUTLER*




# పలుకుబడి

సంపాదకులు :

**ఎబికె ప్రసాద్**

**సతీష్ చందర్**



**ఎబికె పబ్లికేషన్స్**

**హైదరాబాద్**

# VAARTHA PALUKUBADI

***- A Professional compendium of words for Journalists and Writers***

Year of Publication : 1996

Copies : 1000

Price : Rs. 50/-

For Copies **ABK Publications**
4-3-347/A, Bank Street,
Hyderabad - 500 095 (A P)

Cover Design : Bhagavan

Typesetting : **V.S.S. Laser Graphics**
Lakdikapool,
Hyderabad.

Printed at **Navya Printers**
Rajbhavan Road,
Hyderabad.

# Dedication

*We dedicate this professional and functional compendium, meant for Journalists of Telugu Press, to Shri Sudhir Sanghi and Shri Girish Sanghi who invested their hearts and minds in support of our efforts in trimming up the work in tune with the spirit of the times.*

– Editors

# కృతజ్ఞతలు

పాత్రికేయ ప్రత్యేక పద సంపద 'పలుకుబడి'ని సంకలనంగా తీసుకురావడంలో మాకు తోడు నీడగా నిలిచిన ఈ కింది ప్రసిద్ధులకు, సహ పాత్రికేయులకు, గ్రంథకర్తలకు, సంస్థలకూ మా కృతజ్ఞతలు జెకె గాల్‌బ్రిత్, డేవిడ్ రిబర్డ్‌సన్, పిఎఎస్ టేలర్, విలియమ్ మోరిస్, జేఎమ్ షాఫ్రిజ్, డేనియల్ ఓరాన్, వి రఘునాథన్, రఘు అండ్ పాలెట్, నార్మన్ డబ్ల్యు షూర్, ఎన్.హెచ్ అండ్ ఎస్.కె మేజర్, అలన్ పామిర్, జె.&సి మెరియన్ అండ్ కో, ప్రోగ్రెస్ పబ్లిషర్స్, ఎపి (లారెల్ రిఫరెన్స్) స్టైల్ బుక్, స్టేట్స్‌మన్ స్టైల్ బుక్, క్రిస్తోఫర్ డబ్ల్యు ఫ్రెంచి, ఎలిజబెత్ హోల్డ్, నైగల్ రీస్, చార్లెస్ ఫిలిప్ బ్రౌన్, హెచ్ డబ్ల్యు ఫౌలర్, ఇ.బి ఉవరోవ్ అండ్ అలన్ ఇసాక్స్, ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ ఫర్ ఎడిటర్స్ అండ్ రైటర్స్, నార్ల వెంకటేశ్వరరావు, విద్వాన్ విశ్వం, దిగవల్లి శివరావు, తిమ్మావజ్ఝల కోదండరామయ్య, తిరుమల రామచంద్ర, కొడవటిగంటి కుటుంబరావు, సంజీవదేవ్, నండూరి రామమోహన్‌రావు, కె. వాసుదేవరావు, సి వెంకటేశ్ (స్పోర్ట్స్), కె శ్రీనివాస్, జె శ్రీనివాస్, సుబ్బారాయుడు, నామాడి శ్రీధర్, ఒమ్మి రమేష్‌బాబు, సువర్ణకుమార్, సి హెచ్. గంగాధర్, బి. బాలసుబ్రహ్మణ్యం

ముచ్చటగా కంపోజ్ చేసిన వి యస్.యస్. లేసర్ గ్రాఫిక్స్, అందంగా ముద్రించిన నవ్య ప్రింటర్స్ అధినేతలకు...

- సంపాదకులు

# పదపదాన......

# అక్షర సైనికుల అంబుల పొది!

మళ్ళీ ఒక నిఘంటువా! కాదు అలాంటి అవసరం కూడా లేదు ఒక ఇంగ్లీషు పదం - దాని ప్రక్కనే రెండు మూడు సరిసమానమైన తెలుగు పదాలూ కొత్తగా పొందు పరచనవసరం లేదు అలాంటి నిఘంటువులు మార్కెట్లో కోకొల్లలు ఇలాంటివి పత్రికా రచయిత ప్రత్యేక అవసరాలను పెద్దగా తీర్చలేవు పత్రికా రచయితల అవసరాలెప్పుడూ పాఠకుల అభిరుచుల్నిబట్టే మారుతుంటాయి ప్రపంచ పత్రికా రంగం వేగంగా మారుతోంది, గంట గంటకూ ప్రపంచ వార్తల్నందించే ఎలక్ట్రానిక్ మీడియా తాకిడి సైతం ఎదిరించి నిలుస్తోంది అచ్చుగుద్దిన పదానికి (PRINTED WORD) వున్న శాశ్వతత్వం ఎప్పటికప్పుడు అదృశ్యమయ్యే తెరమీద బొమ్మలకుండదని నిరూపిస్తోంది ఇలా నిలవగలగడానికి కారణం - పత్రికలు పాఠకుల సకల జీవితావసరాలపైనా దృష్టి సారించడమే

ఈ నేపధ్యంలోనే పాఠకుల ప్రత్యేకాభిరుచులకు (SPECIAL INTERESTS) మరింత ప్రాధాన్యం వచ్చింది ఫలితంగా - వానలకోసం రైతు ఆకాశం వైపు చూడడం మాని పత్రికకేసి చూస్తున్నాడు ఉద్యోగాలకోసం నిరుద్యోగి ఉపాధి కేంద్రాల చుట్టూ తిరగడం మాని, పత్రిక చుట్టూ పరిభ్రమిస్తున్నాడు పరిశ్రమల భవితవ్యం కోసం వ్యాపారి పంచాంగాన్ని చూడడం మాని పత్రికల్ని తిరగేస్తున్నాడు కంప్యూటర్ల విన్యాసాల కోసం నిపుణులు పారిశ్రామిక ప్రదర్శనలకు వెళ్ళడం మాని పత్రికని వెంటాడుతున్నారు ఇలా ప్రతీ రంగాన్నీ పత్రికారంగం రంగరించుకొని తనలో ఇమడ్చుకొంటోంది సంపూర్ణత్వాన్ని పొందుతోంది. కాబట్టి ప్రతీ రంగానికీ ప్రత్యేక పదజాలం (JARGON) వుంటుంది ఈ పదజాలంలో ఎంతో కొంత పత్రికా రచయిత తెలుసుకుంటాడు తెలుసుకోవాలి కూడా అంతేకాదు, ఆ ప్రత్యేక పదాలను సాధారణీకరించి, సామాన్య పాఠకుడికి సైతం సన్నిహితం చెయ్యాలి

ప్రపంచ పత్రికా రంగాన్ని కాస్త ఆలస్యంగానైనా అనుసరించి మరింత సొంత గొంతుతో ముందుకు సాగుతున్న తెలుగు పత్రికా రంగం పాఠకుల ప్రత్యేకాభిరుచుల్ని ఆకళింపు చేసుకుంటోంది వాటికి అరకొర పేజీల్ని కేటాయించడం మొదలుపెడుతోంది వ్యాసాల వరకు దిగి వచ్చింది ఈ అభిరుచులు వార్తల్లో కూడా ప్రతిఫలించాలి అప్పుడే సమగ్రత వస్తుంది

ఇప్పటికీ తెలుగు పత్రికలు ప్రపంచంతో పొత్తు పెట్టుకోవడానికి వున్న ఏకైక వారధి ఇంగ్లీషు భాష ఈ భాషనుంచే మనం కొత్త అర్థాల్ని వెత్తుక్కుంటూ వుంటాం ఖండించటాలు, ఉద్ఘాటించటాలు, నొక్కిచెప్పటాలు - అలా దిగిన సరుకే ముక్కస్య ముక్కానువాదాలు తెలుగు పత్రికకు సొంత ముఖాన్నివ్వలేవు కేవల నానార్థాలు, తర్జుమా చేసి చేతులు దులుపుకోవడానికి ఉపయోగపడతాయేమో కాని, పత్రికా శైలిని సుసంపన్నం చేయలేవు అవి పత్రికా రచయిత సాధారణావసరాలను తీరుస్తాయి కాని, ప్రత్యేకావసరాలను తీర్చలేవు

ఉదాహరణకి - రాజకీయాలను విశ్లేషిస్తూ ఒక ఇంగ్లీషు జర్నలిస్టు - ఇటీవల "Entryism" బాగా పెరిగింది - అని అంటాడనుకోండి ఈ మాట మన తెలుగు పత్రికా రచయితకి కొరుకుడు పడదు వెంటనే నానార్థాల సాధారణ నిఘంటువుని తెరుస్తాడు అందులో Entryism అనే పదం దొరకదు. Entry అనే పదంతో సరిపుచ్చుకోవాలని చూస్తాడు దానికి నానార్థాలుగా - ద్వారం, మార్గం, ప్రవేశం - అని ఉంటాయి

ఏ అర్థం సాయంగా ఈ మాటను అనువదించాలి? ఇలాంటప్పుడు సాధారణ నిఘంటువులే కాదు, వాటిని వివరించిన తెలుగు పండితులు కూడా అక్కరకు రారు మళ్ళీ ఒక జర్నలిస్టో, లేక రాజనీతి శాస్త్రవేత్తో - ఆదుకోవలసిందే శల్య సారధ్యం వహించడానికి శత్రుపక్షంలో కలగలిసిపోయే వ్యూహాన్ని - Entryism అంటారన్నది ప్రపంచ రాజకీయాల్ని శ్రద్ధగా అధ్యయనం చేస్తున్నవాళ్ళకి కాని బోధపడదు అయితే ప్రత్యేకావసరాల్ని తీర్చడానికి కూడా కొన్ని నిఘంటువులొచ్చాయి అవి కూడా మళ్ళీ నానార్థాలే యిచ్చి ఊరుకున్నాయి 'తిలకాష్టమహిషబంధనం' లాంటి గొలుసుకట్టు పదాల్ని ఎలా సృష్టించాలి - అని కాలాన్ని ఖర్చుచేసే తెనాలి రామకృష్ణులకు మన (జర్నలిస్టుల) అవసరాలు తెలియకపోవచ్చు కాబట్టి మన పనిముట్ల పొదిని (TOOL - BOX) మనమే తయారు చేసుకోవాల్సి వచ్చింది కాబట్టి ఈ 'పలుకుబడి' మనది మనకోసం మనం రాసుకున్నది అదే - 'వార్త' పలుకుబడి

అంతేకాదు మనం ఒక పనిముట్టును వేర్వేరు పనులకుపయోగిస్తాం ఒక పదాన్ని వేర్వేరు సందర్భాల్లో వేర్వేరు విధాలుగా అనువదిస్తాం ఒక వైద్యశాస్త్ర విద్యార్థి Anatomy అనే పదాన్ని ఒకే అర్థం - (శరీర ధర్మం)లో వాడతాడు అదేమాటని ఒక చిత్రకారుడు కూడా ఒకే అర్థం (శరీరాకృతి)లో వాడతాడు అయితే జర్నలిస్టు రెండు అర్థాలలోను పలు సందర్భాల్లో వాడతాడు కాబట్టి అతడికి నానార్థాలని ఒకే చోట ఏకరవుపెట్టే నిఘంటువు కాకుండా సందర్భానుసారంగా గుర్తు చేసే నిఘంటువుకి అవసరం 'వార్త పలుకుబడి'లో ఈ సౌకర్యం వుంది ఇదే పదానికి ఒక అర్థం 'సైన్స్' విభాగంలో దొరికితే, మరొక అర్థం 'ఆర్ట్స్' విభాగంలో దొరుకుతుంది వెదకడం కూడా సులభమౌతుంది (చిత్రలేఖనం మీద వార్తని అనువదిస్తూ అందులో వచ్చిన Anatomy అనే పదం కోసం 'సైన్సు' విభాగంలో వెదకం కదా!) అయితే ఆయా శాస్త్రాల్లోని అన్ని పదాలూ ఈ 'పలుకుబడి'లోనే వుంటాయా? - అని అడిగితే ఉండవనే చెబుతాం వ్యవహారంలోకి వచ్చిన ముఖ్యమైన పదాల్నే ఆయా జాబితాల్లో చేర్చే ప్రయత్నం చేశాం

అర్థం అంటే మాటకు మాట చెప్పడం కాదు దాని రంగూ, రుచీ, పరిమళం చెప్పడం "రాజకీయాల్లో వచ్చే పదాలకు అర్థాలను సైద్ధాంతికంగా నిర్ణయించాలి కానీ వ్యాకరణబద్ధంగానో తర్కబద్ధంగానో కాదు (Politics as an art and political science as a discipline, are overwhelmingly about words, shades of meaning, ideological linkages neither grammatically nor logically determined)" అని డేవిడ్ రాబర్ట్‌సన్ అనే రాజనీతి శాస్త్రజ్ఞుడు అంటాడు. ఈ నిబంధన ఒక్క రాజకీయాలకే కాదు అన్ని రంగాలకూ వర్తిస్తుంది ఆయా రంగాలనిబట్టి 'పలుకుబడి' మారాలి లేకుంటే అర్థం కృతకమౌతుంది అలాంటప్పుడే అనువాద తెలుగుకన్నా, పరాయి భాష మెరుగనిపిస్తుంది.

ఒక్కసారి రెండు మూడు ఇంగ్లీషు మాటలకి కలిపి ఒకే అర్థం వాడుతుంటాం ఇలాంటి తర్జుమా వల్ల అనువాదం మొద్దుబారుతుంది స్పష్టత లోపిస్తుంది ఇప్పటికీ కొంతమంది - Trade, Commerce, Business అనే మాటల్ని సమానార్థకాలుగా వాడుతుంటారు ఇతర సందర్భాల్లో అయితే ఫర్వాలేదు కాని అర్థశాస్త్ర పరిధిలో ఈ మాటకు వేర్వేరు అర్థాలున్నాయి. కొనడం అమ్మడాన్ని Trade (వర్తకం) అనీ, వస్తువుల్ని ఉత్పత్తిదారుడి నుంచి వినియోగదారుడి వరకూ చేరవేసే సమస్త సేవల మొత్తాన్నీ Commerce (వాణిజ్యం) అనీ, లాభార్జనకోసం చేసే ఏ వ్యాపకాన్నయినా Business (వ్యాపారం) అంటారనీ తెలిస్తే అనువాదం చాలా స్పష్టంగా వుంటుంది. అలాగే ప్రత్యక్ష ప్రజాస్వామ్య పద్ధతుల్లోని

Plebisciteనీ, Referendumనీ ఒకే రీతి (జనవాక్య సేకరణ)లో అనువదిస్తున్నారు అందుకే మాటకు మాటనే అర్థంగా యివ్వకుండా వాటి conceptని పరిచయం చేసే ప్రయత్నం చేశాం

ఇవాళ ఇంగ్లీషు మాటకు తెలుగు అర్థాన్ని స్థిరపరచేది నైఘంటికుడు కాడు అర్థం ప్రజాస్వామికంగానే స్థిరపడుతుంది రచయిత ప్రతిపాదిస్తే ప్రజలు (పాఠకులు) ఆమోదిస్తారు ఒక్కసారి ప్రజలు అందిస్తే రచయిత స్వీకరిస్తాడు ఏదీ 'వన్ వే' కాదు ఉదాహరణకి Hung Parliament అనే మాటకి 'త్రిశంకు సభ' అని పత్రికా రచయిత ప్రవేశపెట్టాడు దానిని ప్రజలు స్వీకరించారు Dredger అనే మాటకి ప్రజలే 'తవ్వోడ' అన్నారు ఒక రచయిత స్వీకరించి ప్రయోగించాడు కాబట్టి రచయితగాని, పత్రికా రచయిత కాని నోరు తిరగని పదాలను ప్రజలమీద రుద్దే ప్రయత్నం చేయకూడదు స్వేచ్ఛ ఉన్న చోటే సృజనకు చోటు వుంటుంది పత్రికా రచయితలకు కూడా అనువాద స్వేచ్ఛ ఉండాలి సబ్ ఎడిటర్ దగ్గర నుంచి ఎడిటర్ వరకూ 'తెలుగు పలుకుబడి'ని పెంచే అవకాశం వుంది కొత్త ఇంగ్లీషు మాటకి సరయిన తెలుగు మాటనే ప్రయోగించే అర్హత అందరికీ ఉంటుంది ఎటొచ్చీ తెలియాల్సింది 'భావన' (Concept) మాత్రమే వ్యవహారభాషకి వుండే ఈ ప్రజాస్వామిక లక్షణాన్ని దృష్టిలో వుంచుకొని చాలా చోట్ల రెండేసి తెలుగుమాటల్ని ప్రతిపాదించాం మంచిదనుకున్న దాన్ని స్వీకరించవచ్చు ఇలా స్వీకరించిన మాటతోపాటు కొత్త పదాల Conceptని కూడా వార్త / వ్యాసంలో పరిచయం చేయాల్సిన బాధ్యతను పాఠకులకు అలవాటయ్యే వరకూ విస్మరించకూడదు మొత్తంమీద మాటకి తగ్గ అర్థాన్నే కాదు, అర్థానికి తగ్గ మాటని కూడా డిస్కవర్ చెయ్యడానికి వీలుగా 'పలుకుబడి' తీర్చిదిద్దడానికి ఒక ప్రయత్నం చేశాం

ఇప్పుడొస్తున్న రచయితలకీ, పత్రికా రచయితలకీ పల్లెల్లోని 'పలుకుబడి' సంగతి తక్కువ తెలుసు ఎక్కువ మందికి మన సామెతలూ, జాతీయాలూ తెలీవు తెలుగు నెలలూ, సంవత్సరాలూ తెలీవు వాటిని పరిచయం చేసి ఆసక్తిపెంచే ప్రయత్నం కూడా చేశాం తూనికల్నీ, కొలతల్నీ మార్చుకొనే పద్ధతిని సూచించాం

వీటితోపాటు 'తెలుగు వాక్యాన్ని' గ్రాంధికపు వాసనల్నించి బయటపడెయ్యాలనుకున్నాం 'మరియు', 'యొక్క' లాంటి మరికొన్ని పదాల్ని గుర్తు పట్టి ప్రజాస్వామికంగా 'వెలి'వేశాం పత్రికా రంగంలో కాగితాలు లేని కంప్యూటర్ వాతావరణానికి ఆహ్వానం పలుకుతూ అందుకు సంబంధించిన ప్రత్యేక పదజాలాన్ని చేర్చాం

కొత్తదనం కోసం పరితపించే ప్రతీ రచయితకీ, పత్రికా రచయితకీ ఈ 'పలుకుబడి' ఉపయోగపడుతుందని మా విశ్వాసం ఈ 'పలుకుబడి'కి తొలిపుట వుంటుంది కానీ మలిపుట వుండదు ప్రతి ఏడాదీ కొత్త పదాలతో కొన్ని కొత్త పేజీలు చేరుతూనే వుంటాయి పదసృష్టి జరుగుతూనే ఉంటుంది భాష నిత్య ప్రవాహిని

మన 'పలుకుబడి' తరగని సంపద ప్రజల ఆయుధాగారం బ్రైస్ పెరియన్ చెప్పినట్లు 'పదాలు - దట్టించిన తుపాకులు (Words are loaded pistols) వీటిని ఆకతాయిపిల్లవాళ్ళలాగా కాకుండా సుశిక్షితులైన సైనికుల్లాగా ఉపయోగించే వాళ్ళే రచయితలూ, పత్రికా రచయితలూ

**- సంపాదకులు**

# రాజనీతి శాస్త్రం



**Agent Provocateur** = కజ్జాకోరు / రెచ్చగొట్టేవాడు

**Aggrandizement** = వృద్ధి / గొప్పతనం

**Aggression** = దురాక్రమణ ఇంతవరకూ దీనికి సరైన నిర్వచనం ఎవరూ చెప్పలేకపోయారని కృష్ణమీనన్ అన్నాడు

**Agrarian Parties** = రైతాంగ పక్షాలు / గ్రామీణ పక్షాలు (ఇవి కూడా రాజకీయ పక్షాలే రైతులకు గ్రామీణ ప్రజలకు ప్రధానంగా ఇవి ప్రాతినిధ్యం వహిస్తాయి ఒకప్పుడు స్కాండినేవియాలో ప్రపంచంలో ఎక్కడికంటే కూడా ఈ పార్టీల బలం జాస్తీగా ఉండేది 1800-1910 మధ్యకాలంలో అమెరికాలో ప్రత్యేకించి రైతాంగానికి వేరే పార్టీలు ఉండేవి అయితే ప్రతి పార్టీకి ఒక రైతు విభాగాన్ని ఏర్పాటు చేయడం పరిపాటి అయిపోయిన ప్రస్తుత ప్రజాస్వామ్య వ్యవస్థల్లో వీటి అవసరం దాదాపు లేనట్లే)

**Alienation** = పరాయీకరణ (తనతనాన్ని కోల్పోవడం)

**Ambassador** = రాయబారి

**Ambassador extraordinary** = విశిష్టదూత (ఒక ప్రత్యేకమైన పనిమీద ప్రభుత్వం పంపించే రాయబారి)

**Ambassador plenipotentiary** = ఖరారునామా దూత (సభలనూ ఒప్పందాలనూ కుదర్చడానికి సంప్రదింపులు జరిపే సాధికార దూత)

**Ambassador-at-large** = విశ్వదూత (ప్రత్యేకించి ఒక దేశానికి కాకుండా ప్రపంచంలో ఏ భాగంలోనైనా స్వదేశానికి ప్రాతినిధ్యం వహించే రాయబారి)

**Anarchy** = అరాచకం

**Anomie** = సాంఘిక రాజకీయ స్తబ్దత

**Anti-Ballistic Missile Treaty** = ఖండాంతర క్షిపణుల నిరోధక ఒప్పందం

**Anti-Semitism** = యూదు వ్యతిరేకత (యూదుల పట్ల వుండే వ్యతిరేక భావం దీనిని హిట్లర్ పెంచి పోషించాడు)

**Apartheid** = జాత్యహంకారం (నెల్సన్ మండేలా నల్లజాతి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసేంతవరకూ శ్వేత జాతీయుల జాత్యహంకార ప్రభుత్వమే దక్షిణాఫ్రికాని పాలించింది)

**Apparatchik** = ప్రభుత్వాధికారి (Apparat అంటే రాజ్యాంగ యంత్రాంగం అని అర్థం అందులోని ఉద్యోగినే Apparatchik అంటారు స్థూలార్థంలో ఇతణ్ణి బ్యూరోక్రాట్ అని కూడా అంటారు)

**Arbitration** = మధ్యవర్తిత్వం (దేశాల మధ్య / వ్యక్తుల మధ్య వివాదం వచ్చినప్పుడు మూడవ వ్యక్తి / దేశం తీర్పు చెప్పడం)

**Aristocracy** = కులీనస్వామ్యం (అధిక సంఖ్యాకులపై అల్ప సంఖ్యాకుల పెత్తనం ఈ అల్ప సంఖ్యాకులు ఎక్కువ సార్లు సంపన్న వర్గాలే అవుతారు)

**Arms race** = ఆయుధ పోటీ

**Asian Subcontinent** = (ఆసియా ఉపఖండం) : ఈ పేరు సాధారణంగా బంగ్లాదేశ్, భూటాన్, ఇండియా, నేపాల్, సిక్కిం, శ్రీలంకలకు వర్తిస్తుంది కాగా ఆసియాలోని ఇతర దేశాలకు / ప్రాంతాలకు వర్తించే పదాలు వేరు (ఉదా: తూర్పు ఆసియా, పశ్చిమ ఆసియా, ఆగ్నేయాసియా)

**Attache** = (ఎటాషి) : అనుబంధ దూత (రాయబారికి అనుబంధంగా ఉంటూ సలహాలిచ్చే వ్యక్తి ఉదా: కల్చరల్ ఎటాషీ, మిలటరీ ఎటాషీ)

**Aufklarung (German)** = వికాసనోద్యమం (18వ శతాబ్దపు మేధావులు తలపెట్టిన ఉద్యమం)

**Auschwitz** = కాన్సన్ట్రేషన్ క్యాంపు : దారుణ నిర్బంధ శిబిరానికి ఇది మారుపేరు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో నాజీ హిట్లర్ మూకలు యూదులను వేధించి హింసించేందుకు నెలకొల్పిన శిబిరం ఇది

**Autarchy** = సంపూర్ణాధిపత్యం (absolute

sovereignty).

**Autarky** = స్వయం సమృద్ధి

**Authoritarianism** = పెత్తందారీ పాలన (ప్రజల అభీష్టాలతోగానీ, అభిప్రాయాలతోగానీ సంబంధం లేకుండా పాలించడం. అలాగని దీనిని నియంతృత్వం అని అనరు. ప్రతి [illegible] సమర్థించుకోవాలని చూస్తుంది పెత్తందారీ పాలన)

**Axis powers** = అక్షరాజ్యాలు : రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ, ఇటలీ, జపాన్‌ల కూటమిని (alliance) ఇలా అనేవారు

**Ayathollas** = ఇరాన్ మత పాలకులు

**Balance of power** = రాజ్యాధికార సమతుల్యత

**Balfour Declaration** = బాల్‌ఫర్ ప్రకటన: (పాలస్తీనాలో 1917లో యూదుల ప్రభుత్వం ఏర్పాటుకు అవకాశం కల్పించిన ప్రకటన - అయితే యూదేతం జాతుల హక్కులను గౌరవించి తీరాలన్న షరతు కూడా యిందులో భాగమే. ఈ ప్రకటన కర్త పేరు బాల్‌ఫర్)

**Ballistic Missile (ABM)** = ఖండాంతర క్షిపణి

**Ballot** = బ్యాలెట్ / ఓటు

**Ballot rigging** = బ్యాలెట్ రిగ్గింగ్ (అక్రమంగా ఓటు చెయ్యడం)

**Benelux countries** = బెల్జియం, నెదర్లాండ్స్, లక్సెంబర్గ్‌లను కలిపి ఇలా అంటారు

**Bill of rights** = హక్కుల పత్రం / పౌరహక్కుల పత్రం (ఉదా: ఇంగ్లీషు, అమెరికన్, ఫ్రెంచి రాజ్యాంగాలలో ఈ పత్రాలు అంతర్భాగం)

**Bi-polar** = ద్వి కేంద్ర ప్రపంచం (ఉదా: సోవియెట్ పతనమయ్యేవరకూ, అమెరికా, సోవియెట్‌లు ప్రపంచాన్ని పంచుకొన్నాయి )

**Black leg** = సమ్మె విద్రోహి (అందరూ సమ్మె చేస్తుంటే పనిలో పాల్గొనే కార్మికుణ్ణి యిలా సంబోధిస్తారు. మొదట్లో ఈ పదం జూదగొండులకూ, గుర్రప్పందాల్లో పాల్గొనే వాళ్ళకూ వర్తింపచేశారు. పరస్పర ద్రోహం ఈ ఆటల్లో రివాజు. కడకు 1930లో అమెరికాలో ట్రేడ్ యూనియన్ పరిభాషకు కూడా ఇది పాకింది)

**Blitzkrieg** = మెరుపుదాడి (రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీ సేనలు ప్రారంభించిన ఆకస్మిక దాడుల సందర్భంగా పుట్టిన పదమిది)

**Bolshevik** = బొల్షివిక్కు (1917 రష్యన్ విప్లవానికి ముందు, ఉద్యమంలో బోల్షివిక్ ఉద్యమం ఒక భాగం. ఈ పదం ఆల్ రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ రెండుగా చీలిపోయినప్పుడు పుట్టింది. ఈ రెండు పక్షాలలో ఒక దానిని మెన్షివిక్కులు (మైనారిటీ)గానూ మరొకదానిని బొల్షివిక్కులు (మెజారిటీ)గానూ పిలిచారు. విప్లవ చైతన్యానికి మారుపేరుగా బొల్షివిక్ చైతన్యాన్ని పిలిచేవారు (Bolshevik spirit).

**Brownout** = (బ్రౌనౌట్) : తాత్కాలికంగా ఓల్టేజ్ తగ్గింపును ఇలా అంటారు. విద్యుచ్ఛక్తిని పొదుపు చేయడానికి ఈ పని చేస్తారు

**Bureau Crazy** = రాజకీయవేత్త (పాలకుడు) ప్రాపకంపొందడానికి బ్యూరోక్రాట్ జరిపే పెనుగులాట

**Bureaucracy** = అధికార స్వామ్యం (అధికార యంత్రాంగం కొన్ని సందర్భాల్లో రాజకీయ యంత్రాంగాన్ని లక్ష్యపెట్టకుండా ప్రవర్తిస్తుంటుంది)

**Butskellism** = మిశ్రమ ఆర్థిక విధానం (Mixed Economy): అయితే ఇది నెహ్రూ మార్కు "మిశ్రమ ఆర్థిక విధానం" కాదు. బ్రిటన్‌లో రెండో ప్రపంచ యుద్ధం తర్వాత మొదటి కన్సర్వేటివ్ ప్రభుత్వం ఏర్పడ్డప్పుడు ఈ పదం పుట్టింది. అంతకు ముందున్న బ్రిటీష్ ఆర్థిక మంత్రి గైట్‌స్కెల్, ఆ తర్వాత కన్సర్వేటివ్ ఆర్థిక మంత్రి బట్లర్‌ల ఉమ్మడి ఆర్థిక విధానాన్ని ఈ పేరుతో వెక్కిరించారు )

**Cabbages and Kings** = ఇది ఇంగ్లీష్ టి వి సీరిస్‌లో, రేడియో క్విజ్ పోటీల్లో పలుమార్లు "క్యాబేజెస్ అండ్ కింగ్స్" పేరిట వచ్చిన ప్రసిద్ధ శీర్షిక. రచయిత లూయీ కరోల్ రచన "Through the Looking Glass" లోని ఒక ఘట్టం ఈ ప్రయోగానికి ఆధారం. ఆ ఘట్టంలో ఓసన్నివేశం "వాల్రస్ అండ్ ది కార్పెంటర్". అందులోని సంభాషణ ఇది :

**"The time has come, the Walrus said, To talk of many things: Of shoes-and ships and sealing-wax / Of cabbages**

**and kings (1871)"** అంతేకాదు కరోల్ కంటే ముందు రివరెండ్ సిడ్నీస్మిత్ జీవిత చరిత్ర "స్మిత్ ఆఫ్ స్మిత్" లో గ్రంధకర్త హెస్కెత్ పియర్సన్ ఈ ప్రయోగం చేశాడు ఆ చరిత్రలో ప్రస్తావించిన జార్జిగ్రాసీ అనే ఆవిడ గురించి స్మిత్ చెప్పిన మాటలివిః

**"She had innumerable hobbies, among them horticulture and democracy, defined the most approved methods of growing cabbages and destroying kings"!!**

**Cabinet Government** = క్యాబినెట్ ప్రభుత్వం (ఇది బ్రిటీష్ రాజ్యాంగ పరిభాషనుంచి ఎరువు తెచ్చుకున్నది కొద్దిమంది సీనియర్ రాజకీయ వేత్తలు దేశ విధానాలను తీర్చిదిద్దేందుకు ఏర్పరచిన బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఇలా అంటారు కామన్‌వెల్త్ దేశాలన్నిటిలోనూ ఈ తరహా ప్రభుత్వం కనిపిస్తుంది సమష్టి బాద్యత ఈ వ్యవస్థకు ఆయువుపట్టు)

**Canute** = రాజు కాన్యూట్ ః ఇంగ్లాండ్, నార్వే, డెన్మార్క్‌లకు ఒకనాటి డేనిష్ రాజు ఇతడు (1035) ఇతని గురించి కట్టు కథలు కొన్ని వ్యాప్తిలోకి వచ్చాయి వాటిలో ఒకటి - సముద్రపు కెరటాల్నివెనక్కి తొలగమని శాసించాడనీ, కాని విఫల మనో రథుడయ్యాడనీ! ఎవరైనా ఏదైనా మొండిగా వాదిస్తూ 'తాపట్టిన కుందేటికి మూడే కాళ్ళ'ని చెప్పే మొండి ఘటాలకు 'కాన్యూట్'తో పోల్చడం పరిపాటి నిజానికి కాన్యూట్ ఆ పని చేయలేదు పాత కథల్ని నమ్మి శ్రీశ్రీ కూడా 'కడలి తరగలాపెదవా భడవా! ఓ కాన్యూట్?!' అని శాపనార్థంగా ప్రశ్నించాడు కాని అసలు వాస్తవం ఇదిః తన అధికారానికి పరిమితులున్నాయని తన వంది మాగధులకు నచ్చచెప్పి నిరూపించడంకోసం కాన్యూట్ తన సింహాసనాన్నే సముద్రం దగ్గరకు నడిపించాడు "చూడండి! నేను శాసించినా కడలి తరగలు వెనక్కి తగ్గాయేమో చూడండి! అలాగే నా అధికారానికి కూడా పరిమితులున్నాయని మీరు మరవకండి" అన్నాడు కాన్యూట్ ప్రవచించిన ఈ రాజనీతి విశేషాన్ని మొదటిసారిగా 12వ శతాబ్దపు లిఖిత ప్రతి "హిస్టోరియా ఆంగ్లోరం"లో నమోదు చేశారు

**Cape Canaveral** = రోదసీ నౌక ప్రయోగ కేంద్రం (అమెరికా) ఫ్లోరిడాలో కెన్నడీ రోదసీ కేంద్రం ఉన్నది ఇక్కడనే (Kennedy Space Centre).

**Capitalism** = పెట్టుబడిదారీ విధానం / పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ (దీనికి పునాది స్వేచ్ఛాయుతమైన మార్కెట్)

**Catch-22 (situation)**= సంకట స్థితి / 'ముందు నుయ్యి - వెనుక గొయ్యి'

ఈ ప్రయోగానికి ఆధారం జోసెఫ్ హెల్లర్ అనే కథా రచయిత రాసిన 'కాచ్-22' అనే నవల ఇది 1970లో చలన చిత్రంగా కూడా వచ్చింది రెండో ప్రపంచ యుద్ధంలో కొంతమంది అమెరికన్ వైమానిక దళ సభ్యులు ఎదుర్కొన్న సంకట స్థితిని ఒక సైనిక పాత్ర ద్వారా హెల్లర్ ఈ నవలలో వర్ణిస్తాడు యుద్ధంలో విధి నిషేధాలు అలాంటివి యుద్ధంనుంచి సైనికుడు పారిపోనూ లేడు, అందులో ఇమిడిపోనూ లేడు - ఇదే ఆ సంకట స్థితి కెప్టెన్ యోసారియన్ ఇంక తాను బాంబుదాడులు సాగించలేను మొర్రో అన్నప్పుడు యుద్ధ నియమాలు అతణ్ణి అస్త్ర సన్యాసం చేయడానికి అంగీకరించవు ఆ దశలో యుద్ధం అంటే అయిష్టంగా వున్న సైనికుడి పరిస్థితి 'ముందు నుయ్యి - వెనుక గొయ్యి'

**Catch-all-parties** = సిద్ధాంత రహిత పక్షాలు (ప్రజల ఆర్థిక, సాంఘిక పరిస్థితుల పట్ల స్పష్టమైన అవగాహన, విధానమూ లేని రాజకీయ పక్షాలను ఇలా అంటారు ఎన్నికల సమయంలో కళ్ళాంలో 'పరిగె'లు ఏరుకున్నట్లే ఓట్లు ఏరుకోవడమే వీటి తక్షణ, శాశ్వత కర్తవ్యాలు మన దేశంలో కూడా ఇలాంటి వాటికి కొదువ లేదు)

**Cats and dogs (raining)** = కుండపోత వర్షం /భారీ వర్షంః వెనుకటికి సరైన మురుగు నీటిపారుదల సౌకర్యం లేని రోజుల్లో, డ్రైనేజి అంతా వీధుల్లోనే పారే రోజుల్లో ఇంగ్లండ్‌లో వచ్చిన సామెత ఇది భారీ వర్షాల్లో పిల్లులూ, కుక్కలూ కొట్టుకు వచ్చేవట తుఫాను

[illegible]
[illegible]
[illegible]
[illegible]
పురాణ గాథ ప్రకారం, వాతావరణం [illegible] ప్రభావం
[illegible] కుక్క లు [illegible]
ప్రజల నమ్మకం కాబట్టి 'కుండపోత వర్షానికి పిల్లి
విహ్వారం, తుపానుకు దారితీసిన ఈదురుగాలులకు
కుక్క చివ్వాయని' ఒక విశ్వాసం!

**Charisma** = జనాకర్షక శక్తి / సమ్మోహన శక్తి (ఉదా: గాంధీ, స్టాలిన్, చర్చిల్, మండేలా, ఇందిరాగాంధి, ఎన్ టి ఆర్ లకు ఈ శక్తి ఉంది)

**Chauvinist** = (చావనిజం) అహంకారి, జాత్యహంకారి (నెపోలియన్ సేనలో నికొలెస్ చూవిన్ అనే గుడ్డి దేశ భక్తుడుండేవాడు)

**Chips are down** = క్లిష్ట పరిస్థితి ("a crucial stage in a situation") : పందెం ఒడ్డడం, పందాలు కాసినప్పుడు ఫలితం కోసం ఎదురు చూడడమేగాని తేల్చి చెప్పలేరు అదే క్లిష్ట దశ

**Christian Democractic Parties** = క్రిష్టియన్ డెమోక్రటిక్ పార్టీలు (రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత యూరప్‌లోనూ, లాటిన్ అమెరికాలోనూ, ఇటీవల కాలంలో సోషలిజం పతనం తర్వాత తూర్పు యూరప్ లోనూ తలెత్తిన రాజకీయ ఉద్యమాన్ని ఇలా అంటారు)

**C.I.A.** = సెంట్రల్ ఇంటెలిజన్స్ ఏజెన్సీ (అమెరికా గూడాఛారి సంస్థ)

**Cinderella** = అందచందాలు, ప్రతిభా పాట వాలున్నా గుర్తింపు లేని యువతి ఈ యువతి గాథకు మూలం పెరాల్ట్ రాసిన ఓ ప్రసిద్ధ జానపద కథ (1637)

**Citizen of the World** = ప్రపంచ పౌరుడు / విశ్వ మానవుడు : సుప్రసిద్ధ ఆంగ్ల కవి ఆలివర్ గోల్డ్ స్మిత్ రాసిన లేఖల సంకలనం పేరు ఇది

**Citizen, Resident, Subject, National, Native** = ఈ అయిదు పదాలను సందర్భాన్ని బట్టి భిన్నార్థాలలో వాడాలి పుట్టుకతోగాని, ప్రకృతి ధర్మంగాగానీ జాతి పౌర హక్కులు పూర్తిగా సంక్రమించిన వ్యక్తిని 'పౌరుడు' (సిటిజన్) అంటారు అమెరికాలో రాష్ట్రంలో, నగరాలలో వ్యక్తులను ప్రస్తావించేటప్పుడు 'రెసిడెంట్' (స్థానిక నివాసి) అన్న అర్థంలో వాడతారు దేశ వ్యాప్తంగా వాడాల్సినప్పుడు 'సిటిజన్' అంటారు

చక్రవర్తి పాలనలో లేదా మరో రాజు పాలనలో వున్న పౌరుణ్ణి 'పాలితుడు' (సబ్జెక్టు) అని పాలిస భాషలో వాడుతూ వచ్చారు

వ్యక్తి, కావడానికి దేశ పౌరుడైనా దేశాంతరాల్లో లేదా విదేశాల్లో నివసించుతున్నప్పుడు 'నేషనల్' అన్నారు అమెరికాలో ఉన్న భారతీయుణ్ణి ఇండియన్ నేషనల్ అంటారు అలాగే నాన్-రెసిడెంట్ ఇండియన్ (NRI) ఇండియాలో అమెరికా పౌరుడుంటే అమెరికన్ నేషనల్ అంటారు

ఫలానా చోట / ప్రాంతంలో పుట్టిన వ్యక్తిని 'నేటివ్' అంటారు ఉదా: నెల్లూరువాసి / కరీంనగర్ వాస్తవ్యుడు

**Civil Defence** = పౌర రక్షణ (యుద్ధ సమయంలో ప్రజల ప్రాణ నష్టాలను అగ్గించే రక్షణ వ్యూహం మొట్ట మొదటి పౌర రక్షణ పథకాలు 1930 ఉత్తరార్థంలో ప్రారంభమయ్యాయి )

**Civil disobedience** = శాసనోల్లంఘనోద్యమం (ఈ నిరసన వ్యూహానికి ఆద్యుడు గాంధీజీ ఈ ఉద్యమం మొదట్లో దక్షణాఫ్రికాలో జాత్యహంకార విధానాలకు నిరసనగానూ, ఆ తర్వాత బ్రిటీష్ సామ్రాజ్య వాదపాలనకు నిరసనగానూ ప్రారంభ మయ్యింది)

**Civil law** = పౌర న్యాయం (యూరోపియన్ సాంప్రదాయం ప్రకారం దీనిని 'కోడ్ లా' అంటారు ఈ కోడ్ లాను శాసన సంస్థలు రూపొందించి, క్రోడీ కరిస్తాయి)

**Civil liberties / rights** = పౌర స్వేచ్ఛ / హక్కులు (ఉదారవాద ప్రజాస్వామ్య, సామాజిక వ్యవస్థలన్నింటికీ ఇవి పట్టుగొమ్మలు)

**Civil Service** = పౌరసేవా వ్యవస్థ (పౌర సిబ్బందీ, అధికారులూ) : ప్రభుత్వ పాలనా వ్యవస్థకు వీళ్ళు మూలం ప్రభుత్వమూ, శాసన వేదికా కలిసి రూపొందించే విధానాలనూ, చట్టాలనూ, నియమ నిబంధనలనూ ఈ

వ్యవస్థ అమలు జరుపుతూంయుంది )

**Civilwar** = అంతర్యుద్ధం

**Class** = వర్గం (ఉత్పత్తి మీద ఆధిపత్యాన్ని బట్టి ఏర్పడె సాంఘిక విభాగం ఉదా: సంపన్నవర్గం, శ్రామికవర్గం)

**Cloture (Closure)** = శాసన వేదికలో (పార్లమెంట్‌లో) చర్చను ముగించే పార్లమెంటరి పద్ధతిని టెక్నికల్‌గా 'క్లోచర్ అనాలి కాని క్రమంగా సౌలభ్యం కోసం 'క్లోజర్' అంటారు, ముగింపు చర్చను

**Coalition (Ministry)** = సంకీర్ణ / మిశ్రమ మంత్రివర్గం (ఒక ఉమ్మడి రాజకీయ శత్రువు నెదుర్కొవడం కొసం, తమ విబేదాలను పక్క కు నెట్టుకొని రెండు గాని అంతకు మించి గాని రాజకీయ పక్షాలు కలిసి ఏర్పాటు చెసుకునే మంత్రివర్గం)

**Cold War** = ప్రచ్ఛన్న యుద్ధం / అజ్ఞాత యుద్ధం: ప్రత్యక్షంగా యుద్ధానికి దిగకపోయినా, రాజ్యాల మధ్య ఉద్రిక్త పరిస్థితులు నెలకొని ఉండడాన్ని "కోల్డ్ వార్" అంటారు ప్రదానంగా రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా, సోవియెట్ యూనియన్‌ల మధ్య పరస్పరం భయ వాతావరణంలో నెలకొని ఉన్న ఉద్రిక్తతా స్థితికి ఈ పదం వర్తిస్తుంది ఆ తర్వాత "కోల్డ్‌వార్' పదాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చినవాడు అమెరికన్ ద్రవ్య వ్యవహర్త, ప్రెసిడెంట్ సలహాదారుడైన బెర్నార్డ్ బరూక్ (1947) ఈ పదాన్ని బరూక్‌కు సూచించినవాడు అతని ఉపన్యాస రచయిత హెర్బర్ట్ బేయార్డ్ 1940 నుంచీ తరచుగా బేయార్డ్ ఈ పదాన్ని ప్రయివేట్ సంభాషణల్లో వాడుతూ వచ్చాడు

**Collective responsibility** = సమష్టి బాధ్యత (బ్రిటీష్ నమూనా కేబినెట్ - వెస్ట్ మినిస్టర్ - వ్యవస్థలో ఇది రాజ్యాంగబద్ధమైన ఆనవాయితీ మంత్రవర్గం చేసే నిర్ణయాలకు మంత్రులందరూ బాధ్యత వహించడం దీని ప్రత్యేకత )

**Colonialism** = వలసవాదం (పరాయి దేశం మరొక దేశంలో స్థావరం ఏర్పరచుకున్నప్పుడు దానిని 'కాలని' అంటారు. ఇటీవల కాలంలో కొత్తగా ఏదేశానికాదేశంలో ఇంటర్నల్ 'కలోనియలిజం' అమలులో ఉంటోంది పెట్టుబడులో, ఆర్థిక బలంలో పైచేయిగా ఉన్న ఒక ప్రాంతం దేశంలోని మరొక ప్రాంతం పట్ల సవతి తల్లి ప్రేమతో వ్యవహరించడాన్ని 'దేశీయి వలసవాదం'గా ప్రచారంలోకి వచ్చింది )

**COMECON** = ఇది ఒకప్పుడు సోవియెట్ ఆధిపత్యంలో వున్న తూర్పు యూరప్ దేశాల ఆర్థిక సమాఖ్య ఇప్పుడిది లేదు కేపిటలిస్టు దేశాలకు చెందిన యూరోపియన్ కామన్ మార్కెట్‌కు ఇది పోటీ వ్యవస్థ దీని సృష్టికర్త స్టాలిన్

**Common law** = కామన్ లా : ఇది బ్రిటీష్ న్యాయవ్యవస్థ ఆధారంగా ఏర్పడ్డ చట్టం దీనికి మూలం దేశీయ ఆచార వ్యవహారాలూ, సంప్రదాయాలూ, పూర్వాచార తీర్పులూ, వాటికి సంబంధించిన న్యాయస్థానాల వ్యాఖ్యలూ ఇంగ్లండు, వేల్స్, ఉత్తరమెరికాలలోనూ, ఒకనాటి బ్రిటీష్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా వున్న దేశాలలోనూ ఈ 'లా' అమలులో వుంది

**Commonwealth (of Nations)** = బ్రిటీష్ సామ్రాజ్యం ఆధిపత్యంలో ఉన్న వలస దేశాలు స్వాతంత్ర్యానంతరం ఐచ్ఛికంగా ఏర్పరచుకున్న సమష్టి వేదిక ఈ పదం గ్రీకు `OIKUMENE' (సమష్టి జీవనం) నుంచి పుట్టుకొచ్చింది హేతుబద్ధంగా ఆలోచించగలవారెవరైనా సమర్థించగల సమష్టి సంక్షేమం అనే భావనగా థామస్ హాబ్స్ ఈ పదాన్ని పేర్కొన్నాడు ఇందులో సభ్యులు: ఇండియా, బంగ్లాదేశ్, బార్బడోస్, బోట్స్‌వానా, కెనడా, సైప్రస్, ఫిజీ, గేంబియా, ఘనా, గ్రెనెడా, గయానా, జెమైకా, కెన్యా, లిసోథో, మలావి, మలేషియా, మాల్టా, మారిషస్, న్యూజిలాండ్, నైజిరియా, పాపువాన్యూగినీ, సెంట్ లూసియా, సేషల్స్, సిరాలియోన్, సింగపూర్, శ్రీలంక, స్వాజీలాండ్, టాంజానియ టాంగా, ట్రినిడాడ్ - టొబాగో, ఉగాండా, బ్రిటన్, వెస్టర్న్ సమోవా, జాంబియా నౌరూ, ప్రత్యేక సభ్యదేశంగా కామన్‌వెల్త్ కార్యకలాపాల్లో పాల్గొన్నా, దేశాధినేతల సమావేశాల్లో పాల్గొనదు

**Communalism** = మతతత్వ వాదం

**Commune** = కమ్యూన్ : స్థానిక ప్రభుత్వ వ్యవస్థకు ఆధార పీఠంగా దీనిని రాజకీయాలలో పరిగణిస్తారు

1960లలో సమష్టి జీవనాన్ని కాంక్షిస్తూ అనేకచోట్ల పలువురు యువకులు ఒక విశేష ప్రయత్నం చేశారు సమష్టి సంస్థలు నెలకొల్పుకొని ఒక చోటే కలిసి జీవించడం, తాము సేకరించుకున్న సంబారాలను సమష్టిగా అనుభవించడం - వీరి జీవన సరళి ఇక్కడ వ్యక్తి ఆస్తి హక్కు ప్రసక్తే లేదు పరస్పర సంక్షేమమే కమ్యూన్ పరమార్థంగా భావించారు 1870 - 71 ప్రష్యన్ యుద్ధం తర్వాత పారిస్‌లో తలెత్తిన 'పారిస్ కమ్యూన్' ఒక విప్లవాత్మక ప్రయోగం కాని, ప్రష్యన్ దురాక్రమణ దారుల సహాయంతో వర్సేల్స్ ప్రభుత్వం ఈ కమ్యూన్‌ని అణచివేసింది ఆధునిక విప్లవ యోధులకు కరదీపికగా ఈ కమ్యూన్‌ని కార్ల్‌మార్క్స్ తదితర ప్రజా తంత్ర విప్లవవాదులందరూ పరిగణించారు 1960లలో ఈ ప్రాతిపదికపైనే చైనాలో మావో కమ్యూన్ వ్యవస్థను ఒక విశిష్ట ప్రయోగంగా మలిచాడు

**Communism** = కమ్యూనిజం (సోషలిజానికి మార్క్స్, ఎంగెల్స్ మూలకర్తలు అలనాటి సోవియెట్ యూనియన్ సహా పెక్కు తూర్పు యూరప్ దేశాలు అసియాలో చైనా, లాటిన్ అమెరికాలో క్యూబాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఈ సిద్ధాంత ప్రాతిపదికపై ఏర్పడ్డాయి. సోషలిజం అత్యున్నత దశను మాత్రమే కమ్యూనిజంగా పిలవాలి.)

**Conclave** = పరిమిత సమావేశం : కొద్దిమందికే పరిమితమైన నాయక సమావేశం / జనాంతిక సమావేశం (ఉదా: టి డి పి మొదటి రోజుల్లో జరిపిన "విజయవాడ కాంక్లేవ్") అసలీ పదం పోప్‌ను ఎన్నుకునేందుకు కార్డినల్స్ జరిపే ప్రయివేట్ సమావేశం నుంచి పుట్టింది ఇది రోమన్ కాథలిక్ చర్చి పరిభాష

**Confederation** = రాజ్య సమాఖ్య : పెక్కు స్వతంత్ర దేశాలు తమ అత్యంత స్వయం ప్రతిపత్తిని కోల్పోకుండా ఏర్పరచుకునే సమాఖ్య అయితే దక్షిణమెరికాలో ఈ సమాఖ్య రాష్ట్రాల మధ్య వుంటుంది ఇది ఫెడరల్ వ్యవస్థకు భిన్నమైనది

**Confidence** = విశ్వాసం : ప్రభుత్వానికి లెజిస్లేచర్ యిచ్చే మద్దతు ఈ మద్దతును అవిశ్వాస తీర్మానం మీద పెట్టే ఓటింగు ద్వారా తెలుసుకుంటారు

**Confidence-Building measures** = విశ్వాస వారధులు (ఇండో-పాక్ చర్చలు, స్టాక్ హోం డిక్లరేషన్ వగైరా)

**Congress** = అమెరికన్ లెజిస్లేచర్‌ని ఇలా పిలుస్తారు ఇక మనదేశంలోని కాంగ్రెస్ పార్టీ ఎలాగూ తెలిసిందే

**Congress grass** = ఒక తరహా కలుపు మొక్కకు శాస్త్రవేత్తలు చేసిన నామకరణం

**Conservatism** = ఛాందసవాదం : నిర్దుష్ట సిద్ధాంతాలకి కట్టుబడకుండా గతంలో ఆచరించిందే కొనసాగాలనుకోవడం ఈ మాట 18వ శతాబ్దంనుంచి వాడుకలోకి వచ్చింది ఫ్రెంచి విప్లవం ఫలితంగా దూసుకొచ్చిన హేతువాదతత్త్వవేత్తల్ని, చైతన్యశీలుర్నీ ఎదుర్కోవడానికి పెట్టిన వాదాన్ని తొలుత యిలా పిలిచారు

**Consul** = వాణిజ్య ప్రతినిధి (ఇతర దేశాలలోని కీలకమైన నగరాలలో మనదేశపు వాణిజ్య ప్రయోజనాలను కాపాడే సాధికార ప్రతినిధి)

**Consul General** = ప్రధాన వాణిజ్య ప్రతినిధి (వాణిజ్య ప్రాముఖ్యంగల ప్రధాన నగరాలలో మాత్రమే వుండే అధికారి తన పరిధిలో వున్న ఇతర పట్టణాలలోని కాన్సల్స్‌ని కూడా పర్యవేక్షిస్తుంటాడు)

**Containment** = (కమ్యూనిజం వ్యాప్తిని) నిలువరించడం రెండవ ప్రపంచ యుద్ధ భీతితో అమెరికా రూపొందించుకున్న విదేశాంగ విధానంలో ఇదొక ప్రధాన భాగం

**Continent** = ఖండం : ఈ ప్రపంచం ఏడు ఖండాలు భూ వైశాల్యాన్నిబట్టి వీటిని ఇలా విభజించారు: ఆసియా, ఆఫ్రికా, ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, యూరప్, అంటార్కిటికా, ఆస్ట్రేలియా

**Copter** = హెలికాప్టర్

**Corporatism** = కార్పోరేటిజం : ప్రజలనూ, ప్రభుత్వాన్నీ అనుసంధానం చేసే పాలనా వ్యవస్థ ఇందులోకి కార్పోరేషన్లూ, ప్రభుత్వేతర సంస్థలూ కూడా వస్తాయి. మధ్యయుగాలలో చర్చి, రాచరికాలతోపాటు సమాజంలో ఇది ఒక తృతీయ శక్తిగా అవతరించింది. అయితే పారిశ్రామిక విప్లవంతో దీని స్వరూపమే

మారిపోయింది తిరిగి 20వ శతాబ్దంలో - 1930 - 40లలో ఫాసిజంతోపాటు ఒక రాజకీయ శక్తిగా కూడా అవతరించింది ఆ దరిమిలా ఎర్తక వాణిజ్యాలకు ప్రతిబింబంగా కార్పొరేటిజం పేరులోకి వచ్చింది

**Corridors of Power** = అధికార పంచలు / మంత్రాలయి సరిహద్దులు : ప్రభుత్వ పన్నుగడలకూ, కుతంత్రాలకూ ఇది మారు పేరు ఈ పేరుతో సి పి స్నో ఒక నవల రాశాడు (1964) బ్రిటన్ అధికార ప్రాసాదం వైట్ హాల్‌లో జరిగే మంతనాలను ప్రస్తావించినప్పుడు వాడుతూంటారు "హోమ్ కమింగ్స్" నవలలో స్నో ఇలా రాశాడు (1956): "The official world, the corridor of power, the dilemmas of conscience and egotism - she disliked them all"

**Coup De' Etat** = ఆకస్మిక కూల్చివేత : సైన్యంకాని, సైనిక సహాయంతో కాని ఆకస్మికంగా ప్రభుత్వాన్ని కూల్చివేయడం రాజకీయ సాంఘిక అస్థిరతను ఆసరా చేసుకొని మితవాద శక్తులు ఇలాంటి కుట్రకు పాల్పడతాయి

**Credibility Gap** = పరువు తక్కువ : విలువ కోల్పోవడం / పరువూ ప్రతిష్ఠా లోపించడం : 'ఇది సత్యం' అని చెప్పుకునే ప్రకటనకూ, అసలు వాస్తవానికీ మధ్య వ్యత్యాసం వల్ల ఈ లోటు ఏర్పడుతుంది ఈ మాట ప్రధానంగా వియత్నాంయుద్ధ సమయంలో వచ్చింది యుద్ధ పరిణామాల గురించి పత్రికలు ప్రకటిస్తున్న వాస్తవాలకూ, ప్రెసిడెంట్ లండన్ జాన్సన్ సత్యాన్ని కప్పిపుచ్చుతూ చేస్తూ వచ్చిన ప్రకటనలకూ పొంతన లేకుండా పోయిందానాడు అప్పుడొచ్చిన పదం ఇది ఈ పదాన్ని మొదటిసారిగా "వాషింగ్టన్ పోస్ట్ (1965) పతాక శీర్షిక ద్వారా ("Dilemma in Credibility Gap") పరిచయం చేసింది

**Cuba (Missile) Crisis** = క్యూబా సంక్షోభం: ఈ సంక్షోభం 1962లో కృశ్చేవ్ నాయకత్వాన రష్యా తీసుకున్న దుందుడుకు నిర్ణయం వల్ల ఏర్పడింది క్యూబాకు మధ్యతరహా అణ్వాయుధాలను తరలించడం ద్వారా కృశ్చేవ్ ఈ సంక్షోభాన్ని సృష్టించాడు సోవియెట్ సరిహద్దులలో వున్న టర్కీలో అమెరికా ఇలాంటి ఆయుదాలనే దుందుడుకుగా ప్రవేశపెట్టినందుకు మారుగా కృశ్చేవ్ ఈ పని చేశాడు అమెరికాకు 90 మైళ్ళలోనే క్యూబా వుంది అమెరికన్ ప్రెసిడెంట్ జాన్ ఎఫ్ కెనడి మిస్సైల్స్‌ని క్యూబానుంచి వెంటనే తొలగించాలని హెచ్చరించి అమెరికన్ యుద్ధ నౌకలను క్యూబా వైపుగా నడిపించాడు పలితంగా 1945 తర్వాత మళ్ళీ యుద్ధపుటంచులకు ప్రపంచం చేరుకుంది సోవియెట్ పోలిట్ బ్యూరోలో వచ్చిన చీలిక కృశ్చేవ్ పతనానికి క్రమంగా దారితీసింది రష్యా వెంటనే మిస్సైల్స్‌ను ఉపసంహరించుకుంది.

**Cultural Revolution** = సాంస్కృతిక విప్లవం : చైనా అధినేత మావో సేటుంగ్ నాయకత్వాన 1960లలో సైద్ధాంతిక క్షాళనోద్యమంలో భాగంగా ఈ సాంస్కృతిక విప్లవం వచ్చింది ఎన్నో కష్టనష్టాలకు వోర్చి చైనా విప్లవాన్ని విజయవంతంగా ముగించుకున్న ప్రజలు సోషలిస్టు పంథా కావాలో, కేపటిలిస్టు పంథా కావాలో నిర్ణయించుకోవలసిన విచిత్రమైన పరిస్థితి విప్లవ వ్యతిరేక శక్తుల వల్ల ఏర్పడింది ఆ సమయంలో యావత్తు చైనాను ఒక మహా విద్యాలయంగా, చర్చావేదికగా మార్చేందుకు ఈ సాంస్కృతిక విప్లవాన్ని నిర్వహించాడు మావో ఆలోచనలో, సిద్ధాంతపరమైన అవగాహనలో - ఒక్కమాటలో సంస్కృతిలో, సాంస్కృతిక జీవనంలో భావ విప్లవాన్ని ఆవిష్కరించడమే ఈ సాంస్కృతిక విప్లవం ప్రధాన లక్ష్యం

**Customer is always right** = సదా కొనుగోలుదారుడే శిష్టాది గురువు! ఈ సామెతను మొదట ప్రయోగించినవాడు గార్డన్ సెల్‌ఫ్రిడ్జ్ (1947) ఇతను అమెరికన్ మార్షల్ ఫీల్డ్ అండ్ కోలో పనిచేసేవాడు ఈ సామెతకూ, డిపార్ట్‌మెంట్ స్టోర్ ద్వారా విక్రయ వ్యాపార లావాదేవీలతో సంబంధమున్న అనేక ఇతర పద సంపదకూ ఇతను కారకుడంటారు

**D-Day**- విమోచన దినం : రెండవ ప్రపంచ యుద్ధకాలంలో మిత్రమండలి సేనలు యూరప్‌లో నాజీ జర్మన్ సేనలపై ఒక్క పెట్టున దండెత్తాయి ఈ దాడి ఆ తర్వాత కొలది నెలల్లో నాజీల ఓటమికి దారి

తీసింది. ఒక యూరప్‌కు విమోచనం కల్గించిన ఏదైనా యుద్ధం ప్రారంభమయ్యే మొట్టమొదటి రోజును 'డి' డే అంటారు (దిన ప్రారంభం)

**Dark horse** = అజ్ఞాత గుర్రం / అనామక వ్యక్తి : ఇది ఆలంకారికంగా వాడేమాట. గెలుపు ఓటములెవరివో నిర్ణయం కాని సమయంలో - ఫలానా వాడు నెగ్గలాడు, నెగ్గడు అని తెల్చి చెప్పలేని సమయంలో అనుకోని వ్యక్తి ఎవడో ఒకడు ముందుకు దూసుకువస్తాడు ఉదా ముఖ్యమంత్రి పదవికోసం పోటీలో వున్న ఒకే పార్టీలోని రెండు వర్గాలుకొట్లాడుకుంటున్న దశలో ఎవరో ఒక అనామిక వ్యక్తి నాయకత్వ స్థానంలోకి వస్తాడు అతడే ''డార్క్ హార్స్'' (అజ్ఞాత గుర్రం) ఈ పదాన్ని బెంజమిన్ డిజ్రెలీ వాడాడు (1831)

**Darkness at Noon** = మధ్యందిన రాత్రి / పట్టపగలే చీకటిః ప్రసిద్ధ రచయిత ఆర్థర్ కోజ్లర్ తన నవలకు పెట్టుకున్న పేరిది పార్టీ విద్రోహిగా మారాడని ఒక కమ్యూనిస్టును జైలుపాల్జేసి, విచారించి, ఉరితీసిన ఘట్టాన్ని వర్ణిస్తూ అతను ఈ పదాన్ని నిరసనగా సృష్టించాడు

**De Jure** = చట్టబద్ధంగా, చట్టరీత్యా (చట్టబద్ధంగా జరిగే ఎన్నిక ప్రాతిపదికగా కాకుండా, కేవలం అధికారంతోనే ప్రభుత్వంగా చెలామణి అవుతున్నప్పుడు దానిని Defacto ప్రభుత్వం అంటారు అంతమాత్రాన అది De Jure ప్రభుత్వం కానక్కర్లేదు)

**Decentralisation** = వికేంద్రీకరణ : (కేంద్రంనుంచి అధికారాలను రాష్ట్రాలకూ, యితర స్థానిక సంస్థలకూ బదలాయించడం ఎన్నికయిన ప్రతి నిధులకూ, అధికార యంత్రాంగానికీ మధ్య జరిగే అధికార విభజనని కూడా ఇలా పిలుస్తారు సర్వ సాధారణంగా రాజకీయ నిర్ణయాధికారాలకే ఈ వికేంద్రీకరణ వర్తిస్తుంది )

**Decree** = న్యాయాధికారం : మంత్రిగాని, మంత్రిత్వశాఖగాని ఒక నిబంధనకు సంబంధించి జారీ చేసే ఉత్తర్వు చట్ట సభలో చేసిన శాసనానికి ఇది సమానం దీనిని పార్లమెంటు ఆమోదానికి కూడా పెడతారు

**Deep throat** = కూపీదారు : ఒక సంస్థలో పనిచేస్తున్న తన సహచరులు అక్రమాలకు / దుర్మార్గాలకు పాల్పడబోతున్నప్పుడు ఆ విషయమై రహస్యంగా సమాచారాన్ని తెలియజేసె వ్యక్తిని 'డీప్ త్రోట్' అంటారు 1972-74 నాటి వాటర్ గేట్ కుంభకోణమప్పుడు వాషింగ్టన్ పోస్ట్ విలేఖరులైన కార్ల్ బెర్న్‌స్టీన్, బాబ్ ఉడ్‌వర్డ్‌లకు సమాచారం అందజేసిన నిక్సన్ అధ్యక్ష ప్రాసాదంలోని అధికారులను "డీప్ త్రోట్" అని వ్యంగ్యంగా పేరు పెట్టారు అంటే గరళ కంఠులన్నమాట! "డీప్‌త్రోట్" పేరుతో 1960లలో దారుణమైన ఒక అశ్లీలపు సినిమా కూడా వచ్చింది

**Defacto** = వాస్తవానికి, వాస్తవంలో

**Delegation (of authority or power)** = బదలాయింపు : చట్ట నిర్మాణ బాధ్యతను కింది సభలకూ, సంస్థలకూ అప్పగించడం

**Democracy** = ప్రజాస్వామ్యం

**Democratic centralism** = కేంద్రీకృత ప్రజాస్వామ్యం : దీని ప్రతిపాదకుడు లెనిన్ పార్టీలలోని వివిధ స్థాయి కమిటీలలో సభ్యులకి ఈ విధానం భిన్న అభిప్రాయాలను వ్యక్తం చేసే అవకాశం కల్పిస్తుంది అయితే ఈ అభిప్రాయాల క్రోడీకరణలో ఒక నిర్ణయం తీసుకున్నాక సభ్యులందరూ, తమ వ్యక్తిగత అభి ప్రాయాలను పక్కన పెట్టి, ఆ నిర్ణయానికి బద్ధులై వుండాలి అదే అసలు సిసలైన ప్రజాస్వామ్యంగా లెనిన్ చాటిచెప్పాడు

**Demogauge** = వాగాడంబరి / వాచాలుడు

**Demogrophy** = జనాభా శాస్త్రం

**Detente** = ఉద్రిక్తతా సడలింపు : ఈ పదం 1960 తర్వాత రాజకీయ పరిభాషలోకి వచ్చింది రష్యా, అమెరికాల మధ్య వున్న ఉద్రిక్తతను సడలించడం ప్రధాన వైదేశిక నీతిగా మారింది అప్పటినుంచి దేశాల మధ్య ఉద్రిక్తతను సడలించే ఏ కార్యక్రమానికయినా ఈ పదాన్ని వాడుతున్నారు

**Deterrence** = ఎదుర్కోవడం : అణ్వాయుధ పోటీ పెరిగిన తర్వాత, మరీ ముఖ్యంగా రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఒక దేశాన్ని చూసి మరొక దేశం

బెదిరిపోతున్న సందర్భంలో ఎవరికివారు పీకలదాకా అణ్వాయుధాల నిల్వలకి పాల్పడ్డారు ఈ ధోరణిలో ప్రధాన తత్త్వం - శత్రు దెబ్బ తీరును చూసి బయపడి వెనక్కి తగ్గక తప్పదని భావించడం

**Devolution (of power / resources)** = అధికార పంపిణీః కేంద్ర ప్రభుత్వం కింది ప్రభుత్వాలకు అధికారాలు పంపిణీ చేయడం దీనివల్ల ప్రభుత్వ నిర్వహణ సామర్థ్యం పెరుగుతుంది ఎవరికి వారు తమ స్థానిక వ్యవహారాలను సుఖంగా నిర్వహించు కోవడానికీ, వివిధ వర్గాల ప్రయోజనాలను కాపాడడానికీ తోడ్పడుతుంది 1970లలో స్కాట్లండు, వెల్స్‌లకు ప్రత్యేక అసెంబ్లీలు ఏర్పడాలన్న ప్రతిపాదన వచ్చి నప్పుడు ఈ పదం మొదటిసారిగా బ్రిటన్‌లో ప్రాచుర్యంలోకి వచ్చింది

**Dialectical Materialism** = గతితార్కిక భౌతిక వాదం : దీనిని కుదించి 'DIAMAT' అని కూడా పలుకుతుంటారు సమాజంలోని ఏ పరిణామాన్నయినా నిర్ణయించేవి వైయక్తిక కారణాలు కావనీ, సమాజంలో వున్న భౌతిక పరిస్థితులేనని నిరూపించి చెప్పినవాదం భౌతిక వాదం ఉదాహరణకి అభిప్రాయాలూ, ఆలోచనలూ, మత విశ్వాసాలూ - ఇవన్నీ సామాజిక భౌతిక పరిస్థితులనుంచే ఉత్పన్నమయ్యాయి ఏ పరిణామమూ స్వయంభువు కాదు పరస్పర విరుద్ధమైన ధోరణుల మధ్య ఏర్పడే ఘర్షణలోనుంచే మార్పు సంభవిస్తుందన్నది గతితర్కం హెగెల్‌ని మూలంగా చేసుకొని అతని భావ వాద ధోరణులనుంచి ఆ అవగాహనను రక్షించి మార్క్స్ ఏంగెల్స్‌లు గతితార్కిక భౌతికవాదాన్ని ఆచరణ యోగ్యంగా మలిచారు (పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను - అన్నాడు శ్రీశ్రీ)

**Diarchy** = ద్వంద్వ పాలన

**Dictatorship** = నియంతృత్వం : సర్వాధికారాలను ఒకే వ్యక్తి తన గుప్పెట్లో పెట్టుకుని పరిపాలించడం. ఉదాహరణకి హిట్లర్, ముస్సోలినీ, ఫ్రాంకో అలాంటి నియంతలే

**Dictatorship of proletariat** = శ్రామికవర్గ నియంతృత్వం : విప్లవ ఫలితాలను కంటికి పాపలా కాపాడుకొనేందుకు అంతవరకూ పీడనకు గురైన శ్రామికవర్గం ఏర్పరచుకునే ప్రభుత్వ వ్యవస్థను ఇలా అంటారు భూస్వాములనుంచీ, గుత్తాధిపతులనుంచీ ప్రజల సంపదను రక్షించుకోవడమే ఈ ప్రభుత్వ ధ్యేయం లెనిన్, స్టాలిన్‌ల నాయకత్వంలో ఇలాంటి ప్రభుత్వం రష్యాలో ఏర్పడింది

**Dignity of labour** = శ్రామిక జీవన సౌందర్యం : కాయకష్టానికి వర్తించే నానుడి ప్రసిద్ధ అమెరికన్ రచయిత బూకర్ వాషింగ్టన్ (1901) ఈ శ్రమ సౌందర్యాన్ని ఇలా వర్ణించాడుః "ఒక కవిత అల్లడంలో ఎంత హుందాతనం ఉందో, స్వయంగా భూమిని దున్నడంలోనూ అంతటి సౌందర్యం ఉంది ఈ సత్యాన్ని తెలుసుకొనేంత వరకూ ఏ జాతీ వృద్ధిలోకి రాదు" అలాగే కవి తామస్ గ్రే "ప్రయోజనకర శ్రమ" ("Useful Toil") గురించి ఒక స్మృతి కావ్యం రాస్తూ - 1820ల నుంచి 1920ల దాకా ఒక శతాబ్దం శ్రమ జీవుల ఆత్మకధను ఆవిష్కరించాడు!

**Diplomacy** = దౌత్యం : విదేశాలలో తమ తమ దేశాల ప్రయోజనాలను ప్రతిబింబిస్తూ సాధికారంగా నియమితులైన వారిని దౌత్యవేత్తలు అంటారు

**Direct Democracy** = ప్రత్యక్ష ప్రజాస్వామ్యం : ప్రాతినిధ్య ప్రజాస్వామ్యానికి ఇది విరుద్ధం ఇక్కడ శాసన నిర్మాణంలో ప్రజలకు ప్రత్యక్ష పాత్ర వుంటుంది అధికార బదలాయింపులుండవు

**Directed Democracy** = ఆదేశిత ప్రజాస్వామ్యంః దీనినే guided democracy అని కూడా అంటారు తొట్టతొలుత ప్రజాస్వామికమైన దేశంలో అధిక సంఖ్యాకులైన ప్రజలు నిరక్షరాస్యులుగానే వున్నప్పుడు తమ అవసరాలేవో తమకే తెలియక ఏ వలసవాద భావనలోనో కొట్టుకు పోతున్నప్పుడు - ఒక పక్క వారికి పాలనలో భాగస్వామ్యం యిస్తూనే, నిర్ణయాలలో ప్రతినిధులు సహకరించే పద్ధతిగా దీనిని నిర్వచించుకోవచ్చు ఆసియాలో దీనికి ఆద్యుడు ఒకనాటి ఇండోనేషియన్ అధ్యక్షుడు డాక్టర్ సుకర్నో

**Dissent** = అసమ్మతి / అనంగీకారం : మెజారిటీ సభ్యుల ప్రతిపాదనలను వ్యతిరేకించాల్సి వచ్చినప్పుడు

మైనారిటీ సభ్యులు ప్రకటించే వ్యతిరేకతను యిలా అంటారు

**Divine right** = దైవదత్త రాజ్యాధికారం : యూరప్‌లోని మధ్యయుగాలలో పుట్టిన సిద్ధాంతం ఇది మత పరంగానూ, రాజకీయంగానూ అమలులో వుండేది ఇంగ్లండులో అంతర్యుద్ధం తర్వాత, పార్లమెంటరీ సంప్రదాయలు క్రమంగా కాళ్ళూను కోవడంతో ఈ హక్కుకు కాలం చెల్లింది

**Division of labour** = శ్రమ విభజన : పారిశ్రామికీకరణ తర్వాత వస్తూత్పత్తి వ్యవస్థలో ముఖ్యంగా వివిధ శాఖల విభజన తర్వాత శ్రమ విభజన సిద్ధాంతం కాళ్ళూనింది ఉదా: కరెంటు ఉత్పత్తి చెయ్యడమే కాక గుండు సూదిని ఉత్పత్తి చెయ్యాలన్నా విభిన్న ప్రక్రియలుగా విభజించి శ్రామికుల్ని నియోగించడం సామాజికాభివృద్ధిలో శ్రమవిభజన పాత్ర విస్మరించరానిది

**Dominion Status** = అధినివేశ ప్రతిపత్తి

**Domino theory** = రాజ్యపతన సిద్ధాంతం / పేకమేడల్లా రాజ్యాలు కుప్పకూలే వైనం ఉదా: అమెరికా పలుకుబడిలో వున్న దక్షిణ వియత్నాం పతనంతోపాటు కంబోడియా, లావోస్‌లలో రాజ్యాలు కూలిపోయాయి. అలాగే 1989 ప్రాంతంలో తూర్పు యూరప్ దేశాలు కూడా పతనమయ్యాయి).

**Doom's day** = ప్రళయ వాదం

**Dooms day machine** = ప్రళయవాద సిద్ధాంతం: అణ్వస్త్రయుగం ప్రారంభమైన తర్వాతనే ఈ సిద్ధాంతానికి ప్రాచుర్యం వచ్చింది 'పరస్పర వినాశకర ఒప్పందం'గా ఈ సిద్ధాంతాన్ని వర్ణించవచ్చు దీని ప్రకారం అణ్వస్త్ర ప్రయోగం చేసిన దేశాన్ని సర్వనాశనం చేసే అవకాశం మరో దేశానికివ్వడం

**East-Asia** = తూర్పు ఆసియా (Far East అని పాశ్చాత్యుల వాడకం, ఇది వారికి దూరాన ఉంది కనక:) ఇందులో ఆసియా ఖండంలోని బాగా తూర్పున ఉన్న భాగాలన్నీ ఉన్నాయి చైనా, జపాన్, ఉత్తర, దక్షిణ కొరియాలు, తైవాన్, హాంకాంగ్, పాత సోవియెట్ యూనియన్‌లోని తూర్పు భాగాలూ (దక్షిణాసియా అనిగానీ, ఆగ్నేయ ఆసియా అనిగానీ అన్నప్పుడు అది దక్షిణాసియా సువిశాల ప్రాంతం అవుతుంది)

**Ecology** = పర్యావరణ శాస్త్రం : ప్రాణికోటికీ, దాని పరిసరాలకూ మధ్య సంబంధాన్ని వివరించే శాస్త్రం

**Egalitarianism** = సమతావాదం రాజ్యంలోని పౌరులందరికీ సమాన హక్కుల్నీ అవకాశాల్నీ కల్పించాలనే సిద్ధాంతాన్ని యిలా అంటారు

**Electrol College** = నిర్దేశిత నియోజకవర్గం

**Elitism** = మిశ్రమవాదం : భిన్న రాజకీయ సిద్ధాంతాల కలగూరగంపని యిలా పిలుస్తారు పలు సిద్ధాంతాల్లో సారూప్యం వుండే అంశాలలో రాజ్యపాలన చేయ వచ్చున్నది ఈ వాదం ముఖ్యోద్దేశ్యం 19వ శతాబ్దంలో పరేటో, మోస్కా అనే ఇటాలియన్ సిద్ధాంతకర్తలు ఈ వాదాన్ని ప్రతిపాదించారు 'మార్క్సిజం'లోని "వర్గరహిత సమాజ స్థాపన" అసాధ్యమని చెబుతూ ఈ మిశ్రమవాదాన్ని ప్రవేశపెట్టారు

**Embargo** = (విదేశీ) వర్తకపు ఆంక్షలు

**Embassy** = రాయబార కార్యాలయం (రాయబారినీ, అతని సిబ్బందినీ కలిపి Embassy అంటారు )

**Emergency Powers** = అత్యవసరాధికారాలు : అత్యవసర పరిస్థితుల్లో శాసనసభ అంగీకారాల్నీ, న్యాయ సలహాలను పొందకుండా, ప్రభుత్వంకాని కార్య నిర్వాహక వర్గం కాని పనులు చెయ్యాల్సి వుంటుంది అలా చెయ్యడానికి వీలుకల్పించే అధికారాలను అత్యవసరాధికారాలు అంటారు ప్రజాస్వామిక వ్యవస్థల్లో ఇలాంటి అధికారాలు కేవలం 'అత్యవసర పరిస్థితి' అమలులో వున్నప్పుడే సంక్రమిస్తాయి

**Emissary** = ప్రత్యేక దూత (అంతరంగిక విషయాలపై రాయబారం నడిపేవాడు)

**Enlightment (movement)** = వికాసోద్యమం : ఫ్రెంచి విప్లవానికి ముందూ, వెనకా వచ్చిన ఆలోచనా ధోరణులన్నీ ఈ ఉద్యమం క్రిందికే వస్తాయి. 17వ శతాబ్దం మధ్య కాలంనుంచి 18వ శతాబ్దం చివరి వరకూ వికాస యుగంగా చెప్పవచ్చు. హేతుబద్ధత పునాదిగా స్వేచ్ఛ, భావ ప్రకటనా స్వాతంత్ర్యం, సహజీవనం వంటి అంశాలకు ఈ కాలంలో అధిక

ప్రాధాన్యం లభించింది మనుషులందరూ పుట్టుకతో పాపాత్ములు అనే సాంప్రదాయకమైన ఆత్మన్యూనతా భావానికి ఈ యుగం తిలోదకమిచ్చింది ఒక్క మాటలో చెప్పాలంటే - స్వేచ్ఛ ఈ యుగ ధర్మం

**Entente** = సదవగాహన (దేశాల మధ్య సదవగాహన)

**Entryism** = చొరబాటువాదం : పేరుకు వాదం కాని నిజానికి యిదొక ఎత్తుగడ స్థిరపడ్డ మధ్యేవాద రాజకీయ పక్షాలలో పట్టు సంపాదించడంకోసం, తీవ్రవాద రాజకీయ ఉద్యమాలకు సంబంధించినవాళ్ళు ఆయా పక్షాలలో చేరతారు కీలక నిర్ణయాలను తమ ఉద్యమాలకు అనువుగా చేయించుకోవడానికి ప్రయత్నిస్తారు

**Environment** = పరస్పర వాతావరణం (పర్యావరణ శాస్త్రానికీ, దీనికీ కొంచెం తేడా ఉంది ఉదా: పర్యావరణ శాస్త్రం మనిషినీ, అతని చుట్టుపట్ల ఉన్న ఎడారులు, అడవులు అతనిపై కలిగించే ప్రభావాన్నీ అధ్యయనం చేస్తుంది కాగా "ఎన్విరాన్‌మెంట్" అంటే, ఒక ప్రాజెక్టు కట్టడం వల్ల ఆ ప్రాంతం ప్రజలకు కలిగే ప్రయోజనంతోపాటు ప్రజలు ఆధారపడుతున్న భూములకు కలిగే ముంపు వల్ల లేదా ఆ ముంపు వల్ల ప్రజలను ఆ ప్రాంతంనుంచి తరలించవలసి రావడం వల్ల కలిగే ఇబ్బందులూ చర్చనీయాంశంగా ఉండటం ఉదా: తెహ్రీ డామ్ నిర్మాణం గురించి నర్మదా ప్రాజెక్టు గురించి జరుగుతున్న రభస ఇలాంటిదే

**Environmentalism** = పర్యావరణ వాదం : అభివృద్ధికన్న 'ప్రకృతి పరిరక్షణే' ప్రధాన ధ్యేయంగా గల రాజకీయ సిద్ధాంతాన్ని ఇలా అంటారు ఈ వాదం తొలుత పాశ్చాత్య రాజకీయాల్లోకి 1960-70ల మధ్య ప్రవేశించింది 'ఆర్థిక ఉత్పాదకత లేకపోయినా నష్టం లేదు ముందు కాలుష్యాన్ని అరికట్టండి' అంటూ భారీ పరిశ్రమల స్థాపనకీ, ప్రాజెక్టుల స్థాపనకి సైతం అడ్డు చెప్పడానికి వెనకాడరు ఇంగ్లండులోని 'గ్రీన్ పార్టీ' విధానాలు యిందుకు ఉదాహరణలు. వీరికి పర్యావరణమే పరమావధి.

**Envoy** = సందేశ దూత (ప్రత్యేక సందేశాన్ని తీసుకుపోయే దౌత్య ప్రతినిధి) దీని ఫ్రెంచి పదం Envoyer.

**Equality of Opportunity** = సమానావకాశం : జాతి, మతం, జెండర్ కారణంగా ఏ ఒక్కరి అభివృద్ధికీ ఆటంకం చెప్పకుండా వుండడం 20వ శతాబ్దపు ద్వితీయార్థంలో ఈ దృక్పధానికి బహుళ ప్రచారం లభించింది అమెరికా వంటి దేశం కూడా వాణిజ్య, పారిశ్రామిక సంస్థల్లో సమానావకాశాలకు రక్షణ కల్పించడానికి ముందుకు వచ్చింది అంతెకాదు తరతరాలుగా అణగారిన వర్గాలు పొందిన నష్టాన్ని పూడ్చే కార్యక్రమాన్ని చేపట్టడానికి కూడా సంసిద్ధత చూపాల్సివచ్చింది ఇదంతా వివిధ దేశాలలో జరుగుతున్న ప్రజాస్వామికోద్యమాల ఫలితమే

**Escalation** = ఆయుధ ఉధృతి : శత్రుదేశం ఉపయోగిస్తున్న ఆయుధాలను బట్టి మరింత శక్తివంతమైన ఆయుధాలను ప్రయోగించడం ముఖ్యంగా సంప్రదాయ ఆయుధాల వాడకం మాని అణ్వాయుధాలను చేపట్టడాన్ని యిలా పిలుస్తారు

**Ethncity** = జాతివాదం (చరిత్రలో సమాజాలు అప్పుడప్పుడు వేర్పాటు ధోరణులతో శత్రు భావంతో రాజకీయ తెగలుగా విడిపోతూ వచ్చాయి ఇలా - జాతి ప్రాతిపదికపైన సాంస్కృతిక, చారిత్రక ప్రత్యేకతలు లక్షణాలుగా ఉన్న సంక్లిష్ట సమాహారాన్ని ఇలా అంటారు ఒక్కో సందర్భంలో గుర్తింపునకు 'వర్ణం' ప్రత్యేక గుణంగా ఉండడం ఇందులో విశేషం )

**EURO** = యూరోపియన్ సమాఖ్య దేశాల ఉమ్మడి కరెన్సీ

**Eurocommunism** = యూరో కమ్యూనిజం (పశ్చిమ యూరప్ దేశాలలో కొన్ని కమ్యూనిస్టు పార్టీలు 1960ల నుంచి ఈ పేరిట వ్యవహరిస్తూ వచ్చాయి ఉదా: ఇటలీ, స్పానిష్ పార్టీలు పాపులిజం లాంటిదే ఈ వాదం జనాకర్షక వాదం మధ్యతరగతి ప్రజలే ఈ వాదానికి పట్టుగొమ్మలు చర్చి లాంటి సంస్థల నీడన తలదాచుకుంటూ ప్రభుత్వం నడపాలనే ఈ వాదం చూస్తుంది స్పానిష్ ఫాసిస్టు ఉద్యమంనుంచి ఈ వాదం పుట్టింది జనరల్ ఫ్రాంకోను అధికారంలోకి తెచ్చిందీ ఈ వాదనే. పతనాన్ని చూపించిందీ ఈ వాదనే.

**European Communities (EC)** = యూరోపియన్ (దేశాల) సమాఖ్య : మూడు సంస్థల (యూరోపియన్ కోల్ అండ్ స్టీల్ కమ్యూనిటీ, యూరోపియన్ ఎకనామిక్ కమ్యూనిటీ, యూరోపియన్ అటామిక్ ఎనర్జీ కమ్యూనిటీల) సమష్టి రూపమిది

**European Community (or) Common Market** = Umbrella organization of the European Economic Community (EEC) ఇందులో సభ్యులు 12 దేశాలు : ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, లక్సెంబర్గ్, బెల్జియం, నెదర్లాండ్స్ (ఇవి ఆది సభ్య రాజ్యాలు), డెన్మార్క్, గ్రీస్, ఐర్లాండ్, పోర్చుగల్, స్పెయిన్, బ్రిటన్ ఈ వ్యవస్థ కార్యనిర్వాహక మండలిని యూరోపియన్ కమిషన్ అంటారు బ్రస్సెల్స్ దీని కేంద్ర కార్యాలయం సభ్య దేశాల అధిపతుల శిఖరాగ్ర మండలిని యూరోపియన్ కౌన్సిల్ అంటారు

**European Monetary System (EMS)** = యూరోపియన్ ద్రవ్య వ్యవస్థ : యూరోపియన్ సమాఖ్య సభ్య దేశాల మధ్య కరెన్సీ విలువల్నీ, ద్రవ్య సరఫరానీ నియంత్రించే వ్యవస్థని ఇలా పిలుస్తారు ఈ దేశాల కరెన్సీలకి మాధ్యమంగా యూరోపియన్ కరెన్సీ యూనిట్ ఉంటుంది వివిధ దేశాల మధ్య ఖాతాలను సరిచూసుకోవడానికి ఆయా దేశాల కేంద్ర బ్యాంకులు ఈ యూనిట్ కొలమానంగా ఉపయోగిస్తాయి

**Existentialism** = అస్తిత్వ వాదం : 18వ శతాబ్దంనుంచీ ఈ వాదం వినికిడిలో ఉంది కాని యూరోపియన్ రాజకీయ మేధావులను ముఖ్యంగా ఫ్రెంచి రాజకీయ భావనా స్రవంతిని ఇటీవల కాలంలో హెచ్చుగా ప్రభావితం చేసిన మేధావులు జాం పోల్ సార్త్ర్ (1905-80), ఆల్బర్ట్, కామూ (1913-1960) ఈ అస్తిత్వవాదం వలన వ్యతిరేక ఉద్యమాలనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాలనూ ప్రభావితం చేసింది చివరికి మార్క్సిజాన్ని కూడా ప్రభావితం చేసింది ఆధునిక మానవ సమాజంపైన బ్యూరాక్రాట్లు పెత్తనం చేస్తున్నారు. ఎవరికివారు ఏమునా తీరేగా వ్యవహరిస్తూ పరాయీకరణం పాలవుతున్నారు మానవత్వం కోల్పోతున్నారు (డీ హ్యూమనైజ్) - కనుక ఆ రాజ్య శక్తి దౌష్ట్యాన్ని ఎదిరించి నిలబడాలంటే మానవుని అస్తిత్వాన్ని కాపాడుకోవలసిందే, నిలబెట్టుకోవలసిందే ఈ ఉద్దేశంతోనే సార్త్ర్ "దిరోడ్స్ టు ఫ్రీడం' అనే నాలుగు సంపుటాలలో ప్రసిద్ధ రచన వెలువరించారు

**Fabians** = బ్రిటన్‌లో ఫేబియన్ సొసైటీని 1884లో వామపక్ష మేధావులు నెలకొల్పారు దాని సభ్యులను ఫెబియన్స్ అంటారు ఫెబియన్' పేరును సాచివేత ఎత్తుగడలకు పేరుమోసిన రోమన్ జనరల్ క్వింటస్ ఫెబియస్ మాక్జిమస్ కంక్టేటర్ పేరు నుంచి తీసుకున్నారు లేబర్ పార్టీ నిర్మాతలలో ఫేబియన్లు ప్రసిద్ధులు సోషలిజం సాధనకు తాపీగా, శాంతి యుతంగా, రాజ్యాంగబద్ధంగా, రాజకీయ పరివర్తన సాధించడం వీరి లక్ష్యం ఈ ఉద్యమ కర్తలలో ఆద్యులు జార్జి బెర్నాడ్ షా, సిడ్నీ వెబ్ దంపతులు

**Faeroe Islands** = ఫారో దీవులు : ఇవి ఐస్‌లాండ్‌కూ, షెట్‌లాండ్ దీవులకూ మధ్య అట్లాంటిక్ సముద్రంలో వున్న డేనిష్ (డచ్‌వాళ్ళ) దీవులు

**Falangism** = 'ఫెలాంగే' అన్నది స్పానిష్ ఫాసిస్టు ఉద్యమం 'ఫెలాంగే ఎస్పనోలా' తొలి రూపం స్పానిష్ అంతర్యుద్ధంలో జనరల్ ఫ్రాంకోను అధికారంలోకి తెచ్చిన ఉద్యమం ఫెలాంగే ఎస్పనోలా కాని క్రమంగా దాని ప్రభావం ఫ్రాంకో పాలనలోనే కునారిల్లిపోయింది

**Fascism** = ఫాసిజం : ప్రాచీన రోమన్ పదం 'ఫాసెస్' నుంచి వచ్చిందీ మాట ఓ కట్ట ఇనుప చువ్వలు, వాటి మధ్యనుంచి చొచ్చుకు వచ్చే గండ్రగొడ్డలి 'ఫాసెస్' చిహ్నం ఐకమత్యానికి, అధికార దర్పానికీ దీనిని ప్రతీకగా భావించారు ఈ చిహ్నాన్నే 1920లలో బెనిటో ముసోలినీ తన కొత్త ఇటాలియన్ రాజకీయ ఉద్యమానికి చిహ్నంగా తగిలించుకున్నాడు ఆ తరువాత రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో - జర్మనీలో హిట్లర్, స్పెయిన్‌లో ఫ్రాంకో నాయకత్వాన ఫాసిస్టు పార్టీలు వెలశాయి రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు తర్వాత ఫాసిస్టు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. విచిత్రమైన విషయం - ప్రజలలో అశాంతిని ఆసరా చేసుకొని నేషనల్ సోషలిజం పేరిట ఈ పార్టీలు

అధికారంలోకి రావడం! "నేషనల్ సోషలిస్టు జర్మన్ వర్కర్స్ పార్టీ" పాసిస్టు హిట్లర్ నెలకొల్పిన నేతి బీంకాయి సోషలిస్టు పార్టీ కమ్యూనిజం వ్యతిరేకత జాత్యహంకారం పాసిస్టుల వేదం

**Federalism** = (ఫెడరలిజం) వివిద యంత్రాంగాల మధ్య రాజ్యాంగ బద్ధంగా అదికార విభజన చేసే విదానాన్ని ఇలా పిలుస్తారు సాధారణంగా ఈ విభజన కేంద్ర, రాష్ట్రాల మద్య ఉంటుంది 18వ శతాబ్దంలో కొత్తగా స్వతంత్రమైన అమెరికా వలస దేశాల్లో ఈ విధానం తొలుత అమలులోకి వచ్చింది పెడరలిజంలో ప్రతీ యంత్రాంగానికీ దాని పరిధిలో సార్వభౌమాధికారం వుంటుంది ఈ విధానం ఒక్కో దేశంలో ఒక్కో విధంగా వుంటుంది బాగా చిన్న దేశాలకీ రక్షణ నివ్వడంలోనూ, బాగా పెద్ద దేశాలకి పరిపాలనని సులభతరం చెయ్యడంలోనూ ఫెడరలిజం బాగా తోడ్పడుతుంది అయితే 1990 తర్వాత ఈ విధానం ఆర్థికంగా బాగా బలపడ్డ ఐరోపా దేశాలు పెట్టుకున్న 'యూరోపియన్ కమ్యూనిటీస్'కి బాగా ఉపకరించడం గమనించదగ్గ విషయం

**Feminism** = (ఫెమినిజం) = స్త్రీవాదం : స్త్రీల హక్కుల రక్షణకు ఉద్యమించిన వాదం ఆధునిక ఫెమినిస్టు ఉద్యమానికి 1960లలో ఉత్తర అమెరికా అగ్రస్థానం వహించింది క్రమంగా అది యూరప్‌కు విస్తరించి, నేడు ప్రపంచ వ్యాపితంగా బలీయమైన ఉద్యమంగా రూపొందింది అయితే ఇంతకు ముందే బ్రిటన్‌లో 'సఫ్రగెటి' ఉద్యమం ఫెమినిస్టు ఉద్యమంగానే తలెత్తి ఉంది. ఇది కేవల స్త్రీ వాద ఉద్యమంగా కాక మహిళల రాజకీయ హక్కులకోసం కూడా పోరాడే చైతన్య స్రవంతిగా ప్రారంభమయింది పురుషులతో సమంగా ఆచరణలో సరిసమానమైన రాజకీయ, సాంఘిక, ఆర్థిక హక్కులకోసం ఉద్యమించిన వాదం ఫెమినిజం ఇందు రెండు ప్రధాన పాయలు ఇటీవల స్పష్టంగా ముందుకొచ్చాయి పురుషుల అహంకారానికి ముగుదాళ్ళు వేసి ధాష్టీకాలనుంచి విముక్తి పొందే పీడిత మహిళా లోకపు ఉద్యమాన్ని 'విక్టిమ్ ఫెమినిజం' అన్నారు. కాగా, కేవలం అధికారం కోసం తాపత్రయపడే పెమినిస్టుల వాదాన్ని "పవర్ ఫెమినిజమ్" అన్నారు

**Feudalism** = భూస్వామ్య విదానం (పాశ్చాత్య దేశాల్లో మధ్యయుగాలనాటి భూస్వామ్యాన్ని యిలా పిలిచేవారు క్రమేపీ వివిధ రకాలైన ఆదునిక సాంఘికరాజకీయ వ్యవస్థల్లో ఈ లక్షణాన్ని చూసుకొని, అలా పిలవడం అలవాటయ్యింది పెట్టుబడిదారీ విధానానికి ముందు దశని భూస్వామ్య విధానంగా మార్క్సిజం గుర్తిస్తుంది ఇది ఒక రకంగా రాచరికంలో భాగమే దేశ భూభాగం మీద ఒక్క రాజుకే హక్కు ఉంటుంది తనకు సేవలందించిన అనుచరులకు ఆ భూమ్మీద వచ్చే ప్రతిఫల సాయంలోంచి తనకిష్టం వచ్చినంత పంచుతాడు ఇలాంటి వ్యవస్థలో ఒక వ్యక్తి సాంఘిక స్థాయి అతడి పుట్టుకను బట్టి ఆధారపడి వుంటుంది బానిసకు పుట్టినవాడు బానిసగా జీవించాల్సిందే మనదేశంలోని కులవ్యవస్థ ఇందులో భాగమే

**Fifth column** = పంచమాంగ దళం / విభీషణ వర్గం (విదేశీ సైన్యంతో చేతులు కలిపే స్వదేశీ ముఠా ఈ పదాన్ని స్పెయిన్ అంతర్యుద్ధకాలంలో స్పానిష్ జనరల్స్‌లో ఒకరయిన ఎమిలియో మోలా సృష్టించాడు)

**Fifth Republic** = "ఐదవ రిపబ్లిక్" - ఫ్రాన్స్‌లో నేడున్న రాజకీయ వ్యవస్థకు మరో పేరు 'ఫిఫ్త్ రిపబ్లిక్' 1958లో ఆల్జీరియాలో ఫ్రెంచి సైన్యం జరిపిన తిరుగుబాట్లు ఫలితంగా నాల్గవ ఫ్రెంచి రిపబ్లిక్ ప్రభుత్వం బలహీన పడిపోయి, ప్రధాన మంత్రిగా వ్యవహరించమని ఆహ్వానిస్తూ ప్రెసిడెంట్ రెనీకోరీ ప్రకటన విడుదల చేయవలసి వచ్చింది అ ప్పుడు ఏర్పడిన రిపబ్లిక్‌నే ఫిఫ్త్ రిపబ్లిక్‌గా వ్యవహరించారు ఫ్రాన్స్‌కు నూతన రాజ్యాంగాన్ని రాసే అధికారం తనకున్నదని ఆమోదించే షరతుపైననే డిగోల్ అధికారాన్ని స్వీకరించడం జరిగింది డిగోల్ పార్టీ పేరు 'గాలిస్ట్ పార్టీ'

**Filibuster** = దీర్ఘోపన్యాసకుడు / కాలయాపకుడు: ప్రధానంగా శాసన వేదిక ఒక బిల్లును ఆమోదించకుండా అడ్డు తగులుతూ దీర్ఘోపన్యాసాలతో కాలయాపన చేసే లెజిస్లేటర్‌ను ఇలా అంటారు

**First Strike** = తొలి ఘాతుకం - అంతవరకు అణ్వాస్త్ర

వాటికి తెలియని సత్తువపైన తొలిదెబ్బగా అణ్వస్త్రాన్ని ప్రయోగించడాన్ని ఇలా అంటారు

**First world** = సంపన్న ప్రపంచం - పశ్చిమాన దేశాలకు ఏమీ ప్రపంచానికి విరుద్ధమైన ప్రపంచం ఇది పారిశ్రామిక విప్లవాన్ని జయప్రదం చేసుకున్న పశ్చిమ యూరోపియన్, ఉత్తర అమెరికా దేశాలు, జపాన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ దేశాలను కలిపి 'సంపన్న ప్రపంచం' అంటారు ఒక్క మాటలో - మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు అభివృద్ధి పదంలో వున్న పారిశ్రామిక రాజ్యాలను 'ఫస్ట్ వరల్డ్' అంటారు

**Fiscal policy** = బడ్జెటరీ అంశాలకు సంబంధించిన (ముఖ్యంగా పన్నులు, సుంకాల విధింపు వగైరాలకు సంబంధించిన) విధానాన్ని ఇలా అంటారు

**Fleet Street** = పత్రికా కేంద్రం : "ఫ్లీట్" అన్నది లండన్‌లోని థేమ్సు నదిలోకి ప్రవహించే ఒక సెలయేరు దాని ప్రక్కనే ఉన్న వీధిని 'ఫ్లీట్ స్ట్రీట్' అంటారు ఈ వీధి వార్తా పత్రికల, ఇతర మాగజైన్ల ప్రచురణకు ప్రధాన కేంద్రం కనుకనే దీనికి పత్రికా కేంద్రం అని పేరు సంచలనాత్మకంగా జర్నలిజాన్ని కూడా ఫ్లీట్ స్ట్రీట్ జర్నలిజం అంటారు

**Force Majeure** = బలవంతపు మార్పు : ఇతరుల అభిప్రాయాలతో, ఒప్పందంతో లేదా న్యాయ సంబంధమైన ధర్మాధర్మ విచక్షణతో సంబంధం లేకుండా బలప్రయోగంపైన ఆధారపడి వచ్చిన రాజకీయ పరిణామాన్ని "ఫోర్స్ మెజూరి" అంటారు ఉదా: సమ్మెదారులతో సంప్రదింపులకు ప్రయత్నించకుండానే ప్రభుత్వం ఫ్యాక్టరీలలోకి సైన్యాన్ని పంపించి బలవంతంగా సమ్మె పరిష్కారానికి పూనుకోవడం

**Fourth world** = అధోజగత్ సహోదర ప్రపంచం - ఈ అన్ని దేశాలలోను జీవన పరిస్థితులలో ఎదుగూ బొదుగూ లేకుండా దోపిడీకి, అక్రమాలకు, అన్యాయాలకు గురవుతూ, కూటికి, గూటికి, గుడ్డకి దూరమవుతున్న కోటానుకోట్ల తాడిత పీడిత ప్రజల ప్రపంచాన్ని ఇలా పిలుస్తున్నారు ఈ సిద్ధాంతాన్ని సమర్థవంతంగా ప్రతిపాదించిన వ్యక్తి వరల్డ్ బ్యాంక్ వైస్ ప్రెసిడెంట్‌గా పనిచేసి దాని విధానాలతో విభేదిస్తూ పదవికి రాజీనామా చేసిన డాక్టర్ డేవిసన్ బుదూ

**Fraternity** = సౌభ్రాతృత్వం లేదా సౌభ్రాత్రం : ఫ్రెంచి విప్లవం అందించిన మూడు మహదాశయాలో ఇదొకటి మిగతా రెండు ఆదర్శాలు : సమానత్వం (ఈక్వాలిటీ), స్వేచ్ఛ (లిబర్టీ)

**Functionalism** = సామాజిక వ్యవస్థ తులనాత్మక పరిశీలన మరో మాటలో దీనినే వ్యవస్థాపక సిద్ధాంతం అంటారు అన్ని సామాజిక వ్యవస్థలలోని సమాన ధర్మాలను పరిశీలించి వాటిని స్థిమితమైన సాంఘిక వ్యవస్థతో పోల్చుకుని వ్యవస్థాపక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడు డర్క్‌హీమ్ ఉదా: ఒక రాజకీయ వ్యవస్థ తన సామాజిక పరిసరాల, అవసరాలకు అనుగుణంగా వ్యవహరించి, ఏ విధంగా తన లక్ష్యాలను సాధించుకోవాలో, ఇందుకోసం పాటించవలసిన విధులేమిటో (ఫంక్షన్స్) తెలియజెప్పేదే ఈ సిద్ధాంతం యుద్ధానంతర కాలంలో జరిగిన రాజకీయ శాస్త్రాభివృద్ధి పరిశోధనలో ఈ సిద్ధాంతం తగిన పాత్ర వహించింది

**Fundamentalism** = మత / కుల చాందసం : చాందసవాదులు అన్ని మతాలలోనూ ఉన్నారు అయితే చాందస భావాలపై తిరుగుబాటు కూడా అన్ని మతాలలోనూ వచ్చింది క్రైస్తవంలో ప్రొటస్టాంటిజమ్ చాందస క్రైస్తవంపై తిరుగుబాటు, బ్రహ్మ సమాజం, ఆర్య సమాజం, వివేకానంద బోధలు హైందవంలోని చాందస వర్గాలపై ధ్వజమెత్తిన ఉద్యమాలు ఇస్లామ్‌లో సూఫీ అలాంటిదే

**G-5 (Group Five)** = ఫ్రాన్స్, జర్మనీ, బ్రిటన్, జపాన్, అమెరికా

**G-7 (Group Seven)** = ఏడు సంపన్న రాజ్యాలు : అమెరికా, బ్రిటన్, కెనడా, ఫ్రాన్స్, ఇటలీ, జర్మనీ, జపాన్

**Game Theory** = (గేమ్ థీరీ) = వ్యూహ రచనా సిద్ధాంతం : దీనికి ఆద్యులు ఆస్ట్రేలియా గణిత శాస్త్రజ్ఞులు వాన్‌నూమాన్, మోర్గన్ స్టెర్న్ సమాజంలో ఘర్షణలకూ, పరస్పర సహకారానికీ దోహదపడే సమస్యలకు గణిత శాస్త్రం సహాయంతో హేతుబద్ధంగా పరిష్కారం

కనుగొనడం ఈ సిద్ధాంతం లక్ష్యం ఈ ప్రతిపాదన 1940ల్లో తలెత్తింది రాజకీయ శాస్త్రం, వ్యూహ సిద్ధాంతం, నైతిక శాస్త్రం ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు ఈ సిద్ధాంతాన్ని అన్వయింపజేయడానికి ప్రయత్నించారు కొంతమేరకు రక్షణ వ్యూహకర్తలకూ, ఆర్థిక శాస్త్రవేత్తలకూ కూడా ఇది ఉపయోగ పడిందంటారు

**Gangbusters** = మాఫియా ముఠాలపై పెద్దపెట్టున దాడిచేసే పోలీసు బలగం ("గాంగ్ బస్టర్స్" పేరిట అమెరికాలో 1945-57 మధ్య కాలంలో రేడియో సీరీస్ ప్రసారమయ్యాయి కూడా)

**Gang of four** = దుష్టచతుష్టయం/నలుగురి ముఠా: 1970లలో చైనాలో సాంస్కృతిక విప్లవ కాలంలో మావో భార్య జియాంగ్ క్వింగ్ నాయకత్వాన ముఠాగా అవతరించిన "దుష్టచతుష్టయా"న్ని ఇలా పిలిచారు విద్రోహ రాజకీయాలకుగాను ఈ దుష్టచతుషయాన్ని విచారించి, మరణ శిక్ష విధించింది బీజింగ్ ప్రభుత్వం అయితే తర్వాత మరణ శిక్షను యావజ్జీవ ఖైదుగా మార్చింది జియాంగ్ క్వింగ్‌కాక మిగతా ముగ్గురు "విద్రోహులు" : ఝాంగ్ చుంకియో (సాంస్కృతిక విప్లవ కాలంలో పొలిటికల్ ఆర్గనైజర్), వాంగ్ హోగ్‌వెన్ (యువజన సంస్థ మిలిటెంట్), యావో వెన్‌యూన్ (జర్నలిస్టు) ఈ ముఠాను "గాంగ్ ఆఫ్ ఫోర్"గా శరించింది ఎవరో కాదు మావోనే తన అవసాన దశల్లో మావో తన భార్యను, ఆమె వందిమాగధుల్ని పదే పదే హెచ్చరిస్తూ వచ్చాడు **(Dont be a Gang of four)** ఎగతాళిగా మారిన ఈ పేరు క్రమంగా చైనా సరిహద్దులు దాటి కుట్రదారులు నలుగురు కలిసిన ప్రతిచోటుకూ పాకిపోయింది ఉదాహరణకు 1981లో బ్రిటన్‌లోని సోషల్ డెమోక్రటిక్ పార్టీ స్థాపకులైన రాయ్ జెంకిన్స్, డేవిడ్ ఓవెన్, విలియమ్ రోడ్జర్స్, షిర్లీ విలియమ్స్‌లను కూడా "దుష్టు చతుష్టయం" అని పిలుస్తూ వచ్చారు.

**GATT** = (గ్యాట్) = సుంకాలు, వాణిజ్య వ్యవహారాల సార్వత్రిక ఒడంబడిక 1947లో ఇది ఐక్యరాజ్య సమితి ప్రత్యేక విభాగంగా వ్యవహరిస్తూంటుంది కాని దీనిపైన అమెరికా ప్రభావం జాస్తి 1944లో కుదిరిన బ్రెటెన్ ఉడ్స్ ఒప్పందం రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచ ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణానికి ఉద్దేశించింది 'గ్యాట్' ప్రధాన లక్ష్యం - ఒప్పందంలోని సభ్య దేశాలలో క్రమేపీ సుంకాలను తగ్గించేలట్టు చూడడం, క్రమానుగతంగా ప్రపంచ వ్యాపితంగా స్వేచ్ఛా వాణిజ్యానికి (ఫ్రీ ట్రేడ్)దారులు తెరవడమూ ఈ ఆర్థిక సంస్కరణల్లో భాగంగా 1986లో ఉరుగ్వేలో ప్రారంభమైన 'గ్యాట్' సంప్రతింపుల ఫలితంగా ఇండియా కూడా సభ్య దేశమయింది స్వేచ్ఛా వాణిజ్యం సంపన్న దేశాల ప్రయోజనాలకు అనుకూలం కాగా, వర్ధమాన దేశాల ఎగుమతులపైన అనేక ఆంక్షల మూలంగా వర్ధమాన దేశాల ప్రయోజనాలు దెబ్బతినగలవని ఒక వాదన

**Gaullism** = 'గాలిజం' : చార్లెస్ డిగోల్ ఫ్రాన్స్‌లో ప్రారంభించిన రాజకీయ ఉద్యమాన్ని 'గాలిజం' అంటారు అయితే ఈ ఉద్యమం కేవలం డిగోల్ అభిప్రాయాలకో లేదా ఆయన నెలకొల్పిన పార్టీలకో పరిమితమయింది కాదు ఫ్రెంచి రాజకీయాలలో ప్రధాన మితవాద శక్తులన్నింటికీ మాతృక 'గాలిజం' అని చెప్పవచ్చు గాలిస్టుపార్టీ ఒకటి కాదు దఫదఫాలుగా ఎన్నో పార్టీలు 'గాలిస్టు' పక్షాలుగా వెలిశాయి రెండవ ప్రపంచ యుద్ధం చివర్లో డిగోల్ ఫ్రెంచి రిపబ్లికన్ పార్టీను నెలకొల్పాడు ఆ తర్వాత "రిసెంబ్లిమెంట్ పోలా రిపబ్లిక్" పేరిట ఒక పార్టీని జాక్విస్ చిరక్ స్థాపించాడు ఒక రాజకీయ శక్తిగా 'గాలిజం'కు నిర్దుష్టమైన సిద్ధాంతం అంటూ లేదు డిగోల్ వ్యక్తిగత భావాలు మినహా దీనికి ప్రతిపత్తి లేదు అతని ప్రధాన విశ్వాసాలలో కొన్ని : బలమైన కేంద్రీకృత రాజ్యవ్యవస్థ, పటిష్ఠమైన ప్రభుత్వం, అరాచకాన్ని సహించని పార్లమెంటు

**Gauntlet** = సవాలు విసరడం / అందుకోవడం ("to throw down the gauntlet" అంటే సవాలు చేయడం / సవాలు విసరడం) To take up the gauntlet అంటే సవాలు అంగీకరించడం.

**General Assembly** = సర్వ సభ్య సమావేశం; సర్వసాధారణ సభ (ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ పదం వచ్చినప్పుడు సమితి జనరల్ అసెంబ్లీ అని

కూడా వాడుకోవచ్చు )

**Genocide** = జాతి నిర్మూలన

**Geo-politics** = భౌగోళిక రాజకీయాలు (రాజకీయాలనూ, వైదేశిక నీతినీ భౌగోళిక పరిస్థితులు ప్రభావితం చెస్తుంటాయి ఈ పరిస్థితుల అధ్యయనమే Geopolitics ఉదా: రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో నాజీ జర్మనీ అనుసరించిన విస్తరణ వాదం ఫలితంగా అంతకు ముందు యూరప్‌లో స్థిరపడిన భౌగోళిక, రాజకీయ సరిహద్దులు తారుమారయ్యే పరిస్థితి ఏర్పడింది

**Gerrymandering** = నియోజక వర్గాల తారుమారు (నియోజకవర్గాలను పాలక పక్షం స్వప్రయోజనాలకు అనుకూలంగా పునర్వ్యవస్థీక రించడం ఇది అమెరికాలో పుట్టిన సంకర పదం దీని కర్త ఎల్‌బ్రిడ్జ్ జెరీ)

**Ghettos** = మురికి వాడలు (మన దేశంలో స్లమ్ అనీ, జుగ్గీస్ అనీ అంటారు అమెరికాలో హార్లెమ్, వాట్స్ ప్రాంతాల్ని గెటోస్ అని పిలుస్తారు )

**Glasnost** = భోళాతనం (ఈ పదం గోర్బచెవ్ సృష్టే ఈ పెరిస్త్రోయికా, గ్లాస్‌నాస్త్‌లు రష్యన్ సంస్కరణ వాదానికి రెండు కవచాలు ఆర్థిక సంస్కరణతో పాటు రాజకీయ వ్యవస్థను ప్రజాస్వామ్యం చెయ్యటం దీని లక్ష్యం )

**Goulash Communism**= తిండిపోతుల వ్యవస్థః దీనిని కాపిటలిస్టు అమెరికన్ ఆర్థిక వేత్తలు ప్రచారంలోకి తెచ్చారు ముఖ్యంగా పాత సోవియట్ యూనియన్‌లో నికిటా కృశ్చేవ్ అధికారంలోకి వచ్చిన తరువాత దీనికి ప్రాచుర్యం వచ్చింది

**Gradualism** = ప్రశాంత రాజకీయం : విప్లవం అవసరం లేదని భావించే ఒక తరహా సోషలిజం ఇది ప్రజాస్వామ్య రాజకీయాలను బాదర బందీ లేకుండా ప్రశాంతంగా, నింపాదిగా, బహు తాపీగా నిర్వహించు కోవడం ద్వారా సాంఘిక-ఆర్థిక వ్యవస్థల్లో మార్పులు తెచ్చుకోవచ్చునని ఈ సిద్ధాంతం విశ్వాసం. సోషల్ డెమోక్రసీని ప్రబోధించే రకరకాల సోషలిస్టులు, కమ్యూనిస్టులూ యూరప్‌లో క్రమంగా ఈ సిద్ధాంతం వైపు ఆకర్షితులయ్యారు కాగా విప్లవకారులూ, అతివాదులూ ఈ "గ్రాడ్యుయలిస్టుల" అందరినీ సోషలిజాన్ని అమ్మేసిన రివిజనిస్టుల క్రింద జమ కడుతుంటారు గ్రాడ్యుయలిజానికి కేంద్రాలు ఇటలీ, ప్రాన్స్‌లు

**Gramsci (1891-1937)** = ఇటలీ కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడీయన 1921లో ఇటాలియన్ సోషలిస్టు పార్టీ చీలిపోయిన తరువాత ఆయన ఈ పార్టీని నెలకొల్పారు ఫాసిస్టు మూకలు విజృంభిస్తున్న కాలంలో కమ్యూనిస్టు పార్టీ నాయకులు అజ్ఞాతవాసంలో గడిపారు అప్పుడు గ్రామ్‌సీ దీర్ఘ కాల జైలు శిక్ష అనుభవించారు జైలులోనే మరణించారు ఆ కాలంలో గ్రామ్‌సీ రాజకీయ ప్రతిఘటనా వ్యూహాన్ని రచించి, సమరశీల భావాలకు నారుపోసి నీరుపెట్టాడు ఫలితంగా యుద్ధానంతర రిపబ్లిక్‌లో ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీ మొత్తం పశ్చిమ యూరప్ కమ్యూనిస్టు పార్టీలలో దేనికంటే కూడా బహుళ వాస్తవమైనబృహత్తర ప్రజా శక్తిగా అవతరించింది గ్రామ్‌సీ గ్రంథం "ప్రిజన్ నోట్ బుక్స్" మొత్తం యూరో కమ్యూనిజం ఉద్యమానికే ఊపిరి అయింది

**Granam-Rudman**= అమెరికన్ రిపబ్లిక్ పార్టీలో మితవాద ఆర్థిక వాదానికి నాయకులు వీళ్ళు బడ్జెట్ లోటును తప్పించడం వీరి ఆదర్శం

**Grand Old Party** = అమెరికాలోని రిపబ్లికన్ పార్టీకి ఇది మారు పేరు

**Green Socialism** = గ్రీన్ సోషలిజం : హరిత సమత పర్యావరణ పరిరక్షణ ప్రధాన లక్ష్యంగా పనిచేస్తున్న రాజకీయ పక్షాలను, ఉద్యమాలనూ "గ్రీన్ సోషలిజం' అంటున్నారు జర్మన్ ఇకాలజీ పార్టీని "గ్రీన్ పార్టీ" అంటారు మధ్య తరగతి రాడికల్స్‌ను తరచుగా ఆకర్షిస్తున్న ఈ "గ్రీన్ సోషలిజం" స్థూలంగా ఉదారవాద సోషలిస్టు విలువల మధ్య ఒక సంధాన కర్తగా వ్యవహరిస్తోంది రాజకీయంగా అస్పష్ట శక్తిగా ఉంటున్నా, పర్యావరణ రక్షణ శక్తిగా అన్ని రాజకీయ పక్షాల విధానాలనూ గ్రీన్ సోషలిజం ప్రభావితం చేస్తోంది

**Hawaii (Islands)** = పాలినీషియన్ జాతి సంతతిని

ఇలా అంటారు హవాయి పౌరులను 'హవాయిన్స్' అంటారు హవాయి ద్వీపకల్పంలో 132 దీవులున్నాయి ఇవి శాన్‌ఫ్రాన్సిస్కోకి నైరుతిగా ఉంటాయి ఇవి ఎనిమిది దీవులు: హవాయి, కావహూలావి, కాయి(Kauai) లనాయి, మాయి, మొలోకాయి, నిహోవు, ఒహు - ఇవిగాక హవాయిలో మరి మూడు చదరపు మైళ్లలో 6450 చిన్న దీవులున్నాయి భూ వైశాల్యంలో దీవుల్లోకెల్లా పెద్దది హవాయి హనొలూలు, పెరల్ హార్బర్ ఓహులో ఉన్నాయి హవాయి పౌరుల్లో నూటికి 80 మంది ఈ రెండు దీవుల్లో నివసిస్తారు

**Hawks and Doves** = యుద్ధ ప్రియులు, శాంతి కాముకులు : వియత్నాం యుద్ధ సమయంలో అమెరికాలో ఈ రెడు శక్తులూ ప్రముఖంగా ముందుకొచ్చాయి ఆరునూరైనా నూరు ఆరైనా వియత్నాంను సైనికంగా దెబ్బతీసి రావాలన్న వాళ్ళను కజ్జాకోరులయిన యుద్ధ ప్రియులుగానూ, సమస్యలను సావధానంగా, రాజీ ధోరణిలో, సాత్వికంగా పరిష్కరించుకోవాలని వాదించే వాళ్ళను శాంతి ప్రియులుగానూ ప్రజలు భావించారు

**Helsinki Process** (or Helsinki spirit) = హెల్సింకీ భావన / హెల్సింకీ మార్గం : యూరోపియన్ దేశాల భద్రతకు, ఆర్థిక, మానవ హక్కులకు పూచీపడుతూ హెల్సింకీలో జరిపిన నాయక సమావేశం ఫలితం - "హెల్సింకీ సద్భావం" 1973-75 మధ్య ఈ సద్భావన ఏర్పడింది యూరప్ దేశాల మధ్య పొరపొచ్చాలు వచ్చినప్పుడు, అత్యయిక స్థితి ఏర్పడినప్పుడూనాటో' లాంటి సైనిక కూటమి కన్నా హెల్సింకీ సద్భావన ఆధారంగా అవతరించిన 'యూరోప్ సహకార భద్రతా సంస్థ' మాత్రమే జోక్యం చేసుకోవాలని నిర్ణయించారు

**Hemisphere** = అర్ధగోళం

**His Master's voice** = యజమాని స్వరాన్ని సావధానంగా ఆలకించే జాగిలాన్ని (పేరు నిపుర్) ట్రేడ్‌మార్క్‌గా HMV రికార్డు కంపెనీ స్వీకరించింది

**Holocaust** = ఘోర కలి (రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో నాజీలు జరిపిన మూకుమ్మడి హత్యను యిలా పిలిచారు)

**Homocide** = సకారణ హత్య (ఆత్మరక్షణార్థం)

**Honky / Nigger** = ఈ రెండూ బ్లాక్స్ పట్ల నీచార్థంలో వాడుతున్నందుకు బ్లాక్స్ అభ్యంతరం చెప్పారు అందుకని 'బ్లాక్స్'ను నీగ్రోలు అనకూడదు, 'బ్లాక్స్' అని మాత్రమే వాడాలి

**Hot line** = అమెరికా, రష్యాల మధ్య ఆకస్మిక / అత్యవసర సమాచారాన్ని అందించుకునేందుకు, చర్చించుకునేందుకోసం మొదటిసారిగా ఏర్పడిన సర్క్యూట్ లింక్‌ను ఇలా అన్నారు ఇప్పుడిలాంటి హాట్ లైన్స్ పత్రికా కార్యాలయాల్లోనూ ఉన్నాయి

**Human rights** = మానవ హక్కులు (ఒక వ్యవస్థలో పౌరుడిగా మాత్రమే కాకుండా, కేవలం మానవుడిగా పుట్టడం ద్వారా సంక్రమించే అన్ని హక్కులూ ఈ హక్కుల్ని ఏ ప్రభుత్వమూ కాదనడానికి వీల్లేదు వర్తమాన ప్రపంచంలో మానవ హక్కుల రక్షణకు అధిక ప్రాచుర్యం లభిస్తోంది )

**ICBM (Inter Continental Ballistic Missile)** = ఖండాంతర క్షిపణి : సుదీర్ఘ లక్ష్యాలను త్రుటిలో సర్వ నాశనం చేసిరాగల రాక్షస అణ్వస్త్ర శక్తి ఇది ఇంతవరకు దీనిని ప్రతిఘటించి నిల్వగల ఆత్మరక్షణాయుధ వ్యవస్థ ప్రత్యామ్నాయంగా అవతరించలేదు సోవియట్ (నేడు రష్యా) - అమెరికాల మధ్య అణ్వస్త్ర సమతుల్యతను కాపాడుతున్న ప్రధాన శక్తి ఈ మిస్సైల్ 1991లో వ్యూహాత్మక అణ్వాయుధాలను తగ్గించుకొంటూ కుదిరిన ఒప్పందం ప్రకారం (Strategic Arms Reduction Treaty) ఆర్థిక కారణాల రీత్యా అణ్వస్త్ర వాహక సాధనాలను కొంత తగ్గించుకోవాలని రెండు అగ్రరాజ్యాలూ నిర్ణయించాయి

**IMF** (International Monetary Fund) = అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఏర్పడిన ఐక్యరాజ్య సమితి ప్రత్యేక సంస్థ ఇది ముఖ్యంగా 1944లో బ్రెటెన్ ఉడ్స్ సమావేశంలో అమెరికా-బ్రిటన్‌ల మధ్య కుదిరిన ద్వైపాక్షిక ఒప్పందం ఫలితం ఐ.ఎమ్.ఎఫ్ స్థాపన దీని లక్ష్యాలు: సుస్థిరమైన అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలు

నెలకొల్పడం, స్థిరమైన అంతర్జాతీయ కరెన్సీ రూపొందించడం, స్థిరమైన మారక ద్రవ్యం రేట్లను సాధించడం మరో మాటలో చెప్పాలంటే - 1931 నాటికి ప్రతిచోటా విస్తరించిన పాత గోల్డ్ స్టాండర్ (స్వర్ణ ప్రమాణం) స్థానే మరొక కరెన్సీ ప్రమాణాన్ని స్థాపించడం దీని లక్ష్యం

**Immobilisme** (Immobilism) = అనిశ్చిత రాజకీయం : ఇది ఫ్రెంచి పదం ప్రధానంగా ఫ్రెంచి థర్డ్ రిపబ్లిక్ (1870-1940), ఫోర్త్ రిపబ్లిక్ (1946–58)ల రాజకీయాలకు ఈ 'అనిశ్చిత వాదం' వర్తిస్తుంది ఈ రెండు రిపబ్లిక్ వ్యవస్థలలోనూ బలీయమైన కేంద్ర ప్రభుత్వాలు లేవు అధికారమంతా పార్లమెంటులో కేంద్రీకృతమై ఉంది ప్రధానమంత్రులను, ప్రభుత్వాలనూ ఎన్నుకొనే అధికారం నేషనల్ అసెంబ్లీకి కట్టబెట్టారు ఫ్రెంచి సామాజిక వ్యవస్థ చిన్నాభిన్నమై ఉన్నందున,

## NUCLEAR TERMINOLOGY

**Core** = ప్రధాన కేంద్రం : ఇది న్యూక్లియర్ (అణు) రియాక్టర్‌లో కీలకమైన భాగం ఇందులో అణు విచ్ఛిత్తికి దోహదపడి, అపారమైన శక్తిని విడుదలచేసే ఇంధనం ఉంటుంది ఈ రియాక్టర్ ప్రధాన కేంద్రంలో యురేనియం లాంటి ఇంధన అణువులు విచ్ఛిన్నమవుతాయి వేడిమి రూపంలో శక్తి పుడుతుంది ఈ శక్తి నీటిని మరగబెట్టి ఆవిరి పుట్టడానికి దోహదపడుతుంది అలా విడుదలైన ఆవిరి టర్బయిన్ తిరగడానికి అవసరమైన శక్తిని పుట్టిస్తుంది తద్వారా టర్బయిన్ జనరేటర్‌ను ఆడించి ఉత్పత్తి చెస్తుంది

**fission** = అణువిచ్ఛిత్తి : అణు కేంద్రాన్ని విచ్ఛిన్నం చేసి, శక్తిని విడుదల చేయడం

**Meltdown** = ఒక్కొప్పుడు అణు ఇంధనం కాస్తా మరిగి కరిగిపోయేంతగా రియాక్టర్ కోర్ వేడెక్కి (వోవర్ హీట్) పోతుంది. ఆ దశనే న్యూక్లియర్ యాక్సిడెంట్ (న్యూక్లియర్ ప్రమాదం) అంటారు అణు ఇంధనం తన ఎలయాన్ని ఛేదించుకొని అణు ధార్మిక పదార్థాలను పరిసరాలలోకి విడుదలచేసి హాని కల్గిస్తుంది

**rad** = రేడియేషన్ కొలమానం : రేడియేషన్ (అమితమైన తాపశక్తి) వ్యాపించిన సందర్భంలో ఏ మేరకు అది వ్యాపించిందో అంచనా కట్టే ప్రామాణికమైన కొలమానం ఒక 'మిల్లీ రాడ్' రాడ్‌లో వెయ్యో వంతు రేడియేషను ఈ మేరకు మాత్రమే భరించగలమని చెప్పడానికి కొలబద్ద ఉందా లేదా అన్నది శాస్త్రవేత్తలలో ఇంకా చర్చనీయాంశంగానే ఉంది

**Radiation** = తాపశక్తి / అణు ధార్మిక శక్తి : యురేనియం లాంటి తాపశక్తిగల పదార్థం విడుదల చేసే పరమాణువులను లేదా రేడియో యాక్టివ్ తరంగాలను రేడియేషన్ అంటారు ఈ తాపశక్తి శరీరంలోని కణాలకు నష్టం కలుగజేస్తుంది లేదా వాటిని చంపేస్తుంది ఫలితంగా కాన్సర్లు, జన్యు కణాల పతనం, మృత్యువాత సంభవం

**rem** = తాపశక్తి కొలమానం: జీవ కణాల్లోకి చొచ్చుకుపోయిన అణు ధార్మిక శక్తిని కొలిచే ప్రామాణిక యూనిట్‌ను 'రెమ్' అంటారు 'రెమ్' కొలమానంలో వెయ్యోవంతును ఒక "మిల్లీ రెమ్" అంటారు మనిషి ఛాతీ ఎక్స్‌రేలో ఈ రేడియేషన్ 20-30 "మిల్లీ రెమ్స్" మధ్య ఉంటుంది ఈ రేడియేషన్ కాస్మిక్ కిరణాల వల్ల, డయాగ్నొస్టిక్ ఎక్స్‌రేలవల్ల, వ్యాపిస్తూంటుంది.

**Roentgen** = ఎక్స్-రే ఎక్స్‌పోజర్ ప్రామాణిక కొలత (ఎక్స్-రే కనిపెట్టిన వ్యక్తి పేరు కూడా ఇదే )

**Uranium** = న్యూక్లియర్ రియాక్టర్లలో ఇంధనంగా ఉపయోగించే రేడియో ధార్మిక మూలధాతువు ఇది

**Kiloton bomb** = వెయ్యి టన్నుల టి ఎన్ టి విధ్వంసక శక్తికి సమానమైన అణుబాంబు

**Megaton bomb** = 10 లక్షల టి ఎన్ టి. విధ్వంసక శక్తి సమానమైన పెను మారణాస్త్రం

**Neutron Weapon** = ఇది బాంబు కాదు అదొక ఆయుధం లేదా ఆయుధాన్ని మోసుకుపోయే సాధనం (వార్‌హెడ్) ఈ వార్‌హెడ్‌ను లాన్స్ మిస్సైల్ లాంటి క్షిపణిమీద పెట్టి పేలుస్తారు లేదా శతఘ్ని సహాయంతో పేలుస్తారు అంతేకాని బాంబులాగా విమానంనుంచి దీన్ని వదలిపెట్టరు ఈ ప్రేలుడు వల్ల అపారమైన రేడియేషన్ విడుదలవుతుంది దీనివల్ల మనుషులు చస్తారు గాని బిల్డింగులకు, ఇతర నిర్మాణాలకు కలిగే నష్టం స్వల్పం.

**T.N.T.** = పెను ప్రేలుడు పదార్థం దీని విస్తృత నామం : "ట్రినిట్రోటొలూన్" (Trinitrotolune). బాంబుల, అణు బాంబుల విధ్వంసక శక్తిని ఈ పదార్థ విధ్వంసక శక్తిలో అంచనా కడతారు

అనిశ్చిత రాజకీయాల మూలంగా కుక్క గొడుగుల్లా ఎలు ఏకాల పార్టీలు వెలిశాయి ఇందుకొక కారణంగా దామాషా ప్రాతినిధ్య ఎన్నికల పద్ధతిని పేర్కొంటారు ఈ పద్ధతి వల్ల ఎవరికి సరైన మెజారిటీ లభించక మంత్రివర్గాలన్నీ అస్థిరమైన సంకీర్ణ మంత్రివర్గాలుగా తయారయ్యాయి ఒక్కొక్కసారి ప్రభుత్వాల ఉనికి నెలలు కాదు రోజులు నిర్ణయిస్తూ వచ్చాయి ఈ అనిశ్చిత పరిస్థితినే "ఇమ్మొబైలిజం" అన్నారు కొన్ని సందర్భాల్లో ఇటలీలో, మరికొన్ని సందర్భాల్లో అమెరికాలోనూ ఇలాంటి పరిస్థితులు తలెత్తకపోలేదు

**Imperialism** = సామ్రాజ్యవాదం రాజకీయ పరిభాషలో దీనినే సామ్రాజ్య విస్తరణ వాదం అని కూడా అంటారు వ్యాపారం పేరిట వచ్చి వ్యవహారం చక్కబెట్టిన బ్రిటన్ మన పాలిట సామ్రాజ్యవాద దేశం అయితే, ఇతరుల అధికారాలను హరించడాన్ని కూడా కొందరు 'సామ్రాజ్యవాదం' అంటున్నారు ఉదా: అమెరికన్ పార్లమెంట్ అధికారాలను కూడా తాను హస్తగతం చేసుకోడానికి రిచర్డ్ నిక్సన్ ప్రయత్నించినప్పుడు అతణ్ణి అమెరికన్లు ఇంపీరియల్ ప్రెసిడెంటు అని విమర్శించారు

**Impromptu** = ఆకస్మికంగా / అప్రయత్నంగా / ఎలాంటి ప్రత్యేక ఏర్పాటు లేకుండా (చేసే పర్యటన, తనిఖీ వగైరాలకు సంబంధించి)

**Indochinese Peninsula** = ఇండో చైనా ద్వీపకల్పం ఇందులో బర్మా, కంబోడియా, లావోస్, వియత్నామ్ దేశాలున్నాయి

**Insurgent**= రాజ్య ధిక్కారకుడు, ధిక్కారక సభ్యుడు

**Interest Groups** = స్వార్థ వర్గాలు : రాజకీయ వ్యవస్థలో ఒక ప్రత్యేక వర్గం (సెక్షనల్) ప్రయోజనాలను కొమ్ముకాసి ముందుకు నెట్టడం కోసం ఏర్పడిన సంస్థలను "ఇంటరెస్ట్ గ్రూపులు" అంటారు ఉదా: ఇలాంటివి ట్రేడ్ యూనియన్లు, వృత్తి సంఘాలు, యాజమాన్య సంఘాలు, ప్రెషర్ గ్రూపులు లాంటి స్వచ్ఛంద సంఘాలు వగైరా పార్లమెంటరీ వ్యవస్థలో 'లాబీ' వర్గాలు కూడా ఇలాంటివే

**International Socialism** (Three Internationals) = అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమం / వ్యవస్థ శ్రామికవర్గ అంతర్జాతీయ భ్రాతృత్వాన్ని సోషలిస్టు, కమ్యూనిస్టు సిద్ధాంతాలు ఆమోదించినవే ఈ ఆదర్శం లక్ష్యంగా వెలసినవే - సెకండ్, థర్డ్ ఇంటర్నేషనల్ సంస్థలు అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమంలో థర్డ్ ఇంటర్నేషనల్ ఒక బాగం దీనినే "కొమింటర్న్" అని కూడా అంటారు ఫస్ట్ ఇంటర్నేషనల్ వ్యవస్థాపకులు కారల్ మార్క్స్, ఎంగెల్స్ (1864) సెకండ్ ఇంటర్నేషనల్ 1889లో పారిస్‌లో ఏర్పడింది రెండవ ఇంటర్నేషనల్ మొదటి ప్రపంచ యుద్ధంతో బలహీనపడిపోయింది ఇందుకు ప్రధాన కారణంగా - పెట్టుబడిదారీ దేశాలు ప్రారంభించే యుద్ధాలను ఆయా దేశాల్లోని సోషలిస్టు పార్టీలు వ్యతిరేకించాలని నిర్ణయించినప్పుడు తీరా ఆచరణలోకి వచ్చేసరికి ఈ పార్టీలు తమ తమ దేశీయ ప్రభుత్వాలకు కొమ్ముకాయడమేనని అంటారు తర్వాత ఈ సెకండ్ ఇంటర్నేషనల్‌ను 1923లో సంస్కరించారు ఇప్పటి సోషలిస్ట్ ఇంటర్నేషనల్ దీని చలవే అయితే ఈ ఇంటర్నేషనల్ రాజకీయంగా సంస్కరణ వాద పక్షం, విప్లవ సిద్ధాంతానికి పరమ వ్యతిరేకం క్రమంగా ఇలా ఈ ఇంటర్నేషనల్ బలహీనపడడంతో రాడికల్ కార్యక్రమంలో 1919లో ముందుకు దూసుకువచ్చిన సంస్థ థర్డ్ ఇంటర్నేషనల్ రష్యాలు బోల్షివిక్ ప్రభుత్వం ఏర్పడిన దరిమిలా లెనిన్ ఆధ్వర్యంలో ఈ థర్డ్ ఇంటర్నేషనల్ అవతరించింది

**Interpol** = అంతర్జాతీయ పోలీసు (నేర) విచారణ సంస్థ (International Criminal Police Organization).

**IRA** (Irish Republican Army) = ఐరిష్ రిపబ్లికన్ ఆర్మీ: ఉత్తర ఐర్లాండ్ బ్రిటన్ పెత్తనాన్ని వ్యతిరేకిస్తూ 1916నుంచీ గెరిల్లా యుద్ధం సాగిస్తున్న సంస్థ దీని రాజకీయ సంస్థ "సిన్‌ఫిన్" సిన్‌ఫిన్ అంటే "మా అంతట మేము" అని అంటే స్వయం శక్తితో సాగించిన ఉద్యమం ఇది 1905లో ఈ రాజకీయ పక్షం ఏర్పడగా ఆ తర్వాత పదకొండేళ్ళకు దాని విమోచన సంస్థగా ఐ ఆర్ ఎ అవతరించింది

**Iron Curtain** = ఇనుప తెర : ఈ పదం ప్రధానంగా సోషలిస్టు దేశాలను ఉద్దేశించి కల్పించింది ఈ దేశాలనుంచి తమకు అవసరమైన రహస్య సమాచారం అందడం లేదన్న అక్కసుతో కాపిటలిస్టు దేశాధినేతలు అల్లి వ్యాప్తిలోకి తెచ్చిన పదం ఇది ఈ పదాన్ని వాడిన వ్యక్తి బ్రిటన్ యుద్ధ కాలపు ప్రధానిగా ఉన్న విన్స్టన్ చర్చిల్ అని కొందరంటే, కాదు తూర్పు యూరప్, ఆగ్నేయ యూరొప్‌పై సోవియెట్ ఆధిపత్యాన్ని వర్ణించేందుకు నాజీ హిట్లర్ జర్మనీ సమాచార మంత్రి జోసెప్ గోబెల్స్ అని మరికొందరంటారు ఇదే వరుసలో చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడిన తర్వాత అక్కడినుంచి కూడా తమకు తగిన సమాచారం అందనందుకు దుగ్ధతో కాపిటలిస్టు రాజ్యాధినేతలు చైనాను "అడితీ తెర" / వాసపు బొంగుల తెర (Bamboo curtain) అని పేరు పెట్టారు

**Isolationism** = తటస్థ విధానం/వేర్పాటు విధానం: అంతర్జాతీయ విధానంలో ఇదో వ్యూహం తన ఆంతరంగిక వ్యవహారాలకు ఎలాంటి హాని కలగనంతవరకూ ప్రపంచ వ్యవహారాలలో తనకు ఆసక్తి లేదనీ, ఇతర దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో కూడా తనకెలాంటి ఆసక్తి లేదనీ ప్రకటించే దేశానికి ఈ సూత్రం వర్తిస్తుంది అంటే పెక్కు ఘర్షణలలో ఎలాంటి జోక్యం లేకుండా కిమిన్నాస్తిగా ఉండే దేశ విధానాన్ని తటస్థ విధానంగా పేర్కొన్నారు 1823లో రూపొందిన మన్రో సిద్ధాంతం (Manroe doctrine) ఈ వైఖరికి నిదర్శనం 19వ శతాబ్దంలో ఎక్కువ భాగం, 20వ శతాబ్దంలో రెండు యుద్ధాల మధ్యకాలంలోనూ అమెరికా అనుసరించిన వైదేశిక నీతి ఇదే తన స్వప్రయోజనాలకు సరిపోయినప్పుడు తటస్థ విధానాన్ని అనుసరించి, తన ప్రయోజనాల రక్షణ కోసం ఆసియా వ్యవహారాల్లోనూ, హవాయి, ఫిలిప్పీన్స్ ఆంతరంగిక వ్యవహారాల్లోనూ జోక్యానికి దిగింది అమెరికా రెండు యుద్ధాల మధ్య కాలంలో అమెరికా నానాజాతి సమితినుంచి దూరంగా వుంది 1941 ఆఖర్లో జపాన్ దాడికి దిగేదాకా రెండో ప్రపంచ యుద్ధంలో నానాజాతి సమితి జోక్యం చేసుకోకుండా అమెరికా నిరోధించింది ఈ తాటస్థ్యం వల్ల అమెరికాకు వొరిగిన ప్రయోజనాలెలా వున్నా విధానం యూరప్‌కు ఉపద్రవంగా మారింది అమెరికా తాటస్థ్యాన్ని అడ్డుగా పెట్టుకొని యూరప్‌లో నియంతలు తలెత్తారు

**Jacobins** = 1789 లగాయతూ ఫ్రెంచి విప్లవకాలంలో ఎందరినో ప్రభావితం చేసిన విప్లవ సంస్థ సభ్యులను "జాకోబిన్స్" అంటారు వారి సిద్ధాంతాన్ని 'జాకోబినిజం' అంటారు దీని లక్ష్యం - ప్రజా వాణిని ప్రజాస్వామికంగా వ్యక్తీకరించగల జాతీయ పార్లమెంటు స్థాపన, రాజ్య సార్వభౌమాధికారానికి పార్లమెంటే ఏకైక ప్రతీకగా గుర్తించడం

**Jingo** = ఉన్మత్త జాతీయ వాది / జాతీయోన్మాది (ఇతనుకూడా జాత్యహంకారానికి వర్గం చుట్టమే ప్రధానంగా కయ్యానికి కాలుదువ్వే విదేశాంగ నీతి యితడి వేదం)

**Judicial Review** = న్యాయ సమీక్ష : రాజ్య పాలనా వ్యవహారాలలో ప్రభుత్వం (ఎగ్జిక్యూటివ్) తీసుకునే ఫలానా చర్యగాని లేదా శాసన వేదిక (లెజిస్లేచర్) చేసే ఫలానా నిర్ణయంగానీ ఎంతవరకు రాజ్యాంగ విహితం అని విచారించి అత్యున్నత న్యాయస్థానం చేసే సమీక్షను, నిర్ణయాన్నీ జ్యుడిషియల్ రివ్యూ అంటారు న్యాయస్థానం స్వతంత్ర ప్రతిపత్తితో వ్యవహరించగల అవకాశం వున్న ప్రతి చోటా ఈ న్యాయ సమీక్షకు విలువుంది

**Junta** = సైనికాధికార ముఠా (రాజ్యాంగ యంత్రాన్ని హస్తగతం చేసుకున్న తర్వాత పెత్తనం చెలాయించే సైనికాధికార ముఠా)

**Just War** = ధర్మయుద్ధం : కొన్ని సందర్భాల్లో యుద్ధం సమర్థనీయమవుతుంది అప్పుడది ధర్మయుద్ధంగా ప్రజలు పరిగణిస్తారు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం దేశాలు, ప్రజలు సాగించే పోరాటాలు, యుద్ధాలు, ధర్మ యుద్ధాలకింద లెక్క కాగా కొందరు స్వార్థ ప్రయోజనాలకోసం రాజ్య కాంక్షకొద్దీ ప్రజలపై రుద్దే యుద్ధాలు అధర్మ యుద్ధాలుగా పరిగణనలోకి వచ్చాయి ఈ తరహా యుద్ధాలు సృష్టించేవాళ్ళు సామ్రాజ్యవాదులు, నయా వలసవాదులు ఆదిలో ధర్మయుద్ధ సిద్ధాంతాన్ని బలపర్చిన ముఖ్యులు

గ్రాటియస్, శామ్యూల్ పఫెండార్ఫ్ (1632 - 94)

**KGB** = రష్యన్ గూఢాచారి సంస్థ (రష్యన్ బాషలో దీని అర్థం "Committee for State Security" అని)

**Kibbutz** = యూదు ఉద్యమం : యూదులకు ప్రత్యేక రాజ్య ప్రతిపత్తిని సాధించేందుకు 1930లలో ప్రారంభమైన యూదుల పోరాటంలో పాలెస్తీనాలో తలెత్తిన ప్రత్యేక ఉద్యమాన్ని ఇలా పిలుస్తారు ఇజ్రాయెల్ ఏర్పడిన తర్వాత వ్యవసాయాభివృద్ధి కోసం బీడు భూముల్ని సారవంత క్షేత్రాలుగా మార్చేందుకు ఆదిలో "కిబుజ్" ఉద్యమం తలెత్తింది సామూహిక దృక్పథం ఈ ఉద్యమానిక ఆయువుపట్టు ప్రయివేట్ ఆస్తికంటే సంఘ శ్రేయస్సుకూ, సామూహిక వర్తనానికి ప్రాధాన్యమిచ్చిన ఉద్యమం పెట్టుబడిదారీ సమాజాలకు కీలకమైన స్వార్థ ప్రయోజనాలకు భిన్నంగా "కిబుజ్" సామూహిక ప్రయోజనాలకు పెద్ద పీట వేసింది వ్యక్తి వాదాన్ని తగ్గించడం స్త్రీలను వంటింటి కుందేళ్ళుగా ఉంచక సాంఘికోత్పత్తి కార్యక్రమాలకు మళ్ళించి, పిల్లల పెంపకం బాధ్యతను సామూహిక బాధ్యతగా మలచిన ఉద్యమం ఇది

**Knesset** = (కెనెట్) ఇజ్రాయేలీ పార్లమెంటు

**Korean war** = కొరియా యుద్ధం : కొరియన్ ద్వీపకల్పంపై చైనా దాదాపు రెండువేల సంవత్సరాల పెత్తనం చెలాయించింది (ముఖ్యంగా 13 - 19 శతాబ్దాల మధ్య) తర్వాత అది సొంత కాలంపాటు స్వతంత్రంగా ఉంది కాని 1910లో జపాన్ కొరియాపై దురాక్రమణ చేసింది రెండో ప్రపంచ యుద్ధం చివర్లో జపాన్ ఓడిపోయిన దరిమిలా కొరియాను 38వ అక్షాంశ రేఖ పొడవున రెండు భాగాలుగా చీల్చారు ఒక భాగం సోవియెట్ అధిపత్యంలోకి, రెండో భాగం అమెరికన్‌ల ఆధిపత్యంలోకి వెళ్ళింది రెండు కొరియాలలో రెండు ప్రభుత్వాలు వెలశాయి తర్వాత కమ్యూనిస్టులు ఉత్తర కొరియాను ఆక్రమించినందుకు అమెరికా దక్షిణ కొరియాను రెచ్చగొట్టి స్వయంగా ఐక్యరాజ్య సమితి చాటున అమెరికన్ సేనలను దించింది. జనరల్ మెకార్థర్ ఉత్తర కొరియాపై దాడికి కాలుదువ్వడమే కాక పొరుగున ఉన్న కమ్యూనిస్టు చైనా రిపబ్లిక్ పైన కూడా కాల్దువ్వడానికి ప్రయత్నించి, కొరియా యుద్ధాన్ని విస్తృతం చేయబోయాడు కాని ఉత్తరకొరియా - చైనా సెనలు ఉమ్మడి వ్యూహంతో సమితి జోక్యాన్ని, మకార్థర్ వ్యూహాన్నీ తుత్తునియలు చేయగల్గాయి ఆ తరువాత జరిగిన వియత్నాం యుద్ధంలో కంటే ఎక్కువ సైనిక నష్టాలను అమెరికా చవి చూడవలసి వచ్చింది మకార్థర్‌ను సైన్యాధిపతి పదవి నుంచి అమెరికా తొలగించింది కొరియాలో యుద్ధ విరమణ కోసం కృషి చేసిన దేశాలలో ఇండియా ఒకటి

**Ku Klux Klan (K.K K.)**= వేధింపు సంస్థ : రంగుజాతుల వారిని / శ్వేతేతర జాతులను వేధించే సంస్థను 'కుక్లక్స్ క్లాన్' అంటారు (అమెరికా) అమెరికాలో 'క్లాన్' పేరిట వేర్వేరుగా 42 సంస్థలున్నాయి ఇది ఫాసిస్టు సంస్థ, జాత్యహంకార సంస్థ

**Kuomintang** = "కొమింటాంగ్" : ఇది చైనాలోని ఒకప్పటి రాజకీయ పార్టీ దీని నాయకుడు చాంగ్‌కై షేక్ ఇతడు చైనా విప్లవోద్యమానికి తాళలేక దేశం విడిచి పారిపోయి తైవాన్ దీవిలో తలదాచు కున్నాడు తర్వాత ఆయన వారసులు తైవాన్‌లో అమెరికాకు తైనాతీలుగా మారి ఒక ప్రభుత్వాన్ని ఏర్పరచుకొని అదే అసలైన 'చైనా ప్రభుత్వం'గా చలామణీ కాజూస్తున్నారు తైవాన్ (ఫార్మోజా) చైనాలో అంతర్భాగం నేటికీ రెండు చైనాల పేరిట నాటకమాడుతున్న అగ్రరాజ్యం అమెరికా.

**Kuril Islands** = ఈ దీవులపై ఆధిపత్యం తమదంటే తమదని జపాన్, రష్యాలు రెండూ వాదులాడు కుంటున్నాయి రెండో ప్రపంచ యుద్ధ కాలంలో యుద్ధ వ్యూహరీత్యా తప్పనిసరై రష్యా ఈ దీవుల్ని ఆక్రమించవలసి వచ్చింది

**Laissez-faire** = స్వేచ్ఛా వ్యాపార సిద్ధాంతం : దేశ ఆర్థిక వ్యవహారాలపైన ప్రభుత్వానికి ఎలాంటి అదుపాజ్ఞలు ఉండరాదని బోధించే సిద్ధాంతం ఇది 19వ శతాబ్దపు ఉదారవాద ధోరణుల నుంచి ఇది మొలకెత్తింది ఆధునిక ప్రపంచంలో కూడా 'గ్లోబలైజేషన్' పేరిట ఈ సిద్ధాంతం పునరుజ్జీవనం పొందజూస్తోంది.

కాని ఆధునిక యుగంలో ప్రభుత్వం జోక్యం లేకుండా కనీసం సంక్షేమ కార్యక్రమాల అమలులోనైనా ప్రభుత్వ నియంత్రణ లేకుండా రాజ్య వ్యవహారాల నిర్వహణ అసాధ్యమని కొందరు ఆర్థిక, రాజకీయ శాస్త్రవేత్తల విశ్వాసం  స్వేచ్ఛా వ్యాపార సిద్ధాంత కర్తలలో ప్రముఖులు: డేవిడ్ రికార్డో, ఆల్ఫ్రెడ్ మార్షల్ ఫ్రీడ్‌మాన్

**Latifundia** = లాటిఫండియా : లాటిన్ అమెరికాలో జమిందారీ-భూస్వామ్య వ్యవస్థను ఇలా అంటారు సొంతంగా సాగు చేయకుండా విస్తారమైన భూములపై కర్రపెత్తనం మాత్రమే చెలాయిస్తూ సామాన్య మధ్యతరగతి రైతాంగం శ్రమను దోపిడీ చేసే భూస్వామ్య వ్యవస్థను ఇలా అంటారు

**Law and order** = శాంతి భద్రతలు

**Law of the land** = అమలులో వున్న న్యాయం

**League of Nations** = నానాజాతి సమితి : ఐక్యరాజ్య సమితి స్థాపనకు ముందున్న ప్రపంచ సంస్థ ఇది  1918 జనవరిలో - అమెరికా మొదటి ప్రపంచ యుద్ధంలోకి దిగిన తొమ్మిది నెలల తర్వాత నాటి అమెరికన్ ప్రెసిడెంట్ ఉడ్రో విల్సన్ "పద్నాలుగు సూత్రాలు" ప్రకటించాడు  అందులో ప్రధానమైన అంశాలు - నూతన ప్రపంచ రాజకీయ వ్యవస్థ ఏర్పాటు, రాజ్యాల మధ్య సమతుల్యతా వ్యవస్థను రద్దు చేయడం, అదరికీ వర్తించగల సమష్టి భద్రతా వ్యవస్థను నెలకొల్పేందుకు వీలైన ప్రపంచ వ్యవస్థను ఏర్పరచడం 1919లో వర్సేల్స్ సంధి పత్రంపై సంతకాలు చేసిన రాజ్యాలు ధృవీకరించి, 1920లో స్థాపించిన ప్రపంచ సంస్థే "లీగ్ ఆఫ్ నేషన్స్"  ప్రపంచ శాంతి స్థాపనకు అవసరమైన సైనిక శక్తి దీనికి లేదు. ఆర్థికపరమైన ఆంక్షలు విధించగల అధికారముగాని వాటిని అమలుపరచగల యంత్రాంగం "నానాజాతి సమితి"కి లేదు  క్రమంగా క్షీణించిపోతున్న ఈ సంస్థ 1946లో రద్దయింది  అయితే లీగ్ ఆఫ్ నేషన్స్ శాశ్వత విజయాలుగా చెప్పదగినవి రెండు : 1) అది నెలకొల్పిన ప్రపంచ న్యాయస్థానము, ఏర్పరచిన అంతర్జాతీయ కార్మిక సంస్థ

**Left Adventurism** = అతివాద దుందుడుకు విధానం (దీనినే అతివాద బాలారిష్టం అని లెనిన్ అభివర్ణించాడు  ఇది శాస్త్రీయ మార్క్సిజానికి విరుద్ధం)

**Leftist** = వామపక్షీయుడు / ఉదారవాది / డెమోక్రటిక్ సోషలిజంలో విశ్వాసం ఉన్న వ్యక్తి

**Leninism** = లెనినిజం : వ్లాదిమీర్ ఇలిచ్ లెనిన్ రష్యన్ బోల్షివిక్ విప్లవనేత, విప్లవ రష్యా నిర్మాత  ఆయన రష్యన్ సమాజ అవసరాలకు అనుగుణంగా కమ్యూనిజం సిద్ధాంతాన్ని రూపుదిద్దినందున ఈ పేరు వ్యాప్తిలోకి వచ్చింది  ఆ తర్వాత పశ్చిమ యూరోప్ కమ్యూనిస్టు పార్టీలు, క్రమంగా ప్రపంచ వ్యాపితంగా కార్మికవర్గ పక్షాలూ మార్క్సిజంతో పాటు లెనినిజాన్ని కూడా తమ సిద్ధాంతంగా ఆమోదించాయి  తద్వారా రెండూ కలిసి మార్క్సిజం-లెనినిజంగా వ్యాప్తిలో వున్నాయి

**Liberalism** = ఉదారవాదం: ఈ వాదం 19వ శతాబ్దం ఆఖరి పాదంలో ప్రచారంలోకి వచ్చింది  చారిత్రికంగా చూస్తే 'లిబరిలిజం' అనేది మిగులు సగులు ఫ్యూడల్ రాచరికపు ఆధిపత్యపు సంకెళ్ళ నుంచి స్వేచ్ఛకోసం ప్రారంభమైన మధ్యతరగతి లేదా బూర్జువా వర్గ ఉద్యమం  ఆనాటి అన్ని రకాల 'స్వేచ్ఛా' ఉద్యమాలతోనూ (స్వేచ్ఛా వాణిజ్యం, పౌరహక్కులు, మానవహక్కుల ఉద్యమాలు వగైరా) దీనికి సంబంధం ఉంది

**Libertarianism** = ఇది కూడా ఓ తరహా ఉదారవాదమే  కాని లిబరల్ కాపిటలిస్టు విశ్వాసాలను అతిగా సాగలాగి అతి ఉదారవాద ధోరణులకు దారితీసిన సిద్ధాంతం ఇది  దీనికి మూలం అమెరికా, బ్రిటన్, స్కాండినేవియాలు రేగనోమిక్స్‌ను, థాచరిజంనూ (రేగన్-థాచర్ స్వేచ్ఛా వాణిజ్య ధోరణులను ఇలా అంటారు) ఇందుకు ఆధునిక ఉదాహరణలుగా ఆర్థికవేత్తలు పేర్కొంటారు  లిబర్టేరియన్ల వాదం అంతరార్థం - పౌరులందరికీ కొన్ని నిర్దిష్టమైన హక్కులుంటాయి వీటిని రద్దు చేయలేరు  వదులుకోనూ లేరు. సమష్టి ప్రయోజనాల పేరిట వీటిని బలిపెట్టనూ లేరు  లిబర్టేరియనిజాన్ని సంస్కరించడానికి ప్రయత్నించిన

వాళ్ళ నొజిక్, రాల్స్, హైక్ 'తొండముదిరి ఊసరవెల్లి' అయిందన్నట్టుగా ఈ లిబర్టేరినిజానికి వేసిన వెర్రితల "అనార్కిజం" (అరాచకవాదం)! కొటికి పడగలెత్తించె కేవల "ద్రవ్యవాదా"నికి రాజకీయ బాపనా రూపమే లిబర్టేరియనిజం

**Lie in state** = ప్రభుత్వ లాంచనాలతో అంత్య క్రియలు జరిగే నాయకులకు / ప్రభుత్వాధినేతలకు వర్తింపజేసే లాంఛనాన్ని ఇలా అంటారు (Those entitled to a state funeral are a president, a former President, a Prime Minister, Former P M , or a President elect or any other person designated by the president)

**Limited war** = పరిమిత యుద్ధం /స్థానిక యుద్ధం: అణ్వస్త్ర పోటీ యుగంలో పరస్పరం అణుయుద్ధానికి కాల్దువ్వే అగ్రరాజ్యాల జోక్యానికి దారితీయకుండా ఎక్కడికక్కడ స్థానికం చేసే ఘర్షణను పరిమిత యుద్ధం అంటారు ఉదా: కొరియా యుద్ధం, అరబ్-ఇజ్రాయిలీ యుద్ధాలు, దక్షిణ అట్లాంటిక్‌లు, అర్జెంటీనా - బ్రిటన్‌ల మధ్య ఘర్షణ ఇరాక్‌పై తలపెట్టిన గల్ఫ్ యుద్ధం చూడ్డానికి పరిమితంగా కన్పించినా ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు దానిని నూతన మారణాస్త్రాల పాటవ పరీక్షా క్షేత్రంగా (గల్ఫ్ ప్రాంతాన్ని) మార్చివేశారు

**Lobby** = సాధింపు వర్గం: దీని మూలం పార్లమెంటు 'లాబీలు', వోటింగ్ జరిగిన తర్వాత కూర్చుని వ్యవహారాలు రాజకీయ వ్యవహారాలు చర్చించుకోవడాన్ని గుసగుసలు పోవడాన్ని చిలాబీయింగ్' అంటారు 'లాబీ' కి దిగాడంటే లావాదేవీకి దిగాడని అర్థం వత్తిడి ద్వారా (సాధింపు ద్వారా), వాదన ద్వారా లేదా మరో ప్రలోభం ద్వారా పాలకులచేత పని చేయించుకోవడమే 'లాబీయింగ్' ఈ కార్యక్రమంలో ఉండే వారిని మరో విధంగా 'ప్రషర్ గ్రూపు' అంటారు

**Lobbyist** = పైరవీకారుడు (చట్టాలు చేయించడానికీ, వాటిని నిలుపు చేయించడానికీ ఒక గ్రూపు / సంస్థ / పాలక పక్షం తరపున కమీషన్ తీసుకొని పనిచేసే పైరవీకారుడు)

**M - 7** = ఇండియా, దక్షిణాఫ్రికా, మారిషస్, కెన్యా, ఓమన్, సింగపూర్, ఆస్ట్రేలియా (హిందూ మహా సముద్రాన్ని ఒరుసుకుని ఉన్న దేశాలు) వీటి సమావేశం మారిషస్‌లో జరిగింది అందుకని M- గుర్తు

**Mafia / Mafiosi** = మాఫియా ముఠా : నేరగాళ్ళు రహస్య కార్యకలాపాలు సాగించే సంస్థనూ, దాని సభ్యులనూ ఇలా అంటారు అయితే నేరాన్ని వృత్తిగా చేపట్టి అజ్ఞాతంగా అత్యాచారాలకు పాల్పడే ఆర్గనైజ్డ్ క్రైమ్ కూ దీనికీ తేడా ఉంది మాఫియా ప్రధాన కార్యకలాపాల్లో ఒకటి - రాజకీయ వేత్తలతో, బిజినెస్ గ్రూపులతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోవడం

**Maginot line** = ఆత్మ రక్షణ శ్రేణి (దీని పుట్టుక రెండు ప్రపంచాల మధ్య కాలంలో జర్మన్ల దాడినుంచి ఫ్రెంచి దుర్గాలను రక్షించుకోవడానికి ఏర్పడ్డ శ్రేణి పేరిది అయినా దాన్ని జర్మన్లు కూలుస్తూనే వచ్చారు ఈ రక్షణ శ్రేణి ప్రతిపాదకుని పేరు మేజినాట్).

**Magna carta** = హక్కుల పత్రం (వ్యక్తిగత, రాజకీయ హక్కులను 13వ శతాబ్దంలో ఇంగ్లండు రాజు జాన్ ఆనాటి భూస్వామ్య వర్గాలకు మాత్రమే ధారాదత్తం చేశాడు దీని ద్వారా తన రాచరికాన్ని కుదించుకున్నాడు)

**Mandate** = ఆదేశం: ఎన్నికలలో విజయం పొందిన పక్షాలు (తక్కువ మెజారిటీతో గెలుపొందినా సరే) దేనికవే ప్రజలు తమను పాలనాధికారం చెలాయించమని "ఆదేశం"చారని చెప్పుకొంటాయి పార్టీ నిర్దేశిత విధానాలను అమలు చేయాలన్నది "ఆదేశం", సారాంశం దానినే 'మాండేట్' అంటారు దీనిని ప్రత్యామ్నాయంగా ఎడ్మండ్ బర్క్ "డెలిగేషన్" అనే సిద్ధాంతాన్ని రూపొందించారు అధికారాన్ని మరొకరికి బదలాయించడాన్ని, విధానాల అమలుకు ఈ బదలాయింపు అవసరం అని భావించడాన్ని ఈ సిద్ధాంతం ప్రతిపాదించింది మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత నానాజాతి సమితి (లీగ్ ఆఫ్ నేషన్) ఓడిపోయిన జర్మన్, టర్కిష్ సామ్రాజ్యాల ఆధిపత్యంలో ఉన్న వలస దేశాల పరిపాలనాధికారాలను యుద్ధంలో గెలిచిన కొన్ని రాజ్యాలకు బదలాయించింది ఈ బదలాయింపులను "మాండేట్స్" అన్నారు. "మాండేట్

'అంతిమ లక్ష్యం వలసలకు స్వాతంత్ర్యం ప్రకటించడం సమితి ధర్మకర్తృత్వ సూత్రం లక్ష్యం కూడా ఇదే

**Maoism** = మావో సిద్ధాంతం : కమ్యూనిస్టు సిద్ధాంతానికి ప్రధానంగా వ్యవసాయిక దేశమైన చైనాకు, ఆసియా దేశాలకు అనుగుణమైన రాజకీయ, సైనిక వ్యూహరచన చేసిన మావో సూత్రాలను 'మావోయిజం' అంటారు సోవియెట్ ప్రయోగం ప్రధానంగా కార్మికవర్గ విప్లవం కాగా, చైనాలో మావో ప్రయోగం ప్రధానంగా రైతాంగ కార్మిక విప్లవం మార్క్సిజం-లెనినిజానికి ఆసియా దేశాల రైతాంగ - వ్యవసాయ కార్మిక ప్రయోజనాల దృష్ట్యా నూతన భాష్యం చెప్పిన సిద్ధాంతకర్త ప్రతి విదేశీ భావజాలం దేశీయ ప్రయోజనాలకు చాకిరీ చేయాలనీ పాత సంప్రదాయాలు నవ్య సమాజ సృష్టికి మాత్రమే దోహదపడాలనీ ఈతని సిద్ధాంతం

**Marshall Islands** = బ్రిటీష్ పరిశోధకుడు జాన్ మార్షల్ పేరిట వెలసిన దీవులు

**Marshall Plan** = మార్షల్ పథకం : అమెరికాలో ట్రూమన్ ప్రభుత్వ హయాములో విదేశాంగ మంత్రిగా పనిచేసిన జార్జి మార్షల్ రూపొందించిన పథకం మార్షల్ పథకం ప్రధాన లక్ష్యం యుద్ధానంతరం యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థలను పునర్వ్యవస్థీకరించడానికి ఆర్థిక సహాయం అందించడం యుద్ధం వల్ల చితికిపోయిన యూరప్ దేశాల పరిస్థితులను చక్కదిద్దడం కోసం డాలర్ల సహాయం పేరిట వెలసిన పథకం ఇది ఇందుకొక షరతు విధించాడు మార్షల్ యూరప్ దేశాలు పరస్పరం సహకరించుకోవలెగాని కలహించు కోకూడదు అని ఫ్రాన్స్, బ్రిటన్‌లు ఈ పథకానికి ఆహ్వానం తెల్పగా, యుద్ధానంతర యూరప్‌ను తన గుప్పిటలోకి తెచ్చుకోవాలని పెత్తనం చెలాయించాలని అమెరికా ఈ ఎత్తు ఎత్తిందని సోవియెట్ ఈ పథకాన్ని తిరస్కరించింది తూర్పు యూరప్ తన పట్టు సడలిపోతుందని భయపడింది 1948 నుంచీ యూరప్‌లోకి డాలర్ల ప్రవాహం ప్రారంభమైంది యూరప్ దేశాల ఆర్థిక వ్యవస్థలకు సహాయం చేయడంతో పాటు మార్షల్ ప్లాన్ కలతలకు, కార్పణ్యాలకు కూడా కారణమైంది

**Marxism - Leninism** = మార్క్స్ సిద్ధాంతాలను జార్ చక్రవర్తుల పాలనలోఅణగారి కునారిల్లిపోతున్న రష్యన్ సమాజానికి వర్తింపజేసి 1917అక్టోబర్ రష్యన్ మహా విప్లవానికి సారథ్యం వహించిన లెనిన్ వ్యూహ రచననే లెనినిజం అంటారు ఉభయ సిద్ధాంతాల మేలికలయికయే మార్క్సిజం - లెనినిజం

**Marxism** = మార్క్సిజం : కారల్ మార్క్స్ సిద్ధాంతాలనే మార్క్సిజం అంటారు దానికి పునాది "కమ్యూనిస్టు మానిఫెస్టో" రచన శాస్త్రీయమైన వివరణల ద్వారా దేశ దేశాల ఆర్థిక, రాజకీయ, సాంఘికపరిస్థితుల అధ్యయనం ద్వారా పెట్టుబడికీ - శ్రమశక్తికీమధ్య సాగుతున్నసంకుల సమరానికి కారణాలను అన్వే షించడం ద్వారా ప్రపంచ కార్మికవర్గం విమోచనకు ఈ విశిష్ట ప్రణాళికను, తదితర సాంఘిక, తాత్త్విక సైద్ధాంతిక పునాదిని ఏర్పరచినవాడు కారల్ మార్క్స్ "ప్రపంచ కార్మికులారా! ఏకంకండి మీకు పోయేదేమీ లేదు సంకెళ్ళు తప్ప" అన్న నినాదాన్ని విశ్వవ్యాపిత నినాదంగా మార్చింది మార్క్సిజం

**Materialism** = భౌతికవాదం : సామాజిక పరివర్తన సంస్థల పుట్టు, పురోగతీ - అన్నీ ఈ భౌతిక ప్రపంచం సృష్టేనన్నది ఈ సిద్ధాంతం మార్క్సిస్టు సిద్ధాంతాలకే ప్రధానంగా ఈ భౌతిక వాదాన్ని వాడతారు ప్రతిదీ మారుతూఉంటుందని, ఈ పరిణామశీల గతిని తర్కించుకొంటూ మంచి - చెడులను విడమర్చుకుంటూ, విమర్శ ఆత్మ విమర్శ ఆధారంగా సమాజం పురోగమిస్తుందన్నది గతి తర్కంగానూ, గతి తార్కిక భౌతికవాదంగానూ (Dialectical Materialism) ప్రచారంలోకి వచ్చింది.

**May-Day** = "మేడే" : ప్రపంచ కార్మిక దినోత్సవం (మే 1) 16 గంటల పనిదినానికి వ్యతిరేకంగా ఎనిమిది గంటల పనిదినం కోసం ఆరాటపడి పోరాటాలు నడిపి చికాగో మారణకాండ తర్వాత ప్రపంచ కార్మికులు సాధించుకున్న దీక్షా దినం. ఇప్పుడు దాదాపుగా అన్నిదేశాలూ పాటిస్తున్నాయి.

**Media** = ప్రచార, ప్రసార సాధనాలు (వార్తా పత్రికలు, మ్యాగజైన్లు, వార్తా సర్వీసులు, రేడియో, టెలివిజన్).

**Mercenary** = కిరాయి సైనికుడు

**Messaiah** = విమోచన ప్రదాత, విమోచకుడు

**Middle Age** = మధ్యయుగాలు : క్రీస్తుశకం 476 నుంచి క్రీస్తు శకం 1450 మధ్య కాలాన్ని ఇలా అంటారు

**Militias** = మిలిషియా : ఈ ప్రత్యేక దళాలు రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ఏర్పడ్డాయి యుద్ధం విరుచుకుపడ్డప్పుడు స్థానిక పౌర జనాభా సహాయం పెద్దగా లేకుండానే ఈ మిలిషియారంగంలోకి దిగుతుంది స్థూలంగా వీటిని పాక్షిక సైనిక దళాలు అనవచ్చు వీటికి మరో పేరు "పౌర సైనికులు" (citizen soldiers) అత్యయక పరిస్థితులలో మాత్రమే వీరి సర్వీసులను ప్రభుత్వాలు ఉపయోగించుకొంటాయి అమెరికాలో 'నేషనల్ గార్డ్' ఇలాంటిదే ఇవి రిజర్వు దళాలుగా వ్యవహరిస్తాయి

**MIRV** = ఇది ఖండాంతర క్షిపణి దీనికి అనేక అణ్వాయుధాలు అమరి ఉంటాయి ప్రతి ఒక్కదాన్ని విభిన్న లక్ష్యాల మీదికి వదలొచ్చు (Multiple Independently Targetable Reentry Vehicle)

**Mittel - Europa**= మధ్య యూరప్‌ను (మిడిల్-యూరోప్) ఇలా అంటారు లేదా సెంట్రల్ యూరప్ అని కూడా అంటారు జర్మనీ ప్రభావంలో వున్న యూరోపియన్ దేశాలన్నింటికీ ఇది వర్తిస్తుంది

**Mobocracy** = మూక పాలన

**Monaco** = వాటికన్ తర్వాత ప్రపంచంలో అతి చిన్న రాజ్యం ఇది

**Monarchy** = ఏకస్వామ్యం / ఒకే వ్యక్తి పాలన

**Monetarism** = ద్రవ్య వాదం (మోనిటరిజం : ఈవాదకర్త ప్రముఖ ఆర్థికవేత్త మిల్టన్ ఫ్రీడ్‌మాన్ "చికాగో స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్" దానికి కేంద్ర స్థానం ఈ వాదం ఆర్థిక వేత్తల కంటే రాజకీయ వేత్తలలో ఎక్కువ ప్రాచుర్యం పొందింది ముఖ్యంగా కాపిటలిస్టు వ్యవస్థలలో అమలులో వున్న కీన్సియనిజంకు (కీన్స్‌సిద్ధాంతం) ప్రత్యామ్నాయంగా అమెరికా, బ్రిటన్‌లలోని రాజకీయ మితవాద వర్గాలు మోనిటరిజాన్ని ప్రచారంలోకి తెచ్చాయి. మోనిటరిజం ప్రధాన లక్ష్యం-ద్రవ్యోల్బణాన్ని ఎట్టి పరిస్థితులలోనూ అదుపు చేయడం, తగ్గించడం ఆర్థిక వ్యవస్థలో స్వేచ్ఛగా ద్రవ్య సరఫరా (మనీ-సప్లై = డబ్బు చెలామణి) వల్ల ద్రవ్యోల్బణం రేటును అదుపు చేయవచ్చునన్నది ఈ వాదకర్తల విశ్వాసం మరో మాటలో చెప్పాలంటే స్వేచ్ఛా వ్యాపారం దీని అంతిమ లక్ష్యం

**Monetary policy** = ద్రవ్య విధానం : ప్రధానంగా ద్రవ్య చెలామణికి (కరెన్సీ నిర్వహణ, ద్రవ్య మారకం, దాని తాలూకు లావా దేవీలు) ద్రవ్యోల్బణ పరిస్థితులలో డివాల్యుయేషన్, డిప్రిసియేషన్ వగైరా అంశాలకు సంబంధించిన విధానాన్ని ఇలా అంటారు

**Multilateralism** = సామూహిక అణ్వస్త్ర విసర్జనః ఇది అణ్వస్త్ర సంపదకు సంబంధించిన పదం ఇతరులతో నిమిత్తం లేకుండా ఒక దేశం తనకు తానుగా అణ్వస్త్రాలను విసర్జించడాన్ని "యూనీ లేటరిజం" అంటారు కాని అన్ని దేశాలు కలిసి క్రమానుగతంగా అణ్వస్త్ర సంపదను తగ్గించడానికి లేదా రద్దు చేయడానికి సామూహికంగా నిర్ణయించు కోవడాన్ని "మల్టీ లేటరలిజం" అంటారు ఈ సమష్టి నిర్ణయవాదానికి 1989లో ఊతమిచ్చిన వాడు సోవియెట్ ప్రెసిడెంట్ గోర్బచేవ్

**Nation** = జాతి : ఈ భావనకు ఆధారం జాతీయవాదం లేదా "నేషన్-స్టేట్" భావన 'నేషన్' అంటే ఫలానా అని సాంకేతిక పరంగా నిర్వచనం చెప్పలేము కాని సామాజిక శాస్త్రంలో ఈ పదానికి ప్రయోజిత నిర్వచనం స్థూలంగా ఇలా ఉంది 'నేషన్' అంటే ఒకే సామూహిక శక్తిగా ఉమ్మడి చారిత్రక సంప్రదాయాలు, ఉమ్మడి సంస్కృతి గుర్తించదగిన సమష్టి భౌగోళిక ప్రాదేశికత ఉన్న జాతి "నేషన్" అవుతుంది అయితే అన్ని జాతులకూ / దేశాలకూ ఈ నిర్వచనం వర్తించకపోవచ్చు ఉదాః బెల్జియం ఇదీ ఒక నేషనే. కానీ చారిత్రికంగా దీర్ఘకాలంగా అక్కడి కాథలిక్ డచ్ భాషా ప్రజలకూ (ఫ్లెమిష్), వాలూన్ భాషా ప్రజలకూ మధ్య మతపరమైన, భాషా పరమైన పొరపొచ్చాలూ, తగాదాలూ తీవ్రస్థాయిలో వున్నాయి నేటి రూపంలో వున్న బెల్జియం1830లనుంచే ఒక జాతిగా వర్ధిల్లుతోంది అలాగే చారిత్రికంగా ఒక

స్వరూపమూ జాతి స్వరూపమూ లేని మరో దేశం పోలెండ్ కడచిన వెయ్యేళ్ళలో ఎక్కువ భాగం పోలెండ్ ఒక స్వతంత్ర రాజ్యంగానే లేదు దాని సరిహద్దులు, భూభాగాలు మధ్య యూరప్‌కు ఎటుపడితే అటు బదిలీ అయిపోయాయి అయినా పోలెండ్ జాతీయ సమైక్యతకు ఈ పరిణామాలు అడ్డు రాలేదు భౌగోళికంగా చెల్లాచెదురై ఉన్నా జాతుల ఉనికి మాత్రం చెక్కు చెదరదు ఇందుకు ఉదాహరణ యూదుల సమైక్యత

**Nation-State** = నేషన్-స్టేట్ / సజాతీయ రాజ్యం: ఉమ్మడి సంస్కృతి, చరిత్ర, భాష, జాతి భావన - వీటన్నింటితో కూడిన ఏకీకృత రాజకీయ వ్యవస్థను 'నేషన్-స్టేట్' అంటారు చరిత్రలో జాతులు ఉన్నా నేషన్ స్టేట్ ప్రతిపత్తి లేని జాతులు కూడా ఉన్నాయి ప్రాచీన గ్రీస్‌లో గ్రీక్ నేషన్ (జాతి) ఉందిగాని నేషన్-స్టేట్ లేదు రోమన్ సామ్రాజ్య పతనం తరువాతనే నేషన్-స్టేట్ భావన తలెత్తి వేళ్ళూనుకోసాగింది "హోలీ రోమన్ ఎంపైర్" - వేర్పాటుతనంతో ముక్కు ముఖం లేకుండా పడి ఉన్న సబ్-స్టేట్స్ ను కూడగట్టి పాలించలేక కునారిల్లిపోయింది నేషన్-స్టేట్స్‌గా అవతరించిన తొలి రాజ్యాలలో ఫ్రాన్స్, బ్రిటన్‌లు ఆధునిక యుగంలో సామ్రాజ్యవాదుల నిరంకుశ స్వార్థపూరిత నిర్ణయాల ఫలితంగా బలవంతంగా ఏర్పడిన నేషన్-స్టేట్స్ పాకిస్తాన్, చెకోస్లోవేకియాలు అలాగే తూర్పాసియా దేశాలు కొన్నీ అరబ్ పెనిన్స్యులాలోని నేషన్-స్టేట్స్ అవతరణ కూడా ఇలా జరిగిందే అరబ్బులను చిన్నాభిన్నం చేయడంలో బ్రిటన్, అమెరికాల పాత్ర నీచాతి నీచం

**National Assemblies** = జాతీయ శాసన సభలు (పార్లమెంటులు) ఇవి: బల్గేరియా, చెక్‌స్లోవేకియా, ఈజిప్టు, హంగరీ, నేపాల్, పాకిస్తాన్, పోర్చుగల్, ట్యూనీసియా, ఉగాండా, జాయిరి, జాంబియా)

**National Socialism** = "నేషనల్ సోషలిజం" : నేతి బీరకాయలో నెయ్యి ఎంత ఉంటుందో, హిట్లర్ నేషనల్ సోషలిజంలో కూడా అంత 'సోషలిజం' ఉంది! ఇది ఒకనాటి జర్మన్ నాజీ పార్టీ సిద్ధాంతం (Nationalsozialistische Deutsche Arbeiterpartei) యుద్ధంలో ఓడిపోయిన జర్మనీ, నిరాశా నిస్పృహల మధ్య గడుపుతున్న సమయంలో ప్రజలలో పాలకుల పనుల ఎడ్ల అసంతృప్తి, నిరుద్యోగం, పేదరికం తాండవించడాన్ని అవకాశంగా తీసుకొని హిట్లర్ 'సోషలిజం' పేరుతో జర్మన్ ప్రజలను సమీకరించడానికి ఎత్తుఎత్తాడు, సఫలీకృతుడయ్యాడు నాన్-జర్మనీ శక్తులను తరిమివేసి, జర్మన్ జాతినంతా ఒక్క త్రాటి క్రిందకు తేవాలని జాత్యహంకార ఉద్యమానికి పునాదులు వేశాడు 1920లలో, 1930లలో యూరప్‌లో తలెత్తిన ఫాసిజానికి హిట్లరీ 'నేషనల్ సోషలిజం' తోబుట్టువయింది యూదు వ్యతిరేకత దీని ప్రత్యేక తత్త్వం లక్షలాది యూదులను రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో హిట్లర్ ఊచకోతకోశాడు

**NATO** = 'నాటో' సైనిక కూటమి : దీని పూర్తి పేరు 'నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్' రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత పశ్చిమ రాజ్యాల రాజకీయ-సైనిక సంస్థలను సంఘటితపరచిన బలవత్తరమైన సైనిక కూటమి ఇది దీనికయ్యే ఖర్చులో హెచ్చు భాగాన్ని అమెరికా భరిస్తోంది కమ్యూనిస్టు దేశాలనుంచి పశ్చిమ రాజ్యాల ఉనికికి ప్రమాదం వస్తుందన్న ఊహతో రక్షణ పేరిట అమెరికా నాయకత్వాన ఏర్పడిన సైనిక కూటమి ఇది ఇలాంటి సైనిక కూటములే - ఆగ్నేయాసియా సైనిక వ్యవస్థ (South-East Asia Treatry Organization), సెంట్రల్ ట్రీటీ ఆర్గనైజేషన్ (సీటో) ఇవి కూడా అమెరికా ప్రోద్బలంతో, ఏర్పడినవే కానీ ఈ సభ్య దేశాలలో దేనికీ కమ్యూనిస్టు దేశాలనుంచి ప్రమాదం రాలేదు కాని ఆసియాలో, ఆగ్నేయాసియాలో అమెరికా ఆధ్వర్యంలోని ఈ కూటాలనుంచే ఇండియా - పాకిస్తాన్‌లకు, వియత్నాం, కాంబోడియాలకు దఫదఫాలుగా ప్రమాదాలు ఏర్పడ్డాయి పాకిస్తాన్ ఈ కూటాలలోచాలా సంవత్సరాల వరకు సభ్య దేశం

**Neo-Colonialism** = నయా వలస విధానం ('నియో' అంటే సరికొత్త నయా / నవ్య అని అర్థం). దేశాలు స్వాతంత్ర్యం పొందినప్పటికీ పాత సామ్రాజ్యవాద దేశాలు తమ ఆర్థిక, రాజకీయ బలాన్ని ఆసరా చేసుకొని రకరకాల వత్తిళ్ళ ద్వారా ఆయా స్వతంత్ర దేశాలపై పరోక్షంగా పెత్తనం చెలాయించజూచే వైఖరిని "నయా

వలసవాదం" అంటారు. మరో ముక్కలో - వర్ధమాన దేశాలపై పాత వలస వాదుల సరికొత్త పెత్తందారి తనానికి ఇది మారుపేరు.

**Neo-Fascist** = 'నయా ఫాసిస్టు' : ఇది 1990లో ప్రాచుర్యంలోకి వచ్చిన పదం. ఇటలీలో తలెత్తిన నయా ఫాసిస్టు పార్టీ (Moviments Sociale Italians - MSI) దీనికి మూలం. జర్మనీలో 'రెప్' (Die Republikaner)లాంటి కొన్ని పార్టీలు కూడా నియో ఫాసిస్టు శక్తులే. బ్రిటన్ నేషనల్ ఫ్రంట్ లాంటి నియో ఫాసిస్టు ఉద్యమాలు ఇతర దేశాలలోకూడా ఉన్నాయి. అంటే హిట్లర్ పార్టీని పోలిన జాత్యహంకార శక్తులివి. ఫ్రాన్స్‌లో "ది ఫ్రంట్ నేషనల్" కూడా ఇలాంటిదే.

**New Class** = కులీన వర్గం : ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడు యుగోస్లావేకియా రాజకీయవేత్త, యుగోస్లావేకియా కమ్యూనిస్టు పార్టీలో తిరుగుబాటు వర్గం ప్రముఖుడైన మిలోవన్ జిలాస్. సమతావాదాన్ని, వర్గ రాహిత్యాన్ని కమ్యూనిస్టు రష్యా, తూర్పు యూరప్ రాజ్యాలూ ప్రతిపాదించి, ప్రోత్సహించి, అలాంటి వ్యవస్థలను నెలకొల్పినప్పటికీ అక్కడి కమ్యూనిస్టు పార్టీల నాయకత్వ వ్యవస్థలో ఒక కులీన వర్గం (నయా సంపన్న వర్గం) అవతరించిందని జిలాస్ సిద్ధాంతం. ఈ రాజ్యాలలో ప్రయివేట్ ఆస్తిని ప్రధానంగా రద్దు చేసినప్పటికీ ఆర్థికపరంగా చాలా వరకు సమత్వం సాధించినప్పటికీ - ప్రభుత్వం యంత్రాంగంలోనూ, పార్టీ నాయకత్వంలోనూ సీనియర్ పదవులలో వున్నవారు తమకున్న విశిష్టాధికారాలు ఆధారంగా ప్రత్యేకకులీన వర్గంగా అవతరించారని జిలాస్ థీరీ. ఉన్నతాధికారం, భౌతికంగా భోగభాగ్యాలు సమకూడడంతో వీళ్ళు సమతా ప్రజాస్వామిక వ్యవస్థకు దూరమైపోయారని జిలాస్ వాదన.

**New Deal** = పునరుజ్జీవన పథకం / న్యూడీల్ : 1933 నుంచి 1945 వరకు అమెరికా ప్రెసిడెంటుగా ఉన్న ఫ్రాంక్లిన్ డిలానో రూజ్‌వెల్ట్ రూపొందించిన శాంతి కాల విధానాలను "న్యూడీల్" అన్నారు. 1929లో స్టాక్ మార్కెట్ పతనం తర్వాత అమెరికన్ చుట్టబెట్టిన పెను ఆర్థిక సంక్షోభం (గ్రేట్ డిప్రెషన్) వల్ల కల్గిన కష్ట నష్టాలనుంచి ప్రజలను కడతేర్చడానికి ఈ 'న్యూడీల్'ను రూజ్‌వెల్ట్ ప్రకటించాడు. ఈ సంక్షోభ కాలంలో 30 లక్షల మంది అమెరికన్లు పనులు కోల్పోయారు. దారిద్ర్యం ముమ్మరించింది. 'న్యూడీల్' అడుగుజాడల్లోనే క్రమంగా అమెరికాలో ప్రెసిడెంట్ ట్రూమన్ "ఫెయిర్ డీల్", కెన్నడీ "న్యూ ఫ్రాంటియర్", జాన్సన్ 'గ్రేట్ సొసైటీ' పథకాలు కూడా వచ్చాయి. రూజ్‌వెల్ట్ న్యూడీల్ శాశ్వత పరిష్కారం కాకపోయినా 1930లలో నిరుద్యోగ సమస్యలను, సాంఘిక సమస్యలను తాత్కాలికంగానైనా పరిష్కరించడానికి తోడ్పడింది. ఆనాడు సంక్షోభంలో ఉన్న ఆర్థిక వ్యవస్థను కొంతవరకైనా కడతేర్చడం పెద్దఎత్తున ఫెడరల్ ప్రభుత్వం జోక్యం వల్లనే, సహాయక పథకాల వల్లనే సాధ్యమయింది. స్వేచ్ఛ వ్యాపారానికి అలవాటుపడిన వ్యాపారులు, పారిశ్రామిక వేత్తలు "న్యూడీల్"ను వ్యతిరేకించారు. కాని ప్రజలలో ఈ పునరుజ్జీవన పథకం ప్రశస్తి పొందింది. "న్యూడీల్" అమెరికన్ రాజకీయ చరిత్రలో ఒక నూతన అధ్యాయాన్ని ఆవిష్కరించింది. ఫెడరల్ వ్యవస్థ స్వరూప స్వభావాలలోనే మార్పులు తెచ్చింది.

**New Economic Policy**= నూతన ఆర్థిక విధానం: దీని కర్త రష్యన్ కమ్యూనిస్టు పార్టీ నేత, సోవియట్ నిర్మాత లెనిన్. రష్యన్ పార్టీ పదవ (బోల్షివిక్) మహాసభలో దానిని ఆయన ప్రతిపాదించాడు. 1921 మార్చిలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ దీనిని ఆమోదించింది. 1917లో బోల్షివిక్ విప్లవం జయప్రదం అయిన తర్వాత వెంటనే యుద్ధ ప్రాతిపదికపై ప్రవేశపెట్టిన ఆర్థిక విధానాన్ని సడలిస్తూ ప్రకటించిన నూతన విధానాన్నే 'నెప్' అన్నారు. అంతకు ముందు రద్దయిపోయిన బ్యాంక్ వ్యవస్థను పునరుద్ధరణ బ్యాంకుల జాతీయీకరణ, దేశీయ వాణిజ్యాభివృద్ధికి అనుగుణంగా నిర్బంధాలు సడలించడం, సరకుల సరఫరా, పంపిణీలపై ప్రభుత్వ ప్లానింగ్ కంట్రోళ్ళను సడలించడం, పరిమిత లాభాలను అనుమతిస్తూ పరిమితంగా ప్రయివేట్ ట్రేడింగ్‌కు అవకాశం కల్పించడం - నూతన ఆర్థిక విధాన లక్ష్యాలు. అయితే విదేశీ పెట్టుబడులపై ఆంక్షలు తొలగించినా, వాటి లాభాల తరలింపును

పూర్తిగా అదుపు చేసింది అందించిన సహాయానికి ముదరాగా కొంతశాతం లాభాన్ని అనుమతించి, నిర్మాణ పనులు పూర్తి కాగానే దేశం విడిచి వెళ్ళాలని షరతు విధించింది ప్రభుత్వం ఈ షరతులకులోబడే విదేశీ సంస్థలు సహాయం అందజేసాయి దేశీయ చట్టాలకు పూర్తిగా బద్ధులై ఉంటామని ఆ సంస్థలు హామీ పత్రాలు వ్రాసి ఇచ్చాయి 1929లో స్టాలిన్ మొదటిసారిగా పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెట్టిన తరువాతే "నెప్" రద్దయింది ఈ ప్రణాళికను నెహ్రూ ఎంతగానో కొనియాడారు

**Nobel Prize** = డైనమైట్ కనిపెట్టిన ఆల్‌ఫ్రెడ్ నోబెల్ ఉత్తమ పురస్కార పత్రం కూడా నెలకొల్పడం విశేషం నోబెల్ పేరిట ఆరు బహుమతులున్నాయిః 1) శాంతికి, 2) రసాయన శాస్త్రానికి, 3) సాహిత్యానికి, 4) భౌతిక శాస్త్రానికి, 5) ఫిజియాలజీ లేదా మెడిసిన్‌కు, 6)ఎకనమిక్స్‌కు పురస్కారాలున్నాయి ప్రతి ఏటా డిసెంబర్ 10న (నోబెల్ వర్ధంతి రోజు) నోబెల్ బహుమతి పురస్కారోత్సవాలు జరుగుతుంటాయి శాంతి పురస్కారం మాత్రం ఆస్లో నగరంలో జరుగుతుంది మిగతా బహుమతుల ప్రదానం అంతా స్టాక్ హోమ్‌లో (స్వీడన్) జరుగుతుంది

**Non-Alighned Nations** = అలీన దేశాలు / విబంధ దేశాలు : ఇది కేవల రాజకీయ పదమేగాని ఆర్థిక పరమైన లేదా భౌగోళిక పరమైన పదం కాదు అటు కాపిటలిస్టు సైనిక కూటమికి, ఇటు సోషలిస్టు సైనిక కూటమికి చెందకపోయినా అలీన దేశాలు స్విట్జర్లాండ్ లాంటి పూర్తి అలీన దేశాలు కావు అయినా ప్రపంచ రాజకీయాల్లో క్రియాశీలమైన పాత్ర నిర్వహించగల దేశాలుగా ఉంటున్నాయి అందువల్ల అలీన దేశాలను వర్ధమాన దేశాలతో పోల్చి 'నాన్ అలైన్డ్' - "థర్డ్ వరల్డ్" పదాలను గందరగోళ పరచకూడదు ఎందుకంటే వర్ధమాన దేశాల్లో హెచ్చుభాగం అలీన దేశాలే అయినా, యుగోస్లావియా లాంటి అలీన దేశం వార్సా (పాత సోషలిస్టు) సైనిక కూటమిలో భాగస్వామి కాకపోయినా, వర్ధమానదేశం కాదు అంటే కొన్ని సంపన్న దేశాలు కూడా అలీన విధానాన్ని అనుసరించవచ్చు.

**Non-Alignment** = అలీన / విబంధ విధానం : ఇది 1950లలో పెక్కు ఆఫ్రో - ఆసియన్ దేశాలకు "శ్రీరామరక్ష" అయింది ఈ విధాన ప్రతిపాదకులుః నెహ్రూ, సుకర్ణో, మార్షల్ టిటో, నాజర్ అప్పటికి అమలులో వున్న రెండు రాజ్య కూటాలకు ముఖ్యంగా రాజకీయ - సైనిక కూటాలకు (కాపిటలిస్టు కూటమి, సోషలిస్టు కూటమి) సమదూరంగా ఉంటూ వాటిలో చేరకుండా తమ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకోవడం అలీన దేశాల లక్ష్యం ఇటీవల సోషలిస్టు దేశాల కూటమి విచ్ఛిన్నం కావడంతో రెండు కూటాల మధ్య "ప్రచ్ఛన్న యుద్ధం" కూడా సడలడంతో - అలీన ఉద్యమం కూడా నిస్తేజమయింది

**Non-Proliferation Treaty (NPT)** = అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందం 1968లో కుదిరిన ఈ ఒప్పందంపై అయిదు అణ్వస్త్ర రాజ్యాలలో మూడు మాత్రమే సంతకం చేశాయి అవిః అమెరికా, సోవియట్ యూనియన్, బ్రిటన్ 1992లో ఫ్రాన్స్, చైనాలుకూడా సంతకం చేశాయి అణ్వస్త్ర యుద్ధ ప్రమాదాన్ని తగ్గించేందుకు లేదా అదుపు చేసేందుకు ఈ ఒప్పందాన్ని ఉద్దేశించారు అణ్వాయుధాలపై గుత్తాధిపత్యం కోసమే అగ్రరాజ్యాలు ఈ ఒప్పందాన్ని ఉద్దేశించాయని కొన్ని వర్ధమాన దేశాల అభిప్రాయం

**Northern Hemisphere** = ఉత్తరార్థ గోళం

**"Nuts and bolts"** = సాధ్యాసాధ్యాలు / అనుపానులు / అవకాశాలు "to discuss nuts and bolts of working together" కలిసి పనిచేయడానికి ఏ మేరకు అవకాశాలున్నాయో చర్చించడం

**Occident/Occidental** = యూరప్‌నుగాని పశ్చిమార్థ గోళాన్నిగాని **(Western Hemisphere)** లేదా ఈ ప్రాంతాలలో నివసించేవారిని గాని ప్రస్తావించదలచినపుడు ఇలా అనవచ్చు (ఆక్సిడెంట్ / ఆక్సిడెంటల్)

**Official Secrets Act** = అధికార రహస్యాల (భద్రత) చట్టం : దీనిపుట్టుక బ్రిటన్‌లో. 1911లో మొదటిసారిగా అక్కడి పార్లమెంటు ఈ చట్టం చేసింది

దీని లక్ష్యం - బ్రిటన్‌లో గూఢచారుల కుట్రదారుల కార్యకలాపాలు నిరోధించడం, ప్రభుత్వ రహస్య పత్రాల రక్షణ ప్రభుత్వం ఏ సమాచారాన్నయితే బయటికి పొక్కకూడదనుకొంటుందో ఆ కీలక సమాచారాన్ని పొక్కకుండా కాపాడడానికి ఈ చట్టం బలమైన ఆయుధం అయితే సెన్సిటివ్ సమాచారం పేరిట ప్రజలకు వెల్లడించవలసిన విషయాలను కూడా వెల్లడి కాకుండా అధికారుల, పాలక శక్తిగా ఉన్న రాజకీయ వేత్తల కుట్రలు కుహకాలను ప్రజలు తెలుసుకోకుండా జాగ్రత్తపడడానికి కూడా ఈ చట్టాన్ని వినియోగిస్తారు మనదేశంలో కూడా ఇది అమలులో వుంది అయితే ఇలాంటి చట్టం అమెరికాలో లేకపోగా 1966లో అక్కడ 'సమాచార స్వేచ్ఛా చట్టం' (Freedom of Information Act) తెచ్చారు అందువల్లనే వాటర్ గేట్ కుంభకోణంలో, పెంటగాన్ పేపర్స్ వెల్లడిలో పాలకుల, అధికారుల ఆగడాలను పత్రికలు ఎండగట్టగలిగాయి

**Old World** = 'పాత ప్రపంచం' : ఆసియా, ఆఫ్రికా, యూరప్‌లను ఇలా కూడా పిలుస్తారు ఇవి పురాతన సంస్కృతి, సంప్రదాయాలకు, ఆచార వ్యవహారాలకూ కేంద్రాలన్న ఉద్దేశంతో, వీటిని 'ఓల్డ్ వరల్డ్' అని పేరు పెట్టి ఉంటారు.

**Oligarchy** = ముఠా పాలన

**Ombudsman** =పెద్ద మనిషి / తీర్పరి : ప్రభుత్వ చర్యలపై స్పందించగల పౌరుల హక్కులను కనిపెట్టి కాపాడేందుకు నియమితుడైన పెద్ద మనిషి లేదా తీర్పరి ఈ పెద్ద మనిషి తీర్పు పద్ధతికి మూలం స్కాండినేవియా దేశాలు. దుష్పరిపాలన వల్ల లేదా అక్రమ పాలన వల్ల ఇబ్బందులకు గురైన పౌరుడు సాధికార తీర్పరికి ఫిర్యాదు చేసుకొనే హక్కును ఈ వ్యవస్థ కాపాడుతుంది ఈ "అంబడ్స్‌మన్" పద్ధతిని ఇప్పుడు ఇండియాలో కూడా కొన్ని సంస్థలు (టైమ్స్ ఆఫ్ ఇండియా లాంటి పత్రికలు సహా) అమలు జరుపుతున్నాయి.

**Organization of African Unity (OAU)** = ఆఫ్రికన్ సమైక్యతా సంస్థ దీని జననం 1963 ఆఫ్రికన్ అలీన దేశాల మధ్య సమన్వయీకృతమైన విధానాలను ప్రోత్సహించేందుకు ఆఫ్రికాలోని వలస విధానపు అవశేషాలను రూపుమాపే లక్ష్యంతో ఈ సంస్థ ఏర్పడింది

**Organization of American States (OAS)** = అమెరికన్ రాష్ట్రాల ప్రాంతీయ సహకార సంస్థ: పశ్చిమార్ధ గోళంలోని దేశాల మధ్య శాంతిని, భద్రతను, పరస్పర అవగాహనను కాపాడి పెంపొందించు కునేందుకు 1948లో ఈ సంస్థ ఏర్పడింది అయితే పశ్చిమార్ధ గోళంపై అమెరికా ఆర్థిక, రాజకీయ, సైనిక అదుపులేని ప్రాంతీయ సహకారాభ్యున్నతికి ఈ సంస్థ సరైనవేదిక కాలేకపోయింది చివరికి ఈ సంస్థలో కెనడా 1990లో సభ్య దేశంగా చేరినప్పటికీ ఈ అసమ స్థితిలో చెప్పుకోదగిన మార్పేమీ లేదు

**Oval office** = అమెరికన్ ప్రెసిడెంట్ అధికార కార్యాలయం "వైట్ హౌస్"ను ఇలా కూడా అంటారు

**Overseas Territories** = దేశాంతర వలసలు/ అధీన ప్రాంతాలు : ఇలాంటి కొన్ని ప్రాంతాలు, వలసలూ, స్వతంత్ర దేశాలూ కావు భౌగోళిక పరిస్థితులను బట్టి ప్రత్యేకతను చాటుకున్నా వలస రాజ్యాలతో కుదుర్చుకున్న సంధుల ప్రకారం ప్రత్యేక ప్రతిపత్తిని మాత్రమే కలిగి ఉన్నాయి. వీటిని వార్తలలో పేర్కొన్నపుడు డేట్‌లైన్‌లో నగరాన్ని పేర్కొంటూనే బ్రాకెట్‌లో వలస ప్రాంతం పేరును విధిగా ఉంచాలి : ఉదా: బెర్ముడా, కార్సికా, ఫారో ఐలాండ్స్, గ్రీన్‌లాండ్, గ్రెనెడా, గాడిలోప్, గువామ్, మార్టినిక్, ప్యూరిటోరికో, సార్డీనియా, సిసిలీ

**Pan - Africa** = అఖండ ఆఫ్రికా

**Pan - America** = అఖండ అమెరికా

**Pan - Asia** = అఖండ ఆసియా

**Pan** = అఖండ

**Papacy** = క్రైస్తవ పూజారి వ్యవస్థ (ఈ వ్యవస్థకు పెద్ద పోప్)

**Para – Military Force** = అత్యవసర భద్రతాదళం

**Pardon/Parole/Probation** = ఈ మూడు పదాలకు చెప్పే అర్థాలు గందరగోళంగా ఉంటూంటాయి కాని ప్రతి ఒక్క దానికి నిర్దిష్టమైన అర్థం ఉంది పార్డన్ : వ్యక్తిని క్షమించి, మరెలాంటి శిక్ష లేకుండా వదిలేయడం

[illegible] : సాధారణంగా [illegible] రాజకీయ [illegible] [illegible]

పెరోల్ : పైన శిక్షా కాలం ముగియకముందే అతని ప్రవర్తనను బట్టి ఖైదీని విడుదల చేయడం. ఆ ఖైదీ వ్యక్తి ప్రవర్తనలో మళ్ళీ ఏదైనా లోపం కనిపిస్తే పెరోల్‌ను ప్రభుత్వం రద్దు చేస్తుంది.

ప్రొబేషన్ : నేరస్తుడికి శిక్ష వేసిన తర్వాత సదరు శిక్షను అమలు జరపకుండా, అరెస్టు చేయకుండా కొంతకాలం నిలుపు చేయడం. నేరస్తుడి ప్రవర్తనపై ఆధారపడి దీనిని అమలు జరుపుతారు. ఈ ప్రొబేషన్ నిబంధనలను విధించే హక్కు, రద్దు చేసే హక్కు జడ్జికి మాత్రమే ఉంటుంది.

**Parkinson's disease** = వృద్ధాప్యం మీద పడుతున్నకొద్దీ నరాల బిగువ, కరాల సత్తువ వొంట్లో ఒకేక సడలిపోవడం వల్ల వచ్చే వ్యాధి. దీనిని వివరంగా తెలియజెప్పిన ఇంగ్లీష్ వైద్యుడు డాక్టర్ జేమ్స్ పార్కిన్సన్.

**Parkinson's law** = తనకు కేటాయించిన వ్యవధిని పూరించుకోవడంకోసమే వ్యక్తికి పని పెరుగుతూంటుందని నార్త్‌కోట్ పార్కిన్సన్ అనే బ్రిటీష్ ఆర్థికవేత్త వ్యంగ్యంగా వర్ణించాడు. సోమరిపోతులకు ఇదొక హెచ్చరిక. (పార్కిన్సన్ డిసీజ్ అని ఒక వ్యాధి ఉందిగాని దాన్ని కనిపెట్టిన వ్యక్తి ఇంగ్లీషు వైద్యుడు జేమ్స్ పార్కిన్సన్. ఇద్దరికీ సంబంధం లేదు.)

**Parliament** = శాసన వేదిక / పార్లమెంటు

**Parliamentary Government** = పార్లమెంటరీ ప్రభుత్వం : శాసనసభకుగానీ, పార్లమెంటుకుగాని బాధ్యత వహించే, ప్రభుత్వం (ఎగ్జిక్యూటివ్) ఉన్నప్పుడు దానిని ఇలా అంటారు. ఈ ప్రభుత్వం తరచు ఎలక్షన్‌ల ద్వారానే ఏర్పడుతుంది. లేదా మరేదైనా విస్తృతమైన వ్యవస్థ ద్వారా నామినేషన్ ద్వారా ఏర్పడుతుంది. చట్టాలు చేయడం శాసన వేదికల ప్రధానమైన పని. అందుకే వీటిని 'చట్ట సభల'ని కూడా అంటారు. ప్రజా ప్రతినిధులుగా సభ్యులు తమను ఎన్నుకున్న ప్రజలకు జవాబుదారీ వహించాలి.

**Parliaments** = శాసన వేదికలను "పార్లమెంట్స్" పేరిట పిలిచే దేశాలు : ఇండియా, ఇంగ్లాండ్, ఆస్ట్రేలియా, కెనడా, డెన్మార్క్, ఫిన్‌లాండ్, ఫ్రాన్స్, ఐర్లాండ్, ఇటలీ, న్యూజిలాండ్, నార్వే, పోలెండ్ (ఈ వేదికలనూ కొన్ని చోట్ల కాంగ్రెస్ అని, ఇంకొన్ని చోట్ల నేషనల్ అసెంబ్లీ అనీ, మరి కొన్ని చోట్ల పార్లమెంట్ అనీ వ్యవహరిస్తున్నారు. ఉదా: జపాన్‌లో డయెట్, స్పెయిన్‌లో 'కోర్టెస్', ఇజ్రాయేల్‌లో 'కెనెట్', రష్యాలో 'సుప్రీం సోవియెట్' ఇలా.)

**Participatory Democracy** = భాగస్వామ్య ప్రజాస్వామ్యం : ఇది ప్రత్యక్ష ప్రజాస్వామ్యానికి (direct democracy) ప్రత్యామ్నాయం. కొంతలో కొంత ఇది ప్రాతినిధ్య ప్రజాస్వామ్యానికీ (representative democracy) వ్యతిరేకం. వర్గాలలో పాలు పంచుకోవడం అంటే విడిగా అంతిమ నిర్ణయాధికారం చెలాయించడంగా భావించరాదు. ప్రజలు ఎన్నుకున్న ప్రతినిదులు అంతిమ నిర్ణయాలు చేయడంలో, చట్టాలు చేయడంలో సర్వాధికారులు కావచ్చు. కాని రాజకీయ వ్యవస్థలో పౌరులు పాల్గొని నిర్ణయాలను ప్రభావితం చేయగల "భాగస్వామ్య ప్రజాస్వామ్యాన్ని" కాదనగల హక్కు మాత్రం ఎవరికీ లేదు.

**Peristroika** = పునర్వ్యవస్థీకరణ (ఈ పదాన్ని సోవియెట్ పతనానికి ముందు మిఖాయెల్ గోర్బచెవ్ ప్రచారంలోకి తెచ్చాడు. సోవియెట్ నూతన ఆర్థిక సంస్కరణలకు యిది నాంది పలికింది. ఇందులో నూతనత్వం ప్రయివేటు వ్యక్తులకు పరిశ్రమల్ని ధారాదత్తం చేయడం)

**Persian Gulf** = పర్షియన్ గల్ఫ్ : ఇరాన్ దక్షిణ కోస్తా దూర ప్రాంత జలాలను ఇలా పిలుస్తారు. కొన్ని అరబ్ దేశాలు దీన్ని అరేబియన్ గల్ఫ్ అంటాయి. కాని ఈ ప్రాంతీయ జలరాశిని మొత్తంగా పర్షియన్ గల్ఫ్ అనే అంటారు.

**Pingpong** = టేబుల్‌టెన్నిస్‌కి మరో పేరు. ఈ మాట ఇప్పుడు దౌత్య భాషలోకి ప్రవేశించి "పింగ్‌పాంగ్ దౌత్యం" గా కూడా ("Pingpong diplomacy") పేరులోకి వచ్చింది. ఇది చైనీస్ పరిభాష.

**Plebiscite** = జనశాసనం (Plebiscitum అనే

లాటిన్ పదం నుంచి వచ్చింది ఏ ప్రభుత్వ వ్యవస్థ కావాలి లేదా ఎలాంటి పాలకుడు కావాలి అనే విషయంపై జాతి మొత్తం ఖచ్చితంగా తేల్చిచెప్పడం)

**Plebiscitory Democracy** = జనశాసనాత్మక ప్రజాస్వామ్యం (రాజకీయ సమస్యలపై ఓటర్లు ప్రత్యక్షంగా అభిప్రాయం తెల్పడానికిచ్చే అవకాశం దీనిని అమలు పరచడంలో ఆరితేరిన దేశం స్విట్జర్లాండు అయితే దేశ దేశాల ఆర్థిక నేరస్థుల, రాజకీయవేత్తల దొంగ డబ్బును భద్రం చేసే 'పోషణం' కూడా ఈ దేశమే!)

**Plenary** = సర్వసభ్య సమావేశం

**PLO** = పాలెస్తీనా విమోచన సంస్థ (పాలెస్తీన్ లిబరేషన్ ఆర్గనైజేషన్) అరబ్ భూభాగంపై ఇజ్రాయెల్ ఏర్పడింది లగాయతూ పాలెస్తీనియన్లు నానా అగచాట్లకు గురికావడం వల్ల వాళ్ళు వివిధ రాజకీయ గ్రూపులుగా సమీకృతులై పాలస్తీనా విమోచన కోసం ఏర్పరచుకున్న సమరశీల సంస్థ ఇది ఇది 1964లో ఏర్పడింది మరో మిలిటెంట్ సంస్థ ఫటా (Fatah) అరబ్ భూభాగంలో ఈ కుంపటి పెట్టించినవాళ్ళు ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులు

**Pluralism** = (ప్లూరలిజం) బహుళ కేంద్రాధికారం/వికేంద్రీకృత వ్యవస్థ : రాజనీతి శాస్త్రంలో ఇదో సాంకేతిక పదం లిబరల్ డెమోక్రసీకి లేదా రిప్రజెంటేటివ్ డెమోక్రసీకి దీనిని మారుపేరుగా వాడతారు ఈ వ్యవస్థలో అధికార కేంద్రం ఒకటి కాదు, అది బహుళ వ్యాపితం అధికారం వివిధ కేంద్రాల మధ్య వికేంద్రీకృతమవుతుంది కనుకనే దీనిని ప్లూరలిస్ట్ రాజకీయ వ్యవస్థ అంటారు

**Pocket Veto** = పాకెట్ వీటో: అమెరికన్ కాంగ్రెస్ (పార్లమెంట్) వాయిదా పడినప్పుడు వాడే పరిభాష ఇది కాంగ్రెస్ సమావేశంలో ఉన్నప్పుడు ఏదైనా ఒక బిల్లు పది రోజులు ప్రెసిడెంట్ బల్ల మీదనే ఉండిపోయిన పక్షంలో, ప్రెసిడెంట్ సంతకం లేకుండానే అది చట్టం అయిపోతుంది ఒకవేళ ఈ లోగా కాంగ్రెస్ వాయిదా పడి పదిరోజుల్లోగా ఆ బిల్లు ప్రెసిడెంట్ సంతకం పొందలేకపోతే ఆ బిల్లును "వీటో" అయినట్టు జమకడతారు

**Polemics** = సిద్ధాంత చర్చ

**Police State** = పోలీస్ రాజ్యం : సమస్యలను బలప్రయోగం ద్వారా/హింసా చర్యల ద్వారా పరిష్కరించడానికి ఉత్సాహపడే పాలక పక్షం ఉన్న రాజకీయ వ్యవస్థను 'పోలిస్ స్టేట్' అంటారు ఈ వ్యవస్థలో ప్రజా బాహుళ్యంపై జులుం చెలాయిస్తూ పెత్తనం చెలాయించాలని రహస్య పోలీసులు, సైనిక ఎర్గాలు, చివరికి ప్రయివేట్ దళాలు కూడా (Private armies) చూస్తుంటాయి సాధారణ న్యాయ చట్టాలు, పౌరహక్కులూ ఈ వ్యవస్థకు ఏవగింపు

**Polis** = (పాలిస్) : ప్రాచీన కాలంలో రాజకీయ సిద్ధాంతానికి ఆయువు పట్టయిన భావనను 'పాలిస్" అన్నారు ఆనాటి రాజకీయాలను అర్థం చేసుకోడానికి ఈపదం తోడ్పడుతుంది "రాజకీయం" (పాలిటిక్స్) అన్న శబ్దానికి మూలం ఈ 'పాస్', తత్సంబంధమైన పదాలూ ప్రపంచ రాజనీతి శాస్త్రంలో మనకు తెలిసిన 'సిటీ స్టేట్'కు ఆధారం ఈ పదమే ఆనాటి గ్రీకో-రోమన్ ప్రపంచమంతటా రాజకీయ వ్యవస్థకు 'పాలిస్' పదం మూలాధారం "Living in a polis" అంటే సిటీ స్టేట్ పౌరుడని అర్థం అంధయుగాలనుంచీ (Dark ages) ఈ పదం ముఖ్యంగా గ్రీస్‌లో హెచ్చుగా ప్రాచుర్యంలో ఉంటూ వచ్చింది అందుకే గ్రీస్ రాజనీతి శాస్త్రవేత్తలయిన ప్లాటో, అరిస్టాటిల్‌లాంటి వాళ్ళు 'పాలిస్' లో ఉండే మానవుడు 'రాజకీయ పశువు' (Political animal) అని చమత్కరించారు

**Politbureau**= పొలిట్‌బ్యూరో : అత్యున్నతస్థాయి విధాన నిర్ణయ మండలి ఈ పదం ప్రధానంగా కమ్యూనిస్టు పార్టీల నాయకత్వ స్థానానికి వర్తించేది రష్యా కమ్యూనిస్టు పార్టీలు పొలిట్ బ్యూరో అంటే దాదాపు ఇతర దేశాలలోని క్యాబినెట్‌కు సమానం విధాన రూపకల్పనతోపాటు, రోజువారీ తక్షణ సమస్యలపై నిర్ణయాలు చేసే సంస్థ పొలిట్ బ్యూరో. పార్టీ కాంగ్రెస్ సమావేశంలో లేనప్పుడు ఈ మండలి నిత్యం సమావేశమవుతూ ఉంటుంది బ్రిటన్‌లో లేబర్ పార్టీ నేషనల్ ఎగ్జిక్యూటివ్ కమిటీ కూడా పొలిట్ బ్యూరోలాంటిదే

**Political assylum** = రాజకీయాశ్రయం (విరాటాశ్రయం)

**Political science** = రాజనీతి శాస్త్రం

**Politics** = రాజకీయాలు / రాజకీయం

**Polity** = (రాజ్యం నడిచే తీరు, నిర్దుష్టరూపంగల రాజ్యవ్యవస్థ) ఈ మాటను ప్రాచుర్యంలో తెచ్చినవి పత్రికలు మాత్రమే

**Polyarchy** = బహుళవ్యక్తి పాలన : ప్రజలు ప్రత్యక్ష ఓటింగ్ ద్వారా ఎన్నుకునే పాలన 'ప్రజాస్వామ్యం' కాగా పోలియార్కీలో పాలన పెక్కు మంది వ్యక్తులదేగాని, దానిని ప్రజాస్వామ్యం అనరు ఈ భావనకు పునాది వేసినవాడు రాబర్ట్ దాల్ (Dahl). వివిధ ప్రయోజనాలను ఆశించే గ్రూపుగా ఏర్పడి పోటా పోటీలతో ప్రభుత్వాలు ఏర్పరచడానికి ఉద్యమించే "ఇంటరెస్ట్ గ్రూపు"లన్నీ ఈ "పోలియార్కీ" కిందకే వస్తాయి గ్రూపు థీరీకి ఇది పెద్ద పీట వేసింది

**Popular Front** = పాపులర్ ఫ్రంట్ : (ప్రజాఐక్య సంఘటన) ఎన్నికల ఎత్తుగడలలో భాగంగా లేదా రాజకీయ వ్యవస్థలో వామపక్ష (కొన్ని సందర్భాల్లో లిబరల్ సెంట్రిస్ట్) పార్టీల మధ్య కుదిరే పొత్తులను పాపులర్ ఫ్రంట్‌గా పిలవడం రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అలవాటయింది ఇలాంటి ప్రసిద్ధ పాపులర్ ఫ్రంట్ 1930లలో ఫ్రాన్స్‌లో సోషలిస్టులకు - వామపక్షం రాడికల్స్‌కు మధ్య ఏర్పడింది. 1936లో పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వం ఫ్రాన్స్‌లో ఏర్పడింది 20వ శతాబ్దంలో ఫ్రాన్స్‌లో వెలసిన మొదటి వామపక్ష ఐక్య సంఘటన ప్రభుత్వం అదే ఇది 1938 వరకూ పరిపాలించింది అదే సమయంలో స్పెయిన్, చిలీలలో కూడ పాపులర్ ఫ్రంట్ ప్రభుత్వాలు ఏర్పడి కొంత కాలం ఉన్నాయి ఆనాడు మితవాద, మధ్యేవాద (సెంట్రిస్ట్) ప్రభుత్వాలకు బలమైన ప్రత్యామ్నాయంగా ఈ పాపులర్ ఫ్రంట్స్ ప్రభుత్వాలు అవతరించి, ప్రజల మన్ననలు పొందాయి.

**Populism** = జనాకర్షకవాదం : నేషనల్ సోషలిజం, మెకార్థీయిజం లాంటి యూరోపియన్, నార్త్-అమెరికన్ ఉద్యమాలను పాపులిస్ట్ ఉద్యమాలుగా పేర్కొన్నా అసలు రాజకీయాల్లో జనాకర్షక పద్ధతులు ఎక్కువగా మొదట అమలులోకి వచ్చింది లాటిన్ అమెరికాలో అంటారు. పాపులిజం ప్రధాన లక్షణాలు : జనాన్ని ఆకర్షించగల శక్తి గల నాయకుడొకడుంటాడు ఆ శక్తితో ప్రజలను ఆకట్టుకునే తంత్రాలు పన్నుతాడు తద్వారా తనకు అనుకూలంగా క్రమంగా ప్రభుత్వ వ్యవస్థ పైన ఏవగింపు కల్గించేందుకు సమాజంలోని పేద ప్రజా బాహుళ్యాన్ని పెద్ద ఎత్తున సమీకరిస్తాడు ఇందుకోసం ఒక పార్టీని నెలకొల్పుతాడు యుద్ధ కాలంలో జర్మనీలో హిట్లర్, యుద్ధానంతర దశలో అర్జెంటీనాలో జూన్ పెరాన్ ఇలాంటి సంస్థలనే నెలకొల్పారు ఇటలీలో ఫాసిజం, 1990లలో ఫ్రెంచ్ ఫ్రంట్ నేషనల్ లీడర్ జీన్‌మేరీ లెపెన్ కూడా ఇలాంటివారే.

**Portfolio (Minister without)** = ఏ శాఖాలేని మంత్రి

**Portfolio** = మంత్రిత్వ శాఖ (దీనికి మూలం - దౌత్య వ్యవహర్తలు, మంత్రులు, అధికార పత్రాలను తీసుకువెళ్ళే సంచి)

**Pragmatism** = లౌకికతత్త్వం : ఇతరుల మనసులు నొప్పించకుండా తప్పించుకు తిరిగేవాడు గొప్పవాడని కొందరి భావన ఈ థీరీ సిద్ధాంతాలపైనగాక కేవలం ఇంగిత జ్ఞానంపై ఆధారపడి బండిదొల్లిస్తూంటుంది ఏది ఉపయోగకరమో దానిని ఆశ్రయించాలిగాని ఉబుసుపోని సిద్ధాంతాలను పట్టుకొని వేళ్ళాడ కూడదన్నది దీని తాత్త్విక చింతన ఈ ధోరణిని ఆశీర్వదించినవారిలో ముఖ్యుడు బర్కీ

**Presidential Government** = అధ్యక్ష పాలనా వ్యవస్థ : రాజ్యాధిపతి ప్రెసిడెంట్ అయినా, రాజైనా, రాణి అయినా లేదా మరో పేరిట చెలామణీ అవుతున్నా అనేక అధికారాలు కలిగి ఉండొచ్చు అధ్యక్ష పాలనా వ్యవస్థలో ప్రభుత్వాధినేత విశేషాధికారాలు చెలాయిస్తాడు నిర్ణయాలు తీసుకోవడంలో అతను సర్వాధికారి కాని దేశం ప్రెసిడెంట్ కేవలం లాంఛనాధ్యక్షుడుగా ఉన్న చోట్ల లేదా కేవలం ప్రధాన మంత్రి నియామకానికే అతని అధికారం పరిమితం అయినచోట్ల అతను పరిపూర్ణాధికారం చెలాయించే అధ్యక్షుడు (ప్రెసిడెంట్)

కాజాలదు అధ్యక్ష తరహా ప్రభుత్వ వ్యవస్థ కూడా రకరకాలుగా ఉంటుంది కాని అమెరికా, ఫ్రాన్స్ సహా పెక్కు దేశాలలో ప్రెసిడెంట్‌ను వేరుగా లెజిస్లేచర్ నుంచి ఎన్నుకుంటారు

**Pressure Group** = ప్రెషర్ గ్రూపు / రాపిడి వర్గం: సమాజంలో స్వార్థ ప్రయోజనాలు ఈడేర్చుకోజూచే గ్రూపునకు మద్దతుగానో, లేదా ఒక ప్రయోజనాన్నో, రాజకీయ స్థానాల కోసమో ఆశించి పనిచేసే స్వచ్ఛంద సంస్థలను (గ్రూపులను) ప్రెషర్ గ్రూప్స్ అంటారు వీటి పని వత్తిడి ద్వారా/రాపిడి ద్వారా పనులు చేయించడం ఇవి రకరకాలుగా వ్యవహరిస్తుంటాయి

**Primaries** = ప్రైమరీలు : ఫలానా పార్టీ పేరిట అధికారానికి ఫలానా వ్యక్తిని వోటర్లు తాముగానే నిర్ణయించి ఎంచుకునే పద్ధతిని ప్రైమరీ ఎలెక్షన్ అంటారు ఈ పద్ధతి 20వ శతాబ్దం తొలి సంవత్సరాలలో అమెరికాలో ఎక్కువ ప్రాచుర్యంలోకి వచ్చింది అవినీతికర పార్టీ యంత్రాంగానికి ప్రత్యామ్నాయంగా తలెత్తిన ప్రోగ్రెసివ్ మూవ్‌మెంట్ ఇందుకు నిదర్శనం సరిగ్గా ఈ కాలంలోనే 'ఇనిషియేటివ్', రీకాల్ (ఎన్నుకున్న ప్రతినిధుల్ని వెనక్కి పిలిపించే హక్కు) ప్రాచుర్యంలోకి వచ్చాయి కాని ఎవరు తమ అభ్యర్థిగా ఉండాలో ప్రజలు ప్రాథమిక దశలోనే నిర్ణయించే పద్ధతిని "ప్రైమరీ ఎలెక్షన్" అన్నారు అమెరికన్ ఎన్నికల వ్యవస్థలో అతి ప్రాథమిక దశకు తర్వాత 'ప్రైమరీలు' అని పేరొచ్చింది ప్రెసిడెంట్ ఎన్నికలో ఇది కీలకాంశం.

**Proletariat** = శ్రామిక వర్గం : ఇది కాలక్రమంలో ప్రాచుర్యంలోకి వచ్చిన పదమేగాని కారల్ మార్క్స్ సృష్టించింది కాదు పెట్టుబడిదారీ సమాజంలో సొంత ఆస్తులు లేని కార్మిక వర్గాన్ని ప్రోలిటేరియట్ అంటారు అధికారానికి, సంపద పంపిణీకి కడగొట్టున ఉండే వర్గం ఇది. బూర్జువా వర్గ దోపిడికి వీరే ఆధారం ఈ పదానికి మూలం రోమ్‌లోని పేద వర్గాలు - ప్రోల్స్ (Proles) అంటే పేద సంతానం అని). పన్నులు చెల్లించలేక అందుకు పరిహారంగా వీరు తమ బిడ్డలను మిలిటరీ సర్వీసులోకి పంపేవారట ఈ వర్గమే సమాజపు ఉపరితల సౌభాగ్యానికి వెన్నెముకగా భావించి, వృథా అవుతున్న ఈ ఉత్పత్తి శక్తులను సమాజ శ్రేయస్సుకోసం ఎలా సద్వినియోగం చేసుకోవాలో మొదటిసారిగా ఆలోచించి సమీకరించిన రాజకీయ శాస్త్రం మార్క్సిజం

**Proportional Representation** = దామాషా ప్రాతినిధ్యం : శాసన సభలో / పార్లమెంటులో బహుళ పక్ష సమాజంలోని అన్ని వర్గాలకు మెజారిటీ మైనారిటీలకూ - తగినంతగా ప్రాతినిధ్యం కల్పించడానికి ఉద్దేశించిన వోటింగ్ వ్యవస్థను ఇలా అంటారు ఎన్నికలలో మొత్తం పోలైన వోట్లలో ఆయా పక్షాలకు దామాషానపడినవోట్లు ఆధారంగా ఆయా పక్షాలకు సీట్లు కేటాయించడం ఈ వ్యవస్థ ప్రత్యేకత ఇందుకు వేర్వేరు పద్ధతులు ఉన్నా ప్రధానమైనవి రెండు ఐర్లాండ్ లాంటి కొన్ని దేశాలలో నియోజకవర్గం ప్రాతిపదికగా వ్యక్తిగతంగా ఆయా అభ్యర్థులకు (individual candidates) వోట్లను బట్టి సీట్లు కేటాయిస్తారు అలాగే ఇజ్రాయెల్, నెదర్లాండ్స్ లాంటి దేశాల్లో పార్టీ అభ్యర్థి జాబితా పద్ధతిపైన (Party list system) ఆధారపడి ఓటింగ్ జరుగుతుంది ఇజ్రాయేల్‌లో - వోటింగ్ పూర్తిగా ఈ 'అభ్యర్థి జాబితా' పద్ధతిపైన జరుగుతుంది కాబట్టి వోటరు తన ఎంపికను వ్యక్తిగత స్థాయిలో ఫలానా అభ్యర్థికే పరిమితం చేసుకోడు అక్కడ మొత్తం దేశాన్నే ఏకైక నియోజకవర్గంగా పరిగణిస్తారు కాబట్టి వేర్వేరు నియోజక వర్గాలంటూ ప్రత్యేకించి ఉండవు ఉత్తర అమెరికా, బ్రిటన్, కామన్‌వెల్త్‌లలోని ఆంగ్లో-అమెరికన్ వ్యవస్థలలో తప్ప పాశ్చాత్య (వెస్టరన్) ప్రజాస్వామ్య దేశాలలో ఏదో రూపంలో ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ అమలులో ఉంది ఈ పద్ధతిపైన ఉన్న విమర్శ: రకరకాల చిన్న చిన్న రాజకీయ పక్షాలకు కూడా ప్రాతినిధ్యం కల్పించడం వల్ల తరచుగా 'గాలి వాటానికి' పడిపోయే సంకీర్ణ మంత్రివర్గాలకు అవకాశం ఉన్నందున, దామాషా ప్రాతినిధ్యం ఆధారంగా ఏర్పడే ప్రభుత్వాలు సర్వ సాధారణంగా బలహీన ప్రభుత్వాలుగానే ఉంటాయి

**Protocol** = అధికార లాంఛనం

**Racism** = వర్ణ వివక్షా విధానం : మనిషి రంగును బట్టి రాజకీయ, సాంఘిక ప్రతిపత్తిని అంచనా కట్టే

ఆధిక్యత వివాదం బాహాటంగా ఈ వివాదం అమలులో ఉన్నా 20వ శతాబ్దం మధ్యనుండీ ఈ వివాదం ఎంత అవాస్తవమో శాస్త్రీయంగా రుజువయింది. అమెరికాలో బ్లాక్స్, దక్షిణాఫ్రికాలో బ్లాక్స్, నాజీ జర్మనీలో సెమిటిక్ జాతులు, ఇండియాలో దళితులు మానవ హక్కులకోసం వర్ణ వివక్ష నిర్మూలన కోసం, కుల నిర్మూలన కోసం జరిపిన, జరుపుతున్న పోరాటాలు చిరస్మరణీయాలు

**Raison d'etat**= తిరుగులేని నిర్ణయం : ఒక సాంఘిక ప్రయోజనాన్ని ఉద్దేశించి తలపెట్టిన చర్యగానీ, ప్రభుత్వ నిర్ణయంగానీ ప్రజా ప్రయోజనం కోసమే ఉద్దేశించింది కాబట్టి విధిగా దానిని అందరూ పాటించాలి ప్రభుత్వ విధానాన్ని రక్షించాలి అనే వాదన దీనికి మూలం ఇది తిరుగులేని నిర్ణయం

**Raison de guerre** = సబబైన అతిక్రమణ : ఈ పదం అంతర్జాతీయ న్యాయ సూత్రాలు ఆధారంగా వక్రంగా రూపొందించిన మాట "సక్రమ యుద్ధ" (Just war) సిద్ధాంతానికిది ఒక విధంగా సవరణ అని చెప్పవచ్చు యుద్ధంలో విజయం అనేది సైనికుల అంతిమ లక్ష్యం కాబట్టి ఆ విజయ సాధన కోసం వాళ్ళు ఏ మార్గం అనుసరించినా తప్పు లేదన్న సిద్ధాంతం దీనికి పునాది కనుక అంతర్జాతీయ న్యాయ సూత్రాలను కాలదన్నవచ్చునని దీని అర్థం ఈ సూత్రాన్ని అనుసరించే ఆంగ్లో, అమెరికన్ సామ్రాజ్యవాదులు దఫదపాలుగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో అనేక సందర్భాల్లో చట్ట విరుద్ధ చర్యలకు పాల్పడ్డారు చివరికి రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యూరప్‌లోని అత్యంత సుందరమైన చర్చీలపైన, లైబ్రరీలపైన జరిపిన విధ్వంసాన్ని, మాంట్ కాసినోపై జరిపిన బాంబింగ్‌ను కూడా ఈ సిద్ధాంతకర్తలు సమర్థించుకున్నారు

**Ratification** = ధృవీకరణ : ఇతర దేశాలతో, ప్రభుత్వాలతో కుదుర్చుకునే సంధులను / ఒప్పందాలను ఆ దేశం లెజిస్లేచర్ ధృవపరచవలసి ఉంటుంది ఇది రాజ్యాంగ విహితం. ఉదా: మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత కుదుర్చుకున్న వర్సేల్స్ సంధి, కీలకాయుధాల పరిమితి కోసం రష్యా, అమెరికాలు కుదుర్చుకున్న "సాల్ట్ 2" సంధి పత్రం, అలాగే రెండవ ప్రపంచ యుద్ధంలో మిత్రమండలి దేశాల మధ్య పోట్స్‌డాం, యల్టాలలో కుదిరిన సంధులూ

**Reactionary** = ప్రగతి నిరోధి / అభివృద్ధి నిరోధి

**Realpolitik**= వాస్తవ రాజకీయం : ఈ భావన వ్యాప్తికి జాతీయ, అంతర్జాతీయ రంగాలలో 19వ శతాబ్దంలో బిస్మార్క్ పాటించిన విధానాలు దీని వాస్తవార్థం - వాస్తవ రాజకీయం అని సెంటిమెంటు పేరిట, ఊహాపోహల పేరిట వాస్తవ విషయాలను మభ్యపెట్టకూడదన్నది దీని లక్ష్యం కాని తర్వాత్తర్వాత ఈ అర్థం మారిపోయింది ఆధునిక యుగంలో ఇతరుల ప్రకటనల్లో రంధ్రాన్వేషణకు, లేని ఉద్దేశాలు ఎదుటివాడికి ఆపాదించడానికి ఏదో ఒక దురుద్దేశాన్ని అంటకట్టడానికి పర్యాయపదంగా - 'రీయల్ పొలిటిక్' అని వాడుతున్నారు

**Rebel** = తిరుగుబాటుదారుడు

**Recall** = ప్రజా శ్రీముఖం (తామెన్నుకున్న ప్రజా ప్రతినిధులు బాధ్యతలు విస్మరించినప్పుడు ఇచ్చిన హామీలను ఖాతరు చెయ్యనప్పుడు, అధికారాల్ని దుర్వినియోగపరిచినప్పుడు, శాసన వేదికలలో అసభ్యంగా ప్రవర్తించినప్పుడు వెనక్కి పిలిచే ప్రజల హక్కును 'రీకాల్' అంటారు మొదటిసారిగా 'రీకాల్'ను 1890-1920ల మధ్య అమెరికాలో ప్రవేశపెట్టారు )

**Referendum**= ప్రజా నివేదన (నిర్దుష్ట సమస్య పై అభిప్రాయార్థం ప్రజలకు నివేదించడం)

**Reganomics** = (రేగనోమిక్స్) : అమెరికా ప్రెసిడెంట్‌గా ఉన్నప్పుడు రోనాల్డ్ రేగన్ ప్రవేశపెట్టిన ఆర్థిక విధానాలకు పాత్రికేయులు కల్పించిన పదం ఇది ఈ మితవాద విధానాలను అతని తర్వాత వచ్చిన జార్జి బుష్ తాను ప్రతిపక్షంలో ఉన్నప్పుడు దేశానికి వినాశంగా భావించి "అపశకునపు ఆర్థిక విధానం" Voodoo Economics గా వర్ణించాడు. రేగన్ విధానం ప్రధాన లక్ష్యం - సంపన్నులపైన పన్నులను తగ్గించి సమాజంలో అందరికీ ప్రయోజనం వనగూర్చడం! ఈ కొత్త సిద్ధాంతానికి సూత్రధారుడు రేగన్ అనుకూల ఆర్థిక వేత్త ఆర్థర్ లాఫర్. పన్నులను తగ్గించేయడం వల్ల సంపన్న వర్గాలకు, కంపెనీలకు

[illegible] డబ్బును తిరిగి పెట్టుబడులుగా పెట్టి ఉత్పాదకశక్తిని, ఉపాధి వనరులను, ప్రభుత్వ ఆదాయాన్ని పెంచవచ్చునన్నది లాపర్ థిరి చివరికి ఈ ఆర్థిక మంత్రం వల్ల జరిగిన పని - అమెరికా [illegible] బడ్జెట్‌లోటు తడిసి మోపెడు కావడమూ, ప్రతిపక్ష నాయకుడుగా ఈ విధానాన్ని బుష్ ఎంత విమర్శించినా తీరా తాను అధ్యక్ష పదవికి వచ్చినప్పుడు అదే విధానాన్ని అనుసరించడమూ ఎన్నికల్లో బుష్ [illegible] ఈ విధానం దారితీసింది

**Reparation** = యుద్ధ పరిహారం (యుద్ధానికి దిగిన రెండు దేశాలలో గెలిచిన దేశం ఓడిన దేశంనుంచి పొందే 'కప్పం')

**Representative Democracy** = ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం / పరోక్ష ప్రజాస్వామ్యం (మెజారిటీ ఓటర్లు ఎన్నుకున్న కొద్దిమంది నిర్ణయించి, పాలించే విధానం)

**Republics** = సోవియెట్‌లో 15 రిపబ్లిక్‌లు కలిసి యూనియన్ ఆఫ్ సోవియెట్ సోషలిస్టు రిపబ్లిక్స్‌గా ఒక సమైక్య సమాఖ్యగా లోగడ ఉండేవి ఇప్పుడవి (సోవియెట్ పతనానంతరం) రష్యాలో దేనికదే చెల్లాచెదరై స్వతంత్ర రిపబ్లిక్స్‌గా ప్రకటించుకున్నాయి సోవియెట్ పదం తొలిగి పాత రష్యా పేరు వచ్చింది రష్యా సహా ఈ 15 రిపబ్లిక్‌లూ ఇవిః ఉక్రేనియన్, బెలోరష్యన్, ఉజ్బెక్, కజక్, జార్జియన్, అజరబైజాన్, లిథూనియన్, మోల్డావియన్, లాట్వియన్, కిర్గిజ్, తజిక్, ఆర్మేనియన్, ఇస్తోనియన్, టర్క్‌మెన్ రిపబ్లిక్‌లు ఉక్రేనియన్, బైలో రష్యన్ రిపబ్లిక్‌లు విడిపోయే హక్కు కలిగి ఉండడమే కాక స్టాలిన్ కాలంనుంచీ ఐక్య రాజ్య సమితిలో స్వతంత్ర సభ్యులుగానే ఉంటూ వచ్చాయి

**Revisionism** = రివిజనిజం : మార్క్సిజాన్నిగాని, లెనినిజాన్నిగాని తిరగదోడే విధానాలను సూత్రాలను 'రివిజనిజం' అంటున్నారు ఇలా మూల సూత్రాలను తారుమారు చేసేవారిని రివిజనిస్టులంటారు లెనిన్ కమ్యూనిస్టు విప్లవానికి ప్రత్యామ్నాయ మార్గాన్ని సూచించిన అతివాదులైన రోజా లగ్జెంబర్గ్, ట్రాట్స్కీ సూత్రీకరణలను 'రివిజనిజం'గా పేర్కొనడంతో - ఈ పదం ప్రాచుర్యంలోకి వచ్చింది అతివాదులకు, మితవాదులకు కూడా ఈ పదం సమంగానే నేడు వర్తింపజేస్తున్నారు

**Revivalism** = పునరుద్ధరణవాదం (కాలం చెల్లిన విలువలనూ, విధానాలనూ తిరగదోడడం)

**Rightist** = మితవాది / ఛాందసుడు / సోషలిస్టు వ్యతిరేకి

**Rule of law** = చట్టబద్ధత (శాసనకర్తల నిర్ణయాలను కోర్టులూ, పోలీసులూ, ఇతర అధికార యంత్రాంగం గౌరవించి, పాటించడం)

**SAARC** = (South Asian Association of Regional Cooperation దక్షిణాసియా ప్రాంతీయ సహకార సమాఖ్య) సభ్యదేశాలు : ఇండియా, బంగ్లాదేశ్, నేపాల్, పాకిస్తాన్, శ్రీలంక, భూటాన్, మాల్దీవ్స్

**Sabotage** = విద్రోహం (శల్యసారథ్యం)

**SALT** (Strategic Arms Limitation Talks)= కీలకాయుధాల పరిమితి నిర్ణయి సంప్రతింపులు స్థూలంగా దీన్ని "సాల్ట్" అంటారు దినికి సంబంధించిన సంధులు రెండు : (1) 'సాల్ట్-1', (2) 'సాల్ట్-2' వ్యూహరీత్యా కీలకమైన మారణాయుధాల ఉత్పత్తిని పరిమితం చేసేందుకు 1969లో అగ్రరాజ్యాల మధ్య సంప్రతింపులు ప్రారంభమై 1985 వరకూ సాగుతూనే వచ్చాయి ఈ చర్చల ఫలితంగా 1972లో కుదిరిన ఒప్పందాన్ని 'సాల్ట్- 1' అన్నారు 1979లో కుదిరిన సంధిని 'సాల్ట్-2' అన్నారు

**SAM** = మిసైల్ విధ్వంసక మిసైల్ (క్షిపణి విధ్వంసక మిసైల్, (Surface-to-Air-Missile)

**SDI** = దీన్నే 'స్టార్ వార్స్' వ్యూహ రచనగా పేర్కొన్నారు వ్యూహరీత్యా రక్షణార్థం తీసుకునే చొరవను Strategic Defence Initiative అన్నారు

**Secession** = విడిపోవడం / వేర్పాటు ఒక స్వతంత్ర దేశంలోని ఏ భాగమైనా లేదా ఏ ప్రాంతమైనా, రాష్ట్రమైనా ఆ దేశం నుంచి విడిపోవడానికి చేసే ప్రయత్నాన్ని ఇలా అంటారు స్వపరిపాలిత ప్రాంతంగా ఆ భాగం ఉండిపోతుంది అమెరికా అంతర్యుద్ధ కాలం నుంచి ఆంధ్రప్రదేశ్‌లోని ఆంధ్ర - తెలంగాణా వేర్పాటు

ఉద్యమాల దాకా ఇలాంటి ప్రయత్నాలు జరుగుతూనే వచ్చాయి తాజాగా కునారిల్లిపోయిన సోవియట్ యూనియన్ (నేటి రష్యా)లో పరిస్థితి కూడా ఇదె కొన్ని చోట్ల రాజకీయ శక్తుల స్వార్థ ప్రయోజనాలకోసం వెర్పాటు ఉద్యమాలు తలెత్తితే, మరికొన్ని చోట్ల ప్రభుత్వాల నిరంకుశ విధానాలవల్ల ఈ ఉద్యమాలు పుట్టాయి

**Second Chamber** = ఎగువ సభ : ఎగువసభ, దిగువసభ కలిసి పార్లమెంటు లేదా లెజిస్లేచర్ అవుతుంది ఇండియాలో రాజ్యసభ ఎగువసభ, లోక్‌సభ దిగువసభ అయితే దిగువసభ ప్రజా ప్రతినిధులు అయినందున దానికే విలువ ఎక్కువ పెక్కు దేశాలలో ఎగువసభ అలంకారప్రాయంగా ఉంటోంది. సాహిత్య, కళాదిరంగాలలో, ఇతర శాఖలలో విశేషానుభవం గడించిన నిపుణులకూ, శాస్త్రవేత్తలకూ ప్రాతినిధ్యం కల్పించడం ఎగువ సభల ఉద్దేశం కాగా, ఇప్పుడది రాజకీయ వేత్తల కుట్రలు, కూహకాలవల్ల రాజకీయ పక్షాల ప్రతినిధులకే ఆటపట్టుగా మారింది ఎగువసభ నిష్ప్రయోజకత్వాన్ని రుజువు చేసి, రద్దు చేసిన ఘనత ఫ్రెంచి విప్లవానిది అమెరికా, ఫ్రాన్స్‌లలో సెనేట్, బ్రిటన్ హౌస్ ఆఫ్ లార్డ్స్ ఎగువ సభలు అయితే ఫ్రెంచి సెనేట్ ఫ్రాన్స్ అయిదవ రిపబ్లిక్ తొలి సంవత్సరాల్లో ప్రభుత్వ విధానాలపై చాలా విమర్శనాత్మకంగా వ్యవహరించే లిబరల్ శక్తిగా ఉంది. అలాగే అమెరికన్ సెనేట్ కూడా దిగువసభ అయిన హౌస్ ఆఫ్ రిప్రజెంటేటివ్స్ కంటే తరచుగా లిబరల్ శక్తిగా ఉంటుంది

**Second world** = సంపన్న ప్రపంచంతో దాదాపు సమంగా పారిశ్రామికీకరణ దశకు చేరుకున్న సోషలిస్టు దేశాలను (ఇప్పుడు సోషలిస్టు కూటమి లేదు) అర్ధ సంపన్న దేశాలు అని పిలుస్తున్నారు

**Sectarian** = పిడివాది

**Secular state** = మతాతీత లౌకికరాజ్యం: ఏ మత సంస్థతోనూ లేదా మతపరమైన ఉద్యమాలతోనూ అధికార స్థాయిలో ఎలాంటి సంబంధాలు పెట్టుకోని రాజ్య వ్యవస్థను ఇలా అంటారు ఇండియాది సెక్యులర్ వ్యవస్థ బ్రిటన్‌లో అధికారికంగా నెలకొల్పిన చర్చ్ ఆఫ్ ఇంగ్లాండ్ ఉన్నందున బ్రిటన్‌ను సెక్యులర్ అని చెప్పలేము అలాగే లూథరిన్ చర్చీలకు ఆశీస్సులు తెలిపిన స్కాండినేవియన్ దేశాల రాజ్య వ్యవస్థలనూ సెక్యులర్ అని చెప్పలేము కాని అధికారికంగా సువ్యవస్థితమైన చర్చిని ఏర్పంచడానికి అమెరికన్ రాజ్యాంగం నిరాకరించినందున, అమెరికాది సెక్యులర్ వ్యవస్థగా చెబుతారు ఇరాన్, పాకిస్తాన్, పెక్కు గల్ఫ్ దేశాలూ మత వ్యవస్థలు

**Sesquicentennial** = 150 సంవత్సరాలు

**Seven seas** = (సప్త సముద్రాలు) : అరేబియన్, అట్లాంటిక్ సముద్రాలు, బంగాళా ఖాతం, మధ్యధరా సముద్రం, రెడ్‌సీ, పర్షియన్ అఖాతం, దక్షిణ చైనా సముద్రం

**Seven Sisters** = ఈ పేరు మూడు రకాలుగా వాడుకలో ఉంది

1 ఏడు ప్రసిద్ధ కళాశాలలను ఇలా అంటారు బర్నార్డ్, బ్రిన్‌మార్, మౌంట్ హోల్యోక్, రాడ్‌క్లిఫ్, స్మిత్, వాసర్, వెలిస్లీ.

2 ప్రయివేట్ కంపెనీలుగా నడుస్తున్న ప్రపంచ ప్రసిద్ధ కంపెనీలకు కూడా ఈ పేరు తమాషాగా తగిలించారు బ్రిటీష్ పెట్రోలియం, ఎక్సాన్, గల్ఫ్, మొబిల్, రాయల్ డచ్‌షెల్, స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ (కాలిఫోర్నియా), టెక్స్‌కో

3 ఈశాన్య భారతంలోని "ఏడుగురి తోబుట్టువుల"ను కూడా ఇలాగే పిలుస్తారు అదే - ఏడు విభాగాలుగా విడిపోయిన అస్సామ్ అస్సామ్, నాగాలాండ్, మిజోరామ్, మణిపూర్, అరుణాచల్‌ప్రదేశ్, హిమాచల్ ప్రదేశ్, త్రిపుర.

**Seven wonders of the world** = ఏడు అద్భుతాలు : ఈజిప్షియన్ పిరమిడ్లు (బహు భుజగోపురాలు), బాబిలన్ నందనవనాలు, హాలికార్నసస్ వద్దనున్న మసోలియం, ఈఫెసస్ వద్ద ఆర్తిమిస్ దేవాలయం, రోడ్స్‌కొలోసస్, ఒలింపియా వద్ద ఫిడియాస్ నెలకొల్పిన జీయస్ స్థూపం, ఫారోలు లేదా అలెగ్జాండ్రియా వద్ద నున్న లైట్‌హౌసు. (కొందరి దృష్టిలో తాజ్‌మహల్ ఎనిమిదవ మహాద్భుతం).

**Sexism** = స్త్రీ-పురుష వివక్షకు(లింగవివక్ష)

వ్యతిరేకంగా1960లలో తలెత్తిన ప్రతివాద సిద్ధాంతాలలో ఇదొకటి "రేసిజం" (వర్ణ వివక్ష) తరువాత హెచ్చు ప్రచారంలోకి వచ్చిన ఉద్యమం ఇది ఈ వివక్ష పెక్కు సందర్భాల్లో స్త్రీల పట్ల పురుషులు వివిధ రంగాలలో ప్రదర్శిస్తున్న అహంకార ధోరణులకు సంబంధించినది స్త్రీల పట్ల న్యూనతా భావంపై ఉద్యమించిన సిద్ధాంతమిది ఉద్యోగ సద్యోగాలలో స్త్రీ పురుషుల మధ్య వివక్ష కూడదని, సమాన పనికి సమాన వేతనం ఉండాలని, ప్రభుత్వ వ్యవస్థలో సంస్థలలో ప్రమోషన్లలో సమాన ప్రతిపత్తి ఉండాలనీ, స్త్రీలను వంటిళ్ళకూ, భోగలాలసతకు కట్టు బానిసలు చేసే పద్ధతికి స్వస్తి చెప్పాలనీ 'సెక్సిజం' మానిఫెస్టో క్రమంగా ఇది ఫెమినిస్టు ఉద్యమాలకు బలమైన పునాదులు వేసింది ఇప్పుడు కొత్తగా 'ఏజిజం' (ageism) కూడా బలపడుతోంది వృద్ధుల సంరక్షణ ఈ ఉద్యమం ప్రధాన లక్ష్యం కెనడా రాజ్యాంగంలో ఏజిజానికి ప్రత్యేక ప్రతిపత్తి కల్పించారు

**Social Contract** = యూరోప్‌లో వచ్చిన వికాసనోద్యమ దశలో (Enlightenment)తలెత్తిన సిద్ధాంతం ఈ సిద్ధాంతకర్తలు హాబ్స్, లాకి, రూసో సామాన్య ప్రజల ఆత్మగౌరవ రక్షణ దీని ప్రధాన లక్ష్యం అందుకు దోహదపడే రాజకీయ వ్యవస్థ స్థాపన వీరి లక్ష్యం ఈ వాదం సాధించిన ప్రధాన విజయం - అప్పటిదాకా తమ రాజకీయ వ్యవస్థలో దైవదత్తమని భావించి, రాజు దైవాంశ సంభూతుడన్న మిషపై చేసే వాదనలన్నీ డుల్లిపోవడం ప్రభుత్వం లేకుండానే ప్రజలు తమ ఉనికిని కాపాడుకోవచ్చునన్నది సోషల్ కాంట్రాక్ట్ సిద్ధాంతం ప్రజలు స్వేచ్ఛాజీవులు, స్వయం ప్రతిపత్తిని గౌరవించుకునే పౌరులని ఈ సిద్ధాంతం పిండితార్థం

**Social Democracy** = సంస్కరణవాద సిద్ధాంతాన్ని, మార్క్సిజంవైపు ఒక మేరకు మొగ్గుచూపే పార్టీ సిద్ధాంతాన్ని "సోషల్ డెమోక్రసీ" అయితే మితవాదమైన కన్సర్వేటిజానికీ దీనికి పెద్ద తేడా లేదు అలా అని పూర్తిగా అతివాద పార్టీ వైఖరులతో పూర్తిగా వేరుపడీ ఉండదు ఒక మొక్కలో - అతివాద, మితవాదాలలోని మంచి-చెడుల 'మేలు వంగడం'గా సోషల్ డెమోక్రసీ యూరప్‌లో అతవరించింది లేబర్ పార్టీ, స్కాండినేవియన్ పార్టీ వ్యవస్థలు దీని సంతానమే దీనినే మరో మాటలో లిబరల్ డెమోక్రసీ (ఉదారవాద ప్రజాస్వామ్యం) అని కూడా పిలుస్తూంటారు

**South America** = (దక్షిణ అమెరికా) ఇందులో అర్జెంటైనా బొలీవియా, బ్రెజిల్, చిలీ, కొలంబియా, ఈక్వెడార్, పెరుగ్వే, పెరూ, ఉరుగ్వే, వెనిజులా ప్రధాన దేశాలు కేవలం ఖండంగా చెప్పవలసి వస్తే ఇందులో ఫ్రెంచి గయానా, గయానా, సూరినామ్‌లను కూడా కలిపి చెప్పవలసి వస్తుంది ఈ మూడు ప్రాంతాలూ రాజకీయంగానూ, ప్రాంతీయ సారూప్యత వల్లా మానసికంగా కరిబియన్‌లో అంతర్భాగంగా భావిస్తారు

**Southeast Asia** = (ఆగ్నేయాసియా) ఇండో చైనా ద్వీపకల్పంలోని దేశాలూ, ఈ ద్వీపకల్పానికి ఆగ్నేయంగా ఉన్న దీవులూ కలిపి "ఆగ్నేయాసియా" అంటారు ఇవి - బర్మా, కాంబోడియా, ఇండోనేషియా, లావోస్, మలేసియా, న్యూగినీ, ఫిలిప్పీన్స్, సింగపూర్, థాయ్‌లాండ్, వియత్నాం

**Sovereignty** = సార్వభౌమాధికారం

**Space Shuttle** = రోదసీ విమానం భూ కక్ష్యలోకి మనుషులను, సామాగ్రిని ప్రవేశ పెట్టగల రోదసీ విమానం దీన్ని ఎన్నిసార్లు అయినా ఉపయోగించుకోవచ్చు బూస్టర్ రాకెట్ల సహాయంతో నిటారుగా దీన్ని ప్రయోగిస్తారు భూ కక్ష్యలోకి పంపిన తరువాత ఇంజన్స్‌ను పేల్చుకోవడం ద్వారా తిరిగి రోదసీ విమానం భూమి వాతావరణంలోకి ప్రవేశిస్తుంది క్రమంగా భూమిమీదికి దిగుతుంది

**Spokesman** = అధికార ప్రతినిధి (ఒక పార్టీ తరపునగాని, ఉన్నత స్థానాలలో వున్న వ్యక్తుల తరపునగాని సాధికారంగా ప్రకటనలు విడుదల చేసే / వివరించే ప్రతినిధి)

**State** = రాజ్యాంగయంత్రం : దీనిని కొందరు "ప్రభుత్వం"తో పోల్చుతారుగాని, ఆ పోలిక సరైనది కాదు ప్రభుత్వాలు రావొచ్చు, పోవచ్చు కాని రాజ్యాంగ

యంత్రం పోదు ఇది సామాజిక వ్యవస్థతో ముడిపడివున్న రాజకీయ వ్యవస్థ "స్టేట్" పరిధిలోకి, రాజ్యాంగ యంత్రం పరిధిలోకి దేశ ఆర్థిక రంగం, మతాలయాలు, విద్యాలయాలు, కుటుంబ వ్యవస్థలు ఇలా సామాన్య ప్రజా జీవనం అంతా వస్తుంది వీటన్నింటికీ ఉద్దీపన శక్తిగా రాజకీయాదికారం శక్తి ఉంటుంది కాబట్టి పోలీసు వ్యవస్థ, సైన్యం, సివిల్ సర్వీసూ రాజ్యాంగ యంత్రంలో భాగం

**State Capitalism** = స్టేట్ కాపిటలిజం ః దేశ పరిశ్రమాభివృద్ధికి అవసరమైన ఉపాంగాలను (ఇన్‌ఫ్రాస్ట్రక్చర్) ప్రభుత్వమే నిర్వహించడం ఈ పదాన్ని మొదట ప్రచారంలోకి తెచ్చి ఆచరణలో పెట్టిన వ్యక్తి లెనిన్ రష్యన్ విప్లవానికి నూతన ఆర్థిక విధానం **(NEP)** అమలులో వున్న మధ్యంతరకాలంలో అనుసరించిన బోల్షివిక్ ఆర్థిక విధానం స్వభావాన్ని వివరించడానికి లెనిన్ ఈ పదం వాడాడు అప్పటికింకా రష్యా ఫ్యూడల్ వ్యవస్థ నుంచి పెట్టుబడిదారీ వ్యవస్థకు పూర్తిగా పరివర్తన చెందలేదని వివరించడానికి వీలుగా ఆయన నూతన ఆర్థికవిధానాన్ని "స్టేట్ కాపిటలిజం" అన్నాడు కార్మికవర్గ విప్లవ నాయకత్వం అజమాయిషీలో అధునాతన పరిశ్రమాభివృద్ధికి అవసరమైన పునాదులు వేసుకోవచ్చునని ఆయన విశ్వసించాడు ప్రభుత్వ వ్యవస్థ అంతర్ధానమై (withening away of state) సమసమాజ వ్యవస్థ ఆదర్శ వ్యవస్థగా అవతరించడానికి ముందు దశలన్నిటా ఈ 'స్టేట్ కాపిటలిజం' అనివార్యమని లెనిన్ భావన

**Statesmanship** = రాజనీతిజ్ఞత

**Stockholm Declaration** = స్టాక్ హోమ్ ప్రకటనః ఇది హెల్సెంకీ ఒప్పందంలో భాగమే హెల్సెంకీ సభలో పాల్గొన్న దేశాధిపతులు - రాజ్యాల మధ్య పరస్పరం విశ్వాసం పాదుకొల్పడానికి అవసరమైన చర్యలు తీసుకోవాలని ప్రతిపాదించింది హెల్సెంకీ తీర్మానం దీనినే "Helsinki Final Act of 1975" అంటారు. సభ్య దేశాలు సైనిక చర్యల గురించి పరస్పరం సమాచారం తెలుపుకోవడం దాని లక్ష్యం 1984లో స్టాక్ హోమ్‌లో ఒక సభ జరిగింది దాని ఫలితమే 1986 నాటి స్టాక్ హోమ్ డిక్లరేషన్ సైనిక విన్యాసాలలో పాల్గొనే సైనికుల సంఖ్యను, విన్యాసాల పరిమితిని కుదిస్తూ వెసిన ప్రకటన ఇది దీనిపై సంతకం చేసిన దేశాలు ః అమెరికా, కెనడా, యూరప్ దేశాలు (ఒక్క ఆల్బేనియా తప్ప)

**Strait of Gibraltar** = జిబ్రాల్టర్ జలసంధిః అట్లాంటిక్ సముద్రంనుంచి మధ్యధరా (మెడిటరేనియన్) జలాల్లోకి ప్రవేశం కల్పించె జల సంధిని ఇలా అంటారు

**Strategy** = వ్యూహం

**Super Powers** = 'అగ్రరాజ్యాలు' ఇప్పటికి వీటి సంఖ్య అయిదు (అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, చైనా) జనాభా రీత్యా చైనా మినహా మిగతా రాజ్యాలన్నింటికంటే పెద్ద దేశమైన ఇండియా నేటికీ 'అగ్రరాజ్యం' కాకపోవడానికి కారణం - అణ్వస్త్ర దేశం కాకపోవడమే!

**Syndicalism** = సిండికలిజం ః ట్రేడ్ యూనియ నిజానికి మరో రూపమే ఇది మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు కడచిన సంవత్సరాలలో సిండి కలిజం ప్రాచుర్యంలోకి వచ్చింది సహకార రంగంలో ఉన్న శ్రామికవర్గం పరిశ్రమలపై సంపూర్ణాధిపత్యం చెలాయించడానికి దారితీసిన ఉద్యమం ఇది ఈ పద్ధతి ద్వారా క్రమంగా ప్రత్యక్ష సమ్మెకు పెద్ద ఎత్తున తలపడి మొత్తం సమాజంపైన ఆధిపత్యం సాధించడం దీని లక్ష్యం సిండికలిజం ఉద్యమానికి ఉపునందించిన రచయిత జార్జెస్ సోరెల్ (1847 - 1922)

**Tactics** = ఎత్తుగడ

**Thatcherism** = థాచరిజం (మితవాద రాజకీయ విధానాలను ముమ్మరంగా ప్రవేశపెట్టిన బ్రిటీష్ ప్రధాని థాచర్ ఈమె కార్యక్రమాల్లో ప్రధానమైనది - కీలక ప్రభుత్వ రంగ పరిశ్రమలన్నిటినీ పనిగట్టుకొని షేర్ల బదలాయింపులు సహా ప్రయివేటు వ్యక్తుల పరం చేయడం ఈమె ప్రభుత్వ రంగాన్ని గుత్తాధిపత్యవ్యవస్థగా వక్రీకరించి, ప్రయివేటు రంగానికి తలుపులు బార్లా తెరిచింది ట్రేడ్ యూనియన్ల కనీస హక్కుల్ని కూడా కుదించివేసే బిల్లుల్ని ప్రవేశపెట్టి అభాసుపాలయింది)

**Third World / Third World Countries** =

వర్ధమాన దేశాలు (ఆర్థికంగా బలహీన స్థితిలో వున్న దేశాలు) వర్ధమాన దేశాలు - నూతనంగా రాజకీయ స్వాతంత్ర్యం పొంది ఆర్థికాభ్యున్నతిదిశలో ఉన్న బడుగు దేశాలను ఇలా పిలుస్తున్నారు

**Totalatarianism** = నిరంకుశ ప్రభుత్వాధిపత్యం

**Tri - polar** = త్రి కేంద్ర ప్రపంచం

**Trinidad and Tobago** = ఇది ఉమ్మడి ద్వీపం దీనిని ఐలండ్ నేషన్ అంటారు కమ్యూనిటీ పేరునుబట్టి ఈ రెంటిలో ఏదో ఒక పేరును మాత్రమే వాడతారు

**Trotskyism** = ట్రాట్స్కీయిజం : 1917 రష్యా అక్టోబర్ విప్లవానికి ముందూ, ఆ తరువాతా లెనిన్ స్టాలిన్‌లతో పాటు ప్రసిద్ధికెక్కిన కమ్యూనిస్టు పార్టీ నాయకులలో ఒకరు లియోన్ ట్రాట్స్కీ (1979-1940) రష్యాలో సోషలిజం నిర్మాణం గురించి లెనిన్-స్టాలిన్‌లతో విభేదించి వేరుపడిపోయిన వ్యక్తి 'శాశ్వత విప్లవం' ప్రబోధకుడు ట్రాట్స్కీ ప్రపంచ వ్యాపితంగా సోషలిజం నిర్మాణంతో సంబంధం లేకుండానే ఒక్క దేశంలోనైనా సోషలిజం నిర్మాణం సాధ్యమేనన్న స్టాలిన్ వాదనతో విభేదించి, ప్రపంచ వ్యాపితంగా సోషలిజం నిర్మాణం సాధ్యమైనప్పుడే రష్యాలో సోషలిజం నిలుస్తుందని వాదించినవాడు ట్రాట్స్కీ రష్యన్ కమ్యూనిస్టు పార్టీతో విబేధించి, దానికి వ్యతిరేకంగా ఫోర్త్ ఇంటర్నేషనల్ (Fourth International) స్థాపనకు కృషి చేశాడు

**Tunnel vision** = సంకుచిత వైఖరి (Single track approach)

**U-boat** = జర్మన్ జలాంతర్గామి

**UFo**= గుర్తు తెలియని / ఎగిరే వస్తువు ( ఆకాశంలో) Unidentified Flying Object

**Ultra - rightist** = ఫాసిస్టు ధోరణి గల వ్యక్తి / నిరంకుశాధికారాన్నీ, సైనిక తత్వాన్నీ బలపరిచే వ్యక్తి

**Ultra left** = అతివాదిః సమూలంగా మార్పులు రానంతవరకు ప్రస్తుత వ్యవస్థలో పటిష్టమైన సంస్కరణలుగానీ, సోషలిస్టు పరివర్తనగానీ అసాధ్యం అని విశ్వసించే వ్యక్తి.

**Uncle Sam** = అంకుల్‌శాం : అమెరికన్‌నూ లేదా అమెరికా ప్రభుత్వాన్ని ఇలా పిలుస్తారు (వ్యంగ్యార్థంలో కూడా దీన్ని వాడతారు)

**Uncle Tom** = బ్లాక్స్‌ను పిలిచే పదం ఇది నిషిద్ధం కారణం - డబ్బుకోసం, రాజకీయ పలుకుబడికోసం, ప్రాపకం సంపాదించడంకోసం తెల్లజాతివారికి మోకరిల్లే వారిని ఇలా అంటారు అందువల్ల నిషిద్ధం ఈ పదం హారియెట్ బీచర్ స్టౌస్ రాసిన "Uncle Tom's Cabin" అన్న నవల లోనిది

**Uni - polar** = ఏకధృవ ప్రపంచం

**Utilitarianism** = ప్రయోజనవాదం : ప్రజలకు ఏది మంచో అదే సరైన విధానమన్నది ఈ సిద్ధాంత ప్రవచనం జర్మీ, బెంతామ్, జేమ్స్ మిల్ రూపొందించిన నైతిక, సాంఘిక, రాజకీయ సిద్ధాంతం ఈ వాదానికి మూలం ప్రజలకు మంచి జరగడం, వారి ఆనంద సౌఖ్యాలు, సుఖశాంతులే ప్రధానం అన్నది దీని ప్రబోధం ఆదేశాలకు, వొత్తిళ్ళకు, నైతికపరమైన ధాష్టీకానికి ఈ సిద్ధాంతం బద్ధ విరుద్ధం

**Utopianism** = ఊహాజనితవాదం : ఒక ఆదర్శ ఉత్తమ సమాజాన్ని ఊహించుకొని ఆ ఊహ ఆధారంగా అల్లుకొన్న సాంఘిక, రాజకీయ సిద్ధాంతం ఇది దీనికి మూలం - సర్ తామస్ మోర్ ఈయన 16వ శతాబ్దంలో 'ఉటోపియా' పేరుతో ఒక ఊహాజనితమైన దీవిని సృష్టించుకున్నాడు ఇది ప్లాటో ఆదర్శించిన 'రిపబ్లిక్' లాంటిదే ఆచరణకు రాని ప్రతీ ఊహాజనిత వాదాన్నీ విమర్శించడం కోసం కారల్ మార్క్స్ ఈ 'ఉటోపియా' ను ఉదాహరిస్తూ వచ్చాడు అలాంటి విమర్శలకు గురైన వాటిలో ఒకటి - ఉటోపియన్ సోషలిజం రూసో 'సోషల్ కాంట్రాక్ట్' సిద్ధాంతం కూడా ఇలాంటిదే

**V-J Day** = రెండో ప్రపంచ యుద్ధంలో మిత్రమండలి సేనలు జపాన్‌పై సాధించిన విజయాన్ని ఇలా "విజయ దినం"గా ప్రకటించారు రెండు తేదీల్లో దీన్ని పాటిస్తారు జపాన్‌తో పోరు ముగిసినప్పుడు (1945 ఆగస్టు 15), జపాన్ పూర్తిగా లొంగిపోయిన రోజునా (1945 సెప్టెంబరు 2)

**Vangaurd** = అగ్రగామి దళం

**Veterans Day** = యుద్ధ వీరుల దినోత్సవం:

దీన్ని లోగడ యుద్ధ విరమణ దినం అనేవారు మొదటి ప్రపంచ యుద్ధం యుద్ధ విరమణ ఒప్పందంతో 1918 నవంబర్ 11న ముగిసింది కనక ఇలా పిలుస్తారు

**Vietnam War** = వియత్నాం యుద్ధం పైకి చూడ్డానికి ఉత్తర - దక్షిణ వియత్నామ్‌ల మధ్య పోరుగా కన్పించింది కాని వియత్నామ్ విభజన అమెరికా సృష్టి దక్షిణ వియత్నామ్ ప్రభుత్వం అమెరికా తైనాతీ తైనాతీల ప్రభుత్వానికి కొమ్ముకాయడం అమెరికా సిద్ధాంతం వియత్నామ్ కృత్రిమ విభజన తరువాత ఉత్తర వియత్నామ్ కమ్యూనిస్టుల ప్రభావంలోకి వెళ్ళింది దానితో రష్యా, చైనాల ప్రభావంలో ఉత్తర వియత్నామ్ ఉండిపోయింది వియత్నామ్ అంతర్యుద్ధం, వియత్నామ్‌లో అమెరికా జోక్యం పాతికేళ్ళ యుద్ధానికి పరాకాష్ట 1975లో ఉత్తర వియత్నామ్ వీరోచిత పోరాటం ఫలితంగా యుద్ధానికి ముగింపు వచ్చింది తైనాతీలు పతనమయ్యారు అమెరికా సైన్యం కళ్ళు లొట్టపోయి తోక ముడిచింది

**Wall Street** = ద్రవ్య (పరపతి) సంస్థలు కేంద్రీకరించి వున్న మొత్తం కాంప్లెక్స్‌ను ఇలా అంటారు ప్రత్యేక వీధి అని కాదు, ఒక వరసలో ఈ సంస్థలు ఒకే కాంప్లెక్స్‌లో ఉన్నందున అలా పేరొచ్చింది

**Warsaw Pact** = వార్సా సంధి : అమెరికా, పశ్చిమ రాజ్యాల ఆధ్వర్యంలో ఏర్పడిన సైనిక సంధి - నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్‌కు ప్రతిగా సోవియెట్ రాజ్య కూటమి నెలకొల్పిన సైనిక సంధి "వార్సా ప్యాక్ట్" సోవియెట్ యూనియన్ పతనం తర్వాత ఈ సంధికి కూడా సంధికొట్టింది. రష్యన్ కుహనా కమ్యూనిస్టులు ఇప్పుడు 'నాటో'తో వియ్యమంది మనుగడ సాగిస్తున్నారు.

**Watergate** = వాటర్‌గేట్ : 1972లో అమెరికన్ ప్రెసిడెన్షియల్ ఎన్నికల ప్రచారం సందర్భంగా డెమోక్రాట్ల కన్వెన్షన్ జరిగినప్పటినుంచీ ఈ పదం బహుళ ప్రచారంలోకి వచ్చింది. వాషింగ్టన్ డి.సి.లో ఉన్న రెసిడెన్షియల్, ఆఫీస్, హోటల్ సదుపాయంగల భవన సముదాయం పేరు "వాటర్ గేట్". (వాటర్ గేట్ కాంప్లెక్స్)

డెమోక్రటిక్ పార్టీ నేషనల్ కమిటీ ఈ సముదాయంలోని రూమ్స్‌ను (సూట్స్) ఎలక్షన్ సందర్భంగా అద్దెకిచ్చారు ఈ గదుల్లో ఏం జరుగుతుందో, డెమోక్రటిక్ పార్టీ తరపున ఎన్నికల ప్రచార కార్యక్రమాలు ఎలా ఉన్నాయో తెలుసుకునే ఉద్దేశంతో రిపబ్లికన్ పార్టీ నాయకుడు నిక్సన్ అధ్యక్ష కార్యాలయం ఆధ్వర్యంలో కూపీలు లాగే ఏర్పాటు జరిగాయి ఈ రహస్య పద్ధతులు బయటకు పొక్కి నిక్సన్ ప్రభుత్వాన్ని కుదిపివేశాయి వాషింగ్టన్ పోస్ట్, న్యూయార్క్ టైమ్స్ పత్రికలు ఇన్వెస్టిగేటివ్ రిపోర్టింగ్ ద్వారా కుంభకోణాన్ని వెలికి తీశాయి నిక్సన్ అధ్యక్ష కార్యాలయం ఉన్నతాధికారులు, నిక్సన్ తీవ్ర విమర్శలకు గురయ్యారు ఈ కుంభకోణాన్ని తొక్కి పట్టడానికి నిక్సన్ విశ్వ ప్రయత్నం చేసినా ఫలించలేదు ఎవరో కాదు అసలు నిక్సనే ఇందులో ప్రధాన ముద్దాయి వైట్‌హౌస్ చర్చలలో నిక్సన్ పథకం కాస్తా వెల్లడి కావడంతో సుప్రీంకోర్టు ద్వారా డెమోక్రాట్స్ అభిశంసనకు నిక్సన్ గురి కావలసి వచ్చింది కోర్టు విచారణను తప్పించుకోడానికి నిక్సన్ చేసిన యత్నాలు విఫలమయ్యాయి ఫలితంగా 1974లో నిక్సన్ రాజీనామా చేయవలసి వచ్చింది అదే వాటర్‌గేట్ కుంభకోణంగా ప్రసిద్ధికెక్కింది.

**Weimer Republic** = 1919లో మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత జర్మనీలో ఏర్పడిన రాజకీయ వ్యవస్థను అధికారికంగా 'వీమార్ రిపబ్లిక్' అంటారు ఇది 1933లో "థర్డ్ రీచ్" పేరిట హిట్లర్ అధికారంలోకి వచ్చేదాకా కొనసాగింది. వీమార్ రిపబ్లిక్ అస్థిర పాలనకు, అస్తుబిస్తు రాజకీయాలకు పేరుమోసింది ఆంతరంగిక కుమ్ములాటలు, రాజకీయ స్పర్థలూ దాని జవజీవాలను కుంగదీసాయి కమ్యూనిస్టులకు, ఫాసిస్టులకు మధ్య హోరాహోరి పోరాటాలు సాగాయి. ఈ రిపబ్లిక్ - నాజీ రాజకీయాలకు పుట్టిల్లుగా మారింది

**West Asia** = పశ్చిమ ఆసియా (Middle East అని పాశ్చాత్యుల వాడకం వాళ్ళకిది మధ్య ప్రాచ్యం కనక) పశ్చిమ పాకిస్తాన్‌కు, సైప్రస్‌కు నైరుతిగా ఉన్న ఆసియానే "పశ్చిమాసియా"గా పిలుస్తారు. (పాకిస్తాన్‌కు పశ్చిమాన ఉన్న దేశాలు : ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, ఇరాక్,

ఇజ్రాయేల్, కువైత్, జోర్డాన్, లెబనాన్, ఓమన్, కతార్, సౌదీ అరేబియా, దక్షిణ ఎమెన్, సిరియా, టర్కీ యునైటెడ్ అరబ్ ఎమిరైట్స్, ఉత్తర ఎమెన్) ఇవిగాక పశ్చిమాసియాలో భాగంగా ఈశాన్య ఆఫ్రికా (ఈజిప్టు, సూడాన్), సైప్రస్ దీవి కూడా భాగమే

**West Indies** = దక్షణ అమెరికాకు దక్షిణంగా, ప్యూర్టోరికోకు తూర్పుగా వున్న కరిబియన్ దీవులకు ఇది మరో పేరు వీటిలో ప్రధానమైన దేశాలు : బార్బడోస్, గ్రెనెడా, ట్రినిడాడ్, టొబాగో, ఇతర చిన్న చిన్న పరాధీన దీవులూ ఈ దీవుల్లో కొన్ని బ్రిటన్‌పై ఆధారపడి ఉన్నాయి అవి - బ్రిటీష్ వర్జిన్ ఐలండ్స్, అంగిల్లా, అంటీగా, డొమినికా, సెయింట్ లూసియా, సెయింట్ విన్సెంట్, సెయింట్ క్రిస్టోఫర్ నెవిస్ సహా వెస్ట్ ఇండీస్ అను బంధ రాష్ట్రాలూ, ఫ్రాన్స్‌పై ఆధారపడినవి: గాడిలూప్, మార్టినిక్

నెదర్లాండ్స్‌పై ఆధారపడినవి : నెదర్లాండ్స్, అంటిల్లీస్, సెయింట్ మార్టిన్ ఐలండ్ దక్షిణ ప్రాంతం

అమెరికాపై ఆధారపడినవి: అమెరికా వర్జిన్ ఐలండ్స్ ప్రధానంగా సెయింట్ క్రోక్స్, సెయింట్ జాన్, సెయింట్ థామస్.

**Westerm Hemisphere** = పశ్చిమార్థ గోళం : ఇందులో ఉత్తర, దక్షణ అమెరికాలు, వీటికి సమీపంలో ఉన్న దీవులూ ఉంటాయి వీటిని తరచుగా ఇలా విభజించి చెబుతూంటారు :

(a) Caribbean = ఫ్లొరిడా కొననుండి దక్షిణ అమెరికా ఖండం దాకా ఉన్న దీవుల సముదాయాన్ని, దక్షిణ అమెరికా ఈశాన్య కోస్తాలోని ఫ్రెంచి గినీ, గయానా, సూరినామ్ లను కలిపి 'కరిబియన్' ప్రాంతంగా వ్యవహరిస్తారు. ఇందులో ప్రధాన దీవులు: బహామాస్, క్యూబా, హిస్పానియోలా (ఇది డొమినికన్ రిపబ్లిక్, హైతీల సంయుక్త ఆధిపత్యంలో ఉంది). జమైకా, పూర్టోరికా, వెస్ట్ ఇండీస్ దీవులు

(b) Central America = ఇది మెక్సికో, కొలంబియాల మధ్య నున్న ఇరుకైన ప్రాంతం ఇందులోని దీవులు: బెల్జి, కొస్టోరికా, ఎల్‌సాల్వడార్, గౌతమాలా, హోండూరాస్, నికరగ్వా, పనామా ఇవన్నీ కలపి సెంట్రల్ అమెరికా

(c) Latin America = (దక్షిణ అమెరికా) : అమెరికాకు దక్షిణంగా ఉన్న అమెరికాలను కలిపి ఇలా అంటారు ఈ ప్రాంతాల్లో "రొమాన్స్" భాషలు (లాటిన్ భాష మాతృకగా పెరిగిన భాషలను రొమాన్స్ భాషలు అంటారు) ప్రధాన భాషలు : లాటిన్ అమెరికా అన్నది బ్రిటీష్ సంప్రదాయాలను పాటించే ప్రాంతాలు మినహా అమెరికాకు దక్షిణంగా ఉన్న అన్ని ప్రాంతాలకూ వర్తిస్తుంది సంప్రదాయంగా ఉన్న ప్రాంతాలు : బహామాస్, బార్బడోస్, బెల్జి, గ్రెనెడా, గయానా, జమైకా, ట్రినిడాడ్ - టొబాగో, వెస్ట్ ఇండీస్‌లోని అనేక దీవులూ అయితే పాత డచ్ గయానా, సూరినామ్‌లు ఇందులో భాగం కావు

(d) North America = కెనడా, మెక్సికో, అమెరికా, గ్రీన్‌లాండ్ (డేనిష్ భూభాగం) కలసి ఉత్తర అమెరికా అయింది అయితే దీన్ని ఖండం పేరిట విస్తృతార్థంలో వ్యవహరించవలసి వచ్చినప్పుడు కరిబియన్ దీవులను కూడా కలిపి 'నార్త్ అమెరికా'గా చెప్పవలసి ఉంటుంది

**White House** = అమెరికా అధ్యక్ష కార్యాలయం

**World Court** = అంతర్జాతీయ న్యాయస్థానం దీని కేంద్రస్థానం హేగ్ దీని సృష్టికర్త నానాజాతి సమితి (లీగ్ ఆఫ్ నేషన్స్)

**Yuppie** = యుప్పీ : 1980లలో అమెరికాలో తలెత్తిన ప్రసిద్ధ సోషల్ గ్రూపులకు ముఖ్యంగా యువజన బృందాలకు అమెరికన్ జర్నలిస్టులు పెట్టిన ముద్దుపేరు ఇది దీని పూర్తి పేరు "Young Upwardly-mobile, Professional" ఈ బృందాల్లో పిల్లలను ఆర్థికంగా తమకు భారంగా భావించని మధ్య తరగతి మందహాసులు కూడా ఉన్నారు వీరిని డింక్స్ అంటారు (అంటే - భార్యాభర్తలు ఇరువురూ సంపాదిస్తారు కాని పిల్లలుండరు "Duel Income, No kids") రొనాల్డ్ రేగన్ ప్రెసిడెన్షియల్ (1981-82) ఎన్నికలలో ఈ యువతరాన్ని ప్రభావితం చేయాలని చూశాడు

జీతాలు తగ్గించడంతోపాటు సంక్షేమ పథకాలపై ఖర్చును కూడా తగ్గించాడు అయితే క్రమంగా ఈ యువతరంలో ఎక్కువమంది తర్వాత స్టాక్ మార్కెట్లలో వట్టి విరుద్ధమైన వ్యాపారం లావాదేవీల్లో తలదూర్చి అభాసుపాలయ్యారు పెక్కు యూరోపియన్ దేశాల్లో కూడా ఇదే చేదు అనుభవం లండన్‌లో "యుప్పీ"ని "ఎస్సెక్స్‌మాన్" అంటారు ఈ రెండు నామాలు వ్యవస్థకు పంగనామాలుగా మారి విమర్శలకు గురయ్యాయి!

**Zionism** = జియోనిజం / యూదు దురహంకార వాదం : పాలస్తీనా - యూదు జాతి జన్మ స్థలం కాబట్టి ప్రపంచ యూదు జాతి సంఘీభావానికి పెట్టని కోటగా అరబ్బులనుంచి తిరిగి పాలస్తీనాను ఎలాగైనా గుంజుకు తీరాలని వాదించే సిద్ధాంతాన్ని 'జియోనిజం' అంటారు రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో హిట్లర్ జర్మనీలో అతనితోపాటు ఇతర పశ్చిమ దేశాలలో యూదు వ్యతిరేక భావాలు anti-semitism వ్యాపించినందున - యూదులు 1930లలో సమైక్యవాదాన్నీ, సంఘీబావాన్నీ చాటుకోవలసి వచ్చింది నిజానికి చారిత్రికంగా చూస్తే పాలస్తీనా అరబ్బు ప్రాంతం ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల కుట్రల ఫలితంగా పాలస్తీనా ఆదిలో నానాజాతి సమితి అజమాయిషీలో, తరువాత ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో మనుగడ సాగించుకొంటోంది యూరప్‌లోని యూదులను పెద్ద ఎత్తున పంపించి పాలస్తీనాను అరబ్బులకు దూరం చెయ్యడం వలస పాలకుల లక్ష్యం ఈ కారణం చేతనే ఇజ్రాయేల్‌ను అరబ్బుల మధ్య సృష్టించి నేటి వరకూ పశ్చిమాసియాలో కుంపటి పెట్టి పరిష్కారాన్ని అసాధ్యం చేస్తూ వచ్చినవాళ్ళు సామ్రాజ్యవాదులు

# ఆర్థిక - వాణిజ్య శాస్త్రాలు

**Abnormal Loss** = అసాధారణ నష్టం (ఎప్పుడో కాని సంభవించని నష్టం ఉదా: అగ్ని ప్రమాదంలో బూడిదైన సరకు)

**Account** = ఖాతా

**Accounting Year** = మదింపు సంవత్సరం : కంపెనీ లావాదేవీల మదింపునకు నిర్ణయించిన కాల వ్యవధి - ఏప్రిల్ 1 నుంచి మార్చి 31తో అంతమయ్యేది మదింపు సంవత్సరం

**Accumulation** = షేర్లు పెంచుకోవడం షేర్ల ధరలు ఆకస్మికంగా పెరగకుండా లేదా స్పెక్యులేషన్‌కు తావివ్వకుండా జాగ్రత్తగా పద్ధతి ప్రకారం క్రమానుగతంగా కంపెనీ షేర్లను కొనడాన్నీ, తద్వారా కంపెనీలో 'హోల్డ్' (పట్టు) సంపాదించడాన్నీ ఇలా అంటారు

**Active Stocks** = ప్రధాన షేర్లు ('ఎ' క్లాస్) : స్టాక్ ఎక్స్ఛేంజీల్లో హెచ్చుగా ట్రేడ్ అయ్యే షేర్లను ఇలా అంటారు వీటికి పత్రికలు 'ఎ' క్లాస్ షేర్లు అని ప్రచారంలోకి తెచ్చాయి

**Ad Valorem** = విలువనుబట్టి / ధరనుబట్టి: ఇది సరకుపైన విధించే నిర్ణీతమైన పన్ను కాకుండా, వస్తువు విలువను బట్టి విధించే పన్ను ఉదా: రూ 10లు విలువ చేసే టోపీ పైన యాడ్ వెలొరమ్ టాక్స్ 50 పైసలు విధించవచ్చు లేదా రూ 1 ఖరీదు చేసే టోపీపైన రూ 4ల పన్నూ వేయొచ్చు కాగా వస్తువు ధరతో / విలువతో సంబంధం లేకుండా అన్ని రకాల టోపీల మీద 75 పైసల చొప్పున విధించే పన్నును ఫిక్స్‌డ్ టాక్స్ అంటారు

**Ag-mark** = అగ్ మార్కు = నాణ్యత, తూకం, రకం వగైరాల ప్రమాణాలు సక్రమంగా ఉన్న వస్తువులను ప్రామాణీకరిస్తూ వేసే ముద్ర / లేదా అగ్‌మార్కు పత్రం

**Alfa Shares** = గిరాకీ షేర్లు : వీటిని స్పెసిఫైడ్ షేర్లు, గ్రూప్ సెక్యూరిటీలు, క్లియర్డ్ సెక్యూరిటీలు అని కూడా అంటారు

**Alienation** = పరాయీకరణ / వేర్పాటు భావన / దూరంగావడం : ఆర్థిక పరిభాషలో ఈ పదానికి అర్థం ఆస్తిని మరొకరి పేర బదిలీ చేయడం, లేదా వదిలించుకోవడం అని కాని సామాజిక శాస్త్ర పరిభాషలో దీని అర్థం - ఆధునిక పారిశ్రామిక యుగంలో పని భారం వల్ల కార్మికులలో కలిగే నిర్లిప్తత, నైరాశ్యం, వేర్పాటు భావన అని ఈ భావనను గుర్తించి, ఇందుకు మానవీయ దృక్పథంతో పరిష్కారం కనుగొనాలని యత్నించినవారు మార్క్స్, గాంధీజీ ఇందుకు విరుగుడుగా ఉత్పత్తి సాధనాలను కార్మికుల పరం చేయకుండా అడ్డుకునే దోపిడీ వ్యవస్థ నిర్మూలనకు విప్లవమే మార్గమని మార్క్స్ సూచించగా, ఉపాధికి దూరంచేసే కేవల యంత్ర నాగరికతను నిరసించి మానవుడికి విలువయిచ్చే సంప్రదాయ ఉత్పత్తి పద్ధతులను దేశవాళీ పద్ధతులను అనుసరించాలని, ఈ పరిణామాన్ని అహింసాయుతంగా మాత్రమే సాధించాలనీ గాంధీజీ ప్రతిపాదన

**Allotment - letter** = షేర్ల కేటాయింపు పత్రం : ఇన్‌వెస్టర్‌కు కేటాయించిన షేర్ల సంఖ్య గురించి, వాటి విలువ గురించి తెలుపుతూ కంపెనీ నుంచి ఇన్‌వెస్టర్‌కు పంపే పత్రం

**Amortization** = రుణాల తీరుమానం : తీసుకున్న రుణాలను సక్రమంగా సరిసమాన వాయిదాలలో తిరిగి చెల్లించడం

**Annuity** = నిర్ణీత చెల్లింపు : ఉద్యోగికి నిర్ణీత కాలానికి లేదా జీవితాంతం నిర్ణీత వ్యవధిలో చెల్లించే నిర్ణీతమైన డబ్బు

**Articles of Association** = లక్ష్య పత్రం : కంపెనీని ఏర్పరచే ముందు కంపెనీ ప్రమోటర్లు రాసుకునే "మెమొరాండం ఆఫ్ అసోసియేషన్"తో పాటే ఈ డాక్యుమెంటును కూడా సిద్ధ పరుస్తారు ఇది కంపెనీ వ్యవహారాల నిర్వహణకు అవసరమైన వివరణలతో నిబంధనలనూ, (రూల్సు), రెగ్యులేషన్స్‌నూ రూపొందిస్తుంది కంపెనీ చట్టం ప్రకారం కంపెనీ నమోదు కావాలంటే ఈ లక్ష్య పత్రాన్ని అనుమతికోసం కంపెనీల రిజిస్ట్రార్‌కు సమర్పించాలి "ఆర్టికల్స్" అంటే - షేర్ హోల్డర్లకు, కంపెనీ డైరక్టర్లకు మధ్య కాంట్రాక్టు షరతులని

**Articles** = నిర్మాణ నిబంధనలు : (సంస్థ నిర్మాణ

నిబంధనలు, ఆశయాలు పొందుపరిచిన డాక్యుమెంటు)
**Articles of Association** = సంస్థ నియమావళి
**Asian dollars** = ఆసియా, పసిఫిక్ బేసిన్‌లో పనిచేసే బ్యాంకులలో ఉండే అమెరికన్ డాలర్లు
**Assess** = మదింపు : విలువను మదింపు వేయడం
**Assets** = ఆస్తులు : సంస్థకుగాని వ్యక్తికిగాని రావలసిన అన్నిరకాల డబ్బు ఆస్తి, వాటికి సంబంధమైన హక్కులు వగైరా వెరసి ఆస్తులు
**Assets** = కంపెనీ ఆస్తులు : మార్కెట్ విలువ వున్న కంపెనీ సొంత ఆస్తులన్నీ 'ఎసెట్స్' క్రిందికే వస్తాయి ఇవి : 1 పెట్టుబడి (స్థిరాస్తులు) రూపంలో ఉన్న ఆస్తులు ఉదా : పదికాలాల పాటు స్థిరంగా వుండే (Long term) భవనాలు, భూములూ, పరికరాలు, ఫర్నిచర్, ఫిక్చర్స్ వగైరా 2 చరాస్తులు : ఉదా: నగదు, రిసీవబుల్ అకౌంట్సు, వగైరా అలాగే విక్రయించడానికి సిద్ధంగా వున్న వస్తువులూ, ఒక్క ఏడాదిలోగా అమ్మడానికి వీలయిన ఇతర ఆస్తులూ "కరెంట్ ఎసెట్స్" కిందికే వస్తాయి. 3 కనిపించని ఆస్తులు: ఉదా: గుడ్‌విల్, కాపీరైట్, ట్రేడ్ మార్క్, పేటెంట్స్, ఎగుమతి-దిగుమతి పర్మిట్లు, లీజెస్ (కౌళ్ళు), పంపిణీ హక్కులూ
**Auditing** = ఆడిటింగ్ / పద్దుల తణిఖీ
**Authorised Capital** = ప్రారంభ గరిష్ఠ మూలధనం / అధికృత మూలధనం
**Authorised Share Capital** = గరిష్ఠ మూలధనం : కంపెనీ ఆర్టికల్స్‌లో పేర్కొన్నట్టుగా కంపెనీ గరిష్ట స్థాయిలో షేర్లను విడుదల చేయొచ్చు ఆదిలో కంపెనీ కొద్దిషేర్లనే ఇష్యూ చేయొచ్చు కాని షేర్ హోల్డర్ల, కాపిటల్ ఇష్యూల కంట్రోలర్‌ల అనుమతితో ఆథరైజ్డ్ పెట్టుబడిని పెంచుకోవచ్చు
**Authorized agent** = నిర్ణీత ఏజెంటు
**b) Eurodollar** (యూరో డాలర్) = యూరోపియన్ దేశాల మధ్య చెల్లింపులకోసం యూరోపియన్ బ్యాంకుల్లో అట్టిపెట్టుకొనే కరెన్సీని "యూరోడాలర్స్" అంటారు
**Backadation/backwardation** = సరకుల ధర పడిపోయినప్పుడు అందుకు ప్రతిఫలం చెల్లించి కొన్నాళ్ళపాటు సరకుల అప్పగింతను వాయిదా వేయడం
**Bad debt** = రాని బాకీ / మొండిపద్దు : ఇచ్చిన అప్పు తిరిగి రాబట్టుకోవలసి వున్నా ఎంతకీ వసూలు కాని పద్దు అలాంటి మొండి పద్దుల్ని అప్పుడప్పుడూ రద్దు చేస్తారు
**Badla (or Contango)** = దీనినే 'బ్యాక్ వార్డేషన్' (Backwardation) అని కూడా అంటారు అలాగే ఇండియన్ స్టాక్ ఎక్స్చేంజీలలో 'ఉంధా బాద్లా' 'Undha Badla' అని కూడా పిలుస్తారు సత్వర భవిష్యత్తులో షేర్ల ధరలు పడిపోతాయని ఊహించి "బేర్" సదరు షేర్లను అమ్మజూపుతాడు ఇలా అమ్మజూపడాన్ని 'బాద్లా' పద్ధతి అంటారు (తద్వారా ఉత్తరోత్తరా అనువైన సమయం చూసుకొని షేర్లు ఎంపిక చేసుకొని మరీ వాటిని విడుదల చేసి లాభసాటిగా సొమ్ము చేసుకొంటాడు)
**Balance of Trade (BoT)** = వర్తక వ్యత్యాసం: దేశ ఎగుమతి - దిగుమతి వర్తకం విలువలో వచ్చే తేడా దిగుమతుల కంటే ఎగుమతులు పెరిగినప్పుడు ఆ పరిస్థితిని 'వర్తక వ్యత్యాసం' అంటారు ఎగుమతులకన్నా దిగుమతులు పెరిగిపోయినప్పుడు ఆ సమస్థితి కాస్తా తారుమారవుతుంది
**Balance Sheet** = ఆస్తి అప్పుల పట్టీ / అడవా పట్టీ (ఒక సంస్థకు సంబంధించిన ఖచ్చితమైన ఆర్థిక పరిస్థితిని ఈ పట్టీ మాత్రమే తెల్పుతుంది ఏ కంపెనీ నాడి అయినా దాని ఆస్తి అప్పుల పట్టీలోనే దొరుకుతుంది
**Ballon payment / ballon loans** = బడా కిస్తీ : తీసుకున్న ఋణాన్ని రెగ్యులర్‌గా చెల్లిస్తున్నా, ఆ ఋణం ఆఖరికిస్తీని ఒకే దఫా పెద్ద మొత్తంగా చెల్లించినప్పుడు దాన్ని ఇలా అంటారు అంటే - అంతకు ముందు చిన్న చిన్న కిస్తీలలో కొన్ని మొత్తాలు చెల్లిస్తున్న కస్టమర్‌కు ఆఖర్లో చెల్లించే పెద్ద మొత్తాలు అంతగా గణనలోకి రావన్నమాట!
**Ballot** = కంపెనీ కొత్త 'ఇస్యూ' అనుకున్న దానికన్నా ఓవర్ సబ్‌స్క్రైబ్ అయినప్పుడు, షేర్లను కేటాయించే పద్ధతిని "బ్యాలట్" అంటారు (ఎన్నికలలో వేసే 'ఓటు'ను కూడా బ్యాలెట్ అంటారు)
**Bargain** = బేరసారం : షేర్ల క్రయ విక్రయాలకు సంబంధించిన బేరసారాన్నే 'బార్‌గైన్' అంటారు
**Bar Charts** = సాంకేతిక పట్టీలు: రోజువారీ షేర్

ధరవరలను తెలిపే 'నిలువు పట్టీ'లు రోజువారీ షేర్ గరిష్ఠ ధరకు కనిష్ఠ ధరకూ మధ్య తేడాను ఈ 'బార్ చార్ట్'లు సూచిస్తాయి

**Bars and spaces** = నాణ్యతా ప్రమాణాలు : దిగుమతైన సరకులపైనగాని, ఎగుమతి చేసే సరకులపైనగాని ప్యాకేజి కాగితం ఉంటుంది ఇది ఒకడ్పందిగా ఉంటుంది ఈ కాగితంపైన నిలువు గీతలు ఖాళీ జాగాలతో బార్‌కోడ్ ఉంటుంది సాంకేతిక పత్రికలతో తయారైన నంబరు ఆకోడ్‌పైన ఉంటుంది ఈ నంబర్ కోడ్‌ను ప్రత్యేక పరికరాల తోడ్పాటుతో గుర్తిస్తారు సరకుల్ని గుర్తించడానికి, పంపిణీ సక్రమంగా జరగడానికి ఈ కోడ్ సాయపడుతుంది

**Base year** = ఆధార సంవత్సరం

**Basket Currencies** = భంగీ కరెన్సీ : అంతర్జాతీయ కరెన్సీకి స్థిరత్వం లేనప్పుడు కృత్రిమంగా ఒక కరెన్సీని సృష్టించుకొని, పలు దేశాల కరెన్సీల ఉమ్మడి విలువనుబట్టి దేశీయ కరెన్సీ (యూనిట్) విలువను నిర్ణయిస్తారు స్పెషల్ డ్రాయింగ్ రైట్స్ (ఐ ఎమ్ ఎఫ్ ప్రవేశపెట్టిన కృత్రిమ కరెన్సీ దీనిని ఫండ్ సభ్య దేశాలకు కేటాయించారు) యూరోపియన్ కరెన్సీ యూనిట్ (ECU)ల మారకపు విలువల్లో వచ్చే ఒడిదుడుకులను సాధ్యమైనంతమేర తగ్గించుకునేందుకే ఇలా ఇతర దేశాల కరెన్సీల విలువను దామాషాన వారి ఇష్టానుసారం నిర్ణయిస్తారు ఇలా ఏ ఒక్క కరెన్సీనోగాక పలు దేశాల కరెన్సీల కాంబినేషన్‌ను 'బాస్కెట్ కరెన్సీ' అంటారు అదే బంగీ కరెన్సీ ఇందులో బలహీనమైన కరెన్సీ (యూనిట్)కన్నా బలమైన కరెన్సీ విలువ సహజంగానే హెచ్చు శాతంలో ఉంటుంది మన రూపాయి కూడా ఈ భంగీ కరెన్సీ తోడే ముడిపడి ఉంది

**Bear**= మార్కెట్‌లో షేర్ ధర పడిపోతుందని ఊహిస్తూ షేర్‌ను అమ్మేసే ఊపులో ఉండే స్టాక్ మార్కెట్ ఆపరేటర్‌ను ఇలా పిలుస్తారు షేర్ అమ్మేదాకా దుంప తెంచేస్తాడు అందుకోసం షేర్ ధరను ఇంకా ఇంకా తగ్గిస్తూ పోతాడు. ఎలుగుబంటి నేలవైపు కుమ్ముకుంటూ దూసుకు వస్తుంది కాబట్టి 'బేర్' అన్నారు.

**Bearer Cheque** = బేరర్ చెక్కు తెచ్చిన వారికి చెల్లించేందుకు వ్రాసిన చెక్కు.

**Bearish tendency** = దరలు మందగించే దోరణి

**Beta Shares** = గిరాకీ లేని షెర్లు : ఇవీ స్టాక్ ఎక్స్చేంజీలలో 'లిస్ట్' అయిన షేర్లే కాని ఇవి తరచుగా 'ట్రేడ్' కావు తక్కువ ఈక్విటీ పెట్టుబడి ఉన్న కంపెనీల షెర్లను బీటా షేర్లు' అంటారు

**Bid Price**= క్రయధర : బ్రోకర్ కొనదలచిన షేర్ల ధర

**Big Eight** = ఎనిమిది పెద్ద అమెరికన్ అక్కౌంటింగ్ సంస్థలను ఇలా అంటారు ఇవి : ఆర్థర్ యాండర్సన్ అండ్‌కో, కైపర్స్ అండ్ లిబ్రాడ్, ఎర్నెస్ట్ అండ్ విన్నీ, డిలోటి హాస్కింగ్స్ అండ్ సెల్స్, పీట్, మార్విక్ మిచెల్ అండ్ కంపెనీ, ప్రైస్ వాటర్ హౌస్ అండ్ కో. టచీ రాస్ అండ్ కో, ఆర్థర్ యంగ్ అండ్ కో

**Bill Book** = బిల్లు పుస్తకం

**Bill broker** = బిల్లు దలాలీ/ హుండీదలాలీ

**Bill buying** = హుండీ కొనుగోలు

**Bill counter** = బిల్ కౌంటర్ (బిల్లులు చెల్లించే చోటు)

**Bill debt** = అప్పుల బిల్లు

**Bill of Credit** = పరపతి బిల్లు

**Bill of entry** = ప్రవేశపత్రం

**Bill of indemnity**= నష్టపరిహార బిల్లు (శిక్షనూ, నష్టాన్నీ తప్పించే బిల్లు)

**Bill of Payment** = చెల్లింపు పత్రం

**Bill of sight** = చూపుడు బిల్లు (దిగుమతిదారులు ఒక్కో సందర్భంలో కస్టమ్స్ శాఖ వారికి సరకు తాలూకు వివరాలను బిల్ ఆఫ్ ఎంట్రీలో ఇవ్వకపోవచ్చు ఆ సమయంలో దిగుమతిదారులు "బిల్ ఆఫ్ సైట్" అనే ఒక ఫారాన్ని పూర్తి చేసి అధికారులకు పూచీగా చూపవలసి ఉంటుంది)

**Bills of exchange** = మారకపు బిల్లులు / వర్తకపు హుండీలు (మారకానికి సంబంధించిన)

**Bills Payable** = చెల్లింపు హుండీలు / బిల్లులు

**Biproduct** = ఉప ఉత్పత్తి, అనుబంధ ఉత్పత్తి (ఏకకాలంలో ప్రధాన వస్తు ఉత్పత్తితోపాటు మరోరకం వస్తువులు కూడా తయారవుతుంటే, వాటిని ఇలా పిలుస్తారు. ఉదా: చక్కెరకు అనుబంధ

ఉత్పత్తి మొలాసెస్)

**Black Capitualism** = నల్లవారి వ్యాపారం : బ్లాక్స్ యజమాన్యంలో నడిచే వ్యాపారాలను అమెరికాలో ఇలా అంటారు

**Black Friday** = స్టాక్ మార్కెట్ కుప్పకూలిన రోజును ఇలా అంటారు ఈ కల్లోలం ప్రపంచంలో మొదటిసారిగా 1869 సెప్టెంబర్ 24న (శుక్రవారం నాడు) వచ్చింది అప్పటినుంచి ఎప్పుడు స్టాక్ మార్కెట్‌లో తీవ్రమైన ఒడిదుడుకులు వచ్చినా "బ్లాక్ ఫ్రైడే"ను గుర్తు చేస్తుంటారు

**Black Friday** = స్టాక్ మార్కెట్ పరిభాషలో ఇది ఓ దుర్దినం స్టాక్ చరిత్రలో మార్కెట్ పరిస్థితి అస్తవ్యస్తంగా ఉండి సంక్షోభంలో చిక్కుకున్న రోజు 1869 సెప్టెంబర్ 24 1873, 1929, 1987 సంవత్సరాల్లో పెక్కు స్టాక్ మార్కెట్లు ఇలా పతనమయిన రోజు శుక్రవారం అప్పటినుంచీ ఇక్కడ ఎప్పుడు సంక్షోభం తలెత్తినా దాన్ని 'బ్లాక్ ఫ్రైడే'గానే పరిగణిస్తారు

**Black Market** = నల్ల బజారు / దొంగ మార్కెట్ / ప్రభుత్వ విధి నిషేధాలను ఉల్లంఘించి జరిపే క్రయ విక్రయాలకు బ్లాక్ మార్కెట్ అని పేరు

**Black Market** = నల్ల బజారు:

**Black Money** = నల్లడబ్బు / అక్రమార్జన / గుప్త ధనం / దొంగ డబ్బు / వచ్చిన ఆదాయాన్ని పన్నులు ఎగవేసేంత ఆదాయం

**Blank Cheque** = ఖాళీ చెక్కు (డబ్బు మొత్తం పేర్కొనకుండా సంతకం మాత్రం చేసి ఇచ్చే చెక్కు)

**Blanket insurance** = సర్వ రక్షణ భీమా (అన్ని రకాల అపాయాలనుంచీ రక్షణకు ఉద్దేశించిన భీమా)

**Block grant** = అవిభక్త గ్రాంటు (ఫలానా పద్దు క్రింద విభజనగానీ, వివరణగానీ లేని గ్రాంటు)

**Blue Chips** = ప్రశస్తమైన షేర్లు: లాభాలు తీస్తున్న, సువ్యవస్థితమైన, సుప్రసిద్ధమైన కంపెనీల షేర్లను ఇలా అంటారు ఏళ్ళ తరబడి నిరంతరం ప్రగతి సాధిస్తున్న కంపెనీలకు ముందు ముందు మరింత పురోభివృద్ధి సాధించగల అవకాశాలుంటాయి ఈ మాట "కాసినోజూదం" (గాంబ్లింగ్) నుంచి పుట్టుకొచ్చింది ఆ జూదంలో వాడే పాచికలను "బ్లూ చిప్స్" అనే వాళ్ళు!

**Bond** = ప్రభుత్వంగాని, కంపెనీగానీ నిర్దిష్టమైన వడ్డీరేటుపైన సేకరించే ఋణానికి సంబంధించిన పత్రాన్ని ఇలా అంటారు నిర్దిష్టమైన తేదీన తిరిగి ఈ ఋణం చెల్లిస్తామని కూడా ఆ పత్రంలో హామీ పడతారు కంపెనీలు ఇచ్చే బాండ్స్‌ను డిబెంచర్లు అంటారు కంపెనీ అనుమతించే ఫిక్స్‌డ్ డిపాజిట్లకు భిన్నంగా కంపెనీ ఆస్తులను తనఖాపెట్టి సెక్యూరిటీ డిబెంచర్లు ఇస్తారు కాగా కంపెనీల ఫిక్స్‌డ్ డిపాజిట్లు "అన్ సెక్యూర్డ్" కాబట్టి ఇలా చేస్తారు

**Bonus Issue** = బోనస్ ఇస్యూ : కంపెనీలు రిజర్వు షేర్ల సంఖ్యకు దామాషా లెక్కన ప్రస్తుత షేర్ హోల్డర్లకు కంపెనీ షేర్లను ఇవ్వడాన్ని 'బోనస్ ఇస్యూ' అంటారు

**Bonus Issue** = షేర్ హోల్డర్ల మధ్య పంపిణీకి వీలుగా కంపెనీ వద్ద పేరుకున్న లాభాలను 'ఫ్రీ రిజర్వ్స్' అంటారు ఇలాంటి రిజర్వులు హెచ్చుగా వున్నప్పుడు కంపెనీ ప్రస్తుతపు వాటాదార్లకు బోనస్ షేర్లు ఇవ్వడం ద్వారా కంపెనీ ఆ రిజర్వులలో కొంత భాగాన్ని పెట్టుబడిగా ఉంచుకొని, ఆ రిజర్వులను ఈక్విటీగా మార్చుకొంటుంది ఎలాంటి ఖర్చు లేకుండానె బొనస్ షేర్లను కంపెనీ విడుదల చేస్తుంది షేర్ హోల్డర్ల సంఖ్య పెరగదు కాబట్టి బోనస్ షేర్ల వల్ల కంపెనీపై షేర్ హోల్డర్ల యాజమాన్య బలం పెరగదు బోనస్ షేర్లు ప్రకటించిన తర్వాత కంపెనీ వాటా 'ఇస్యూ'ను బట్టి దామాషాన కంపెనీ షేరు తగ్గుతుంది అయితే డివిడెంట్ రేటు మాత్రం తరచు యధాతథంగానే వుంటుంది

**Book keeping** = ఖాతా నిర్వహణ

**Book Value / Written Value** = (చిరా విలువ / లిఖిత మూల్యం) ఆస్తి అప్పులపట్టీ చూపెట్టే కంపెనీ ఆస్తి పాస్తుల విలువను 'బుక్ వాల్యూ' అంటారు 1 వాడకం వల్ల యంత్రాలు వగైరా ఆస్తి తరుగుతూంటుంది (డెప్రిసియేషన్) కాబట్టి ప్రతి సంవత్సరం ఈ బుక్ వాల్యూ తక్కువగా ఉంటుంది తరుగుదల రేటు పోనూ మిగిలిన ఖర్చులు వెరసి - ఆస్తి చిరా విలువ (బుక్ వాల్యూ) అవుతుంది. 2) అలాగే కంపెనీ షేర్ల నికర ఆస్తి విలువ కూడా ఈ వాల్యూలో భాగమే కంపెనీ మొత్తం ఆస్తులలోనుంచి కంపెనీ

ప్రస్తుత అప్పుల్ని దీర్ఘకాలిక అప్పుల్నీ, ప్రిఫరెన్స్ షేర్లనూ తీసి వెయాలి అప్పుడు మిగిలేదల్లా షేర్ హోల్డర్ల 'పండు' ఈ నిధిని విడుదల చేసిన షేర్ల సంఖ్యతో భాగించితే వచ్చే షేర్ బుక్ వాల్యూగా పరిగణించాలి

**Book-rate** = ఖాతా దాఖలా రేటు

**Boom** = షేర్ మార్కెట్ ఉచ్ఛ స్థితిః షేర్ ధరలు పెరిగిపోయిన దశను ఇలా అంటారు ఇది "స్లంప్" (పతన దశ)కు పూర్తి విరుద్ధం ఉచ్చ దశ తరమగా ఆకస్మికంగా, అర్ధాంతరంగా ముగిసిపోతుంది

**Booty** = దోపిడి ధనం

**BOP** = వాణిజ్య చెల్లింపుల పద్దు విదేశాలనుంచి ఎచ్చే దిగుమతులకు సమంగా విలువనూ దేశీయ ఎగుమతుల విలువనూ మదింపు వేసే పద్ధతీ, అంతర్జాతీయంగా చెల్లించవలసిన ఇతర రుణాలూ వగైరా ద్రవ్య లావాదేవీల మదింపు పద్ధతి ఈ లావాదేవీలను సంవత్సర కాలంలో మదింపు వేస్తారు

**Bourse** (బోర్స్) = స్టాక్ ఎక్స్చేంజీకి ఇది మారుపేరు, ముఖ్యంగా ఫ్రాన్స్‌లో ఇలా అంటారు

**Break even point** = లాభనష్టాలు లేని స్థితి

**Broker** (బ్రోకర్) = ఇతను స్టాక్ ఎక్స్చేంజీ సభ్యుడు తన క్లయింటు తరఫునగానీ, తన తరఫున గానీ షేర్లను కొనడానికి లేదా అమ్మడానికి లైసెన్స్ పొందే వాడిని "బ్రోకర్" అంటారు కుదిర్చే "డీల్స్" నిరకరమైన విలువపైన ఇతను కమిషన్ (బ్రోకరేజి) తీసుకుంటాడు

**Broker** = దళారి

**Brokerage** = దళారి రుసుము

**Bucaneer / buccaneer (pirate)** = ఓడదొంగ / సముద్రపు దొంగ

**Budget-grants** = బడ్జెట్ గ్రాంట్లు (సొమ్ము మంజూరు చేసే పద్దులు)

**Budget** = ఆదాయ వ్యయ పట్టిక

**Bull** = షేర్ ధర పెరిగి తీరుతుందన్న ఆశతో షేర్లను ముందు ముందు ఎక్కువ ధరకు, లాభానికి అమ్ముకోవచ్చునని స్టాక్ మార్కెట్ ఆపరేటర్ విశ్వాసం. "బుల్" ఆ షేర్లను మార్కెట్‌లో బలవంతంగా కొనుగోలు చేయించి షేర్ ధరలను పెంచివేయడం జరుగుతుంది "ఇది పొగరబోతు పోట్లగిత్తరా" అంటారే అలాంటి ఆబోతే ఈ "బుల్" అందుకే ఆ పెరు ఈ ఆపరేటర్‌కు ఎచ్చింది

**Bullish tendency** = ధరలు పెంచే ధోరణి

**Bumper Profit** = విశేష లాభం / అదిక లాభం

**Business** = వ్యాపారం (లాభార్జన కోసం చేసే వ్యాపకం)

**Buy-Back** (బై బ్యాక్) = కంపెనీలుగాని లేదా బ్యాంకులుగానీ నిర్దిష్టమైన సమయంలో డిస్కౌంట్‌పై గాని లేదా సమాన ధర చెల్లించిగాని కన్వర్టిబుల్ లేదా నాన్ కన్వర్టిబుల్ డిబెంచర్లను తిరిగి కొనుగోలు చేయడాన్ని ఇలా అంటారు కంపెనీలు షేర్‌ల విక్రయదార్లను సాధ్యమైనంత దూరంగా ఉంచడానికి రకరకాల పద్ధతులను అనుసరిస్తారు కాబట్టి డిబెంచర్ షేర్లను "తిరిగి కొంటాం" (Buy-Back) అని చేసే వాగ్దానాలను అంతగా పట్టించుకోకూడదని నిపుణుల సలహా

**c) Petrodollar** (పెట్రో డాలర్) = పెట్రోలియం ఉత్పత్తి చేసే దేశాలకు చెల్లించే అమెరికన్ డాలర్లను, విదేశీ బ్యాంకులు చెల్లించే డాలర్లను ఇలా అంటారు

**Buyer** = కొనుగోలుదారు (వినిమయం కోసం కొనుగోలు చేస్తే **Buying** అనే తిరిగి అమ్మాలని కొనుగోలు చేస్తే **Purchase** అని అంటుంటారు )

**Call Money** = కంపెనీ అడిగిందే తడవుగా కొత్త ఇస్యూలకు (షేర్లకు) వాయిదాల పద్ధతిపైన చేసే చెల్లింపును "కాల్‌మనీ" అంటారు వాయిదా చెల్లింపులన్నీ పూర్తి అయినప్పుడు "షేర్" విలువను పూర్తిగా చెల్లించినట్లు ప్రకటిస్తారు అప్పుడు కంపెనీ ముద్రకోసం షేర్ హోల్డర్లు కాల్ మనీ చెల్లింపు ధృవ పత్రాన్ని కూడా జోడించి సర్టిఫికేట్లను కంపెనీకి పంపిస్తారు

**Call money (money on call)** 'కాల్ మనీ' = (అప్పుగా ఇచ్చిన డబ్బు బ్యాంకుల మధ్య ఈ లావాదేవీ జరుగుతుంటుంది అలా తీసుకున్న తాత్కాలిక అప్పును నోటీసుతో నిమిత్తం లేకుండానే అడిగినదే తడవుగా ఇచ్చివేయాలని ఏ బ్యాంకి నుంచి తీసుకుంటే ఆ బ్యాంకిని డిమాండ్ చేయడం ఇందులో విశిష్టత

**Call option** = ప్రీమియం కోసం షేర్ల మారకంః నిర్దిష్ట సమయంలో నిర్దిష్టమైన ధరకు నిర్దిష్టమైన షేర్లను

(ప్రీమియమ్ రేటు) మారకం వైపుకొనే హక్కును "కాల్ ఆప్షన్" అంటారు

**Called up Capital** = పిలిచిన షేర్ మూలదనం

**Capital Account** = మూలదనపు ఖాతా

**Capital** = మూలధనం : వ్యాపార నిమిత్తం కంపెనీ పెట్టే డబ్బును కాపిటల్ అంటారు ఈ మూలదనం రెండు మార్గాల ద్వారా వస్తుంది 1 షెర్లు ప్రకటించడం ద్వారా 2 ఋణాల ద్వారా కాపిటల్ సేకరణకు అనుమతించిన గరిష్ట పరిమితిని ఆథరైజ్డ్ కాపిటల్ అంటారు ఇందులో షేర్ల అమ్మకం ద్వారా సమకూడే గరిష్ట పరిమితిని వాటా ధనం / షేర్ కాపిటల్ అంటారు కంపెనీ అమ్మజూపే అనేక షేర్లను కంపెనీ 'ఇస్యూడ్ కాపిటల్' (జారీ చేసిన మూలధనం) అంటారు ఈ పెట్టుబడిలో షేర్ హోల్డర్లు అన్ని షేర్లను లేదా అందులో కొంత భాగాన్నికొనుగోలు చేయొచ్చు ఈ పెట్టుబడి తర్వాత "సబ్‌స్క్రైబ్డ్ కాపిటల్"గా (బందీ అయిన మూలధనం) మారుతుంది ఈ పెట్టుబడి "చెల్లించిన వాటాధనం" (Subscribed capital)గా మారిపోతుంది దీనినే మరో మాటలో 'పైడప్ కాపిటల్' (చెల్లించిన మూలధనం) అంటారు

**Capital expenditure** = పెట్టుబడి వ్యయం (క్రయ విక్రయాలకు సంబంధం లేని ఖర్చు)

**Capital flight** = వలస మూలధనం : పెట్టుబడి పెట్టడానికి సానుకూలమైన వాతావరణాన్ని వెతుక్కుంటూ ఒక దేశంనుంచి మరో దేశానికి లేదా దేశంలోనే ఒక రాష్ట్రం నుంచి మరో రాష్ట్రానికి పెద్ద మొత్తాల్లో తరలిపోయే మూలధనాన్ని ఇలా అంటారు పెట్టుబడులు ఇలా తరలిపోవడం రాజకీయ అస్థిర పరిస్థితుల వల్ల, ఇన్‌ఫ్లేషన్ వల్ల, కార్మిక అశాంతివల్ల, సైనిక నియంతృత్వం లేదా దౌర్జన్యకాండవల్ల జరుగుతుంది

**Capital gains** = పెట్టుబడి లాభాలు : విలువ పెరిగిన ఆస్తుల అమ్మకాలపై వచ్చిన లాభాలను ఇలా అంటారు భూములు, బిల్డింగ్‌లు, షేర్లు లాంటి ఆస్తులను వాటి హక్కు భుక్తం చేసుకొన్న ఏడాదిలోగా అమ్మినప్పుడు వచ్చిన లాభాన్ని వర్తమాన ఆదాయంగా పరిగణించి దానిపై పూర్తి పన్ను విధిస్తారు ఒకవేళ ఆస్తులను సంపాదించిన ఏడాదిలోగా లాభాలు వస్తే, సదరు లాభాలను దీర్ఘకాలిక పెట్టుబడి లాభాలుగా జమకడతారు

**Capital goods** = పెట్టుబడి వస్తువులు (తిరిగి వస్తువుల తయారీకి ఉపయోగపడే వస్తువులు ఉదా: యంత్రాలు)

**Capital Loss** = పెట్టుబడి నష్టం (క్రయ విక్రయాలతో సంబంధం లేకుండా ఎచ్చే నష్టం)

**Cash Cow** = నిరంతరం హెచ్చు డివిడెండ్లు ఇవ్వగల షేర్‌ను (స్క్రిప్) ఇలా అంటారు అంటే 'డబ్బులు తెచ్చిపెట్టే పాడి ఆవు' అన్నమాట

**Cash flow** = యంత్రాల అరుగుదల, తదితర నాన్-క్యాష్ చార్జీలు మినహాయించగా మిగిలిన నికరాదాయాన్ని ఇలా పిలుస్తారు ఇన్‌వెస్టర్లకు ఇది ఒక ప్రధానమైన అంశం ఎందుకని? క్రమం తప్పని క్యాష్‌ఫ్లో వల్ల కంపెనీ రెగ్యులర్‌గా షేర్ హోల్డర్లకు డివిడెండ్లు పంచగల్గుతుంది

**Certificate of Commencement of business** = వ్యాపార ప్రారంభ ధ్రువ పత్రం

**Certificate of incorporation** = సంస్థాపన పత్రం

**Chain Store** = గొలుసు విక్రయశాల (ఒకే సంస్థ వలు ప్రాంతాలలో ఒకే రకం వస్తువులను అమ్మజూపడానికి వ్యాపారశాలలు తెరిస్తే వాటిని ఇలా పిలుస్తారు ఉదా: 'బాటా' చెప్పుల షాపులు)

**Cheap Money** = సులభ రుణం : రిజర్వు బ్యాంకు నిర్ణయించిన తక్కువ వడ్డీరేట్లకు సులభంగా కల్పించే రుణ సౌలభ్యం ఈ సులభ రుణం పరిశ్రమాభివృద్ధికి దోహదం చేస్తుంది పెట్టుబడులను ప్రోత్సహించడానికి తగిన వాతావరణాన్ని కల్పిస్తుంది

**Chiminage** = అడవిదారి పన్ను

**Civilian goods** = పౌరావసర వస్తువులు

**Clearing House** = ఋణ పరిష్కార సంస్థ

**Close - end Credit / Consmencredit** = నియత / పరిమిత పరపతి : వ్యక్తిగత కుటుంబం / ఇంటి అవసరాలకోసం ఒక వ్యక్తికి సకాలంలో డబ్బు / ఆస్తి / సర్వీసు అందజేయడం. వివరంగా చెప్పాలంటే

సంపతి సాకర్యం కల్పించడం

**Collateral** = తనఖా భద్రత : ఋణం కావాలంటే అందుకు దన్నుగా ఏదో ఒక సెక్యూరిటీ చూపాలి దాన్నే "కొల్లేటరల్" అంటారు కంపెనీలు పొందే డిబెంచర్లను ఇతర రకాల పరపతినీ తరచుగా కంపెనీ స్టాక్స్ ఆస్తులుగా తాకట్టు పెట్టటం, అలా తనఖా పెట్టించుకోడం ద్వారా రుణానికి సెక్యూరిటీ ఇవ్వడం

**Collateral Security** = అదనపు పూచీ / హామీ

**Collateral Security** = పూచీకత్తు : తీసుకున్న రుణంపై ఇచ్చే సెక్యూరిటీ ఇది బ్యాంకు ఇచ్చే రుణం కంటే హెచ్చు విలువగల ఆస్తిని తరచుగా తాకట్టుపెట్టుకోవడం ఈ సెక్యూరిటీ విశేషం

**Collation** = సమపంపిణీ (ఆస్తి సం॥)

**Commerce** = వాణిజ్యం (సరకుని ఉత్పత్తి దారుడినుంచి వినియోగదారుడి వరకూ చేర వేయడంలో ఇమిడి వున్న సేవల మొత్తాన్ని వాణిజ్యం అంటారు)

**Commercial Paper (CP)** = స్వల్పకాలిక రుణ పత్రం : ఈ పత్రం కాల పరిమితి (మెచ్యూరిటీ పీరియడ్) 2 నుంచి 270 రోజుల వరకూ ఉంటుంది ఈ రుణ పత్రాన్ని బ్యాంకులు, సంస్థలు, తదితర రుణ గ్రహీతలు ప్రకటిస్తారు ఇన్‌వెస్టర్ల వద్ద ఎదుగు బొదుగూ లేకుండా మూలుగుతున్న సోమరి పెట్టుబడిని ఆకర్షించడం - ఈ రుణ పత్రం లక్ష్యం ఇలాంటి రుణం డిస్కౌంట్‌పైనగాని లేదా బ్యాంకులిచ్చే రేట్లకంటే తక్కువ వడ్డీకిగానీ దొరుకుతుంది

**Commodity** = వస్తువు (ఆర్థిక పరిభాషలో తయారయిన వస్తువును ఇలా పిలుస్తారు)

**Compound Interest** = చక్రవడ్డీ

**Concept of Contract** = కాంట్రాక్టు పద్ధతి (భావన) (మనుస్మృతిలో 'కాంట్రాక్టు'కు సరిసమానమైన పదం 'సంవిత్' అని ఉంది ఐత్ అంటే ధనం విత్త విధానం ధన సంబంధమైన లావాదేవీలకు, ఒప్పందాలకు సంబంధించిన భావన అని అర్థం 'సంవితే భావన')

**Consumer Capitalism** = ప్రయివేట్ రంగంలోగానీ లేదా ప్రయివేటీకరణ జరిగిన రంగాలలో గానీ షేర్లను కొనేటట్టుగా పౌరులను ప్రోత్సహించే విదానాన్ని ఇలా అంటారు ఈ పద్ధతిని 1980లో బ్రిటన్‌లో నాటి ప్రదాని మార్గరెట్ దాచర్ ప్రవేశపెట్టింది

**Consensus ad idem** = ఉభయత్రా అంగీకారం **(Identity of minds)**

**Consideration** = ప్రతిఫలం

**Consignment** = రవాణా చేసే సరకు (కమీషన్ మీద అమ్మమని వేరే ప్రాంతపు ఏజెంటుకు సరకు పంపడాన్ని ఇలా అంటారు సరకు పంపిన వ్యక్తిని Consignor అనీ, ఏజెంట్‌ని Consignee అని కూడా అంటారు)

**Consolidated fund** = ఏకీకృత నిది

**Conspicuous Consumption** = కానరాని వాడకం / అవసరం లేకపోయినా డాంబికంగా కనపడ్డం కోసం విలాస వస్తువులపై ఖర్చు చేయడాన్ని 'విశిష్ట భోగం' అంటారు 'కానరాని విలాస వాడకాలు'గా అర్థం చెప్పుకోవచ్చు

**Consumer** = వినియోగదారుడు (ధర చెల్లించి నేరుగా వస్తుసేవలను పొందే వ్యక్తి)

**Consumer goods** = వినియోగ వస్తువులు (నేరుగా వినిమయం చేయగల వస్తువులు)

**Consumer Interest** = వినియోగదార్ల ప్రయోజనం / శ్రేయస్సు

**Contango** = దీనిని ఇండియన్ స్టాక్ ఎక్స్చేంజీలలో "సీదా బాద్లా" అని కూడా అంటారు షేర్ ధర పెరుగుతుందన్న ఊహపై "బుల్" ఆ షేర్‌ను కొంటాడు కాని, అక్కౌంటిక్ పీరియడ్ ఆఖరికి సదరు షేరు ధర పెరగకపోతే "బుల్" ఆ షేర్లకు డబ్బు చెల్లించి వాటిని సొంతం చేసుకుంటాడు లేదా విక్రయదారుకు అదనపు పరిహారంగా చార్జీలు చెల్లించి (Carryover Charges) ఆ పై అక్కౌంటిక్ పిరియడ్‌కు బదలాయించనైనా బదలాయిస్తాడు ఈ "క్యారీ ఓవర్ చార్జెస్" నే "సీదా బాద్లా" అంటారు

**Contraband** = దొంగసరకు : చట్ట విరుద్ధంగా సాగించే సరకుల ఎగుమతి - దిగుమతులు, వాటిని కొనడం కూడా ఉల్లంఘన అవుతుంది

**Contract Note** = కాంట్రాక్టు పత్రం : షేర్ల

కొనుగోలుకు సంబంధించిన లావాదేవీలు పూర్తి అయిన అనంతరం క్రయిదారుని బ్రోకర్ పంపించే బిల్లును ఇలా పిలుస్తారు అందులో ఏ రేటుకు షేర్లు కొన్నదీ, ఎన్ని షేర్లు కొన్నదీ, కమీషన్ చార్జీలు, బ్రోకర్‌కు రావలసిన మొత్తం డబ్బు, నమోదై ఉంటాయి

**Convertible** = స్వేచ్ఛగానూ, పూరాగానూ సాగించే మారకం

**Convertible Currency** = స్వేచ్ఛా మారక ద్రవ్యం : ఒక దేశం కరెన్సీని మరొక దేశం కరెన్సీలోకి స్వేచ్ఛగా మార్చుకోగలగడం ఇతర దేశాల కరెన్సీలను కొనుక్కునేందుకు దేశీయ కరెన్సీని పూర్తిగా వినియోగించడానికి ప్రభుత్వం అనుమతిస్తేనే దేశీయ కరెన్సీని మారకం వేసుకో వీలవుతుంది అలాగాకుండా పౌరులుగానీ, లేదా ఇక్కడ పర్యటనకు వచ్చి మన కరెన్సీని వాడుకొనే విదేశీయులుగానీ అనుమతించిన కార్యకలాపాలకు తప్ప లేదా పరిమిత మొత్తాలలో తప్ప విదేశీ మారక ద్రవ్యాన్ని కొనుగోలు చేయరాదని ప్రభుత్వం ఆదేశించినప్పుడు కరెన్సీ మారకం సాధ్యపడదు కన్వర్టిబుల్ కరెన్సీకి మరో అర్థం కరెన్సీని బంగారానికిగాని లేదా మరో విలువైన లోహానికిగాని మారకం వేసుకోవచ్చు అని కూడా

**Convertible debenture** = షేర్ల రుణ పత్రం : దీనిని మొదట్లో బాండ్ రూపంలో ఇస్తారు అంటే కంపెనీకి ఇచ్చే రుణంగా దీన్ని పరిగణిస్తారు తర్వాత నిర్ణీత తేదీకి ఈ రుణంలో కొంత భాగాన్నిగాని లేదా మొత్తం రుణాన్నిగానీ షేర్లుగా మారుస్తారు షేర్ల రూపంలోకి మార్చిన డిబెంచర్లలో కొన్నింటికి డివిడెంట్ వస్తుంది కన్వర్ట్ చేయని డిబెంచర్లపైన (non-convertible) వడ్డీ వస్తూ ఉంటుంది

**Cooking the Book** = తారుమారు చిరా : ఒకవైపున షేర్ హోల్డర్లను కృత్రిమంగా సంతోషంగా ఉంచుతూ, అత్యధిక లాభాలు వస్తాయని భ్రమలు గొల్పుతూ ఇన్‌వెస్టర్లను ఆకర్షించేందుకు కంపెనీ అక్కౌంట్లను తారుమారు చిరాగా చూపించే యత్నం ఇందులో భాగమే కొన్ని ఖర్చులను దాచడం, అప్పులను చూపకుండా ఉండడం, వగైరా.

**Core Competency** = నిర్వహణ సామర్థ్యం (సంస్థ సౌష్ఠవం, నిర్వాహకుల పనిసామర్థ్యం, వగైరా సమర్థతలన్నీ కలిసి నిర్వహణ సామర్థ్యంగా పరిగణిస్తారు)

**Cost - accounting** = ఉత్పత్తి ఖరీదు కట్టే పద్ధతి

**Cost - control** = ఉత్పత్తి విలువను నియంత్రించడం

**Cost - estimation** = ఉత్పత్తి విలువ అంచనా

**Cost - finding** = ఉత్పత్తి విలువను కనుక్కోడం

**Cost - Push Inflation** = ఉత్పత్తి ఖర్చులు పెంచే ఇన్‌ఫ్లేషన్ : ఉత్పత్తి ఖర్చులు పెరిగినప్పుడు వచ్చే ఇన్‌ఫ్లేషన్‌ను ఇలా పిలుస్తారు వస్తువు గిరాకీకి ఈ ఖర్చులు పెరుగుదలకూ సంబంధం ఉండదు

**Cost of Living Index** = జీవన వ్యయ సూచీ: సరకులు సర్వీసుల ధరవరల స్థాయిని చూపే సూచీ ఇది వేతనాలపైన నోట్ల ముమ్మరం (ఇన్‌ఫ్లేషన్) ప్రభావాన్ని తగ్గించడంకోసం వేతనాలలో సర్దుబాట్లు చేసేందుకు ఈ సూచీని తరచుగా వినియోగిస్తారు దీన్ని ప్రతి నెలా భారత ప్రభుత్వ కార్మిక శాఖ ప్రకటిస్తూంటుంది 1989 దాకా ఈ సూచీకి ఆధార సంవత్సరంగా 1960ని ఎంచుకున్నారు ఆ తర్వాత ఆధార సంవత్సరాన్ని 1982గా ప్రకటించారు ఇది దేశ వ్యాపిత ధరవరల సాధారణ సూచీ అయినప్పటికీ, అన్ని రకాల వేతన వివాదాలలో పరిష్కారాలలో ఈ సూచీ ప్రాధాన్యత వహిస్తూంటుంది

**Coupon** (కూపన్) = రుణ పత్రానికి లేదా ఒక బాండ్ పత్రానికి లేదా ఒక డిబెంచర్ పత్రానికి వెంట వుండే ఒక చీటీ (స్లిప్) ఇది ఆ "స్లిప్"ను కంపెనీకి లేదా బ్యాంకుకి చూపించిన వెంటనే షేర్ హోల్డర్‌కు వడ్డీ లేదా డివిడెండ్ ఇస్తారు బాండ్‌ను అంటిపెట్టుకునే ఈ కూపన్ షీటు ఉంటుంది కూపన్‌లకు వర్తించే వడ్డీరేటునే "కూపన్ రేట్" అంటారు

**Creditor's ledger** = రుణదాతల ఆవర్జా

**Credit Rating** = కంపెనీ సెక్యూర్డ్ /అన్ సెక్యూర్డ్ రుణాలపై చెల్లించవలసిన వడ్డీలు వగైరా బకాయిలను కంపెనీ క్రమం తప్పకుండా చెల్లించగల స్థితిలో ఉందా లేదా అని కంపెనీ శక్తి సామర్థ్యాలను అంచనా వేయడాన్ని

ఇలా అంటారు అలాంటి మదింపు సంస్థ 'క్రిసిల్'

**CRISIL (Credit Rating Information Services of India)** = సంపత్తి తీటిమానం మదింపు సంస్థ : దీనిని యూనిట్ ట్రస్ట్, ఇండస్ట్రియల్ క్రెడిట్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ కార్పొరేషన్, జనరల్ ఇన్సూరెన్స్ కార్పోరేషన్, లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్, ఏషియన్ డెవలప్‌మెంట్ బ్యాంకు కలిసి ఉమ్మడిగా నెలకొల్పాయి 1988 నుంచీ "క్రిసిల్" పనిచేస్తోంది డిబెంచర్లు, పబ్లిక్, ప్రయివేట్ రంగాల కంపెనీలలోని ఫిక్స్‌డ్ డిపాజిట్లు లాంటి రుణ పత్రాలపై వడ్డీ చెల్లింపులు సక్రమంగా జరుగుతున్నాయా లేదా, వాటికి భద్రత ఉందా లేదా అన్న అంశాలను "క్రిసిల్" మదింపు వేస్తుంది అదే "రేటింగ్" అకారాదిగా రేటింగ్ గుర్తులు ఉంటాయి డిబెంచర్లకు 'డి' గుర్తు, ఫిక్స్‌డ్ డిపాజిట్లకు 'యఫ్' గుర్తు ఉంటుంది 'ఎఎఎ' రేటింగ్ అంటే - తిరుగు లేని భద్రత అనీ, 'ఎఎ' అంటే హెచ్చు భద్రత అనీ, 'ఎ' అంటే తగు మాత్రపు భద్రత అనీ, 'బి' అంటే చాలీ చాలని భద్రత అనీ, 'సి' అంటే చెల్లింపు కష్టమనీ, 'డి' అంటే దివాళా స్థితి అనీ, ఇలా రేటింగ్‌ను విభజించారు కంపెనీలు తమ స్థితిగతులను మదింపు వేసుకోడానికి స్వచ్ఛందంగా కూడా "క్రిసిల్" రేటింగ్‌ను కోరుకోవచ్చు

**Current / Floating assets** = అస్థిర ఆస్తులు

**Customer** = ఖాతాదారు (అలవాటుపడ్డ వినియోగదారుడు)

**Customs** = సుంకాలు = దేశంలోకి వచ్చే దిగుమతులపైన విదేశాలకు పంపే ఎగుమతులపై విధించే పన్ను వీటినే డ్యూటీ అన్నా, టారిఫ్ అన్నా కూడా ఇవే దీనిని కేంద్రం విధిస్తుంది

**Dalal Street** = దలాల్ స్ట్రీట్ : బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజీని (B S E ) ఇలా పిలుస్తారు ఈ ఎక్స్ఛేంజీకి మరో పేరు జీజీభాయి టవర్స్

**Day book (Journal)** = చిఠా / దినవహి

**Debt trap** = రుణాల ఊబి : కంపెనీ నిర్వహణ అసంతృప్తిగా ఉన్నప్పుడు ఎంత పెద్ద కంపెనీ అయినా రుణాల ఊబిలో చిక్కుకొనక తప్పదు భారీ రుణంపైన వడ్డీ చెల్లింపుల వల్ల కంపెనీకి ఎలాంటి లాభంగానీ లేదా నిర్వహణకు అవసరమైన క్యాష్‌గానీ ఉండకపోవచ్చు ఫలితంగా కంపెనీ మరింతగా రుణం చెయవలసి వస్తుంది ఈలాగా ఆకస్మికంగా కంపెనీ కొలుకుంటె తప్ప రుణాల ఊబి కంపెనీ మూతకు దారి తీయెుచ్చు అప్పుడు రుణ దాతలు మరిన్ని రుణాలివ్వడానికి పెట్టే దారుణమైన అవమానకరమైన షరతులకు కంపెనీ లొంగిపోవలసి వస్తుంది.

**Death Duty** = మరణ సుంకం

**Debenture Capital** = ఋణపత్ర మూలధనం

**Debit note** = ఖర్చు పత్రం (క్రయదారుని పద్దు పుస్తకంలో విక్రయదారుని ఖాతాకు ఖర్చు వ్రాసుకోవడం)

**Debt-Equity Ratio** = చేసిన రుణానికి, పెట్టిన ఈక్విటీ పెట్టుబడికీ ఉన్న నిష్పత్తిపై ఆధారపడి కంపెనీ ప్రగతిగానీ దివాళాగానీ ఆధారపడి వుంది దీనినే అమెరికాలో "లెవరేజ్ రేషియో" అంటారు ఈ డెట్ - ఈక్విటీ నిష్పత్తిని మూడు పద్ధతులలో అంచనా వేస్తారు: 1 కంపెనీ మొత్తం రుణాలను షేర్ హోల్డర్లు ఈక్విటీ పెట్టుబడితో విభజించడం, 2 మొత్తం దీర్ఘకాలిక అప్పును షేర్‌హోల్డర్ల ఈక్విటీతో భాగించడం, 3 మొత్తం దీర్ఘకాలిక రుణాల్ని ప్రిఫరెన్స్ షేర్ల మౌలిక విలువనూ (పార్ వాల్యూ) ఈక్విటీ షేర్ల మౌలిక విలువతో భాగించడం ఈ మూడు రకాల నిష్పత్తులూ కంపెనీ సౌష్ఠవానికి గీటురాళ్ళు

**Debt trap** = అప్పుల ఊబి

**Debtor's ledger** = రుణగ్రస్తుల ఆవర్జా

**Deferred Payments :** వాయిదా పద్ధతిపై చెల్లింపులు

**Deflation** = ధరల పతనం : ఇది ఇన్‌ఫ్లేషన్‌కు విరుద్ధం జాతీయ ఆదాయంలో జాతీయ వస్తూత్పత్తిలో పతనదశను 'డిఫ్లేషన్' అంటారు ఇది ధరలు పడిపోవడం వల్ల సంభవిస్తుంది దిగుమతులు తగ్గిపోయి, పన్నులు పెరిగి, వడ్డీ రేట్లు పెరగడం వల్ల ఈ స్థితి వస్తుంది ఈ పరిస్థితులలో స్టాక్ మార్కెట్ కూడా ఆర్థిక మాంద్యం వల్ల దెబ్బతింటుంది.

**Demand - Pull inflation** = గిరాకీ ఇన్‌ఫ్లేషన్ : ఉత్పత్తి ఖర్చులలో పెరుగుదలకన్నా సరకు గిరాకీ వల్ల పెరిగే ఇన్‌ఫ్లేషన్‌ను ఇలా అంటారు

**Demand** = గిరాకీ, డిమాండ్ (వస్తువులను కొనాలనే ఆసక్తి, కొనుగోలు శక్తి ప్రజలకుంటే, అలాంటి వస్తువులకు డిమాండ్ వుందని చెబుతారు)

**Demonitization** = కరెన్సీ ఉపసంహరణ : చెలామణిలో వున్న కొన్ని కరెన్సీ నోట్లను (ఉదా: రూ 500/-, 1000 నోట్లను) సర్క్యులేషన్ నుంచి ఉపసంహరించడం కరెన్సీ మారకం విలువలో కోత పెట్టడాన్ని 'డీవాల్యుయేషన్' అంటారు డీవాల్యుయేషన్ వల్ల ఎగుమతి - దిగుమతుల పరిస్థితి తారుమారవుతుంది

**Departmental Store** = విభాగ విక్రయశాల / సకల వస్తు విక్రయశాల (ఒకచోట పలు రకాల వస్తువులను అందుబాటులో వుంచే వ్యాపారశాల ఉదా: సూపర్ బజార్లు )

**Depreciation allowance** = అరుగుదల / తరుగుదల ఖర్చు

**Depression** = సంక్షోభం ఒడిదుడుకు : దేశ ఆర్థిక కార్యకలాపాల్లో పెద్ద ఒడిదుడుకును 'డిప్రెషన్' అంటారు ఈ పరిస్థితి లక్షణాలు : ధరలు పడిపోవడం, డిమాండ్‌కు మించిన సరకుల సరఫరా, ఆర్థిక కార్యకలాపాల స్తంభన, నిరుద్యోగం పెరుగుదల, ఫలితంగా సర్వత్రా సంక్షోభం, స్టాక్ మార్కెట్లకు కుదుపు

**Derivatives** (డెరివేటివ్స్) = క్లిష్టమైన ఇన్వెస్ట్ మెంట్స్‌ను ఇలా అంటారు ఈ రకమైన మదుపుల లేదా పెట్టుబడుల విలువ స్టాక్స్ పైన, బాండ్స్ పైన, సరుకులపైన, కరెన్సీలపైన, తదితర ద్రవ్య సాధనాలపైన ఆధారపడి ఉంటుంది కొన్ని సందర్భాల్లో ఈ డెరివేటివ్స్ 'రిస్క్'లో పడతాయి ఉదాహరణకు 1994లో వడ్డీ రేట్లు ఆకస్మికంగా పెరిగిపోయేసరికి పెక్కుమంది ఇన్వెస్టర్లు చాలా నష్టపోవలసి వచ్చింది ద్రవ్య సాధనాలకు మారుగా డెరివేటివ్స్ పైన మాత్రమే ఆధారపడి లావాదేవీలు సాగించినప్పుడు ఈ 'రిస్క్' తప్పదు

**Devaluation** = కరెన్సీ విలువ కోత : ఇతర దేశాల కరెన్సీ మారకం విలువను బట్టి ఒకదేశం కరెన్సీ (ఉదా: రూపాయి) మారకం విలువను కోత పెట్టుకోవడాన్ని ఇలా అంటారు విలువ కోల్పోయిన కరెన్సీ హెచ్చు మారకం రేటులో అమ్ముడుపోతుంది (అంటే పోటీ కరెన్సీలో మనం ఎక్కువ రూపాయలు చెల్లించుకోవలసి వస్తుంది ) అలాగే విలువ తగ్గిన కరెన్సీకి మనంకొనే సరుకులు కూడా తక్కువే వస్తాయి డీవాల్యుయేషన్ వల్ల ఎగుమతులు పెరుగుతాయని నమ్మకం ఎందుకని? కరెన్సీ విలువను కోతపెట్టుకున్న దేశపు సరుకులు చౌకగా లభిస్తాయి కాబట్టి కాగా డీవాల్యుయేషన్ వల్ల దిగుమతుల రేటు విలువ పెరిగిపోతుంది దేశ వర్తకం, పరిశ్రమాభివృద్ధిపైన దాని ప్రభావం ఉంటుంది స్టాక్ మార్కెట్ దెబ్బతింటుంది 1966లో భారత కరెన్సీ డీవాల్యుయేషన్‌కు మొదటిసారిగా నాటి ప్రధాని ఇందిరాగాంధీ అనుమతించారు శ్రీశ్రీ భాషలో 'డీవాల్యుయేషన్' అంటే "దీవాళా యేషం"!

**Discount** = వట్టం / ముదరా

**Disinflation** = ధరల (పెరుగుదలలో) మాంద్యం: ఇది డిఫ్లేషన్ వల్లనే విధిగా రానక్కరలేదు కాని సరకులకు గిరాకీ మందగించడం వల్ల కూడా ధరల పెరుగుదలలో మాంద్యం రావచ్చు అమ్మకాలు ఒక మేరకు తగ్గిపోయి, కొనుగోలుదారులు హెచ్చు ధరలు చెల్లించడానికి ఇష్టపడనప్పుడు ఈ పరిస్థితి వస్తుంది

**Dividend** = డివిడెండు / లాభాంశం (కంపెనీ లాభాల్లో షేర్‌హోల్డర్‌కు పంచే భాగాన్ని ఇలా పిలుస్తారు)

**Documentary Bills** = పరపతి పూచీ పత్రాలు (సరకును ఎగుమతి చేసే వ్యక్తికి అవతల డబ్బు ముడుతుందన్న గ్యారంటీ కావాలి అందుకోసం దిగుమతి దారుడు ఎగుమతిదారుని దేశంలోని ఒక బ్యాంకిలో డబ్బు కట్టాలి ఆ పూచీ పత్రాన్ని ఇలా అంటారు )

**Double-Digit Inflation** = హెచ్చరిల్లిన ద్రవ్యోల్బణం : రెండంకెలలో ఇన్‌ఫ్లేషన్ కొనసాగడాన్ని ఇలా అంటారు - అంటే, 10 శాతం నుంచి 99 శాతం వరకూ ఉన్నప్పుడు ఇటీవల కాలంలో మన దేశంలో ఒక ఇన్‌ఫ్లేషన్ రేటు 14-15 శాతందాకా పెరిగింది కాని ప్రపంచబ్యాంకుని సంతృప్తి పరచడంకోసం కృత్రిమంగా ఈ రేటును (వినియోగదార్ల ధరల సూచీతో సంబంధం లేకుండా లెక్కలుగట్టి) ఒక్క అంకెలో (ఉ: 8శాతం) ఉండేటట్టు చూస్తున్నారు.

**Double entries** = జంట పద్దులు

**Double Taxation** = రెండుసార్లు పన్ను వసూలు

**"Drain theory"** = జాతివాదం : ఇతర దేశాలకు కొల్లగొట్టుకుపోవడాన్ని వివరించే సిద్ధాంతాన్ని ఇలా అంటారు దీని కర్త దాదాభాయి నౌరోజీ భారతదేశ దారిద్ర్యానికి బ్రిటీష్ వాళ్ళు ఎలా కారకులయ్యారో సాధికారికంగా నిరూపించిన మొట్టమొదటి పార్లమెంటు సభ్యుడు (1887 - 95)

**Dumping** = అమ్మకాల రుద్దుడు : మార్కెట్‌పై ప్రభావంతో నిమిత్తం లేకుండా పెద్ద సంఖ్యలో షేర్లను ఒకేసారి అమ్మజూపడాన్ని 'డంపింగ్' అంటారు అంతర్జాతీయ పరిభాషలో దీనిని కారు చౌక బేరానికి షేర్లు అమ్మడం అంటారు ఈ అమ్మకాలు ఉత్పత్తి ఖర్చులకంటే కూడా బాగా తగ్గించి సాగుతాయి అదనపు సరకును వదిలించుకోడానికో, పాత సరకు మిగిలిపోతేనో లేదా మార్కెట్‌లో పోటీ వ్యాపారులను దెబ్బతీసి లాభించేందుకో వర్తక వ్యాపారులు ఈ పనులు చేస్తారు

**Easy Money** = సులభ పరపతి : రిజర్వు బ్యాంకు వడ్డీ రేట్లు తగ్గించి, ద్రవ్య చలామణీపై కంట్రోళ్ళు సడలించినందున ద్రవ్య సంస్థనుంచి తేలిగ్గా పొందగల పరపతి సౌకర్యం కంట్రోళ్ళు విధించిన పరపతిని "టైట్ మనీ" అంటారు

**Econometrics** = అర్ధమితి

**Economic incentives** = ఆర్థిక ప్రోత్సాహకాలు / ప్రేరకాలు

**Eco-Feminism** = భూభద్రతా స్త్రీ వాదం (కేవలం లాభాల కోసం తప్ప పరిసరాల పరిరక్షణలోకాని, ప్రజల ఆరోగ్య భాగ్యాలతోకాని సంబంధం లేకుండా ప్రకృతిని కొల్లకొడుతూ లాభాల వేటలో భాగంగా ఇతర దేశాలను దురాక్రమించడానికి సైతం వెనుకాడని శక్తులకు వ్యతిరేకంగా ప్రభవిల్లిన ఉద్యమం ఈ తరహా దోపిడీలో పురుషాధిపత్యాన్ని, అహంకారాన్నీ ధిక్కరించే స్త్రీ వాదానికి ఆద్యులు ఫ్రాంకోయిజే దెబొనె (Fraucoise D' Eanbonne)

**English disease / English sickness** = ఆర్థిక పీతలాటం : బ్రిటన్‌లో పారిశ్రామిక యాజమాన్యాలకు, కార్మికులకూ మధ్య సమస్యలవల్ల, ముఖ్యంగా వర్క్ రూల్స్‌ను శృతి మించి అమలు చేసినందువల్ల వచ్చే సమస్యల మూలంగా ఏర్పడే ఆర్థిక ఇబ్బందులను ఇలా అంటారు

**Entrepreneur** = ఔత్సాహిక పారిశ్రామికవేత్త / ఔత్సాహికుడు : పరిశ్రమ నెలకొల్పడానికి తెగువ చూపే ఉత్సాహవంతుణ్ణి ఇలా అంటారు

**Entry** = పద్దు

**Enomics** = పర్యావరణార్థిక శాస్త్రం (Environmental Economics)

**EPS (Earning Per Share)** = షేరు సంపాదన: షేర్ విలువను మదింపు వేయడానికి వినియోగించే కొలమానాన్ని ఇలా అంటారు కంపెనీ తన ప్రతి షేరుపైనా ఎంత సంపాదించిందో ఈ కొలబద్ధ తెలుపుతుంది అంటే - పన్ను పోను కంపెనీకి మిగిలిన నికర లాభాన్ని కంపెనీ ఈక్విటీ షేర్ల సంఖ్యతో భాగించగా వచ్చే నిష్పత్తిని "ఎర్నింగ్ పర్ షేర్" అంటారు

**Equity Shares** = సాధారణ షేర్లు : కంపెనీల్లో మేనేజిమెంట్లు ప్రాధాన్యతా క్రమంలో ఎంపిక చేసుకున్న ప్రిఫరెన్షియల్ షేర్ హోల్డర్లకు లాభాలు పంచిన తర్వాత పోగా మిగిలిన లాభాలను పొందే హక్కు ఉన్న షేర్లను ఈక్విటీ లేదా ఆర్డినరీ షేర్లు అంటారు ఈ షేర్ల తాలూకా ఇతర 'క్లైమ్స్' అన్నీ సంతృప్తికరంగా పరిష్కారం అయిన తర్వాత కంపెనీ ఆస్తుల్ని షేర్ హోల్డర్ల మధ్య పంచుతుంటారు

**Eqvilibrium** = సమతుల్యం

**Equities** = ఈక్విటీలు : కంపెనీ షేర్లను ఇలా అంటారు అయితే ఇవి బంగారం, భూముల వ్యాపారం, డిబెంచర్‌లు, ఫిక్స్‌డ్ డిపాజిట్లు, మ్యూచువల్ ఫండ్స్, ప్రభుత్వ బాండ్స్ వగైరాల రూపంలో వుండే పెట్టుబడులు లాంటివి కావు.

**Equity Capital** = షేరు పెట్టుబడి

**Ergonomics (Human Factors Engineering)** = (ఎర్గోనమిక్స్) : మానవులను సక్రమంగా వినియోగించుకొనేందుకు ఉపకరించే విధానం ఇది దాని లక్ష్యం - భౌతికావసరాలను పూర్తిగా వినియోగించుకొంటూనే మానవుల ఆరోగ్యం, రక్షణ, ఉపాధి, సంతృప్తి వగైరా సమస్యలను పరిష్కరించుకోవడం,

పరిపాలనను కాపాడుకోవడం

**"EURO"** = యూరోపియన్ యూనియన్ ఉమ్మడి కరెన్సీ

**Eurobond** (యూరో బాండ్) = దేశీయ మార్కెట్‌కు వెలుపల విడుదల చేసే బాండ్లను యూరోబాండ్స్ అంటారు వీటిని దేశీయ కరెన్సీలోగానీ లేదా విదేశీ కరెన్సీలోగానీ విడుదల చేయొచ్చు

**"Ex"** = "ఎక్స్" : కొన్ని షేర్లను "ఎక్స్‌బోనస్" అనీ, "ఎక్స్ డివిడెండ్" అనీ, "ఎక్స్‌రైట్" అనీ కోట్ అవుతుంటాయి కంపెనీ చిరాలు మూసిన తర్వాత షేర్లు కొన్నప్పుడు గానీ, డివిడెండ్ లేదా రైట్స్. లేదా బోనస్ చెల్లించడానికి ముందుగానీ ఇలా "ఎక్స్" పేరుతో కొన్ని షేర్లను పిలవాల్సి వస్తుంది ఇలాంటి సమయంలో షేర్లు కొనదలచిన ఇన్వెస్టర్లు డివిడెండ్‌పై రైట్ క్లైమ్ లేకుండా లేదా బోనస్‌తో నిమిత్తం లేకుండా షేర్లు కొంటూంటారు అలాంటి హక్కుతో / నిబంధనలతో నిమిత్తం లేకుండా ఉన్న షేర్లను "ఎక్స్" షేర్లు అంటారు

**Exchange Economy** = వినిమయార్థిక వ్యవస్థ

**Excise** = ఎక్సైజ్ : యూనియన్, రాష్ట్ర ప్రభుత్వాలు లేదా స్థానిక సంస్థలు ఉత్పత్తిపైన సరకు అమ్మకాలపైన విధించే పన్ను సరకుల వాడకంపైన కూడా విధిస్తారు ఈ పన్నును సరకు విక్రయదారుమీద లేదా కొనుగోలుదారుమీద వేస్తారు

**Exim Bank (Export - Import Bank)** = ఎగుమతి - దిగుమతి / వాణిజ్యం బ్యాంకు అమెరికా ప్రభుత్వ స్వయం పాలనా సంస్థ

**Expenditure tax** = ఖర్చు పన్ను

**Export Processing Zone (EPZ)** = ఎగుమతుల మండలం : ప్రత్యేకించి ఎగుమతి కావలసిన సరకుల ఉత్పత్తికి ఉద్దేశించిన పారిశ్రామిక ప్రాంతాలను ఇలా అంటారు గుజరాత్‌లో కాండ్లే, బొంబాయిలో శాంతాక్రజ్, కలకత్తా వద్ద ఫాల్టా, ఢిల్లీ సమీపంలోని నోయిడా, విశాఖ ఇలాంటి మండలాలు. వీటిని స్వేచ్ఛా వాణిజ్య మండలాలు (Free Trade Zones) అని కూడా అంటారు

కార్టెల్ = వాణిజ్య గుత్త సంస్థ : అనేక కంపెనీలు కలిసి తమ మధ్యనే మార్కెట్‌ను పంచుకొనేందుకు ఏర్పరచుకొనే నియంత్రిత వాణిజ్య సంస్థ (restricted trade association) కొన్ని స్థాయిలలో ధరవరలను నియంత్రిస్తూ, సరకుల సరఫరాను కంట్రోల్ చేస్తూ, తద్వారా అక్రమ లాభాలు గడించడానికి వీలైన ఒప్పందం కుదుర్చుకోవడం కార్టెల్ లక్షణం

కాపిటల్ మార్కెట్ (పెట్టుబడి సేకరణ) = కంపెనీలు నెలకొల్పుకోడానికి, వాటి నిరంతర పురోభివృద్ధికి అవసరమైన దీర్ఘకాలిక పెట్టుబడిని (Long-term Capital) సమీకరించగల ఆదారాలు స్టాక్ ఎక్స్చేంజి ఈ కాపిటల్ మార్కెట్‌లో ఒక భాగం ఈ పేరుతో షేర్ మార్కెట్ పరిస్థితిని వివరించే ఒక పత్రిక కూడా వుంది (బొంబాయినుంచి వస్తుంది)

**Face Value / Par Value** = మౌఖిక విలువ : షేర్, డిబెంచర్, బాండ్ మౌఖిక విలువ లేదా ధరను ఇలా పిలుస్తారు ఇది షేర్ లేదా డిబెంచర్ లేదా బాండ్ సర్టిఫికేట్ పైన తెల్పిన ధరేగాని, మార్కెట్ ధర మాత్రం కాదు

**Factor** = (సర్వీసు వ్యాపారి) సర్వీసు సంస్థ ఇవి రెండు రకాలు : (1) ఒకరి వస్తువులను అమ్మిపెట్టినందుకు కమీషన్ పొందే వ్యక్తి (2) కొన్ని సర్వీసులు అందజేయడంకోసం నైపుణ్యంలో ఏర్పడిన ప్రయివెట్ ఫైనాన్స్ కంపెనీ ఈ సంస్థ టోకుగానే ఈ సర్వీసులో అందజేస్తుంది వాణిజ్య రుణాలు పేరుకొనిపోయిన పార్టీలుంటే వాటి తీరుమానానికి పూచీపడి వాళ్ళ వద్ద కొంత డిస్కౌంట్ తీసుకొని సొమ్ములు వసూలు చేసిపెట్టి తద్వారా ఆ రుణం తీరిపోగానే దానిపై లాభం పొందుతుంది ఈ సంస్థ సలహాలివ్వడమేగాక, మార్కెటింగ్ సర్వేలు కూడా అందజేస్తుంది ఇలా ఒక పరిశ్రమ నిర్మాణ విషయాలపైన ప్రత్యేక శ్రద్ధ వహించి పనిచేసే సంస్థను, లేదా నిర్దిష్టమైన కొన్ని పరిశ్రమలకు వివిధ శాఖలను నిర్వహించి పెట్టే సంస్థనూ "ఫ్యాక్టరింగ్ కంపెనీ" అంటారు మొట్టమొదటిసారి ఈ "ఫ్యాక్టరింగ్" సర్వీసు వస్త్ర పరిశ్రమలో ప్రారంభమైంది

**Factoring** = రుణమిచ్చే ద్రవ్య సంస్థను 'ఫ్యాక్టర్' అంటారు ఈ సంస్థకూ రుణగ్రహీతగా ఉండే వ్యాపార సంస్థకూ మధ్య వినియోగదార్లకు సరకుల, సర్వీసుల

విక్రయ లావాదేవీలకు సంబంధించిన ఏర్పాట్లు 'ఫ్యాక్టరింగ్' అంటారు అంటే - ట్రేడ్ కస్టమర్లకు సరుకులు లేదా సర్వీసులను విక్రయించె క్రమంలో వ్యాపార సంస్థ తాలూకు బుక్‌డెట్స్‌ను (వీటిని ఎక్కౌంట్ రిసీవబుల్స్ అని కూడా అంటారు) ద్రవ్య సంస్థ స్వాధీనపరచుకోవడాన్ని ఫ్యాక్టరింగ్ అంటారు ఈ పని ద్రవ్య సంస్థ వ్యాపార సంస్థ ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండానే చేస్తుంది సరుకుల కొనుగోలుదార్ల (కస్టమర్స్)కు అందించిన పరపతిని నియమబద్ధం చేస్తూ అమ్మకాల తాలూకు లెడ్జర్‌ను ద్రవ్య సంస్థే నిర్వహిస్తుంది ప్రత్యేక శాఖల ద్వారా ఈ "ఫ్యాక్టరింగ్' ను శ్రద్ధగా నిర్వహించుకోవాలని రిజర్వు బ్యాంకు ఆదేశం

**FERA Companies** = విదేశీ మారక ద్రవ్య నియంత్రణ చట్టం వర్తించే కంపెనీలు ఈ చట్టం 1973లో వచ్చింది దేశీయ పరిశ్రమలలో విదేశీ గుత్త సంస్థల ఈక్విటీ 40 శాతానికి మించివున్న పరిశ్రమల్ని ఇలా పిలిచేవారు కాని ఇప్పుడు 'సరళీకరణ' విధానం వల్ల 'ఫెరా' నిబంధనలు కూడా సడలిపోయాయి

**Fiduciary** = నమ్మకస్తుడు : మరో వ్యక్తి తరపున అతని ఆస్తిపాస్తులకు / డబ్బుకూ పూచీ వహించే వ్యక్తి, విశ్వాసపాత్రుడైన వ్యక్తి

**Fill or Kill order** = రద్దు ఉత్తర్వు : ఫలానా షేర్‌ను లేదా షేర్లను వెంటనే కొనమనీ లేదా అమ్మమనీ స్టాక్ బ్రోకర్‌కు ఇచ్చే ఆదేశం ఇది ఉత్తర్వు వెంటనే అమలు కాకపోతే సదరు ఉత్తర్వు రద్దు అయినట్టు భావిస్తారు

**Financial Year** = ఆర్థిక సంవత్సరం : ఆదాయపు పన్ను మదింపు కోసం ఏప్రిల్ 1 నుంచి మార్చి 31 వరకూ ఆర్థిక సంవత్సరంగా నిర్ణయించారు లాభ నష్టాల అక్కౌంటింగ్ సంవత్సరంగా దీన్ని పరిగణిస్తారు

**Finance** = ద్రవ్య వ్యవహారాలు : డబ్బు, పరపతి - ఈ రెండు రకాల ద్రవ్య సాధనాల నిర్వహణ ఫైనాన్స్ కిందకు వచ్చే రంగాలు : బ్యాంకింగ్, టాక్సులు, ఇన్స్యూరెన్స్, డబ్బు చెలామణీ, విదేశీ మారక ద్రవ్యం, ఇన్‌వెస్ట్‌మెంట్, మార్కెట్లు స్థూలంగా చెప్పాలంటే - నిధుల సేకరణ, వాటి నిర్వహణ వెరసి "ఫైనాన్స్"

**Fiscal Policy** = పన్నుల విధానం / పన్నులు వగైరా : దేశ ఆర్థికాభివృద్ధి కోసం, ఆర్థిక వ్యవస్థ స్థిరత్వం కోసం ప్రభుత్వం పన్నులనూ, ఖర్చునూ పెంచడమో తగ్గించడమో చెయవలసి వస్తుంది ఈ సర్దుబాట్లను స్థూలంగా ఫిస్కల్ పాలసీ అంటారు

**Fixed assets** = స్థిరాస్తులు (బవనాలు, యంత్రాలు, ఫర్నీచరు వగైరా)

**Fixed Assets** = స్థిరాస్తులు : కంపెనీ ఆస్తి-అప్పుల (బ్యాలెన్స్ షీట్) పట్టికలో ఒక ఎంట్రీ ఉంటుంది దాని ప్రకారం క్యాష్ క్రింద మార్చరాని భూమి, యంత్రాలు, ఫర్నిచర్ ఇతర ఫిక్చర్స్ ఉన్న ఎంట్రీని "ఫిక్స్‌డ్ ఎసెట్స్" అంటారు బ్యాలెన్స్ షీట్‌లో వీటిని సంవత్సరాల వాడకం మీద తగ్గిన విలువలో జమకట్టి చూపుతారు "కరెంట్ ఎసెట్స్"లోకి వచ్చేవి క్యాష్, మార్కెట్ చెసుకోదగిన సెక్యూరిటీలు, రావలసిన బకాయిలు, రుణాలు, అడ్వాన్సులు సరకు నిల్వలూ వగైరా

**Fixed Capital** = స్థిర మూలధనం (యంత్రాలు వగైరాలకు అవసరమయ్యే మూలదనం)

**Fixed Deposits** = స్థిర డిపాజిట్లు : ఇవి నిర్ణీత కాలానికి చెందిన డిపాజిట్లు అంటే - నిర్దిష్ట కాలానికి ఈ డిపాజిట్ల పైన వడ్డీ వస్తూంటుంది. ఇనవెస్ట్ చేసిన మొత్తం విలువ మాత్రం ప్రత్యేకించి పెరగదు కాని డిపాజిట్ కాల పరిమితి మేరకు వడ్డీ రేట్లు నిర్ణయిస్తారు

**Float** = ఫ్లోట్ : దేశీయ కరెన్సీ విలువ : ఇతర దేశాల కరెన్సీలతో ఎలాంటి ఆంక్షలు లేకుండా స్వేచ్ఛగా మారుతూండడాన్ని "ఫ్లోట్" అంటారు చట్టం ద్వారానో లేదా మరో చిట్కా ద్వారానో కొన్ని దేశాలు కరెన్సీ మారకం రేటును స్థిరపరచడానికి ప్రయత్నిస్తాయి కాని సప్లయి - డిమాండ్ ఆధారంగా కరెన్సీ విలువ స్వేచ్ఛగా నిర్ణయం కావడాన్ని "ఫ్లోట్" అంటారు

**"FORBES 500"** = 'ఫార్చ్యూన్'లాగానే 500 పెద్ద పబ్లిక్ కంపెనీల వివరాలు వెల్లడించే మ్యాగజైన్ 'ఫోర్బెస్'

**Fortune 500** = 500 అమెరికన్ గుత్త పారిశ్రామిక సంస్థలను ఏటా ఎంపిక చేసి ప్రచురించే "ఫార్చ్యూన్' అనే మాగజైన్ ఇది కంపెనీల ఆస్తిపాస్తులు, నికరాదాయం, ఈక్విటీ పెట్టుబడి, షేర్ ఒక్కొంటికి వచ్చే ఆదాయం వగైరా వివరాలతో ఈ జాబితా తయారు చేస్తారు.

**Forward** = ముందస్తు రేటు : ముందు ముందు జరుగబోయే లావాదేవీలకు (transaction) దృష్టిలో పెట్టుకొని ఈ లోపే నిర్ణయమైన వడ్డీ రేటు లేదా కరెన్సీ మారకం రేటు

**Forward buying** = ముందస్తు జాగ్రత్త : భవిష్యత్తు అవసరాలను దృష్టిలో పెట్టుకొని ముందుగానే ఉత్పత్తికి అవసరమైన సరకును, ముడి సరుకునూ సిద్ధం చేసి పెట్టుకోవడం, తద్వారా ఉత్పత్తి కుంటుపడకుండా చూసుకునే పద్ధతి

**Forward Purchase** = ఫార్వర్డ్ పర్‌చేజ్ : షేర్లను నిర్దిష్టమైన ధరకు ముందు ముందు (రానున్న రోజుల్లో) కొనడానికి ముందుగానే ఒప్పందమైనప్పుడు ఇలా అంటారు ధరలు పెరుగుతాయన్న ఆశతో ఈ పని చేస్తూంటారు

**Forward Dealing** = రేపటి కాంట్రాక్టులు : నిర్దిష్టమైన పరిమాణాల్లో సరకుల, కరెన్సీ, సరకుల రవాణాను ప్రకటిత దరకు, ప్రకటిత వ్యవధిలోగా అమ్మడానికి లేదా కొనుగోలు చేయడానికి కుదుర్చుకునే కాంట్రాక్టులు ఈ లావాదేవీ రేపటిని (భావిని) దృష్టిలో పెట్టుకొని జరుగుతూంటుంది

**Free Lunch Theorem** = 'ధర్మపిండ సూత్రం' / అయాచిత సంపాదన : వ్యాపారంలో ఉచిత భోజనం అంటూ ఉండదు స్టాక్‌మార్కెట్‌లో డబ్బు గడించాలంటే ఈ గోదాలోకి దిగేవాడు కష్టపడి పనిచేయాలి షేర్ల ట్రేడింగ్‌లో అన్ని ఆనుపానులు ఇబ్బంది సబ్బందులు తెలుసుకొని జాగ్రత్తగా వ్యవహరించాలి.

**Free Market Economy (Market-Economy)** = స్వేచ్ఛా మార్కెట్ ఆర్థిక వ్యవస్థ : ఇందులో జరిగే బిజినెస్ లావాదేవీల్లో ఏ రూపంలోనూ ప్రభుత్వం జోక్యం చేసుకొనే అవకాశం లేని వ్యవస్థ ధరలపై కంట్రోళ్ళు ఉండకపోవడమేగాక, పర్మిట్లు ఉండవనీ, చే తడుపుళ్ళు (కిక్‌బాక్స్) ఉండవనీ, వర్తక నిర్బంధాలుండవనీ, విదేశీ మారక ద్రవ్య కంట్రోల్ ఉండదనీ ఒక నమ్మకం ఎలాంటి కంట్రోళ్ళు లేని ఇలాంటి విచ్చల విడి వ్యవస్థనే ఫ్రీ మార్కెట్ ఎకనమీ అంటారు

**Fully paid shares** = చెల్లించిన షేర్లు : షేర్ మౌలిక విలువ ప్రకారం పూర్తి విలువను చెల్లించిన షేర్లను ఇలా అంటారు

**Fully Secured Liability** = పూర్తి హామీ గల అప్పు

**Finished goods** = తయారైన సరుకు

**Fundamentals** = కంపెనీ తబిసీళ్ళు / షేర్ల ప్రాథమిక సమాచారం : కంపెనీల షేర్ల విలువను నిర్ణయించేందుకు తోడ్పడే ప్రాథమిక సమాచారమే ఫండమెంటల్స్ (ఆ కంపెనీ ఆర్థిక స్తోమత, లాభ నష్టాల బేరీజు, వాటాదారులకు భవిష్యత్తులో ఒనగూడగల ప్రయోజనాలు వగైరా)

**Futures** = చట్టా వ్యాపారం : ఇదీ చట్టా వ్యాపారం (Speculation) లాంటిదే ఒక సరకును ఈ రోజు కొని రేపో మాపో లాభానికి అమ్మగోరే లేదా కొనగోరే కాంట్రాక్ట్ పద్ధతి ఇది లాభాలను ఆశించి కుదుర్చుకొనే ఒప్పందం దీనికి ప్రాణం

**GDP (Gross Domestic Product)** = నికరదేశీయోత్పత్తుల విలువ : ఒక దేశంలో ఒక్క ఏడాదిలో ఉత్పత్తి అయ్యే సరకుల, సర్వీసుల (సేవలు) మొత్తం విలువ ఇది

**General Ledger** = కల్పిత ఖాతాల ఆవర్జా

**General Sales Tax** = సాధారణ అమ్మకం పన్ను

**Gift Tax** = బహుమతి పన్ను : బహుమతులు పొందే వ్యక్తి సంవత్సరంలో రూ 20,000/-లకు మించి పొందే బహుమతులపై విధించే పన్ను ఇది.

**Gilt edged** = (గిల్ట్ ఎడ్జ్) = అత్యంత హెచ్చు విలువగల (రేటింగ్) స్టాక్ / బాండు లేదా ఇతర రకాల సెక్యూరిటీకి ఇది మారు పేరు పెట్టుబడి భద్రతకు వీటిని ఆశ్రయిస్తారు

**Gilt-edged** = ప్రభుత్వ సెక్యూరిటీలను, బాండ్‌లను ఇలా పిలుస్తారు వీటిపైన చెల్లించే వడ్డీ రేటులకు ఈ సెక్యూరిటీల రిఫండ్‌లకు ప్రభుత్వమే బాధ్యత వహిస్తుంది కాబట్టి వీటిని సురక్షితమైన సెక్యూరిటీలుగా భావిస్తారు. మొట్టమొదట్లో ఈ సర్టిఫికేట్ల అంచులకు బంగారు తాపడం ఉండేది కాబట్టి వీటిని "గిల్ట్ - ఎడ్జ్‌డ్" సెక్యూరిటీలు అన్నారు.

**Glamour Issue** = పురానా పేరు : హెచ్చు ప్రీమియంతో పెద్ద ఎత్తున ప్రచారంలోకి తెచ్చే పబ్లిక్ షేర్లను ఇలా అంటారు ఇటువంటి షేర్ల పట్ల ప్రజలకు మోజు ఎక్కువ ఉదా: టాటా స్టీలు

**Globalisation** = విశ్వీకరణ (ఇది, ప్రచ్ఛన్న యుద్ధం అంతమైనదని భ్రమిస్తున్న సమయంలో "నూతన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ నిర్మాణం" పేరిట తన వస్తువులకు మార్కెట్ల కోసం అమెరికా సృష్టించిన పదం) విస్తరిస్తున్న ప్రపంచ ఎర్తక వాణిజ్య వ్యవస్థకు ఇది మరో పేరు

"విశ్వీకరణ"లో భాగంగానే దేశాల ఆర్థిక వ్యవస్థలపై ప్రభుత్వ జోక్యానికి స్వస్తి చెప్పిస్తూ ఆర్థిక సంస్కరణల పేరిట ప్రయివేటీకరణకు అమెరికా దారులు తెరిచింది" దీనికి "ప్రయివేటైజేషన్ **Privatisation)** అన్నారు

**Gnomes of Zurich** = రహస్య బ్యాంకులు : రహస్య లావాదేవీలకు పేరు మోసిన స్విట్జర్లాండ్ ద్రవ్య సంస్థలనూ, బ్యాంకులనూ ఇలా పిలుస్తారు

**GNP (Gross National Product)** = నికర జాతీయోత్పత్తుల విలువ : ఒక్క ఏడాదిలో ప్రజల వాడకానికి సిద్ధమైన అన్ని రకాల సరకులు, సర్వీసుల మొత్తం (రొఖ్ఖం రూపంలో) విలువనూ, విదేశాలనుంచి మనకు వనగూడే ఆస్తుల నికరాదాయ విలువనూ ఇలా అంటారు జాతీయోత్పత్తుల పెరుగుదల రేటు దేశ ఆర్థిక సౌష్ఠవాన్ని గణించే అతి ముఖ్యమైన కొలమానాలలో ఒకటి

**Godfather offer** = ఏదైనా కంపెనీని స్వాధీనం చేసుకోవడానికి ముందుకు వచ్చే వ్యక్తుల / కంపెనీల ఆఫర్‌లను ఇలా అంటారు సర్వ సాధారణంగా ఈ "టేకోవర్స్" అనేవి మేనేజ్‌మెంట్‌లను మార్చేవిగా ఉంటాయి

**Gold exchange standard** = స్వర్ణ వినిమయ ప్రమాణం

**Gold Standard** = స్వర్ణప్రమాణం : ఇదొక ద్రవ్య వ్యవస్థ డబ్బును, పేపర్ కరెన్సీని బంగారం విలువలో గణిస్తారు ఒక కరెన్సీ (లేదా మోనిటరీ యూనిట్‌లో) విలువ ఎంత బంగారానికి సమానంగా ఉంటుందో చూస్తారు డబ్బును అవసరాన్ని బట్టి గోల్డ్ కాయిన్‌గా మార్చుకోనూవచ్చు, గోల్డ్‌ను డబ్బుగానూ మార్చుకోవచ్చు

**Golden handshake** = ఉద్వాసన : (పొట్ట కొట్టడం) సిబ్బంది పొట్టగొట్టడానికి ఇది మారు పేరు, ఉద్యోగిని ఉద్యోగం నుంచి తొలగించడానికి "నూతన ఆర్థిక సంస్కరణల" పేరిట లిబరలైజేషన్ పేరిటా వచ్చిన ముద్దు పేరు ఒకవైపు ఉపాధికి ఉద్వాసన చెప్పిస్తూ మారోవైపు ఉద్యోగికి పెద్ద మొత్తం"లో క్యాష్ బోనస్ ఇస్తారు కాబట్టి అది 'సువర్ణ కరచాలనం' అయిపోయింది! (మనం చేసే తప్పుడు పనులను సమర్థించుకోడానికి పదాల రూపంలో చేసే గారడీలలో ఇలాంటి 'తీపి గుళికలు' ఎన్నో)

**Gold Lot** = అసాధారణ లాట్ : స్టాక్ మార్కెట్‌లో షేర్లను 'మార్కెట్ లాట్స్'లో కొనడం, అమ్మడం జరుగుతూంటుంది లావాదేవీలకు అనుకూలమైనవి మార్కెట్ లాట్లు కాని మార్కెట్ లాట్ కంటే తక్కువ సంఖ్యలో షేర్లు ఉన్నప్పుడు ఆ 'లాట్'ను 'గోల్డ్‌లాట్' అంటారు అలాగే, ఒక షేర్ తాలూకు మార్కెట్ లాట్ గనుక 100 ఉంటే, అంతకన్నా తక్కువ షేర్లు - 50 షేర్లు లేదా అంతకన్నా ఎక్కువ షేర్లు - 500 షేర్లు ఉన్న సింగిల్ షేర్ సర్టిఫికేట్‌ను కూడా 'ఆడ్‌లాట్" అంటారు ఈ అసాధారణ లాట్స్ అనేవి బోనస్ ఇస్యూల నుంచీ, రైట్స్ ఇస్యూలనుంచీ ఏర్పడు తుంటాయి ఈ 'ఆడ్‌లాట్' లావాదేవీలను కనిపెట్టి ఉండడం ద్వారా మార్కెట్ ధోరణిని ఆటుపోట్ల గురించి జోస్యం చెప్పవచ్చని గార్ఫెడ్ డ్రూ సిద్ధాంతం

**Goldbug** = ఆర్థిక సంక్షోభాలు లేదా విపరీతమైన ద్రవ్యోల్బణం ప్రపంచ ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేస్తున్నప్పుడు బంగారాన్ని పెట్టుబడిగా పెట్టుకోమని విశిష్టమైన పెట్టుబడిని సిఫారసు చేసే సలహాదారు (Consultant)ను గోల్డ్‌బగ్ అంటారు

**Golden Handshake** = పరిహార భిక్ష : ఉద్యోగికి ఉద్వాసన చెప్పినప్పుడు "పొమ్మని చెప్పకుండా పొగబెట్టినట్టు"గా ఉదారంగా చెల్లించే పరిహారం మరో మాటలో దీన్ని "సువర్ణ కరచాలనం" అని కూడా అంటారు

**Good Will** = పరువు ప్రతిష్ఠ వాణిజ్య పరపతి

**Goods** = సరకు, వస్తువులు (మనిషి కోరికను తీర్చగలిగే శక్తి వున్న పదార్థాలను ఇలా పిలుస్తారు )

**Goods** = సరకులు / వస్తువులు : స్థూలార్థంలో అన్ని రకాల ఆస్తులకూ ఇది వర్తిస్తుంది కానీ సూక్ష్మార్థంలో వర్తకుడు అమ్మే సరకులకే వర్తిస్తుంది ఇవి రకరకాలు : Durable Goods : దీర్ఘకాలం

[illegible] (Fungible Goods) [illegible] మన్నికా (Fungible Goods) [illegible] మన్నిక (Hard goods)[illegible] మన్నికైన వస్తువులు

**(Soft Goods)** = [illegible] మన్నికా [illegible]

**Great Crash** = 1929 అక్టోబర్ 2[illegible] న్యూయార్క్ స్టాక్ ఎక్స్ఛేంజీలో డౌ జోన్స్ సూచి 49 పాయింట్లకు పడిపోవడంతో స్టాక్ మార్కెట్ కుప్పకూలి పలుచి పడిపోయింది. దీన్నే 'గ్రేట్ క్రాష్' అన్నారు. ఆ మరుసటి రోజున ఈ సూచీ 43 పాయింట్లకు పడిపోయింది. 1932 జూలై 8 నాటికి ఈ సూచి 41 పాయింట్ల వద్ద నిలిచే వరకూ స్టాక్ ధరలు పడిపోతూనే వచ్చాయి. ఒకే ఒక రోజున - 1929 అక్టోబర్ 29న 16,410,030 షేర్లు కారు చౌక ధరలపైన చేతులు మారిపోయాయి. లక్షలాది మంది నిరుద్యోగులయ్యారు. అసంఖ్యాకంగా పరిశ్రమలు మూతపడ్డాయి. 5000 బ్యాంకులు దివాళా ఎత్తాయి. చరిత్రలో ఎన్నడూ లేనంత దారుణ సంక్షోభంలో అమెరికా చిక్కుకు పోయింది. ఫలితంగా 1933 నుంచీ స్టాక్ మార్కెట్ లావాదేవీలను నియంత్రిస్తూ అమెరికన్ పార్లమెంట్ కొన్ని సంస్కరణ చట్టాలు ప్రవేశపెట్టింది.

**Gatt (General Agreement on Trade and Tariff)** = అంతర్జాతీయ వర్తక-సుంకాల సార్వత్రిక ఒప్పందం

**Great depression** = తీవ్ర ఆర్థిక సంక్షోభం : 1929 అక్టోబర్ 29న అమెరికాలో వచ్చిన స్టాక్ మార్కెట్ పతనానికీ, రెండవ ప్రపంచ యుద్ధానికీ (1939-45) మధ్య కాలాన్ని తీవ్ర ఆర్థిక సంక్షోభ దశ అంటారు. ఈ మధ్య కాలాన్ని తీవ్ర ఆర్థిక సంక్షోభ దశ అంటారు. ఈ శతాబ్దంలోనే కనీ వినీ ఎరుగని స్థాయిలో ఆనాడు అమెరికా, పశ్చిమ రాజ్యాలూ ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యక్తి అదుపులేని స్వలాభాపేక్షకు నిచ్చెనలు వేసిన స్టాక్స్ లావాదేవీల పర్యవసానమే ఈ సంక్షోభాలు. దీని ఫలితాన్ని ఇతర దేశాలు కూడా అనుభవించవలసి వచ్చింది. ఉత్పత్తులు తరిగాయి, ధరలు పడిపోయాయి, రైతులు దెబ్బతిన్నారు, ఉద్యోగులు ఉపాధి కోల్పోయారు.

**Green Card** = (గ్రీన్‌కార్డ్) : అమెరికాలో స్థిరపడదలచిన శాశ్వత పౌరునిగా గుర్తిస్తూ విదేశీయుణ్ణి అక్కడ లీగల్‌గా ఉపాధికి అర్హుడనిగా ప్రకటించే పత్రం

**Greshams Law** = గ్రేషమ్స్ 'లా' : విలువ తరిగిపోయిన డబ్బు క్రమంగా విలువగల డబ్బును చెలామణీనుండి నెట్టిపారేస్తుందన్న సూత్రం (Bad or Cheap money drives our good or dear money out of circulation)

**Grey Market** = అనధికార ప్రీమియమ్ : దీనినే లోపాయికారీగా సాగే ప్రీమియమ్ మార్కెట్ అంటారు. దీని ప్రకారం - స్టాక్ మార్కెట్‌లో ఇంకా నమోదు (లిస్ట్) కాని షేర్ల క్రయ, విక్రయాలు సాగుతూంటాయి

**Gross Loss** = స్థూల నష్టం

**Gross Profit** = స్థూల లాభం (కేవలం ఫ్యాక్టరీ వర్తకపు ఖర్చులు మినహాయించాక తేల్చే లాభం)

**Gross Profit** = స్థూల లాభం : కమిషన్లు పోను తేలిన నికర అమ్మకాల విలువ, ఇందులోనుంచి రాయల్టీలు సహా ఉత్పత్తి ఖర్చులు కూడా పోగా మిగిలిన నికర లాభం. దీనిని 'గ్రాస్ మార్జిన్' అని కూడా అంటారు. నికర లాభాన్ని శాతంలో చూపిస్తారు (నికర లాభాన్ని నికర అమ్మకాలతో భాగించి, శేషాన్ని 100 తో హెచ్చించాలి)

**Guaranty** = హామీ : వస్తువుల నాణ్యతకు వర్తకుడు హామీ పడడం. వస్తువులకు ఎలాంటి నష్టం వాటిల్లినా వాపసు తీసుకుంటానని హామీ పడడం

**Guild** = (గిల్డ్) : మత ప్రయోజనాలను, వ్యాపార ప్రయోజనాలను కాపాడుకొనేందుకు పరస్పర సహాయ సహకారాలు అందించుకొనేందుకు మధ్య యుగాలలో పశ్చిమ యూరప్‌లో ఏర్పడిన వ్యాపార సంఘాన్ని ఇలా పిలిచారు. 11వ శతాబ్దం నుంచీ ఇలాంటి వర్తక సంఘాలు "గిల్డ్"గా పేరుమోశాయి. ఇప్పుడు ఈ పేరు ఇతర వృత్తులకు కూడా పాకింది. ఉదా : పత్రికా సంపాదకుల గిల్డ్ (ఎడిటర్స్ గిల్డ్)

**Gun Jumping** = అధికారికంగా షేర్ల సమాచారాన్ని పబ్లిక్ చేయకముందే అందిన అనధికార సమాచారాన్ని బట్టి షేర్ల లావాదేవీల్లోకి (ట్రేడింగ్) దిగడం

**Gypsy** = (జిప్సీ) : టాక్సీ, ట్రక్కు వగైరా సొంత వాహనాలను స్వతంత్రంగా తిప్పుకొనే ఆపరేటర్‌కు ఇదో మారుపేరు

**Havala (or Making up Price)** = పరిష్కార ధర / భర్తీ రేటు : నిర్దిష్టమైన సెక్యూరిటీల విషయంలో లావాదేవీలు పూర్తికాని కొన్ని కాంట్రాక్టులు ఉంటాయి. వీటిని పరిష్కరించుకొనేందుకు ఒక వ్యవధిని స్టాక్ ఎక్స్ఛేంజి బ్రోకర్లు నిర్ణయించుకుంటారు. కాగా ఈ అపరిష్కృత కాంట్రాక్టులకు సంబంధించిన

సెటిల్‌మెంట్ పీరియడ్ ముగింపు దశలో ఎక్స్ఛేంజిలోని బ్రోకర్ సభ్యుల మధ్య బకాయిల పరిష్కారం కోసం స్టాక్ ఎక్స్ఛేంజి ఒక రేటు నిర్ణయిస్తుంది ఈ రేటునే 'హవాలా' అంటారు పరిష్కార వ్యవధి కాల పరిమితి మించిపోయి మరో తేదీకి పరిష్కారం వాయిదా పడి, అలాంటి కారీఓవర్ అక్కౌంట్లన్నింటినీ సభ్యులు వ్యక్తిగతంగా పరిష్కరించుకోవచ్చు కానీ రకరకాల రేట్ల పైన పెద్ద సంఖ్యలో లావాదేవీలు (Transactions) జరుగుతూ ఉండడం వల్ల తగినంత గందరగోళమూ ఉంటుంది ఆ పరిస్థితులలో పరిష్కారం కాని కాంట్రాక్టులకు సంబంధించి సభ్యుల బకాయిలను (అప్పులను) తేల్చడం కోసం స్టాక్ ఎక్స్ఛేంజి నిర్దిష్టమైన ఫలానా 'షేరు ధర ఇది' అని ఒక రేటు నిర్ణయిస్తుంది సర్వసాధారణంగా సెటిల్మెంట్ పిరియడ్ చివరి వర్కింగ్ డే నాడు షేరు ముగింపు రేటు ఎంత ఉందో ఆ రేటును హవాలా (పరిష్కార ధర) రేటుగా పరిగణిస్తారు

బి) 'హవాలా' అంటే కరెన్సీ మారకంలో అనుసరించే అక్రమ వర్తకమని కూడా అర్థం ఉంది విదేశీ కరెన్సీని బ్లాక్ మార్కెట్ రేట్లకు అమ్మజూపడాన్ని "హవాలా" అంటారు ఇందులో భాగంగానే ఇక్కడ చెల్లించిన ఇండియన్ కరెన్సీ స్థానంలో విదేశాల్లో దొంగచాటుగా విదేశీ మారక ద్రవ్యాన్ని చేతులు మారుస్తూంటారు

**Hedging** - పెట్టుబడి రక్షణ : ప్రతి పెట్టుబడిలోనూ లాభ నష్టాలుంటాయి కాని "రిస్క్" నుంచి తప్పించుకోడానికి మార్గాలు వెతుక్కోవాలి అటువంటి రక్షణ మార్గాన్నే "హెడ్జింగ్" అంటారు షేర్ మార్కెట్‌లో ఫండ్స్ ఇన్‌వెస్ట్ చేసేటప్పుడు రకరకాల షేర్లను కొనుగోలు చేస్తారు ఎందుకు? ఒక షేర్ ధర పడిపోతే, వేరొక షేర్ ధర పెరుగుతుంది లేదా వివిధ రకాల ఆస్తులలో ఇన్‌వెస్ట్ చేస్తారు (ఉదా: షేర్లు, డిబెంచర్లు, బాండ్లు, బంగారం, వెండి, స్థలాలు, బిల్డింగుల క్రయ విక్రయాలు వగైరా). ద్రవ్యోల్బణాన్ని తప్పించుకోగోరేవారు తమ డబ్బులను ఆస్తులపై పెట్టాలి అప్పుడు ఇన్‌ఫ్లేషన్ వల్ల కలిగే దుష్ఫలితాలను కొంతవరకైనా తటస్థీకరిస్తుంది

**Hiccup** = ఆకస్మిక పతనం : స్టాక్ మార్కెట్‌లో ఆకస్మికంగా వచ్చే పతనాన్ని ఇలా అంటారు. అయితే ఈ పరిణామం తాత్కాలికం కావచ్చు.

**Hidden inflation** = దాగుడుమూతల ఇన్‌ఫ్లేషన్ : వస్తువులను చిన్న చిన్న మొత్తాలలో అమ్మడం ద్వారా లేదా నాసిరకం వస్తువులను చిన్న మొత్తాలలో చెల్లగట్టడం ద్వారా అంతకు ముందున్న ధరకే విక్రయించడం వల్ల వచ్చే ధరల పెరుగుదలను "హిడెన్ ఇన్‌ఫ్లేషన్" అంటారు కానరాని పెరుగుదలన్నమాట

**Hit the bricks** = సమ్మె చేయడాన్ని ఇలా అంటారు

**Holding Company** = హోల్డింగ్ కంపెనీ : ఇతర కంపెనీల స్టాక్స్‌ను (షేర్లను) తన సొంతం చేసుకోవడం ద్వారా ఆ కంపెనీలపైన పెత్తనం చెలాయించే కంపెనీ

**Human Capital** = మానవ శ్రమే పెట్టుబడి : ఫైనాన్స్ క్యాపిటల్‌కు అస్తి క్యాపిటల్ అయితే మానవశక్తిని, పరిశ్రమనీ ఆస్తిగా పరిగణించాలన్న భావనే మానుష పెట్టుబడి ఈ మానవ శక్తిని పెంపొందించేందుకు పెట్టే పెట్టుబడివల్ల సంఘానికి గణనీయమైన లబ్ధి సిద్ధిస్తుందన్న విశ్వాసం ఈ భావనకు పునాది

**Holding Company** - మరో కంపెనీ విధాన నిర్ణయాలను ప్రభావితం చేయడానికి వీలైనన్ని వోటింగ్ షేర్లను తన గుప్పిటలో పెట్టుకున్న కంపెనీని హోల్డింగ్ కంపెనీ అంటారు అయితే ఈ పట్టు సంపాదించడానికి 51 శాతం వోట్లు విధిగా ఉండనక్కరలేదు మరో కంపెనీతో విలీనం (మెర్జర్) అయినప్పుడు అయ్యే ఖర్చులకన్నా తక్కువ ఖర్చుతో ఆ కంపెనీ వ్యవహారాల నిర్వహణను కంట్రోల్ చేయడం హోల్డింగ్ కంపెనీకి సుఖం. ఎందుకంటే మెర్జర్‌కు అవసరమైన షేర్లలో కేవలం కొన్ని షేర్లను కొనుగోలు చేయడం ద్వారానే హోల్డింగ్ కంపెనీకి ఆధిపత్యం చెలాయించగల్గే అవకాశం ఉంటుంది కాబట్టి. హోల్డింగ్ కంపెనీకి సొంత బిజినెస్ అంటూ ఏమీ ఉండదు పేరెంట్ కంపెనీ (మాతృ సంస్థ) పరిస్థితి వేరు. పేరెంట్ కంపెనీకి ప్రత్యేకించి సొంత వ్యాపారాలుంటాయి

**Hot Issue** - గిరాకీ ఇస్యూ : బాగా గిరాకీలో ఉన్న కొత్త పబ్లిక్ ఇస్యూను ఇలా అంటారు. హెచ్చు ప్రీమియమ్ వసూలు చేసుకోవడం దాని ప్రధాన లక్షణం (ఉదా: టాటా హనీవెల్, కొచిన్ రిఫైనరీలు) ఇంతవరకూ కనీ

వేరీ ఎంతసంత డిమాండ్‌లో ఉన్న ఇష్యూ జాబా జిమ్మిక్ (40710 3 రెట్లు ఓవర్ సబ్‌స్క్రైబ్ అయింది) అంటారు!

**Hype** - అత్యుత్సాహంతో ప్రచారం : స్టాక్ బ్రోకర్ల సహాయంతో తరచుగా కంపెనీలు తమ షేర్లను మార్కెట్ చేసుకోడానికి పెద్ద ఎత్తున అతిగా ప్రచారం చేయడాన్ని 'హైప్' అంటారు. తమ షేర్ల ధర పెరిగిపోతుందనీ, ఎంత ఎక్కువమంది షేర్లతో ఎక్కువ షేర్లు కొంటే అంత మంచిదనీ, మళ్ళీ ఈ అవకాశం రాదనీ బ్రోకర్లు ప్రచారం చేస్తారు. ఇలాంటి ప్రచారం వల్ల ప్రమోట్ అయ్యే షేర్లనే "Hyped up shares" అంటారు. 1989లో కొన్ని పెద్ద ప్రీమియమ్‌తో విడుదలైన షేర్లలో హెచ్చు షేర్ల ధరలు దారుణంగా పడిపోయాయి. కొన్నింటిని ఇష్యూ ధర కంటే తక్కువ రేటుకు అమ్మజూపవలసి వచ్చింది.

**Hyperinflation** - మితిమీరిన ద్రవ్యోల్బణం : నెలకు 50 శాతం లేదా అంతకుమించిపోయి ధరలు చుక్కలంటినప్పటి పరిస్థితిని ఇలా అంటారు. ఉదా: 1945-46లో హంగరీలో ధరలు నెలకు 19,800 శాతం పెరిగి పోయాయి. హైపర్ ఇన్‌ఫ్లేషన్‌లో ఇది రికార్డు!

**Hypothecation** - తాకట్టు : రుణం తీసుకున్నప్పుడు రుణ గ్రహీత తన ఆస్తులను తాకట్టు పెట్టడం.

**Impasse** = ప్రతిష్టంభన

**Incentives** = ప్రోత్సాహకాలు : ఇది రొఖ్ఖం రూపంలోగానీ లేదా బహుమానం రూపంలోగానీ లేదా నైతికమైన ప్రోత్సాహంగాగానీ ఉండవచ్చు

**Incentives** = ప్రోత్సాహకాలు (కార్మికుల సామర్థ్యాన్ని పెంచడానికి యాజమాన్యం ఆశచూపే ఆర్థిక ప్రయోజనాలు)

**Indemnity** = పరిహారం చెల్లింపు

**Indent House** = ఇండెంట్ సంస్థ (విదేశీ వ్యాపారంలో మధ్యవర్తిత్వాన్ని నెరపే సంస్థ)

**Index** - ధరల సూచీ : షేర్-ధరల ఆటుపోటులను తెలిపే సూచీ / ప్రమాణం. ఇది కేవలం షేర్ ధరల నగటు సూచీ కాదు. ఒక్క స్క్రిప్‌కు ఎన్ని షేర్లు మిగి వున్నాయో గణిస్తుందీ సూచీ. కేవల ధరలో మార్పునుబాకుండా షేర్ ధరలో మార్పును కాకుండా షేర్ ధరల విలువలో ఎంత మార్పు వచ్చిందో తెలుసుకోవడానికి ఈ సూచీ పనికొస్తుంది. ప్రపంచంలో ఇలా షేర్ ధరల సూచీలలో ప్రసిద్ధమైనవి - న్యూయార్క్‌లో ఉన్న డౌజోన్స్ ఇండస్ట్రియల్ యావరేజ్, "స్టాండర్డ్ & పూర్స్ 500", లండన్‌లోని ఫైనాన్షియల్ టైమ్స్ స్టాక్ ఎక్స్ఛేంజి 100, ఇండియాలోని ఎకనామిక్ టైమ్స్, ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్, బిజినెస్ స్టాండర్డ్, బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజి

**Indexing** = సూచీ : చెల్లింపులను (బాండ్లు, వేతనాలు, పెన్షన్ సౌకర్యాలు వగైరాలు) లేదా పన్నులను కొనుగోలుదార్ల ధరలను సూచీకి ముడిపెట్టడంద్వారా ద్రవ్యోల్బణం స్థితిని అంచనా కట్టడాన్ని ఇలా అంటారు

**Indian Stock Exchanges** - ప్రధాన ఎక్స్ఛేంజిలు నాలుగు : బొంబాయి, కలకత్తా, మద్రాసు, ఢిల్లీ. మిగతావి : అహ్మదాబాద్, బెంగుళూరు, కొచ్చిన్, కాన్పూర్, హైదరాబాద్, ఇండోర్, పూనే, లూధియానా, గౌహతి, మంగుళూరు, పాట్నా, జైపూర్, భువనేశ్వర్, సౌరాష్ట్ర, వదోదం, సూరత్, రాజ్‌కోట, కోయంబత్తూరు, విజయవాడ, మీరట్

**Industrials** - ఉత్పాదక షేర్లు : పెక్కు వస్తువులలో ఏ వస్తువునైనా లేదా వస్తువునయినా తయారు చేసే కంపెనీల షేర్లను ఇలా అంటారు. అయితే "ఇండస్ట్రియల్" జాబితాలోకి గ్యాస్, టెలిఫోన్, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా వగైరా ఉపయుక్తాలు (Utilities) గానీ, కన్సల్టెన్సీ, ఆరోగ్య రక్షణ, పర్యాటన వగైరా సర్వీసులు గానీ, రోడ్డు, సముద్ర, విమాన మార్గాల ద్వారా జరిగే రవాణా గానీ, లీడింగ్, రియల్ ఎస్టేట్ వగైరా పెట్టుబడి సంబంధమైన కార్యకలాపాలుగానీ రావు.

**Inflation** - నోట్ల ముమ్మరం / ద్రవ్యోల్బణం : సరకుల ధరలు పెరుగుతూ, డబ్బు విలువ పతనమైపోయే పరిస్థితి. ఉదాహరణకు ఆదాయాలు పెరగడం అంటే డబ్బు చెలామణీ పెరగడం. కాని డబ్బు చెలామణీ పెరుగుదల నిలిచిపోతే లేదా సరకుల లావాదేవీలు పెరిగిపోతే అప్పుడు ధరలు పెరిగే అవకాశం ఉంది. రాబడి ఖర్చు తగ్గిపోయినప్పుడు (లేదా దొంగ నిల్వలు పెరిగిపోయినప్పుడు) సరకుల మారకం మందకొడిగా

సాగుతున్నప్పుడు కూడా ధరలు పెరుగుతాయి ఖర్చు పెరిగిపోవడాన్ని "డిమాండ్ పుల్" అంటారు (గిరాకీ దెబ్బ)! డబ్బు చెలామణీ జాస్తీగా ఉన్నప్పుడు ఈ పరిస్థితి ఉంటుంది అలాగే ఎక్కువ సరకులు అమ్ముడు పోయిన ఫలితంగా ఎక్కువ డబ్బు చెలామణీ లోకి వచ్చినప్పుడు కూడా ఇలాంటి పరిణామమే వస్తుంది దీన్ని 'చలామణీ వేగం' అంటారు లేదా 'డిమాండ్ ఇన్‌ఫ్లేషన్' అంటారు

**Inflation and the Rupee** = ద్రవ్యోల్బణం / రూపాయి విలువ : రకరకాలుగా మారిపోతున్న ఇన్‌ఫ్లేషన్ రేట్ల వత్తిడి ఫలితంగా నేటి కొనుగోలు శక్తిని ఆధారం చేసుకొని రూపాయి విలువను గుణించడం జరుగుతుంది *(దీనికి సంబంధించిన పట్టికను ఈ అధ్యాయము చివరి పేజీలో చూడగలరు)*

**Inflation Hedge** = పెరిగే ఇన్‌ఫ్లేషన్ రేటును తట్టుకొని మార్కెట్‌లో నిలబడగల ఆస్తిని (ASSET) ఇలా అంటారు అంటే, ఇన్‌ఫ్లేషన్ కాలంలో కూడా ఆసామి తన కొనుగోలు శక్తికి దెబ్బ రాకుండా నిలబెట్టుకోగల ఆస్తి అన్నమాట ఇన్‌ఫ్లేషన్ దెబ్బను తట్టుకోగలవి స్టాక్స్, షేర్స్ అని విశ్వాసం రియల్ ఎస్టేట్, రత్నాలు, బంగారం, వెండి వగైరా విలువ ఎప్పటికప్పుడు పెరుగుతూ ఉండే వస్తువులు అయితే సామాన్య మానవుడికి ఇవి అందుబాటులో వుండే సరుకులు కాదు

**Inflationary Gap** = సరకు గిరాకీ ఒత్తిడిని బట్టి ధరల స్థాయి పెరుగుతూండడం (లేదా, ఉత్పత్తిదారులను పూర్తిగా పనికల్పించేందుకు అవసరమైన ఖర్చుకంటే మించిన ఆదాయ ఖర్చును కూడా 'ఇన్‌ఫ్లేషనరీగాప్' అంటారు

**Infrastructure** = ఉపాంగాలు / ప్రాథమిక సౌకర్యాలు : ఆర్థిక రంగ కార్యకలాపాలు, పారిశ్రామిక ఉత్పాదక శక్తికి సజావుగా సాగడానికి ఏర్పడే రోడ్లు, వంతెనలు, విద్యుచ్ఛక్తి, కర్మాగారాలు వగైరా ప్రాథమిక ఉపాంగాలు అవసరం.

**Insider** = కూపీదారు / వ్యాపార విజ్ఞాని : ఇతరులకు లేని వ్యాపార పరిజ్ఞానం ఉన్న వ్యక్తిని 'ఇన్‌సైడర్' అంటారు ఇతను కార్పోరేట్ ఆఫీసరైనా కావొచ్చు కంపెనీ అవుట్‌సైడ్ అక్కౌంటెంట్ తాలూకు బావ మరదైనా కావొచ్చు! ఈ కూపీదారు కంపెనీ లోపల ఉంటూనే బయటి వారికి ఇవ్వకూడని సమాచారాన్ని ఇస్తూంటాడు ఇతరులకు ఇలా కంపెనీ సమాచారాన్ని చట్ట విరుద్ధంగా అందజేసే ఇన్‌సైడర్‌ను "టిప్పీ" (Tippee) అని కూడా అంటారు ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడంటారు అలాంటివాడు ఇన్‌సైడర్!

**Insider Trading** = చట్ట విరుద్ధ లావాదేవీ : కంపెనీ విస్తరణ పదకాలు, ద్రవ్య సంబంధమైన లాభనష్టాలు, కంపెనీ స్వాదీనపు ప్రయత్నాలు వగైరా కంపెనీ తాలూకు లోగుట్టు సమాచారాన్ని తెలుసుకుని, అది ఆధారంగా కంపెనీ షేర్ల క్రయ విక్రయాల ద్వారా స్టాక్ ఎక్స్ఛేంజీలో లాభాలు గడించ జూపడాన్ని "ఇన్‌సైడర్ ట్రేడింగ్" అంటారు

**Issued Capital** = పరిమిత వాటాల విడుదల (ప్రాథమిక నియమావళిలో పేర్కొన్న మొత్తమంతా కంపెనీకి అవసరం ఉండదు అవసరమైన మేరకే వాటాలు జారీ చేస్తారు వీటిని అమ్మజూపుతారు ఇలా అమ్మజూపే వాటాలనే ఇస్యూడ్ కాపిటల్ అంటారు

**Intangible assets** = కనిపించని ఆస్తులు

**Intellectual Property** = మేధా సంపత్తి : పేటెంట్లు, కాపీ రైటు, సాంకేతిక పరిజ్ఞానం (technical know-how) వగైరా ఈ సంపద క్రిందికి వస్తాయి

**Inventory** = కంపెనీ వద్ద నిల్వతేలే ముడి సరుకులు, ఇతర సామాగ్రి వగైరా విలువ ఈ విలువను కంపెనీ బ్యాలెన్స్ షీట్స్‌లో ఎప్పటికప్పుడు నమోదు చేస్తారు స్థూలంగా చెప్పాలంటే - షేర్ సెక్యూరిటీ నికర విలువను ఇన్వెంటరీ అంటారు

**Inventory** = మొత్తం నిల్వ ఉన్న సరుకు : రకరకాల సరకుల మొత్తాన్ని లేదా వాటి మొత్తం విలువనూ కలిపి 'ఇన్వెంటరీ' అంటారు సరకునకు సంబంధించిన కౌంటింగ్, లిస్టింగ్, వాటి ధరవరలు, విడి విడి సరుకుల జాబితా (లిస్టింగ్) నూ కలిపి ఇలా అంటారు "ఇన్వెంటరీ" నాలుగు రకాలు "ఫినిష్డ్ గుడ్స్" (కొనుగోలుదారుకోసం అమ్మకానికి సిద్ధంగా ఉన్న సరకు) "వర్క్ ఇన్ ప్రోసెస్" (ముడి సరకు తగినంత లేక

ఉత్పత్తి రంగంలో ఉన్న ఖర్చు), "రామెటీరియల్స్" (ముడిసరుకు ఖర్చు), 'ఇండైరెక్ట్ మెటీరియల్స్" (పనిముట్లు, గ్రీజ్ వగైరా అదనపు ఖర్చుతో కూడిన ఖర్చు)

**Invoice** = సరుకు / వాణిజ్య పత్రం ఇన్వాయిస్ కొనుగోలుదారుడు, అమ్మకందారుకు మధ్య జరిగే లావాదేవీలకు సంబంధించిన వర్తక పత్రం దీనిని (a bill for merchantise) విక్రయదారే సిద్ధం చేస్తాడు

**Jobber** = షేర్ల లావాదేవీలు జరుపుతూ స్టాక్ ఎక్స్చేంజిలో నిర్దిష్టమైన ట్రేడింగ్ కేంద్రం వద్ద ఉండే వ్యక్తి షేర్ల క్రయ విక్రయాలను స్వల్పమైన ధర తేడాతో నిర్వహిస్తుంటాడితడు షేర్ ధరల మధ్య తేడాను "స్ప్రెడ్" అంటారు

**Jobber** = జాబర్ : ఇతను బ్రోకర్ కంటే బిన్నమైనవాడు బ్రోకర్ తన "పార్టీల" (క్లయింట్స్) తరపున షేర్లు క్రయ విక్రయాలు చేస్తుంటాడు కాగా "జాబర్" పని తన సొంత అక్కౌంట్‌లో షేర్ల క్రయ విక్రయాలను సాగిస్తాడు అంటే కొంత రిస్క్ తీసుకొనైనా సరే తన అక్కౌంట్ పేరిట షేర్ల వ్యాపారం చేస్తున్నందుకుగాను విక్రయ ధరకు - క్రయ ధరకు మధ్య ఉన్న తేడా వల్ల తాను లాభించజూస్తాడు జాబర్ బొంబాయి ఎక్స్చేంజిలో మాత్రం తరచుగా బ్రోకరే జాబర్‌గానూ, ఇతడే అతనుగానూ వ్యవహరించడం కద్దు.

**Joint Venture** = ఉమ్మడి వ్యాపారం : రెండు కంపెనీల మధ్య సహకార యత్నాన్ని(కొలాబొరేషన్) ఇలా అంటారు ఇది భాగస్వామ్యం (పార్ట్‌నర్‌షిప్) కాదు ఉదా : పరస్పరం టెక్నాలజీని లేదా సర్వీసులను సవ్యంగా చాకచక్యంగా ఉపయోగించుకునేందుకు భారతీయ కంపెనీకి, ఒక విదేశీ కంపెనీకి మధ్యకుదిరే సహకార పద్ధతిని ఇలా అంటారు ఉభయులకూ సదరుకంపెనీలో ఈక్విటీ ఉంటుంది

**Journal** = చిట్టా

**Kerb trading** = అనధికార లావాదేవీ : స్టాక్ ఎక్స్చేంజిలో ట్రేడింగ్ పని గంటలు ముగిసిన తర్వాత అనధికారికంగా జరిపే షేర్ల క్రయ విక్రయ లావాదేవీని ఇలా పిలుస్తారు

**Keynesiamism** = జాన్ మేనార్డ్ కీన్స్ (1883-1946) సుప్రసిద్ధ బ్రిటీష్ ఆర్థిక శాస్త్రవేత్త ఆయన రూపొందించిన సిద్ధాంతాన్ని 'కీన్సియనిజం' అంటారు 1920లలో, 1930లలో ఆచరణ యుక్తమైన రాజకీయాలలో తలమున్కలుగా పాల్గొని ఆర్థిక సంక్షోభాల పరిష్కారానికి మార్గాలు వెతికిన వాడు ఆయిన ప్రసిద్ధ సిద్ధాంత రచన - "జనరల్ దిరీ ఆఫ్ ఎంప్లాయ్‌మెంట్, ఇంటరెస్ట్, అండ్ మనీ" నిరుద్యోగ సమస్యకు పరిష్కారంగా ప్రభుత్వం సంక్షేమ పథకాలకు ఎక్కువ ఖర్చు చేయాలని, ఇందుకోసం బడ్జెట్ లోటు ఏర్పడినా ఫర్వాలేదనీ, సంక్షోభాలను, ద్రవ్యోల్బణ పరిస్థితులను తప్పించేందుకు ప్రభుత్వాలు ఆర్థిక వ్యవస్థను కంట్రోల్ చేస్తూ అవసరాన్నిబట్టి సర్దుబాట్లు చేసుకోవాలనీ ఈయన ప్రతిపాదించాడు నోట్ల చెలామణిని పెంచడం ద్వారా లోటు బడ్జెట్ల సృష్టికి ఈయన సిద్ధాంతమే ప్రాతిపదిక అయింది.

**Land Ceiling** = భూ గరిష్ఠ పరిమితి

**Leading Economic Indicators** = దేశంలో బిజినెస్ లావాదేవీలను ఆర్థిక వ్యవస్థ ప్రభావితం చేస్తుంటుంది అలాంటి దేశ ఆర్థిక వ్యవస్థపైన షేర్ మార్కెట్ ధరల పెరుగుదల, పతనం ఆధారపడి వుంటుంది జాతీయోత్పత్తుల మొత్తం విలువలో వచ్చే మార్పును జాతీయార్థిక వ్యవస్థలో పొడసూపే ప్రగతి, పతన స్థాయినీ కొన్ని మాసాల ముందుగానే ఉజ్జాయింపుగా పసికట్టే సూచీలు కొన్ని వున్నాయి అవి: గృహ నిర్మాణ కార్యకలాపాలు, మన్నిక ఉన్న సరకుల కోసం కొత్తగా గిరాకీ పెరగడం, ఓవర్‌టైమ్ సహా సగటున వారంలో చేసే పని దినాలు, స్టాక్ మార్కెట్‌లో "బేర్-బుల్" కార్యకలాపాలు దేశీయ ఆర్థిక వ్యవస్థ తీరు తెన్నులను "బేర్స్", "బుల్స్" కార్యకలాపాలే తెలుపుతూంటాయి

**Leaf Ledger** = విడి విడి అవర్జాలు

**Ledger** = అవర్జా

**Letter of Credit** = హామీ (రుణ) పత్రం, పరపతి పత్రం

**Letter of Indent** = ఇండెంట్ పత్రం (విదేశీ వ్యాపారంలో వుపయోగించే హామీ పత్రం)

**Lien** = ఆస్తిహక్కు : ఋణం ఇచ్చినవాడికి, పుచ్చుకున్నవాడి ఆస్తిపైన వుండే హక్కును "లీన్' అంటారు సెక్యూర్డ్ డిబెంచర్లు సహా సెక్యూర్డ్ రుణ పత్రాలున్న రుణదాతలందరికీ కంపెనీ ఆస్తులపైన హక్కు ఉంటుంది కంపెనీ చిక్కుల్లో పడ్డప్పుడు కంపెనీ ఆస్తిని అమ్మి సొమ్ము చేసుకొనె హక్కు రుణ దాతలకు ఉంటుంది రుణం తీరుమానం కాగానే కంపెనీ ఆస్తిపై షేర్ హోల్డర్ హక్కు రద్దు అవుతుంది

**Limited Liability** = పరిమిత బాద్యత : కంపెనీలో షేర్ హోల్డర్ ఒక మేరకు కంపెనీ యజమానికిందె లెక్క ఆ మేరకు అతనికి కంపెనీ లాభాల్లో వాటా ఉంటుంది కంపెనీకి నష్టాలొస్తే, షేర్ హోల్డర్‌కు డివిడెండ్ రాదు నష్టాలకు షేర్ హోల్డర్ బాధ్యత పరిమితమే మా అయితే అతను షేర్ల రూపంలో పెట్టిన డబ్బు పోతుంది కాని అతని పేరిట ఉన్న ఆస్తులకు నష్టమూ లేదు వాటిని ముట్టుకొనే వారూ ఉండరు

**Liquid** = రొఖ్ఖం / ద్రవ్యం : సాధారణ వ్యాపారానికి సరిపడా ఉన్న డబ్బు వ్యాపారం సజావుగా ఉంటే "లిక్విడ్" అనీ, వ్యాపారం దెబ్బతిని ('డెడ్') కంపెనీని ఎత్తివేయడం "లిక్విడేటెడ్" అనీ అంటారు దివాళా ఎత్తించే ముందు మిగిలిన కంపెనీ ఆస్తుల్ని అమ్మి సొమ్ము (క్యాష్) చేసుకోడాన్ని కూడా "లిక్విడేట్" అంటారు

**Liquid assets** = చరాస్తులు (నగదు, బ్యాంకు నిల్వ, పెట్టుబడులు) ★ రొక్కంలోకి మార్చుకోగల క్యాష్‌గాని, బిల్లుల్నిగాని ఇలా అంటారు

**Liquidity** = ద్రవ్యత (1) కంపెనీ ఆస్తుల్ని తేలిగ్గా, క్యాష్‌లోకి మార్చుకోవడం ఆస్తి అప్పుల పట్టీలను, ఆస్తుల వివరాలను 'ద్రవ్యత' ప్రాతిపదికపై పొందుపరుస్తారు (2) విదేశీ వాణిజ్యంలో అంతర్జాతీయంగా ఒకదేశపు కొనుగోలు శక్తిని కూడా 'లిక్విడేట్' గా పరిగణిస్తారు

**Liquidity** = ద్రవ్యత (ఆస్తులను ధనరూపంలోకి మార్చడానికి వుండే వీలును ఇలా పిలుస్తారు).

**Live Stock** = పశు సంపద

**Liquidity** = ద్రవ్యత : చేతిలో సిద్ధంగా రొఖ్ఖం ఉండడం / లేదా వెంటనే రొఖ్ఖంగా మార్చుకొనడానికి వీలైన ఆస్తులు వుండడాన్ని 'లిక్విడిటీ' అంటారు ఆస్తిని అయినకాడికి తెగనమ్మి క్యాష్ చేసుకోవడం తేలికే కావచ్చు కానీ ఆస్తి విక్రయం ద్వారా తగినంత క్యాష్ రావాలంటే మాత్రం సరియైన మార్కెట్ ధరకు ఆస్తిని అమ్మకగలగాలి

**Listed company** = స్టాక్ ఎక్స్చేంజిలో కొనడానికి లేదా విక్రయించడానికి వీలైన షేర్లు ఉన్న కంపెనీని ఇలా అంటారు

**Listed Shares** = స్టాక్ ఎక్స్చేంజిలో నమోదైన (రిజిస్టరయిన) కంపెనీల షేర్లను ఇలా అంటారు

**Locked In** = స్తంభిత షేర్లు : కంపెనీల చట్టంలోని 80 సిసి నిబంధన ప్రకారం పన్ను రాయితీలు పొందాలంటే మూడేళ్ళపాటు షేర్లు అమ్మకూడదు కనుక లాభానికి విక్రయించడానికి వీలు కాని షేర్లను (స్తంభిత షేర్లు) ఇలా అంటారు లేదా, లాభాపేక్ష కొద్దీ షేర్ల విక్రయానికి దిగేవారిపైనా పెద్ద మొత్తంలో పన్ను పడుతుంది స్తంభిత షేర్ల విలువ మార్కెట్ ఆటుపోటుల వల్ల తరచుగా కోతపడిపోతుంటుంది

**Lot** = షేర్ల పొత్త / పొతిక : నిర్ణీతమైన కనీస సంఖ్యను ఇలా అంటారు ఒక్క పొతికగా షేర్లను అమ్మడాన్ని, కొనడాన్ని 'లాట్' అంటారు ఉదా: ఒక్క కట్టలో 5-10 లేదా 100 షేర్లు ఉంటాయి షేర్ల మొఖ (కనిపించే) విలువను బట్టి ఈ పొతికలను ఏర్పాటు చేస్తారు పైన పేర్కొన్న సంఖ్యలో వున్నవాటిని 'రౌండ్ లాట్స్' అనీ, అంతకన్నా తక్కువ సంఖ్యలో ఉన్న వాటిని "ఆడ్ లాట్స్" అనీ అంటారు

**Luxury tax** = విలాసపు పన్ను

**M1** = సప్లయిలో ఉన్న డబ్బుకు ఇదొక కొలమానం దాని కిందకు చెలామణిలో ఉన్న అన్ని రకాల నాణాలు, కరెన్సీ నోట్లు, వ్యక్తుల కరెంట్ అక్కౌంట్లు వస్తాయి

**M2** = దీని కిందకు M1 మనీ సప్లయి కొలమానంతో పాటు వ్యక్తుల (పర్సనల్) డిపాజిట్ అక్కౌంట్లు కూడా వస్తాయి.

**M3** = దీని కిందకు M2 ప్రమాణం సహా గవర్నమెంటు డిపాజిట్లు, రూపాయి మినహా మిగతా కరెన్సీలలో వున్న అన్ని డిపాజిట్లు వస్తాయి

**M3 Rupee** = ఈ ప్రమాణం కిందకు, రూపాయేతర కరెన్సీలలో ఉండే డిపాజిట్లు మినహా అన్ని రకాల టర్మ్

డిపాజిట్లు ఉంటాయి ఇందులో ప్రయివేట్, పబ్లిక్ రంగాలకు చెందిన అన్ని రకాల కరెంట్, డిపాజిట్ అక్కౌంట్లూ వస్తాయి

**Maastrich Treaty** = ఆర్థిక సమాఖ్యగా యూరోపియన్ యూనియన్ అవతరణకు పునాదులు వేసిన సంధి (ఇది డెన్మార్క్‌లోని యాస్ట్రిక్‌లో కుదిరింది) ఇందులో సభ్యులు : జర్మనీ, ఫ్రాన్స్, డెన్మార్క్, నార్వే, స్వీడన్, ఫిన్లాండ్, ఆస్ట్రియా, స్విట్జర్లాండ్, పోలెండ్, హంగరీ, రుమేనియా, బల్గేరియా, స్లొవేకియా, సైప్రస్, మాల్టా

**Manfactured goods** = ఉత్పాదన వస్తువులు

**Market Price** = మార్కెట్ ధర

**Master Shares** = ఘరానా షేర్లు : యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా (UTI) తలపెట్టిన మ్యూచువల్ ఫండ్స్ తాలూకు షేర్లను ఇలా అంటారు 1986లో మ్యూచువల్ ఫండ్ ఏర్పడింది షేర్ ఒక్కింటికి రూ 10ల చొప్పున 15 కోట్ల షేర్లతో రూ 150 కోట్లు ప్రాథమిక పెట్టుబడితో ఈ ఫండ్ ప్రారంభించారు "రైట్స్" ఇస్యూ ద్వారా షేరుకు రూ 2ల ప్రీమియమ్‌తో 1989లో మరి రూ 90 కోట్లు సమీకరించారు "మాస్టర్ షేర్స్"ను అన్ని ప్రధానమైన స్టాక్ ఎక్స్చేంజీలలోనూ రిజిష్టర్ చేస్తారు. భారతీయ స్టాక్ మార్కెట్‌లో ఈ మాస్టర్ షేర్స్ కీలకమైన పాత్ర వహిస్తున్నాయి.

**Mega Issue** = బడా ఇస్యూ : అనేక వందల రూపాయల విలువ గలిగిన షేర్లు / డిబెంచర్లతో విడుదలయ్యే ఇస్యూను ఇలా అంటారు దుర దృష్టవశాత్తు కొన్ని కంపెనీలు తమ ఘరానా తనాన్ని చాటుకోవడం కోసం తగిన సమర్థత లేకుండానే ఇలాంటి మెగా ఇస్యూలు ప్రారంభించాయి. దెబ్బతిన్నాయి

**Memorandum of Association** = విజ్ఞాపన పత్రం (కంపెనీలు రిజిస్టర్డ్ అయ్యే సమయంలో ఈ పత్రాన్ని రిజిస్ట్రార్‌కు ఇవ్వాలి)

**Mercantile** = వాణిజ్య సంబంధమైన (వ్యాపారం) : సరకుల క్రయ విక్రయాలు

**Merchant Banking** = సాధారణ ప్రజానీకం బ్యాంకింగ్ అవసరాలను చూసే కమర్షియల్ బ్యాంకు లను, మర్చంట్ బ్యాంకులకూ తేడా ఉంది. చారిత్రికంగా మర్చంట్ బ్యాంకుల ప్రధాన వ్యాపకం ఎగుమతి-దిగుమతి వ్యాపారం అయితే ఇటీవల కాలంలో మర్చంట్ బ్యాంకులు పరిశ్రమలకు ఇంటా బయటా ఆర్థిక సహాయం కూడా సమకూర్చిపెట్టే వ్యాపకానికి దిగాయి చివరికి అద్దె - కొనుగోలు పథకాలకు ఫైనాన్సింగ్ సౌకర్యం కూడా కల్పిస్తారు కంపెనీ తరపున ఇవి కొత్త డిబెంచర్లను, షేర్లను కూడా సేకరించే సాధనాలుగా ఉన్నాయి కంపెనీల టేకోవర్‌లు, కంపెనీల విలీనీకరణ కార్యకలాపాలు కూడా మర్చంట్ బ్యాంకులు నిర్వహిస్తున్నాయి

**Merger** = విలీనం : రెండు లేదా అంతకు మించిన కంపెనీల / సంస్థల విలీనం (కంపెనీలను, రైట్స్, కాంట్రాక్టులు ఇలా విలీనం అవుతాయి ఈ విలీనం రకరకాలు: వ్యాపారంలో ఉన్న పోటీదారులు గనుక ఒకే ప్రాంతంలో ఒకే రకం సరకును విక్రయించడాన్ని "హారిజాంటల్ మెర్జర్" అంటారు కంపెనీ కొనుగోలు దార్లతో / సప్లయిదార్లతో చేతులు కలపడాన్ని వెర్టికల్ మెర్జర్ అంటారు బొత్తిగా సంబంధం లేని కంపెనీలు చేతులు కలిపినప్పుడు కంగ్లామెరేట్ మెర్జర్ అంటారు ఇలా ఇంకా ఎన్నో రకరకాలున్నాయి

**Middleman** = మధ్యదళారీ

**Middlemen** = మధ్య దళారీ (వ్యాపార పరిభాషలో మాత్రమే)

**Military goods** = సైనికావసర సరకులు

**Misery Index** = దారిద్ర్య సూచీ

**Modavat** = సవరించిన 'వాట్': వాల్యూయాడెడ్ టాక్స్‌ను మోడిఫై చేసినందున ఈ పేరు

**Money Supply** = ద్రవ్య సరఫరా /డబ్బు సరఫరా: డబ్బు అనేక రూపాల్లో ఆర్థిక వ్యవస్థలో రంగు తిరుగుతూ ఉంటుంది నోట్ల రూపంలో, నాణాల రూపంలో ద్రవ్య సరఫరాలో వచ్చేమార్పులను బట్టి ఆర్థిక వ్యవస్థలో వచ్చే పరిణామాలను గణిస్తుంటారు ఉదా: ద్రవ్య సరఫరా అమితంగా పెరిగిపోయినప్పుడు ఇన్‌ఫ్లేషన్ పెరుగుతుంది ఎగుమతి - దిగుమతి వాణిజ్య చెల్లింపుల సమతౌల్యం దెబ్బతింటుంది కొనుగోలుదార్ల ఖర్చుకు ద్రవ్య సరఫరా ఒక నిదర్శనమైనా ద్రవ్య సరఫరాకూ ఇన్‌ఫ్లేషన్‌కూ సంబంధం ఉన్నందున ధరలను అదుపు చేయదలచిన ప్రభుత్వం చేతుల్లో ద్రవ్య సరఫరాను కంట్రోలు చేయడం అనేది ఒక

ఆయుధంగా తయారైంది. కాని ఆధునిక ప్రభుత్వాలు ఇందులో విఫలమవుతున్నాయి కంట్రోల్ చేయనప్పుడు లోటు ద్రవ్య విధానాలకు, లోటు బడ్జెట్లకు సిద్ధం కాక తప్పదు

**Monetary Policy** = ద్రవ్య నియంత్రణ (డబ్బు చెలామణీ) ఆర్థిక ప్రగతి, అందరికీ ఉపాధి కల్పన, ధరల స్థిరీకరణ, అంర్జాతీయ ద్రవ్య చెల్లింపుల సమతుల్యత ఇత్యాది నిర్దిష్ట లక్ష్యాలను సాధించేందుకు అనుగుణంగా ప్రభుత్వం చేపట్టే ద్రవ్య నిర్వహణ విధానం ఈ పాలసీ నిర్ణయాన్ని మూడు ప్రాథమిక అంశాలు శాసిస్తుంటాయి (1) చెలామణిలో ఎంత డబ్బు ఉండాలో తేల్చే నిర్ణయాలు, 2) వడ్డీ రేట్లు ఎంత ఉండాలో చేసే నిర్ణయాలు, 3) పరపతి సౌకర్యాలు కల్పించే మార్కెట్ల, బ్యాంకింగ్ వ్యవస్థ పని తీరుతెన్నులకు సంబంధించిన నిర్ణయాలు. స్థూలంగా డబ్బు చెలామణీ, దాని నియంత్రణకు సంబంధించిన విధానమే మోనిటరీ పాలసీ

**Money market** = మనీ మార్కెట్ / ద్రవ్య విపణి

**Monopsony** = గుత్తేదారు మార్కెట్ : ఒకే ఒక కొనుగోలుదారు (క్రయదారు) ఉన్న మార్కెట్‌ను ఇలా అంటారు

**Monopsony** = క్రయ గుత్తాధిపత్యం: మార్కెట్‌లో అన్ని సరకుల కొనుగోళ్ళపైన ఒకే వ్యక్తి లేక కంపెనీ ఆధిపత్యం సంపాదించి పెత్తనం చెలాయించే పరిస్థితిని ఇలా అంటారు.

**Monroe doctrine**= (మన్రో సిద్ధాంతం) ఇతర అమెరికన్ రాష్ట్రాల అంతరంగిక వ్యవహారాలలో బయటవారి జోక్యాన్ని నిరోధించే అమెరికన్ సిద్ధాంతం ఈ సూత్రాన్ని ప్రతిపాదించిన వ్యక్తి ప్రెసిడెంట్ మన్రో (1823).

**Moonlight job** = డబ్బుకోసం రెండోపూట (సాయంత్రం) కూడా మరో ఉద్యోగం చేయడం ఇలా సంపాదించే డబ్బును సాధారణంగా ఆదాయపు పన్ను అధికారులకు తెలియనివ్వరు.

**Moratorium** = చెల్లింపుల వాయిదా : ఇవ్వవలసిన బకాయిల చెల్లింపులను తాత్కాలికంగా వాయిదా వేయడం

**Mortgage** = తాకట్టు, తనఖా

**Most-favoured nation (MFN)** = వాణిజ్య నిబంధనలు పకడ్బందీగా ఉన్న దేశం కమర్షియల్ కాంట్రాక్టుదశలో పరస్పరం ఇచ్చిపుచ్చుకునే నిబంధనల ప్రకారం తు చ తప్పకుండా నడుచుకొనేదేశం కాని అమెరికా ఈ సంప్రదాయాన్ని తారుమారు చేసి తనకు అనుకూలంగా సంస్కరణలు చేసిన దేశాన్ని మాత్రమే ఎమ్ ఎఫ్ ఎన్ అని పిలుస్తోంది తనకు అనుకూలమైనప్పుడే ఇతర దేశం 'గారాల' దేశం, కానప్పుడు 'దూరాల' దేశమే

**MOU** = అవగాహన పత్రం : రెండు పక్షాల మధ్య సాంకేతిక సహకారం వగైరా సహకారానికి దోహదపడే కాంట్రాక్టుకు సంబంధించిన అవగాహన పత్రాన్ని ఇలా అంటారు (Memorandum Of Understanding)

**Multinationals (MNCs)** = బహుళజాతి గుత్త సంస్థలు: ప్రపంచ వ్యాపితంగా తమ అనుబంధ సంస్థలున్న (subsidiary companies) బడా వ్యాపార సంస్థలను (కార్పొరేషన్లు) ఇలా అంటారు వీటి నిర్మాణం ప్రపంచ వ్యాపితం ఒక దేశంలో ఈ కంపెనీలు రిజిస్టర్ అయి ఉన్నప్పటికీ వాటి అనుబంధం ఆ దేశ స్థానిక పరిస్థితులనుబట్టి ఉంటుంది ఇలాంటి బహుళజాతి సంస్థలకున్న ప్రయోజనాలు - అంతర్జాతీయ స్థాయిలో తమ సరకుల మార్కెటింగ్, భారీ ఎత్తున పరిశోధన, అభివృద్ధి కార్యకలాపాలు, ప్రొడక్ట్ ప్రాశస్త్యాన్ని గురించి ప్రచారం చేయడం, కాగా వీటికున్న ఇబ్బందులు: దేశం కాని దేశంలో కంపెనీలు నిర్వహించడం వల్ల ఎదురయ్యే వ్యాపార ఇబ్బందులు (రిస్క్), ఒక్కోసారి స్థానికులు తిరగబడడం, పరిసరాల అననుకూలత, ఆపైన రాజకీయ పరమైన చిక్కులు, ఫలితంగా నిర్మాణ కార్యక్రమాలు దెబ్బతినడం, ఈ గుత్త సంస్థల ఆస్తుల స్వాధీన, సంస్కృతి బహిష్కరణ ఇత్యాదులు

**Multi-point tax** = అనేకచోట్ల పన్ను

**Multilateral trade** = బహుముఖ వాణిజ్యం

**Mutual Fund** = ఉమ్మడి నిధి, సంస్థ / సంయుక్త నిధి సంస్థ : ఇదొక పెట్టుబడి సమీకరణ సంస్థ ఇన్వెస్టర్ల డబ్బును సమీకరించి అనేక కంపెనీల షేర్లను ఈ సంస్థ కొనగోలు చేస్తుంది. తన షేర్లను

[illegible] ప్రజలకు అమ్మడం ద్వారా ఈ పని చేస్తుంది. ఇలాంటి మ్యూచువల్ ఫండ్స్ ఆ నిధి [illegible] విధానాలూ ఇప్పుడు ఎన్నో ఉన్నాయి ఉదా: యు టి ఐ, బి ఓ ఐ మ్యూచువల్ ఫండ్స్ వగైరా

**Muniments** = దస్తావేజులు

**Mutual Funds** = సెక్యూరిటీల బంగీ పథకం : ఈ ఫండ్స్‌ను ఇన్‌వెస్ట్‌మెంట్ కంపెనీలు, బ్యాంకులు నిర్వహిస్తుంటాయి. ఇవి డబ్బును షేర్‌హోల్డర్లనుంచి సేకరించి అనేక రకాల షేర్లు, డిబెంచర్లు, బాండ్లు, మనీ మార్కెట్లలో పెట్టుబడిగా ఉంచుతారు. ఇలా ఉమ్మడిగా ఇన్‌వెస్ట్ చేయడం అనేది నిర్దిష్ట కాలానికి పరిమితం కావొచ్చు లేదా నిరంతర వ్యాపకంగానూ కొనసాగించుకోవచ్చు. ఇంతకూ ఇన్‌వెస్టర్లకు ఒనగూడే ప్రయోజనం - వార్షిక డివిడెండ్లు, సరసమైన షేర్ విలువ ప్రోత్సాహకరంగా పెరగడానికి దోహదపడే రకరకాల సెక్యూరిటీలు తమ పేరిటనే ఉండడం. మ్యూచువల్ ఫండ్ వల్ల పెంపొందే సెక్యూరిటీలకు చిక్కులు చాలా అరుదు

**Necessaries** = అవసరాలు (కోర్కెలని అవసరాలు, సౌకర్యాలు, విలాసాలు - అనే మూడు రకాలుగా విభజిస్తారు)

**Negotiable instruments** = మారక పత్రాలు: చెక్కులు, నోట్లు, బిల్స్ ఆఫ్ ఎక్స్ఛేంజి వగైరా అన్నీ ఈ పత్రాల కిందకే వస్తాయి. అడిగినప్పుడుగాని లేదా ఫలానా తేదీకి డబ్బు చెల్లిస్తాననిగాని చెప్పినప్పుడు సదరు డబ్బును బేషరతుగా హామీ పడుతూ సంతకం చేసిన డాక్యుమెంటును 'నిగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్' అంటారు. (Payable "to the order of" or payable "to bearer" . . )

**Net Loss** = నికర నష్టం

**Net Profit** = నికర లాభం (ఫ్యాక్టరీలోనూ, ఆఫీసు నిర్వహణలోనూ పెట్టిన ఖర్చులను మినహాయించాక లెక్కకట్టే లాభం)

**New York Stock Exchange** = ప్రపంచంలో అతి ప్రాచీనమైన, పెద్దదైన స్టాక్ ఎక్స్ఛేంజి న్యూయార్క్ ఎక్స్ఛేంజి 1972లో న్యూయార్క్‌లోని 11 వాల్ స్ట్రీట్‌లో వెలిసింది. ఇక్కడ సగటున 2300 షేర్లు 'లిస్ట్' అవుతుంటాయి. అమెరికా స్టాక్ వ్యాపారంలో 60 శాతం ఇక్కడే జరుగుతూంటుంది. ఈ ఎక్స్ఛేంజికి మరో పేరు "బిగ్ బోర్డ్" / ఎక్ఛేంజి

**Nifty-Fifty** = ఇన్‌వెస్టర్లు ఎక్కువగా అభిలషించే 50 మరానా (Top-fifty) షేర్లకు అమెరికన్లు పెట్టిన ముద్దు పేరు. ఈ 'ఫిఫ్టీ' జాబితా నిరంతరం మారుతూ వుంటుంది

**Nominal account** = కల్పిత ఖాతా

**Nominal Value** = సాధారణ విలువ. షేర్ మౌలిక విలువే (Face Value) సాధారణ విలువ. ఉదా: షేర్ మౌలిక విలువ రూ. 10 ఉంటే దాని సాధారణ విలువ కూడా రూ. 10 అనే అర్థం

**Normal Loss** = సాధారణ నష్టం (ఎప్పుడూ జరిగే నష్టం. ఉదా: గాజు సామాగ్రి రవాణాలో ఎప్పుడూ కొంత శాతం నష్టం అనివార్యం)

**NYSE** = న్యూయార్క్ స్టాక్ ఎక్స్ఛేంజ్

**Offer Letter** = షేర్ల పబ్లిక్ ఇష్యూ కోసం కంపెనీలో విడుదల చేసే "కంపెనీ బాగోగుల పత్రా"న్ని (ప్రాస్పెక్టస్) 'ఆఫర్ లెటర్' అని కూడా అంటారు. షేర్లు విక్రయించే ముందు కంపెనీ ఈ పత్రాన్ని ప్రజలకోసం లాంఛనంగా విడుదల చేస్తుంది. ఇందులో ఉండే వివరాలు: కంపెనీ వ్యాపారం, ప్రమోటర్లు, బిజినెస్ కొలాబరేషన్, మేనేజిమెంటు, డైరెక్టర్ల బోర్డు వివరాలు, ప్రాజెక్టు ఖర్చు, ద్రవ్య సహాయం, ప్రాజెక్టు ఉత్పత్తి ఎప్పుడు ప్రారంభించేది, లాభం వచ్చే అవకాశం మొదలైన వివరాలు, ఇష్యూ పరిమాణం, లిస్టింగ్, షేర్ తీసుకున్నందువల్ల వచ్చే పన్ను రాయితీ, ఇష్యూకి అండర్ రైటర్స్, మేనేజర్స్ వివరాలు, ప్రాజెక్టు వల్ల తలెత్తే చిక్కులు (రిస్క్) వగైరా వివరాలూ

**Offer Price** = విక్రయ ధర : బ్రోకర్ అమ్మజూపే షేర్ల ధర. ట్రస్టు నుంచి యూనిట్లును కొనుగోలు చేసిన ధరను ఇలా అంటారు. ఇందుకు ఎంట్రీఫీ ఉండవచ్చు, లేకపోవచ్చు. కంపెనీ ఏ ధరకు ప్రజలకు షేర్లను ఆఫర్ చేస్తుందో ఆ ధరను కూడా "ఆఫర్ ప్రైస్" అంటారు

**Open market operations** = స్వేచ్ఛా విపణి కార్యకలాపాలు

**Open-end credit / Open Account** = అనియత పరపతి = ప్రతీదఫా పరపతికోసం ప్రత్యేక

ఏర్పాట్లు చేసుకోకుండా క్రయ, ఋణ సౌకర్యాలు పొందే ఏర్పాటు దీనిని "చార్జి అక్కౌంట్" అని కూడా అంబారు తరచుగా క్రెడిట్ కార్డుపై ఈ ఏర్పాటు జరుగుతుంది

**Open-ended Scheme** = స్వేచ్ఛా క్రయ పథకం: పబ్లిక్‌గా ప్రకటించిన ధరకు షేర్లను ఎవరైనా కొనుగోలు చేయడానికి వీలైన పథకాన్ని ఇలా అంటారు

**Option** = షేర్ల ఎంపిక: రేపటి రోజున లేదా నిర్దిష్టమైన ధరకు ఫలానా ప్రత్యేకమైన షేర్‌ను కొనాలా వద్దా అని నిర్ణయించుకునే అవకాశాన్ని "ఆప్షన్" అంటారు ఈ ప్రత్యేక హక్కును పొందేవారు కొంత డబ్బును చెల్లించాలి దానిని "ఆప్షన్ మనీ" అంటారు

**OTC** = ఓవర్ ది కౌంటర్ : అధికారికమైన స్టాక్ ఎక్స్ఛేంజీల పరిధిలోలేని, "లిస్ట్"కాని షేర్లను చెల్లుబడి చేసుకునేందుకు అవకాశం కల్పించే ప్రత్యేక మార్కెట్‌ను ఓటిసి అంటారు

**Over draft** = ఓవర్ డ్రాఫ్ట్ = తాత్కాలిక ఋణం (కరెంటు అక్కౌంట్ డిపాజిటర్లకు బ్యాంకులు ఈ సౌకర్యం కల్పిస్తాయి అయితే ఇందుకు గాను బ్యాంకు సమ్మతమైన భీమా పాలసీలు, షేర్లు వగైరా సెక్యూరిటీలను హామీగా డిపాజిటర్లు ఇవ్వాల్సి ఉంటుంది)

**Over heads** = పైఖర్చులు

**Oversubscribed** = అంచనాకు మించిపోయి సబ్‌స్క్రైబ్ కావడం : కంపెనీ నిర్దిష్టమైన సంఖ్యలో షేర్లను అమ్మజూపవచ్చు అలాంటప్పుడు షేర్లు కావాలని కోరుతూ వచ్చే దరఖాస్తుల సంఖ్య ప్రకటించిన షేర్ల సంఖ్యను మించిపోయినప్పుడు "ఇష్యూ"ను ఓవర్ సబ్‌స్క్రైబ్ అయిందంటారు

**Paid up Capital** = చెల్లించిన పెట్టుబడి : ఇన్వెస్టర్లకు షేర్లు అమ్మడం ద్వారా సమకూర్చిపెట్టే పెట్టుబడిని ఇలా అంటారు (సంపాదన ద్వారా లేదా సెక్యూర్డ్ రుణాలు లేదా అన్‌సెక్యూర్డ్ రుణాల ద్వారా పోగైన పెట్టుబడికీ దీనికీ తేడా వుంది)

**Paid up Capital** = చెల్లించిన షేర్ మూలధనం

**Paid up Capital** = చెల్లించిన మూలధనం

**Par** = షేర్ మౌళిక (సాధారణ) విలువకు ఇది మరో పేరు. "ఎట్ పార్" అంటే సరి సమాన విలువకు అని అర్థం. ఉదా: రూ. 10ల విలువగల షేర్లను సమా విలువకు "ఇష్యూ" చేశారంటే, షేర్ ఒక్కింటికి రూ 10 చొప్పున ఇవ్వ జూపారని అర్థం

**Parent Company** = మాతృ సంస్థ / ప్రధాన కంపెనీ : సబ్సిడియరీ కంపెనీలలో హక్కును వినియోగించుకొడానికి వీలు కల్పించే మెజారిటీ షేర్లను తనకు దఖలు పంచుకొనే కంపెనీని ఇలా అంటారు సదరు కంపెనీలను పేరెంట్ కంపెనీ సొంతం చేసుకోవచ్చు లేదా అజమాయిషీ (కంట్రోల్) వహించవచ్చు పేరెంట్ కంపెనీకి సర్వ సాధారణంగా సొంత వ్యాపారం ఉంటుంది (హోల్డింగ్ కంపెనీ వివరంచూడండి)

**Pari Passu** = సమాన హక్కు / సమాన హోదా : ఒక కంపెనీ తాలూకు డిబెంచర్లను షేర్లలోకి మార్చిన (కన్వర్షన్) తర్వాత అవి కొత్త షేర్లు అవుతాయి సదరు కంపెనీ తాలూకు డివిడెండ్లు, రైట్స్, బోనస్ షేర్లు కూడా పొందడానికి కంపెనీ ఇతర షేర్లకు ఎన్ని హక్కులుంటాయో అన్ని హక్కులూ ఈ కొత్త షేర్లకు కూడా ఉంటాయి అలాగే కంపెనీ లాభ నష్టాలను కూడా ఈ కొత్త షేర్లు పంచుకోవచ్చు

**Parking (Share)** = "షేర్ పార్కింగ్" : షేర్ బ్రోకర్ ఆకర్షవంతమైన ధరకు ఎక్కువ షేర్లు కొంటాడుగాని, తనవద్ద అంత మొత్తం చెల్లించడానికి తగిన డబ్బు లేనప్పుడు, ఆ లోటును భర్తీ చేసుకోడానికి ఆ షేర్లను మరో బ్రోకర్‌కి అమ్మజూపే (దొంగచాటు) లోపాయకారీ లావాదేవీని "షేర్ పార్కింగ్" అంటారు ఈ షేర్లు కొనుక్కునేవాడు దొరకగానే మరో బ్రోకర్‌నుంచి షేర్లు తిరిగి కొనుగోలు చేసి, కొంత కాలంపాటు షేర్లు దగ్గర అట్టిపెట్టుకొనేందుకు ఆ బ్రోకర్‌కు కొంత మొత్తం చెల్లిస్తాడు ఈ బ్రోకర్

**Parking** = భద్రస్థానం : ఇన్వెస్ట్ చేయడానికి తగిన ప్రత్యామ్నాయ ఏర్పాట్లు జరిగేవరకు లేదా కొత్త ఇన్వెస్ట్‌మెంట్లకు స్టాక్ మార్కెట్ పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు ఇన్వెస్టర్లు తమ ఆస్తులను సేఫ్ ఇన్వెస్ట్‌మెంట్స్‌లో ఉంచడాన్ని "పార్కింగ్" అంటారు

**Partly Secured Liability** = పాక్షిక హామీగల అప్పు

**Passed Dividend** = దాటవేసిన డివిడెండ్ : ఏటేటా సాధారణంగా ప్రకటించవలసిన డివిడెండ్‌ను

కంపెనీ ప్రకటించకుండా దాటవేసినప్పుడు ఇలా అంటారు

**Pension** = విరామ వేతనం (రిటైర్ అయినప్పుడు ముసలితనంలో కల్పించే సదుపాయం)

**Pledge** = కుదువ

**Poll tax** = 'తలపన్ను ' (అందరిమీద వేసే పన్ను)

**Polyopsony** = ఒక ప్రత్యేక వస్తువును కొద్ది మంది మాత్రమే విక్రయించే పద్ధతిని ఇలా అంటారు

**Preference shares** = ఆధిక్యపు వాటాలు

**Preliminary expenses** = సంస్థాపన ఖర్చులు

**Premium** = రుసుము / అడితి / షేర్ల విషయంలో అదనపు రేటు

**Price** = ధర (వస్తు, సేవల విలువను ధన రూపంలో చెబితే - అది 'ధర' అవుతుంది)

**Profit & loss Account** = లాభనష్టాల ఖాతా

**Profitability** = లాభదాయకత (ఆస్తుల అంచనాకి ద్రవ్యతతోపాటు లాభదాయకతను పరిగణలోకి తీసు కుంటారు)

**Property account** = ఆస్తి ఖాతా

**Prospectus** (కంపెనీ భాషలో) = పరిచయ పత్రం దీనినే "ఆఫర్ డాక్యుమెంట్" అంటారు

**Qualification Shares** = అర్హత వాటాలు

**Quid Proquo** = ఇచ్చిపుచ్చుకోవడం / ఆదాన ప్రదానాలు (ఒక విలువైన వస్తువు ఇచ్చి మరో విలువైన వస్తువును తీసుకునే పద్ధతి)

**Quorum** = సభ్యుల కనీస హాజరు : కంపెనీ బోర్డులో వోటింగ్, ఇతర కార్యకలాపాల నిర్వహణకు అవసరమైన కనీస సభ్యుల హాజరు

**Reflation** = నోట్ల విలువ పునరుద్ధరణ: డిఫ్లేషన్‌కు లేదా ఇన్‌ఫ్లేషన్‌కు ముందున్న ధరల స్థాయిని పునరుద్ధరించడాన్ని ఇలా అంటారు మరో మాటలో - నోట్ల ముమ్మరానికి, నోట్ల మాంద్యానికి ముందున్న ద్రవ్య ప్రమాణం (రూపాయి) /మోనిటరీ యూనిట్ విలువను పునరుద్ధరించడమే "రిఫ్లేషన్"

**Raw materials** = ముడి పదార్థాలు

**Real Price** = వాస్తవ ధర / సహజ ధర / అసలు ధర

**Reserve Capital** = సంచిత మూలధనం / నిల్వ ధనం

**Reserve for bad and doubtful debts** = రాని బాకీల నిధి (కొన్ని బాకీలు వసూలు కావన్న అనుమానంతో ఈ నిధిని ఏర్పాటు చేస్తారు )

**Retail outlet** = చిల్లర దుకాణం

**Retail Price** = చిల్లర ధర

**Retailer** = చిల్లరవర్తకుడు

**Revenue expenditure** = రాబడి వ్యయం (క్రయ విక్రయాలకు సంబంధించిన ఖర్చు)

**Revenue Loss** = రాబడి నష్టం (రోజువారీ క్రయ విక్రయాల్లో వచ్చే నష్టం దీనిని లాభాన్ని లెక్కకట్టేటప్పుడు గణనలోకి తీసుకుంటారు )

**Revenue Expenditure** = రాబడి వ్యయం (ముడి సరుకు, జీతాలవంటి వాటిపై పెట్టే నిత్య వ్యయాన్ని యిలా అంటారు )

**Rights** = "రైట్స్" : మార్కెట్‌లో కొత్త షేర్లు పొందగల ఇన్వెస్టర్ ప్రత్యేక హక్కును ఇలా అంటారు

**Salary** = జీతం

**Scam** = స్టాక్ కుంభకోణం

**Scrip** = (స్క్రిప్) : షేర్‌కు మరో పేరు ఇది

**Secured creditors** = హామీ గల రుణదాతలు

**Secured Liability** = హామీగల అప్పు

**Secured Loan** = తనఖా రుణం : వ్యక్తి లేదా సంస్థ తీసుకునే రుణానికి సెక్యూరిటీగా ఏదో ఒక ఆస్తిని తాకట్టు పెట్టాల్సి వస్తుంది. ఈ తనఖానే 'ప్లెడ్జి', 'లీన్' అని కూడా అంటారు

**Securities** = ధనపత్రాలు

**Share mania** = షేర్ల పిచ్చి / ఆబ

**Share transactions** = షేర్ల లావాదేవీ: షేర్లపై వ్యాపారం అంతా సాధికారంగా నియమితులైన బ్రోకర్ల ద్వారానే జరగాలి. బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజీలో సభ్యత్వం కార్డు ఉన్న బ్రోకర్ మాత్రమే ఎక్స్ఛేంజీలో లావాదేవీలు జరపడానికి అర్హుడు ఆర్థిక రంగంలో మహర్దశను బట్టీ మాంద్యాన్ని బట్టీ సభ్యత్వ కార్డు రుసుము మారుతూ ఉంటుంది 1910లో ఈ కార్డు రేటు రూ. 1800 ఉంటే 1986లో దీని ఖరీదు రూ. 7 లక్షలు!

**Shiftability** = చలనశీలత (ఆస్తులకుండే లక్షణాలలో ద్రవ్యత, లాభ దాయకత కాకుండా, చలనశీలత మూడవ

లక్షణం)

**Silver standard** = వెండి ప్రమాణం

**Singile Point tax** = ఒకేచోట పన్ను

**Single entry** = ఒంటి పద్దు

**Special Drawing Rights (SDRs)** = ప్రపంచ ద్రవ్యమానం : అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (IMF) కృత్రిమంగా ప్రవేశపెట్టిన విచిత్రమైన ద్రవ్యం, సభ్యదేశాలకు కేటాయించింది ఇది నాణం రూపంలో ఉన్న కరెన్సీ కాదు, కాగితపు కరెన్సీ కాదు, దీని విలువకు మద్దతుగా బంగారం లాంటి అతి విలువైన లోహమూ లేదు. ఇది కేవలం చిట్టా పద్దుగా, నామకః అంతర్జాతీయ రిజర్వు నిధిగా ఉంటుంది

**Split** = (స్ప్లిట్) : షేర్లను చిన్న చిన్న షేర్లుగా విడగొట్టినప్పుడు ఇలా అంటారు ఉదాః రూ 100ల షేర్లను రూ 10ల షేర్ల చొప్పున పది షేర్లుగా విడగొట్టడం షేర్ ధర పెరిగిపోయినప్పుడు షేర్లను ఇలా "స్ప్లిట్" చేస్తారు

**Squeeze** = (స్క్వీజ్) : షేర్ ధర పడిపోతున్న సమయాల్లో ఇన్వెస్టర్లు ఇతరులూ షేర్ల విక్రయానికి తొక్కిసలాడే పరిస్థితిని ఇలా అంటారు ఉదాః షేర్ ధర పతనమయ్యే దశలో "బుల్" తన లాభం మార్జిన్‌కు కాపాడుకోడానికో పెంచుకోడానికో ప్రయత్నిస్తాడు ఈ మొత్తం తొక్కిసలాటను 'స్క్వీజ్' అంటారు

**Stag** = (స్టాగ్) : షేర్లు పంపిణీ అయిన వెంటనే వాటిని అమ్ముకునే ఉద్దేశంతో కొత్త ఇస్యూ కోసం అంగలార్చి సబ్‌స్క్రైబ్ చేసే ఇన్వెస్టర్‌ను లేదా చట్టా వ్యాపారిని (స్పెక్యులేటర్) ఇలా పిలుస్తారు.

**Stock** = నిల్వ, సరకు / వాటా

**Stock** = నిల్వలు / అమ్మకం కోసం వర్తకుడు నిల్వ పెట్టుకున్న సరకులు

**Stock in trade** = నిల్వలో ఉన్న సరకు

**Sundry debts** = చిల్లర బాకీలు

**Super-tax** = అదనపు పన్ను

**Superannuation fund** = వార్ధక్య నిధి

**Supply** = సరఫరా, సప్లయి (పోటీ మార్కెట్‌లో వస్తువుధర డిమాండ్, సప్లయిల మీద ఆధారపడి వుంటుంది).

**Suspense Account** = అనామతుఖాతా (వ్యాపార సంవత్సరాంతంలో కట్టే ముగింపు లెక్కల్లో ఆస్తులు, అప్పులు సమంగా లేకపోతే ఎక్కడో తప్పు జరిగినట్లే లెక్క ఆ తప్పును కనుగొని సవరించే వరకూ ఆ వ్యత్యాసాన్ని అనామాతుఖాతాలో వేస్తారు)

**Slump** = తీవ్ర మాంద్యం : వాణిజ్యంలో మాంద్యస్థితిని "స్లంప్" అంటారు ఈ మాంద్య స్థితిలో ధరలు, ఉపాధి అడుగంటిపోతాయి షేర్ ధరలు పడిపోవడాన్ని ఈ పరిణామం వెల్లడిస్తుంది మాంద్య స్థితినుంచి తేరుకోవడం మందకొడిగా సాగుతుంది

**Speculation** = స్పెక్యులేషన్ (చట్టా వ్యాపారం / పెట్టుబడి జూదం): దీని అసలు అర్థం వేరు లాటిన్‌లో "స్పెక్యులెర్" అంటే శ్రద్ధగా వేచివుండి, పరిశీలించమని కాని ఈ అర్థం మారిపోయి తాను పెట్టిన అసలు పెట్టుబడి భద్రత గురించి లెక్క చేయకుండా తన పెట్టుబడికి మించిన భారీ లాభాలకోసం ఎంతటి రిస్క్' తీసుకోవడానికైనా వెరవని వ్యక్తి కార్యకలాపాన్ని 'స్పెక్యులేషన్' అంటారు ఈ వేటలో అత్యల్పం వ్యవధిలోనే భారీ లాభం వూడిపడాలన్నది దీని సిద్ధాంతం త్వరగా లాభం తీయవలసిన వ్యవధి ఎంత తక్కువ ఉంటే, పెట్టే పెట్టుబడి మీద జూదం అంత ఎక్కువగా ఆడవచ్చునని దీని సారాంశం

**Spread** = స్టాక్ ఎక్స్ఛేంజి ఆవరణలో ఒక షేర్ ధర - పోటీ పెట్టిన రేటుకూ ఇవ్వజూపిన ధరకూ (ఆఫర్ ప్రైస్) మధ్య ఉన్న వ్యత్యాసాన్ని "స్ప్రెడ్" అంటారు ఉదాః- షేర్ బిడ్డింగ్ ధర రూ. 64 ఉంటే, ఆఫర్ చేసిన రేటు రూ. 66లు ఉన్నప్పుడు షేర్ల వ్యాపారికి దక్కే రేటు రూ. 2 లన్నమాట. ఈ వ్యత్యాసం ఎక్కువైనా కావచ్చు, తక్కువైనా కావచ్చు. ఇది మార్కెట్‌లో షేర్‌కు ఉన్న గిరాకీ మీద, షేర్ల లభ్యత మీద ఆధారపడి ఉంటుంది. ఎక్స్ఛేంజిలో ఒకషేర్ ఎంత తరచుగా, ఎంత హెచ్చుగా 'ట్రేడ్' అవుతూంటుందో, ఆ మేరకు షేర్ల వ్యాపారికి షేర్ ఒక్కింటికి దక్కే రేటూ తక్కువే ఉంటుంది

**Stagflation (Stagnation + Inflation)** = నిరంతర ద్రవ్యోల్బణం ఫలితంగా ఎదుగూబొదుగూ లేకుండా ఉన్న ఆర్థిక వ్యవస్థ పరిస్థితిని "స్టాగ్‌ఫ్లేషన్' అంటారు. ఈ పరిస్థితిలో ఆర్థికాభివృద్ధి రేటు కుంటుపడడమే కాక నిరుద్యోగం కూడా హెచ్చు స్థాయిలోనే ఉంటుంది. ధరలు పెరిగిపోతాయి.

**Stock Exchange** = షేర్ల అధిక ధర రేటుకో, హెచ్చుతగ్గుల ధరలు మారే మారకపు కేంద్రాన్ని ఇలా అంటారు. ఎక్స్ఛేంజి సభ్యులు తామే బ్రోకర్లుగా లేదా డీలర్లుగా వ్యవహరిస్తూ షేర్ల క్రయ విక్రయాలను 'బుల్స్' గానూ, "బేర్స్"గానూ సాగిస్తుండే కేంద్రాన్ని (లేదా బిల్డింగ్‌ను) స్టాక్ ఎక్స్ఛేంజి అంటారు.

**Stockinvest** = కాపిటల్ ఇష్యూలకు సబ్‌స్క్రైబ్ చేసే ప్రత్యేక పథకం. దీనిని "సెబి" (సెక్యూరిటీస్ అండ్ ఎక్స్ఛేంజి బోర్డు ఆఫ్ ఇండియా) ఆదేశాల మేరకు 1992 మార్చిలో మొదటిసారిగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ప్రవేశపెట్టింది. ఇది లీగల్ పథకం. అక్కౌంట్ పేయీ చెక్కు లాంటి ప్రత్యేక సాధనం. ఈ కాపిటల్ ఇష్యూస్‌ను కొనుగోలు చేసే ఇన్‌వెస్టర్ తన అక్కౌంట్ ఉన్న బ్యాంకు నుంచి ఇన్వ్యూస్‌ను పొందవచ్చు. ఈ డబ్బు ఇన్‌వెస్టర్ అక్కౌంట్‌లోనే ఉంటుంది. ఇష్యూ కేటాయింపు జరిగే వరకూ ఈ డబ్బుపైన వడ్డీ వస్తూంటుంది. అప్పుడు మాత్రమే ఇన్‌వెస్టర్ అక్కౌంట్‌ను డెబిట్ చేస్తారు, అప్లికేషన్ మనీ మీద ఇచ్చే రిఫండ్‌ను బ్యాంకి తనఖానుంచి విడుదల చేస్తారు. ఏ తావాతా స్టాక్ ఇన్‌వెస్ట్ పథకం వల్ల ఒనగూడే ప్రధాన ప్రయోజనం - ఇష్యూ కేటాయింపుల్లో రిఫండ్ ఇవ్వడంలో జాప్యం లేకుండా చూడడం.

**Sunrise Industries** = ప్రగతి దారిలో ఉన్న నూతన పరిశ్రమలు : దేశ ఆర్థిక వ్యవస్థలో ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తున్న కొత్త పరిశ్రమలను, అభివృద్ధి అవకాశాలున్న ప్రాంతాలను ఇలా పిలుస్తారు. (ఉదా: కంప్యూటర్లు, ఇళ్ళలో శ్రమను తగ్గించే కొత్త పరికరాలు, ఫైబర్ ఆప్టిక్స్ ఉపయోగించి తయారు చేసే కేబుల్స్, పశు సంవర్ధిత మాంసకృత్తుల స్థానే తయారయ్యే కృత్రిమ ప్రోటీన్లు, సముద్రాంతర ఆయిల్ డ్రిల్లింగ్, డ్రైడాకింగ్ వగైరా). ఇలాంటి సరుకులు ఉత్పత్తి చేసే కంపెనీల షేర్లలో పెట్టుబడి పెట్టడం దీర్ఘకాలిక ప్రయోజనం దృష్ట్యా లాభదాయకమని ఒక విశ్వాసం.

**Sunset Industries** = కునారిల్లుతున్న పరిశ్రమలు: ఒకనాడు ఉచ్ఛస్థితిలోకి వచ్చి నేడు కునారిల్లుతున్న పరిశ్రమలను ఇలా అంటారు.

**Synergy** = మేలు కలయిక : ఏ పరిశ్రమకా పరిశ్రమ వ్యక్తిగత స్థాయిలో సాధించే ఫలితాలకంటే రెండు పరిశ్రమల మేలు కలయిక ద్వారా పొందే ప్రయోజనం అసాధారణమైనదని దీని అర్థం. పరిశ్రమల విలీనీకరణ ద్వారా, స్వాధీన పరచుకోవడం ద్వారా ఈ ఆదర్శాన్ని సాధించుకోవచ్చునని ఒక విశ్వాసం. కంపెనీల పరస్పర శక్తి సామర్థ్యాలవల్ల ఈ ప్రయోజనం సిద్ధిస్తుంది. (ఒక పరిశ్రమ సరకుల అమ్మకాలలో, మార్కెటింగ్‌లో దిట్ట అయితే, మరొకటి వస్తు పరిమాణ సాధనలోనూ, దాని అభివృద్ధిలోనూ చేయి తిరిగిన పరిశ్రమ కావొచ్చు. అలాగే ఇంకొక పరిశ్రమ రిజర్వు నిధులలో దీటైనదైతే వేరొకటి షేర్ ఒక్కింటికి తీసే రాబడిలో సాటిలేనిది కావచ్చు) ఇలా పరిశ్రమల విలీనీకరణ వల్ల ఫలితాలు రెట్టింపు మించి ఉంటాయని సిద్ధాంతం. మనం రెండు రెళ్ళు నాలుగంటాం. కాని ఈ 'సినర్జీ' సూత్రం ప్రకారం విలీనీకరణ ఫలితం 2 + 2 = 5 అవుతుందని విశ్వాసం.

**Theory X**= పని ఎగవేతకు అలవాటు పడిన మనిషి ధోరణికి కొలమానం.

**Theory Y**= పనంటే స్వతహాగా ఇష్టపడే వ్యక్తి ధోరణికి కొలమానం.

**Theory Z** = ఉద్యోగులు మేనేజిమెంటు నిర్ణయాల్లో పాలుపంచుకునే ధోరణికి కొలమానం. (ఈ మూడు సూత్రాలనూ మానవ మనస్తత్వంపైన, ప్రవర్తనపైన ఆధారపడి యాజమాన్యాలు రూపొందించాయి. అయితే మనిషిని మనిషి దోచుకునే ఆర్థిక వ్యవస్థ తాలూకు లొసుగుల్ని మాత్రం యాజమాన్యాలు తెలివిగా దాటవేస్తాయని విమర్శకుల వాదన.)

**Tight-Money** = పరపతి కరవు:డబ్బు చెలామణిలో కటకటను ఇలా అంటారు. ఇందువల్ల పరపతి దొరకడం కష్ట సాధ్యమవుతుంది.

**Tip** = స్టాక్ మార్కెట్‌లో షేర్ ధర లావాదేవీలకు చెందిన లోగుట్టు సమాచారాన్ని విశ్వసనీయ వర్గాల ద్వారా రాబట్టే పద్ధతిని ఇలా అంటారు.

**Time-lag**= కాలయాపనం

**Trade** = వర్తకం (క్రయ విక్రయాలే వర్తకం)

**Trading Account** = వర్తకపు ఖాతా

**Trading Inshares** = షేర్ల వ్యాపారం : దీని కథ 18వ శతాబ్దం నాటిది. ఈస్ట్ ఇండియా కంపెనీ (దీన్నే మనవాళ్ళు 'కుంపిణీ' అన్నారు ) పెత్తనం ఇండియాలో

వ్యాపార లావాదేవీలతోనే ప్రారంభమైంది బ్రిటన్‌లో తయారైన వస్త్రాలు, యంత్రాలు వగైరా ఉత్పత్తులను ఈ కంపెనీ ఇండియాలోకి దిగుమతికోసం, ఇక్కడి కంపెనీలకు అమ్ముతుండేది అలాగే ఇక్కడినుంచి పత్తి, సుగంధ ద్రవ్యాలు కొని వాటిని బ్రిటన్‌లోనూ, యూరప్‌లోనూ అమ్మి సొమ్ము దండుకొంటూండేది తన వ్యాపార కలాపాలకు కావలసిన డబ్బును ఈ కంపెనీ వర్తకులనుంచి, బ్యాంకర్లనుంచి అప్పు చేసి తెచ్చి, తీసుకున్న అప్పులకు గ్యారంటీగా ఋణ పూచీ పత్రాలను (లోన్ సెక్యూరిటీలను) ఇస్తూండేది 1830 నాటికి ఈ సెక్యూరిటీల సంఖ్య పెరిగిపోయింది ఆ పిమ్మట కొత్త రకం సెక్యూరిటీని ప్రవేశపెట్టింది దాని పేరు కార్పోరేట్ స్టాక్స్ అండ్ షేర్స్

**Transaction** = వ్యాపార లావాదేవీ

**Transfer Deed** = బదిలీ దస్తావేజు : కంపెనీ షేర్లు, డిబెంచర్లను మరొకరి పేరిట బదిలీ చేసినప్పుడు ఆ లావాదేవీలను రికార్డు చేసే డాక్యుమెంటును ఇలా అంటారు ఈ పత్రానికి విలువ కంపెనీ ఖాతా ముగిసే తేదీ వరకు మాత్రమే ఉంటుంది

**Trial balance** = అంకణా : సమస్త ఖాతాల నిల్వల నివేదిక

**Trough**=స్టాక్ మార్కెట్ సూచీ (ఇండెక్స్)లో చిట్టచివరి పాయింటును "ట్రోవ్" అంటారు (అగాద స్థాయి అన్నమాట) ఈ చివరి పాయింటు నుంచే షేర్ ధరలు సగటున క్రమంగా కొంతకాలంపాటు పెరుగుతూంటాయి ఈ సమయంలో మార్కెట్ సూచీని అధమ స్థాయికి పడిపోకుండా "బుల్" చూస్తే, సూచీని ఆగాధ స్థాయికి నెట్టడానికి "బేర్" చూస్తాడు

**Trust deed** = (ట్రస్టుడీడ్) = ట్రస్ట్ ఏర్పడడానికి తోడ్పడే పత్రం లేదా దస్తావేజు

**Turn Key (Project)** = కాంట్రాక్టు పద్ధతి : అనుకొన్న మేరకు పరిశ్రమను సకాలంలో నిర్మించి ఉపయోగానికి వీలుగా సిద్ధం చేసి ఇచ్చే కాంట్రాక్టు పద్ధతిని "టర్న్‌కీ" అంటారు

**Underwriters** = వాటా పూచీదారులు (కంపెనీ వాటాలు అమ్ముడుపోయేట్టు హామీ ఇచ్చే సంస్థలు లేదా వ్యక్తులు).

**Underwriter** = కొత్త ఇష్యూలో సబ్‌స్క్రైబ్‌కాని పెట్టుబడి భాగాన్ని తాము షేర్ల రూపంలో కొనుగోలు చేయడానికి ముందుకు వచ్చే బ్యాంకర్‌ను లేదా ద్రవ్య సహాయక సంస్థను "అండర్ రైటర్" అంటారు ఆ తర్వాత ఈ భాగం పెట్టుబడిని (షేర్లను) బ్యాంకర్ లేదా ద్రవ్య సంస్థ హెచ్చు ధరకు ఇన్‌వెస్టర్లకు అమ్ముకుంటుంది

**Unofficial Premium** = పెంచిన అనధికార షేర్ దర : ఒక కంపెనీ తాలూకు కొత్త ఇష్యూ మార్కెట్‌లోకి వచ్చినప్పుడు షేర్ల కేటాయింపు ఇంకా జరగనప్పుడు సదరు షేర్లపైన ప్రీమియమ్ నిర్ణయించడాన్ని ఇలా అంటారు ఇది అనధికారికంగా నిర్ణయించే ప్రీమియమ్

**Unsecured Liability** = హామీ లేని అప్పు

**Unsecured Loan** = భరోసా ఋణం : ఋణం తీసుకునె వ్యక్తి / సంస్థ నిజాయితీ, పరపతి స్తోమతు ఆధారంగా కేవలం ఒక సంతకం తోటే మంజూరు అయ్యే ఋణం ఇది దీనికి ఎలాంటి తనఖాలూ, తాకట్టులూ పెట్టనవసరం లేదు

**Upla Chalu** = తమ లాభాల మార్జిన్ తగ్గకుండా జాగ్రత్త పడేందుకు లోపాయికారిగా ఇద్దరు బ్రోకర్లమధ్య కుదిరే సర్దుబాటును "ఉప్లా చాలు" అంటారు

**UTI**= యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా : యూనిట్ హోల్డర్ల తరపున షేర్లను లేదా ఇతర మార్కెట్ సాధనాలను మూకుమ్మడిగా కొనుగోలు చేసి ఉంచే ప్రభుత్వ ధర్మకర్తృత్వ సంస్థ (పబ్లిక్ ట్రస్ట్) ఇది అలాంటి ట్రస్ట్ ప్రభుత్వానికి బాధ్యురాలు కాబట్టిచాలా జాగ్రత్తగా ఇన్‌వెస్ట్‌మెంట్ (పెట్టుబడుల సేకరణ) విధానాన్ని రూపొందించుకోవాలి ఏ ఒక్కరకం షేర్లకో కాకుండా రకరకాల షేర్లను (పోర్ట్‌ఫోలియో) దృష్టిలో పెట్టుకొని ఈ ట్రస్ట్ తీర్చిదిద్దుతూంటుంది యూనిట్ హోల్డర్లకు పెట్టుబడులపైన (షేర్లపైన) తగిన డివిడెండ్ వచ్చేట్టు పూచీ పడడం ఈ ట్రస్ట్ బాధ్యత ఈ ట్రస్ట్ "యూనిట్ పథకం" ప్రకారం ప్రభుత్వం ప్రకటించిన ధరకు ఎవరైనా స్వేచ్ఛగా యూనిట్లను కొనుగోలు చేసుకోవచ్చు అయితే ఆ "యూనిట్ల"ను అమ్మదలచుకుంటే తిరిగి ట్రస్ట్‌కు మాత్రమే ప్రకటిత కొనుగోలు ధరకు అమ్మజూపాలి ఈ పద్ధతిని ఓపెన్ ఎండెడ్ స్కీమ్ అంటారు ఇలాంటి స్కీములనెన్నో ఈ ట్రస్ట్ నిర్వహిస్తోంది ఈ ట్రస్ట్ ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున నిధులు ఉన్నందున స్టాక్

మార్కెట్ లావాదేవీల్లో ఈ ట్రస్టీ కూడా ప్రధాన పాత్ర వహిస్తుంటుంది. ఎప్పుడైనా మార్కెట్ కుప్పకూలే పక్షంలో ఈ ట్రస్టీరు - స్టాక్ మార్కెట్‌లో ప్రవేశించి పరిస్థితిని అదుపు చేసే హక్కు ఉంది. ట్రస్ట్ మొదటి స్కీము 1964లో ప్రారంభమయింది.

**Value** = విలువ (సరకుకుండే ఆర్థిక విలువ అని స్థూలంగా చెప్పవచ్చు.)

**Variable costs** = అనిశ్చిత వ్యయం (అనుకోకుండా మధ్యలో అవసరమయ్యే ఖర్చు. దీన్నే 'ఉపాంత వ్యయం' అని కూడా అంటారు)

**VAT** (వ్యాట్) = వినియోగపు పన్ను (Value Added Tax). వస్తువు ఉత్పత్తి దశలో కాకుండా దాని మాన్యుఫాక్చరింగ్ దశలోనూ, చిల్లర అమ్మకాల దశలోనూ విధించే పన్ను. ఫ్రాన్స్, బ్రెజిల్, కెనడా లాంటి కొన్ని పాశ్చాత్య దేశాల్లో "వ్యాట్" అమలులో ఉంది. యూనియన్ ప్రభుత్వ స్థాయిలో కంటే రాష్ట్ర స్థాయిలో ఈ పన్ను విధింపు, వసూలు క్లిష్టమైనదిగా భావిస్తారు. "వ్యాట్"కు మరో పేరు "డెస్టినేషన్ టాక్స్"

**Vote on Account budget** = అనామతు పద్దు / తాత్కాలిక బడ్జెట్

**Venture Capital** = సాహస పెట్టుబడి : ఫైనాన్షియల్ రిస్క్ (ద్రవ్య చిక్కులు)తో కూడుకున్న కొత్త వ్యాపారంలో పెట్టే పెట్టుబడిని ఇలా అంటారు. అయితే ఈ సాహస పెట్టుబడికి మరో లక్షణం కూడా ఉంది. ఈ పెట్టుబడికి సగటు ప్రతిఫలం వచ్చే అవకాశం కూడా ఉంది. ఈ పెట్టుబడికి వనరులు : సంపన్నులూ, బిజినెస్ ఇన్‌వెస్ట్‌మెంట్ కంపెనీలు, మర్చంట్ బ్యాంకులూ. ఈ కాపిటల్ నిర్మాణంలో ఉండే పెట్టుబడి దారులకు లాభాలలో, ప్రిఫరెన్స్ షేర్లలో వాటాలుంటాయి. సంస్థ పెరిగిన కొద్దీ పెక్కు ఈక్విటీ షేర్లు కూడా కేటాయించే అవకాశం ఉంది.

**Wage** = వేతనం (సాధారణంగా దిన, వార వేతనాలకు ఈ మాట వర్తిస్తుంది)

**Want** = కోరిక, వాంఛ (మనిషికి వాంఛలుంటాయన్న ప్రాతిపదికే యావత్ అర్థశాస్త్రానికీ పునాది. But, wants are unlimited)

**Warranty** = పూచీ : దీన్నే ఇంప్లయిడ్ వారెంట్ అని కూడా అంటారు. కొన్ని వాస్తవాలకు కట్టుబడి ఈ పూచీ యిస్తారు. ఉదా: భూముల అమ్మకంలో ఉన్న భూమి మంచిదేనని, సదరు దస్తావేజు తకరారు లేనిదనీ, అమ్ముకోవచ్చుననీ హామీ పడడాన్ని వారంటీ అంటారు.

**Wasting assets** = విలువ తగ్గిన ఆస్తులు (క్షీణించే ఆస్తులు అని కూడా అంటారు. సంవత్సరాల తరబడి ఉపయోగం వల్ల విలువ తగ్గే యంత్రాలు, గనులు, క్వారీలను ఇలా అంటారు.)

**Wealth tax** = సంపద పన్ను

**Wholesale Price** = టోకు ధర

**Wolf** = స్టాక్ మార్కెట్ పతనానికి దారితీసే స్పెక్యులేటర్‌ను (చట్టా వ్యాపారిని) ఇలా అంటారు

**Working Capital** = నిర్వహణ పెట్టుబడి : అక్కౌంటింగ్ పరిభాషలో - ప్రస్తుత ఆస్తులకూ, ప్రస్తుత అప్పులకూ మధ్య ఉన్న వ్యత్యాసాన్ని ఇలా అంటారు. దీనినే అవృత పెట్టుబడి అని కూడా అంటారు. వర్కింగ్ కాపిటల్‌ను స్థిరాస్తులుగా ఎన్నడూ పరిగణించకూడదు.

**Work - in progress** = తయారీలో వున్న సరకు

**Work-in-process** = తయారీలో వున్న సరకు

**Working Capital** = సహాయక మూలధనం / అస్థిర మూలధనం (పరిశ్రమల నిర్వహణకు రోజువారీ అయే ఖర్చులను ఆదుకొనే మూలధనం)

**Yuppie Scam** = స్టాక్స్ లావాదేవీల్లో ఇన్‌సైడర్ ట్రేడింగ్‌లో తలదూర్చే యువకులైన వృత్తిదారులు చేసే కుట్రలను వాల్ స్ట్రీట్ కుంభకోణం అంటారు. అదే ఈ 'స్కామ్'.

**Zero - Based - Budgeting (ZBB)** = ప్రాధాన్యతల బడ్జెట్ : ఏ అయిదేళ్ళలో కలిపి ఒకేసారి ప్లానింగ్ జరపకుండా, ఏ సంవత్సరానికా సంవత్సరానికే పరిమితమై వనరుల అవకాశాన్నిబట్టి ప్రాధాన్యతలను ఎంపిక చేసుకుని తయారు చేసే బడ్జెట్‌ను ఇలా అంటారు.

# ద్రవ్యోల్బణం - రూపాయి విలువ (1964 - 1994)

వరుసగా ఒక్కొక్క సంవత్సరం తరువాత పరిస్థితి

| రూ. / విలువ | ఇన్‌ఫ్లేషన్ రేటు 5% | 6% | 7% | 8% | 9% | 10% | 11% | 12% | 13% | 14% | 15% | 16% | 17% | 18% | 19% | 20% |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 yr | 0.952 | 0.943 | 0.935 | 0.926 | 0.917 | 0.909 | 0.901 | 0.893 | 0.885 | 0.877 | 0.870 | 0.862 | 0.855 | 0.847 | 0.840 | 0.833 |
| 2 yrs | 0.907 | 0.890 | 0.873 | 0.857 | 0.842 | 0.826 | 0.812 | 0.797 | 0.783 | 0.769 | 0.756 | 0.743 | 0.731 | 0.718 | 0.706 | 0.694 |
| 3 yrs | 0.864 | 0.840 | 0.816 | 0.794 | 0.772 | 0.751 | 0.731 | 0.712 | 0.693 | 0.675 | 0.658 | 0.641 | 0.624 | 0.609 | 0.593 | 0.579 |
| 4 yrs | 0.823 | 0.792 | 0.763 | 0.735 | 0.708 | 0.683 | 0.659 | 0.636 | 0.613 | 0.592 | 0.572 | 0.552 | 0.534 | 0.516 | 0.499 | 0.482 |
| 5 yrs | 0.784 | 0.747 | 0.713 | 0.681 | 0.650 | 0.621 | 0.593 | 0.567 | 0.543 | 0.519 | 0.497 | 0.476 | 0.456 | 0.437 | 0.419 | 0.402 |
| 6 yrs | 0.746 | 0.705 | 0.666 | 0.630 | 0.596 | 0.564 | 0.535 | 0.507 | 0.480 | 0.456 | 0.432 | 0.410 | 0.390 | 0.370 | 0.352 | 0.335 |
| 7 yrs | 0.711 | 0.665 | 0.623 | 0.583 | 0.547 | 0.513 | 0.482 | 0.452 | 0.425 | 0.400 | 0.376 | 0.354 | 0.333 | 0.314 | 0.296 | 0.279 |
| 8 yrs | 0.677 | 0.627 | 0.582 | 0.540 | 0.502 | 0.467 | 0.434 | 0.404 | 0.376 | 0.351 | 0.327 | 0.305 | 0.285 | 0.266 | 0.249 | 0.233 |
| 9 yrs | 0.645 | 0.592 | 0.544 | 0.500 | 0.460 | 0.424 | 0.391 | 0.361 | 0.333 | 0.308 | 0.284 | 0.263 | 0.243 | 0.225 | 0.209 | 0.194 |
| 10 yrs | 0.614 | 0.558 | 0.508 | 0.463 | 0.422 | 0.386 | 0.352 | 0.322 | 0.295 | 0.270 | 0.247 | 0.227 | 0.208 | 0.191 | 0.176 | 0.162 |
| 11 yrs | 0.585 | 0.527 | 0.475 | 0.429 | 0.388 | 0.350 | 0.317 | 0.287 | 0.261 | 0.237 | 0.215 | 0.195 | 0.178 | 0.162 | 0.148 | 0.135 |
| 12 yrs | 0.557 | 0.497 | 0.444 | 0.397 | 0.356 | 0.319 | 0.286 | 0.257 | 0.231 | 0.208 | 0.187 | 0.168 | 0.152 | 0.137 | 0.124 | 0.112 |
| 13 yrs | 0.530 | 0.469 | 0.415 | 0.368 | 0.326 | 0.290 | 0.258 | 0.229 | 0.204 | 0.182 | 0.163 | 0.145 | 0.130 | 0.116 | 0.104 | 0.093 |
| 14 yrs | 0.505 | 0.442 | 0.388 | 0.340 | 0.299 | 0.263 | 0.232 | 0.205 | 0.181 | 0.160 | 0.141 | 0.125 | 0.111 | 0.099 | 0.088 | 0.078 |
| 15 yrs | 0.481 | 0.417 | 0.362 | 0.315 | 0.275 | 0.239 | 0.209 | 0.183 | 0.160 | 0.140 | 0.123 | 0.108 | 0.095 | 0.084 | 0.074 | 0.065 |
| 16 yrs | 0.458 | 0.394 | 0.339 | 0.292 | 0.252 | 0.218 | 0.188 | 0.163 | 0.141 | 0.123 | 0.107 | 0.093 | 0.081 | 0.071 | 0.062 | 0.054 |
| 17 yrs | 0.436 | 0.371 | 0.317 | 0.270 | 0.231 | 0.198 | 0.170 | 0.146 | 0.125 | 0.108 | 0.093 | 0.080 | 0.069 | 0.060 | 0.052 | 0.045 |
| 18 yrs | 0.416 | 0.350 | 0.296 | 0.250 | 0.212 | 0.180 | 0.153 | 0.130 | 0.111 | 0.095 | 0.081 | 0.069 | 0.059 | 0.051 | 0.044 | 0.038 |
| 19 yrs | 0.396 | 0.331 | 0.277 | 0.232 | 0.194 | 0.164 | 0.138 | 0.116 | 0.098 | 0.083 | 0.070 | 0.060 | 0.051 | 0.043 | 0.037 | 0.031 |
| 20 yrs | 0.377 | 0.312 | 0.258 | 0.215 | 0.178 | 0.149 | 0.124 | 0.104 | 0.087 | 0.073 | 0.061 | 0.051 | 0.043 | 0.037 | 0.031 | 0.026 |
| 25 yrs | 0.295 | 0.233 | 0.184 | 0.146 | 0.116 | 0.092 | 0.074 | 0.059 | 0.047 | 0.038 | 0.030 | 0.024 | 0.020 | 0.016 | 0.013 | 0.010 |
| 30 yrs | 0.231 | 0.174 | 0.131 | 0.099 | 0.075 | 0.057 | 0.044 | 0.033 | 0.026 | 0.020 | 0.015 | 0.012 | 0.009 | 0.007 | 0.005 | 0.004 |

# పార్లమెంటరీ భాష

**AVote on Account** = తాత్కాలిక బడ్జెట్ / ఎకౌంటుకు ఓటు

**Aye / ayes** = ('ఏస్') ఇంగ్లీష్ / పార్లమెంటులో సానుకూలుర సమ్మతి ప్రకటించే ఆ సభ్యుల లాబీ' అంటారు లెజిస్లేచర్‌లో వీరిని డివిజన్ లాబీ అని కూడా అంటారు "the Ayes' have it" అంటే తీర్మానాన్ని సభవారు ఆమోదించారని ('ఆయ్' అంటే "ఏస్" 'Yes' అనే ఇదే వాడుక ఉన్నారని!)

**Bicameral (Bicameral Legislature)** = రెండు సభలు (లోక్‌సభ + రాజ్యసభ = పార్లమెంటు, రాష్ట్రంలో శాసనసభ + శాసనమండలి లేదా విధానసభ + విధాన పరిషత్ = లెజిస్లేచర్ వీటిని 'బైకామెరల్' అంటారు వీటికి మరో పేరు అప్పర్ హౌస్, లోయర్ హౌస్

**Cliff - hanger** = ఉత్కంఠ / సస్పెన్స్ : "All the elements of a Cliff - hanger were

## BILLS

**Appropriation Bill** = ద్రవ్య వినియోగపు బిల్లు: కేంద్రం ఏకీకృత నిధి (కన్సాలిడేటెడ్ ఫండ్) నుంచి ఖర్చుల నిమిత్తం మొత్తాలను తీసుకొని వాడుకోడానికి ప్రభుత్వాన్ని చట్టబద్ధంగా అనుమతిస్తూ ప్రతిపాదించే బిల్లును 'అప్రాప్రియేషన్ బిల్లు' అంటారు లోక్‌సభ ఆమోదించిన అన్ని శాఖల పద్దులూ ఈ బిల్లు కిందకే వస్తాయి

**Constitution Amendment Bill** = రాజ్యాంగ సవరణ బిల్లు : 368వ అధికరణ ప్రకారం రాజ్యాంగ సవరణకు బిల్లును ప్రవేశపెట్టాలి దీనిని ప్రభుత్వమైనా ప్రవేశపెట్టవచ్చు లేదా ప్రయివేట్ మెంబర్ అయినా ప్రతిపాదించవచ్చు

**Finance Bill** = ఆర్థిక బిల్లు : వచ్చే ఏడాదికి ఆర్థికపరమైన ప్రతిపాదనలను రూపొందించి ప్రభుత్వం సిద్ధపరిచే బిల్లును "ఫైనాన్స్ బిల్" అంటారు దీనిని సభలో బడ్జెట్ ప్రవేశపెట్టిన దరిమిలా ప్రతిపాదిస్తారు

**Money Bill & Financial Bill** = ఈ రెండు బిల్లులకు మధ్య టెక్నికల్ వ్యత్యాసాన్ని రాజ్యాంగ చట్టం స్పష్టం చేసింది రాబడికి, ఖర్చుకూ సంబంధించిన ఏ బిల్లు అయినా ఫైనాన్స్ బిల్లు అవుతుంది అయితే అన్ని ఫైనాన్స్ బిల్లులూ 'మనీ బిల్స్' కాజాలవు రాజ్యాంగంలోని 110వ అధికరణలో నిర్దేశించిన అంశాలకు మాత్రమే కట్టుబడిన 'మనీ బిల్లు'లను ఫైనాన్స్ బిల్లులుగా చెప్పాలి పైగా ఇవి స్పీకర్ సర్టిఫై చేసిన తరువాతనే మనీ బిల్స్ అవుతాయి

మనీ బిల్స్ : లక్షణాలు : పన్ను విధింపు, రద్దు, రాయితీ, మార్పులు వగైరా ద్రవ్య నియంత్రణ లేదా ద్రవ్య సేకరణకు ప్రభుత్వానికి అధికారమివ్వడం, కన్సాలిడేటెడ్ / కాంటింజెన్సీ ఫండ్స్ ఆఫ్ ఇండియా నుంచీ ఆ ఫండ్స్‌లోకి డబ్బులు జమకట్టడం వగైరా అందువల్ల 'మనీ బిల్లు' (ద్రవ్య సంబంధమైన బిల్లు)ను రాష్ట్రపతి సిఫారసుపైన ఒక్క లోక్‌సభలో మాత్రమే ప్రవేశపెట్టాలి గాని, రాజ్యసభలో ప్రవేశపెట్టరాదు లోక్‌సభ ఆమోదం పొంది, స్పీకర్ సర్టిఫై చేసిన తరువాత రాజ్యసభకు పంపుతారు మనీ బిల్లును తిరస్కరించే అధికారంగాని, సవరించే అధికారంగానీ రాజ్యసభకు లేదు సిఫారసులు మాత్రమే అది చేయగలదు

**Private Members' Bill** = ప్రయివేట్ సభ్యుని బిల్లు : ప్రజా ప్రయోజనాలకు, సమస్యలకు సంబంధించిన అనేక అంశాలపైన ప్రజా ప్రతినిధులు తమ అభిప్రాయాలను వ్యక్తం చేసుకొనే అవకాశాన్ని పార్లమెంటరీ సూత్రాలు, నిబంధనలూ కల్పించాయి. ఆ మేరకు ప్రయివేట్ సభ్యులు కూడా బిల్లులు ప్రవేశపెట్టవచ్చు. శాసన వేదికలో ఇలాంటి బిల్లుల ప్రతిపాదనకు, సమావేశాలు జరిగే కాలంలో ప్రతి రెండవ శుక్రవారం రెండున్నర గంటలు కేటాయిస్తారు. కాగా, మరో శుక్రవారాన్ని ప్రయివేట్ మెంబర్ ప్రతిపాదించ దలచిన తీర్మానాలకు కేటాయిస్తారు

evident in the LS as opposition held up the proceedings for more than one hour insisting that they be given more time to discuss the demands for grants of ministries

**Coalition (Government)** = సంకీర్ణ / మిశ్రమ ప్రభుత్వం

**Coalition Ministry** = సంకీర్ణ మంత్రివర్గం

**Coat of arm** = ప్రత్యేక చిహ్నం (డాలుపై వంశ లాంఛనాలు ఉండే కవచం)

**Cold Storage** = పక్కకు పెట్టడం (He has put my proposal in Cold Storage), నిర్ణయం తీసుకోకుండా సమస్యను పక్కకు నెట్టడం / శీతల గిడ్డంగి (ఫ్రిజ్ వంటి)

**Cold War** = ప్రచ్ఛన్న యుద్ధం

**Concurrent List** = ఉమ్మడి జాబితా

**Concurrend Powers** = ఉభయ సామాన్యాధికారాలు (కేంద్రం - రాష్ట్రాలు సమంగా చెలాయించే అధికారాలు)

**Confederation** = సమాఖ్య / రాజ్యం (ఇది పరస్పరం కుదిరే సంధి ప్రకారం ఏర్పడుతుంది )

**Consolidate Fund** = ఏకీకృత నిధి

**Consolidated Fund of India** = కేంద్ర ప్రభుత్వ ఏకీకృత నిధి (ప్రభుత్వం ఋణ తీరుమానం నిమిత్తం నిల్వచేసే నిధి)

**Contingency Fund** = ఆత్యయిక నిధి (ఆకస్మిక ఖర్చులకోసం ఏర్పరచిన నిధి)

**Dissolution** = (సభను) రద్దు చేయడం

**Division** = ఎ) విభాగం / బి) పార్లమెంటులో, శాసనసభలో జరిగే వోటింగ్ (ఉదా:- ఎ) సంఘీ గ్రూప్ ఇండస్ట్రీస్‌లో స్పిన్నర్స్ ఒక విభాగం నాగార్జునా గ్రూప్‌లో "స్టీల్స్" ఒక విభాగం బి) శాంతి భద్రతలకు సంబంధించిన 'లా అండ్ ఆర్డర్ బిల్లు'పై జరిగిన వోటింగ్‌లో పాలకపక్షానికి తగినంత మెజారిటీ ఉండడం 'డివిజన్ బెల్' అంటే వోటింగ్ జరగడానికి ముందు సభలో హాజరు కావాలని శాసన కర్తలకు హెచ్చరికగా మోగే బెల్లు "డివిజన్ ఓట్" /'స్టాండింగ్ ఓట్" అంటే - సభ్యులు వోటింగ్‌కోసం నిలబడినప్పుడు వారి సంఖ్యను లెక్కిస్తారు కాని ఓటును మాత్రం రికార్డు చెయరు

**Erskine May** = పార్లమెంటు సభా నిబంధనలు, సభా నిర్వహణ గురించిన సాధికార గ్రంథాన్ని రచించిన వ్యక్తి ఈయన ఈ గ్రంథం ("Treatise on the Law, Privileges, Proceedings and Usage of Parliament") 1844లో వెలువడింది ఇతను కామన్స్ సభ గుమాస్తా! ప్రపంచ వ్యాపితంగా పార్లమెంటరీ నిబంధనలకు ఆధారం ఈయన గ్రంథం

**Expunge** = రికార్డు నుంచి తొలగించడం (Ex Speaker of the Assembly expunged some words from the record)

**Extradition** = పట్టి అప్పగించడం పట్టుకొని అప్పగించడం (ఒక దేశానికి సంబంధించిన నేరస్థుడు మరో దేశంలో అరెస్టయినప్పటి స్థితి)

**Filibuster** = దీర్ఘోపన్యాసకుడు (కొందరు పార్లమెంటు సభ్యులు బిల్లుపై చర్చను ముగించకుండా, దానిపై వోటింగ్ జరక్కుండా ఉండేలా చూస్తారు ఇదో కళ! అలాంటి పద్ధతిని ఇలా అంటారు ఉదా: **Congress member indulged in a bilibuter in Lok Sabha)**

**genocide** = ఊచకోత : మొత్తం జాతిని / ప్రత్యేక జాతిని / ఒక మతానికి చెందినవారిని ఊచకోత కోయడం

**gerrymandering** = నియోజకవర్గాల పునర్విభజన (వచ్చే ఎన్నికల్లో తమ గెలుపు అవకాశాలను ఈరకంగా నియోజకవర్గాల పునర్వ్యవస్థీకరణ పేరిట పెంచుకోడానికి పాలకులు / రాజకీయవేత్తలు జరిపే కుతంత్రం)

**"grass roots " Cadre** = రాజకీయ పార్టీ సాధారణ కార్యకర్తలు / పునాది కార్యకర్తలు (వీళ్ళే పార్టీ భవితవ్యానికి పునాది వర్గం)

**Horse-trading** = రాజకీయ బేరసారాలు (after horse - trading the Chairman of a Party accepted a member of the dissident group to head a Committee)

**Hung Parliament** = 'హంగ్' పార్లమెంట్ ='త్రి

శంకు సభ' ఏ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి తగిన మెజారిటీ లేని విచిత్ర పరిస్థితి)

**Hush Money** = (వాగ్బంధన రుసుం) = వాయిముడుంపు లంచం (ఎదుటి వాడిని మాట్లాడనివ్వకుండా నిరోధించేందుకు చెల్లించే ముడుపు)

**Impromptu Motion** = ఆకస్మిక తీర్మానం (motion moved suddenly)

**"Kitchen Cabinet"** = ప్రధాన మంత్రికి సలహాలిచ్చే అనధికార కమిటీ ఇందులో మంత్రులు, సలహాదారులు, ప్రధాని స్నేహితులూ వుంటారు ఇది బ్రిటీష్ సంప్రదాయం

**Lobby** (లాబీ) = "ప్రెషర్ గ్రూపు"లను ఇలా అంటారు స్థూలంగా ఎ) శాసన వేదికలోన వోటింగ్‌కు వెళ్ళే శాసనకర్తలను (ఎం.పి.లు / ఎమ్ ఎల్ ఏ లు) 'డివిజన్ లాబీ' అనీ వోటింగ్ లాబీ అనీ అంటారు బి) ఏదైనా ఒక సమస్యపైన శాసనకర్తలను వత్తిడి చేసి ఒప్పించేందుకు ప్రయత్నించే ప్రెషర్ గ్రూపును కూడా ఇలా అంటారు ఉదా: "Environmental Lobby" పర్యావరణ రక్షణ ప్రాధాన్యాన్ని గుర్తింపజేసేందుకు ఎం పి.లను వత్తిడి చేసే గ్రూపును కూడా "లాబీ" అంటారు సి) బ్రిటీష్ కామన్స్ సభ కార్యకలాపాలు రిపోర్ట్ చేసే జర్నలిస్టుల గ్రూపును కూడా 'లాబీ' అంటారు. వీళ్ళకి సీనియర్ మంత్రులు, లేదా మంత్రిత్వ శాఖల ప్రతినిధులూ ప్రత్యేక 'బ్రీఫింగ్' ఇస్తారు. అయితే ఈ గోష్ఠిని 'ఆఫ్-ది-రికార్డ్'గా ఉంచేస్తారు

**Lobby Correspondent** = బ్రిటీష్ కామన్స్ ఉభయ సభలకు చెందిన లాబీని వెస్ మినిస్టర్ లాబీ అంటారు. ఈ లాబీలో సభ్యుడు జర్నలిస్టు. అందుకే అతణ్ణి "లాబీ విలేకరి" అన్నారు. (అలాగే నీ తరపున ఫలానా పనిచేసి పెట్టమని ఏ ఎం.పి.కో లేదా స్థానిక అధికారికో వ్యాపారస్థుడు పురమాయించడం కూడా 'లాబీ' కిందికే వస్తుంది. ఈ వ్యాపార లాబీ వ్యవస్థను అమెరికా మరీ చట్టబద్ధం చేసింది!)

**Lobbyist** ='ప్రెషర్ గ్రూపు' తరఫున విషయాలు నివేదించడానికి పురమాయించిన వ్యక్తి. ఇందుకోసం అతనికి కొంత డబ్బు చెల్లిస్తారు.

**Mace (L)** = లాంఛన చిహ్నం (ఇది నగిషీగా తయారుచేసిన పొన్ను కర్ర దీన్ని బంగారంతోగాని వెండితోగాని తాపుడం చేస్తారు దీన్ని శాసన వేదిక బల్లమీద ఉంచుతారు ఈ లాంఛన చిహ్నం అర్థం - సభా కార్యక్రమాలు ఇక ప్రారంభించవచ్చు అని కామన్స్ సంప్రదాయం ప్రకారం ఈ చిహ్నాన్ని సభావేదికపై ఉంచకుండా ఏ కార్యక్రమమూ ప్రారంభం కాదు )

**May Day** = అంతర్జాతీయ కార్మికదినోత్సవం సుదీర్ఘ పనిగంటలను తగ్గించుకోడానికి దేశదేశాల కార్మికులు అనేక త్యాగాల అనంతరం సాధించుకున్న సంఘీభావ దినోత్సవం ఇది దీన్నే "లేబర్ హాలిడే" అని కూడా అంటారు 16 గంటల పనిదినం ఎనిమిది గంటలకు తగ్గడం, తదితర కోర్కెలను సాధించడం ఎంతో రక్తతర్పణ తర్వాతనే సాధ్యమయింది.

**Mayhem** = అల్లకల్లోలం / హింసాత్మక ఘటన / వ్యక్తి చేయి, కాలు బలవంతంగా విరిచేయడం

**Motion** = ప్రతిపాదన

**prorogue** = ప్రోరాగ్ శాసన సభను లేదా పార్లమెంటును రద్దు చేయకుండా సభా సమావేశాలను మాత్రం వాయిదా వేయడాన్ని 'ప్రోరాగ్' అంటారు (ఇక్కడ "సైనిడై", "ప్రోరాగ్" పదాల మధ్య వ్యత్యాసాన్ని జాగ్రత్తగా గమనించాలి. సభ ఒకసారి నిరవధికంగా వాయిదాపడినప్పుడు సభను తిరిగి సమావేశపరిచే హక్కు స్పీకర్‌కు ఉంటుంది కాగా స్పీకర్ సభను నిరవధికంగా వాయిదా వేసిన కొలది రోజులకు ఇక సభా సమావేశాలు 'ప్రోరాగ్' అయినట్టు ప్రకటించే హక్కు పార్లమెంటు విషయంలో అయితే రాష్ట్రపతికి, రాష్ట్ర శాసన సభ విషయంలో గవర్నర్‌కు ఉంటుంది. అలా 'ప్రోరాగ్'అయిన సభలను తిరిగి సమావేశపరిచే హక్కు వీరిద్దరికే ఉంటుంది.)

**Protem Speaker** = తాత్కాలిక సభాపతి / స్పీకర్

**Question Hour** = ప్రశ్నోత్తరాల సమయం

**Quorum** = కోరం : (సభ్యుల కనీస సంఖ్య) సభలో సభ్యుల మొత్తం సంఖ్యలో పదింట ఒకవంతు (స్పీకర్ సహా) కనీసం హాజరై ఉండాలి. ఈ కనీస సంఖ్యను 'కోరమ్' అంటారు. రోజా సభ సమావేశమైనప్పుడు, సభాపతి తన స్థానాన్ని అలంకరించబోయేముందు,

...సభలో ఉండవలసిన కనీస సంఖ్యను లెక్కించడం రివాజు ఏదైనా ఒకరోజున ఉదయం 11 గంటలకు అనుకున్న కనీస హాజరు లేని పక్షంలో 'కోరం బెల్లు' మోగుతుంది కోరం పూర్తి అయిన తరువాతనే స్పీకర్ సభాపతి స్థానం అలంకరిస్తారు

**Short Notice Question** = స్వల్ప వ్యవధి / అవ్యవధి ప్రశ్న : ప్రజా ప్రయోజనానికి సంబంధించిన ముఖ్యమైన అంశంపైన అతి స్వల్ప వ్యవధిలో వేసే ప్రశ్న ఇది సాధారణ ప్రశ్నలకు సమాధానం కోరుతూ పది రోజుల వ్యవధిలో నోటీసు ఇవ్వవచ్చు కాని అతి ముఖ్యమైన ప్రశ్న విషయంలో ఈ వ్యవధిని కుదించినందున 'అవ్యవధి ప్రశ్న' అన్నారు దీనికి ముందుగా నోటీసు ఇవ్వనక్కర లేదు

**Sine - die** = నిరవధిక వాయిదా

**Starred Questions** = సభావేదికపై మౌఖికంగా సమాధానాలు పొందగల ప్రశ్నలను ఇలా అంటారు వీటికి చుక్కల (ఏస్టరిక్స్) గుర్తులుంటాయి కాబట్టి "స్టార్డ్" అన్నారు వీటికి మంత్రి ఇచ్చే సమాధానాలపైన సభ్యులు ఉప ప్రశ్నలు వేయవచ్చు

**State List** = రాష్ట్ర జాబితా

**Summoning of the House / Houses** = సమావేశం కావలసిందిగా రాష్ట్రపతి / గవర్నర్ లెజిస్లేచర్‌ను ఆదేశించడాన్ని ఇలా అంటారు

**Union List** = కేంద్రం జాబితా (రాజ్యాంగంలో కేంద్రం అధికారాల కిందకువచ్చే అంశాలు)

**Unstarred Questions** = లిఖిత పూర్వకంగా సమాధానాలు పొందగల ప్రశ్నలు వీటిపైన ఉపప్రశ్నలు (సప్లిమెంటరీస్) అనుమతించరు

**Vote on Account** = తాత్కాలిక బడ్జెట్ / అనామతు పద్దు

**"Zero Hour"** = 'జీరో అవర్' : ఇది ఒక విధంగా సభ్యుల 'స్వేచ్ఛా సమయం' ఉభయ సభలలో ప్రశ్నోత్తరాల సమయం ముగిసిన తరువాత వ్యవధిని 'జీరో అవర్' అంటారు సభా నిబంధనలలో 'జీరో అవర్' అంటూ ఏదీ పేర్కొని లేదు నిబంధనల్లో ప్రత్యేక అస్తిత్వం లేని సమయాన్ని ఇలా అన్నారు అంతేగాదు సరిగ్గా అపరాహ్ణ సమయాన 12 గంటలకు 'జీరో అవర్' ప్రారంభమవుతుంది కాబట్టి ఇలా అన్నారు పైగా ఏ కొలది నిమిషాలోగాక, తరచుగా దాదాపు ఒకగంటసేపు ఈ జీరో అవర్ కార్యక్రమాలు సాగుతాయి ఈ సమయంలో సభ్యులు సభలో ఏ విషయాన్నైనా ప్రస్తావించుకోవచ్చు 1960లో ఈ "జీరో అవర్" పత్రికలు సృష్టించిన పదం

## MOTIONS

**Adjournment** = వాయిదా తీర్మానం / ప్రతిపాదనః సభాపతి (స్పీకర్) అనుమతిస్తే, సభా కార్యక్రమాలకు అంతరాయం కల్పించి సభ్యులు ప్రజా ప్రయోజనానికి సంబంధించిన ముఖ్యమైన తక్షణ సమస్యను వాయిదా తీర్మానం ద్వారా ప్రస్తావించవచ్చు తీవ్ర పరిణామాలకు దారితీయగల ముఖ్య సమస్యపై ముందుగా నోటీసు ఇచ్చి చర్చకు స్వీకరించాలని కోరే వ్యవధి లేని సమయంలోనే ఇలాంటి వాయిదా తీర్మానాలు ప్రవేశపెడతారు (ఉదాః హైదరాబాద్‌లో నాటు సారా తాగి పదిమంది చనిపోవడం, పెక్కుమందిని ఆసుపత్రికి తరలించడం, తద్వారా ఏర్పడిన కల్లోలం)

**Censure** = అభిశంసన తీర్మానం : అవిశ్వాస తీర్మానానికి దీనికీ తేడా ఉంది అవిశ్వాస తీర్మానానికి నిర్దిష్టమైన కారణం చెప్పనక్కరలేదు కాని అభిశంసన తీర్మానానికి నిర్దిష్టమైన కారణాలు, లేదా ఆరోపణలూ ఆధారంగా ఉండి తీరాలి ప్రభుత్వం అనుసరించే ఫలానా విధానాలు, చర్యలూ ఆధారంగా ఈ అభిశంసన తీర్మానం ప్రతిపాదిస్తారు ఈ తీర్మానాన్ని క్యాబినెట్ మొత్తంపైనగాని, మంత్రిపైనగాని, లేదా కొందరు మంత్రులపైనగానీ ప్రతిపాదించవచ్చు

**No-Confidence** = అవిశ్వాస తీర్మానం : లోక్‌సభ, విశ్వాసం ఉన్నంతవరకూ మంత్రి వర్గం ఉంటుంది ఒకసారి అవిశ్వాసం ప్రకటించిన తరువాత ప్రభుత్వం రాజీనామా చేయాలి. ప్రధానమంత్రి/ ముఖ్యమంత్రి సభను రద్దు చేయాలని సిఫారసు చేసినా, చేయకపోయినా ప్రభుత్వం రాజీనామా చేయక తప్పదు.

**No-Day-Yet-Named Motion** = నిర్దిన తీర్మానం : సభ్యుడు ప్రతిపాదించిన ఒక తీర్మానాన్ని స్పీకర్

స్పీకర్ అనుమతించినా చర్చించే తేదీని నిర్ణయించనప్పుడు ఇలా అంటారు

**Noes** = 'ఎస్' మాదిరే వీళ్ళు 'నోస్' తీర్మానానికి వ్యతిరేకంగా వోటు చేసేవాళ్ళని 'నోస్' అంటారు తీర్మానం వీగిపోతే "the Noes have it" అని స్పీకర్ ప్రకటిస్తాడు అంటే సభవారు తిరస్కరించారని అర్థం

**Calling Attention Motion** = సావధాన తీర్మానం : ఫలానా ముఖ్య సమస్యను సభవారి దృష్టికి తెస్తూ ప్రవేశపెట్టే తీర్మానం ఈ తీర్మానం ప్రవేశ పెట్టడానికి ముందుగా సదరు తీర్మానం అవసరాన్ని చెబుతూ ప్రతిపాదకుడు నోటీసు ఇవ్వాలి ఈ రకమైన తీర్మానం మొదటిసారిగా 1954లో వచ్చింది ఇది ఒక రకంగా ప్రభుత్వంపై అభిశంసన తీర్మానం లాంటిదే అయితే భారత రాజ్యాంగ వ్యవస్థలో దీని విస్తృతి పరిమితం ప్రజా ప్రయోజనానికి సంబంధించిన ఏదైనా తక్షణ సమస్యను సభ్యుడు ప్రభుత్వం దృష్టికి తేదలచినప్పుడు అతను స్పీకర్ / చైర్మన్ పూర్వానుమతిని పొంది మంత్రి దృష్టికి ఆ సమస్యను తీసుకు రావొచ్చు, ప్రభుత్వం చేయాలనీ అడుగవచ్చు సభ్యులు ఈ సావధాన తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి ప్రధానమైన ఆధారం - దినపత్రికల వార్తలు లేదా సభ్యుని ప్రయివేట్ సమాచారం ఆధారంగా లేదా సభ్యునికి, అతని నియోజకవర్గ ప్రజలకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలూ ఆధారంగా ఈ తీర్మానం ప్రవేశపెట్టవచ్చు ఈ తీర్మాన ప్రతిపాదనకు సభ్యులు ఉదయం 10 గంటలకల్లా నోటీసులు యివ్వవలసి ఉంటుంది ప్రతి సమావేశంలోనూ (సిటింగ్‌కు) ఒక్కో సభ్యుడు రెండు సావధాన తీర్మానాలకు మించి ప్రతిపాదించకూడదు వీటిని స్పీకర్ పరిశీలించి నిర్ణయం చేస్తారు

**Demands for Grants** = పద్దుల అనుమతి : ప్రతీ మంత్రిత్వ శాఖకు ఖర్చు పెట్టుకోడానికి ప్రతి పద్దుకూ సభవారి అనుమతి అవసరం బడ్జెట్ వ్యయం ఖాతాలో ఈ డిమాండ్లు (పద్దులు) అంతర్భాగం అవసరమైన మొత్తాన్ని వాడుకోడానికి అనుమతించవలసిందిగా ("for grant of authority") మంత్రి సభ వారిని కోరతాడు ప్రధాన తీర్మానం రూపంలో ఈ పద్దులు ప్రవేశపెడతారు

**Cut Motions** = కోత తీర్మానాలు : మంత్రిత్వ శాఖ ప్రధాన పద్దు సంతృప్తిగా లేనప్పుడు సభ్యులు అనేక అనుమానాలలో, అభియోగాలలో ప్రభుత్వ పాలసీని వ్యతిరేకిస్తూ ప్రధాన తీర్మానానికి సవరణగా ఉప తీర్మానాలు ప్రవేశపెడుతుంటారు కొంత ఖర్చును కోత పెట్టే పేరుతో ఈ తీర్మానాలు వస్తాయి. ఈ సబ్సిడియరీ మోషన్స్‌ను పార్లమెంటరీ పరిభాషలో "కోత తీర్మానాలు" అంటారు ఈ తీర్మానాలు మూడు రకాలు : 1) ప్రభుత్వ విధానాన్ని నిరసిస్తూ ప్రవేశపెట్టే తీర్మానం. దీనినే Disapproval of Policy Cut అంటారు. "ఈ పద్దు వ్యయాన్ని రూ. 1కి కోత పెట్టాలి" అని ప్రతిపాదిస్తారు అంటే ఫలానా పద్దు అవసరాన్ని నొక్కి చెప్పే విధానాన్ని (పాలసీని) తీర్మాన ప్రతిపాదకుడు వ్యతిరేకిస్తున్నాడని అర్థం 2) ఎకానమీకట్ (Economy Cut) : పద్దు ఖర్చులో కొంత ఆదా చేసే ఉద్దేశంతో పద్దు వ్యయాన్ని నిర్దిష్టమైన మొత్తంలో తగ్గించాలని కోరే తీర్మానం ఇది. 3) Token Cut . ఇది లాంఛనమైన కోత ఉదాహరణకు ఫలానా పద్దు వ్యయంలో రూ. 100లు తగ్గించండి అని కోరుతూ ప్రవేశపెట్టే తీర్మానం ఇది ఈ తీర్మానం తరచుగా వస్తూంటుంది ఇంతకూ కోత తీర్మానం ప్రధాన ఉద్దేశమల్లా వ్యయానికి సంబంధించిన ప్రతి పద్దునూ చర్చించిగాని అనుమతించరాదన్న లక్ష్యంతో సభలో చర్చను ప్రోత్సహించడం

**Resolution** = తీర్మానం (ప్రతిపాదనకీ, తీర్మానానికీ స్వల్పమైన తేడా మాత్రమే ఉంది). ప్రతిపాదన **(Motion)** రెండు రకాలుగా ఉంటుంది 1) ప్రభుత్వ పరంగా ప్రవేశపెట్టే ప్రతిపాదన. ప్రభుత్వ విధానానికో లేదా తలపెట్టిన ఫలానా చర్యకో సభవారి అనుమతి కోరుతూ ప్రవేశపెట్టే ప్రతిపాదన. 2) ప్రయివేట్ సభ్యులు ప్రవేశపెట్టే ప్రతి పాదన : ఫలానా అంశం పైన సభవారి అభిప్రాయాన్ని లేదా సభ్యుల మనోభావాలను తెలుసుకొనేందుకు ప్రయివేట్ సభ్యుడు ప్రవేశపెట్టే ప్రతిపాదన. 'తీర్మానం'(Resolution) కూడా సాధారణ ప్రజా ప్రయోజనానికి సంబంధించిన అంశంపై చర్చ లేవనెత్తడానికి సభ్యులకు, మంత్రులకు అవకాశమిచ్చే సభా నిర్వహణ నిబంధనలలో "రిజల్యూషన్" ఒక భాగం. సభలో ప్రవేశపెట్టే ఈ తీర్మానం అభిప్రాయ ప్రకటనగానో ('declaration of opinion') లేదా ఒక సిఫారసుగానో ఉండవచ్చు. లేదా ప్రభుత్వ విధానాన్ని లేదా చర్యను సభవారు సమ్మతించేదిగానో లేదా తిరస్కరించేదిగానో ఈ తీర్మానం ఉండవచ్చు.

# పత్రికా రంగం

**A P. = Associated Press** అవతరణ 1848 120 దేశాలలో సుమారు 8500 చందాదారులున్న అంతర్జాతీయ వార్తా సంస్థ కేంద్ర కార్యాలయం న్యూయార్క్ నగరం దీని బ్యూరోలు అమెరికాలోనే 132 ఉన్నాయి, విదేశాల్లో సుమారు 90 బ్యూరోలు ఉన్నాయి ప్రపంచ వ్యాపితంగా 1987 నాటికే ఈ సంస్థకు 1500 పూర్తి కాలపు విలేఖరులు, ఎడిటర్లు, ఫోటోగ్రాఫర్లు ఉన్నారు దీని బడ్జెట్ ఏడాదికి 20 కోట్ల డాలర్లు

**Cliche** =పెంపుడు పదం, రొడ్డకొట్టుడు మాట (రచయితలు అలవాటుగా వాడే మాటల్నిలా అంటారు)

**Colummist** = ప్రత్యేక వ్యాస రచయిత

**Development Journalism** = ప్రగతి నివేదక రచన (అభివృద్ధి కార్యక్రమాలను విశ్లేషించే పత్రికా రచన)

**Embargo** = ఆంక్ష : ఫలానా ప్రకటనను / వార్తను ప్రచురణకు నిర్ణయించిన గడువుకు ముందే ప్రచురించరాదని పెట్టే ఆంక్ష / షరతు

**Feroze Gandhi Act** = ఫిరోజ్‌గాంధీ చట్టం : పార్లమెంటు కార్యక్రమాలను సభ్యుల ప్రసంగాలను, సాధ్యమైనంత వాస్తవంగా రిపోర్టు చేసే విలేకరులను ఎలాంటి సివిల్ క్రిమినల్ చర్యలకు గురిచెయ్యరాదని శాసించే చట్టం దీనినే పార్లమెంటరీ ప్రొసీడింగ్స్ (ప్రొటెక్షన్ పబ్లికేషన్స్) యాక్ట్-1950 అంటారు

**Fourth Estate** =పత్రికా రంగం (జర్నలిజాన్నీ, జర్నలిస్టులనూ కలిపి ఇలా పిలుస్తారు) : ఈ పదాన్ని వాడుకలోకి తెచ్చిన వ్యక్తి ప్రసిద్ధ రచయిత ఎడ్మండ్ బర్క్. పార్లమెంటులో విలేఖరులు కూర్చునే గ్యాలరీని ఈయన "ఫోర్త్ ఎస్టేట్" అని అభివర్ణించాడు ఆ పదం ఎందుకిలా వచ్చింది? అంతకుముందు బ్రిటిష్ సమాజంలో మూడు ఎస్టేట్లు ఉండేవి: (1) లార్డ్స్ స్పిరిచ్యువల్(మతాధికారుల వర్గం) (2) లార్డ్స్ టెంపొరల్ (రాచరిక వర్గం); (3) కామన్స్ సభ్యులు. పలుకుబడిలో, విస్తృతిలో అంతే సమాన స్థాయిగల నాల్గవ వ్యవస్థగా పత్రికా రంగాన్ని గుర్తించారు

**Freelancer (writer or Journalist)** = ఉద్యోగంలో లేకుండా వివిధ పత్రికలకు వ్యాసరచన ఆధారంగా వృత్తి ధర్మం నిర్వహించే వ్యక్తి సంస్థ 'పేరోల్స్' లేకుండా స్వేచ్ఛగా రాసుకునే రచయిత / జర్నలిస్టు / డిజైనర్ వగైరాలను ఇలా పిలుస్తారు

**Follow-up** = వార్తానంతర కథనం

**Handout** = ప్రచురణకోసం ఉద్దేశించిన లిఖిత పత్రం / ప్రకటన ఇలాంటి హ్యాండ్ ఔట్స్‌ను ప్రభుత్వ శాఖలు తమకు అనుకూలంగా ప్రచురణకు విడుదల చేస్తూంటాయి అయితే, చురుకైన రిపోర్టర్ అంతటితో ఆగకుండా అందులో వెల్లడి కాని విషయాల గురించి అన్వేషిస్తాడు

**Human-interest stories** = మానవీయ కథనాలు (జాలి, సానుభూతి, నవ్వు, ఆశ్చర్యం, ఆగ్రహం వంటి ఉద్వేగాలను కలిగించే వార్తా కథనాలు)

**Interpretative reporting** = వ్యాఖ్యానాత్మకమైన వార్తా కథనం (రిపోర్టింగ్)

**Investigative reporting** = పరిశోధనాత్మక వార్తా కథనం (రిపోర్టింగ్)

**Journal** = వార్తాపత్రిక / మాస, పక్ష, వారపత్రిక (పీరియాడికల్)

**Journalese** = పత్రికా రచనా సంప్రదాయంలో తొలి దశ / పత్రికల్లో వాడే ప్రత్యేక పరిభాష.

**Journalism** = పత్రికా రచన / పాత్రికేయ వృత్తి

**Journalist** = పాత్రికేయుడు / పాత్రికీయుడు

**Key-hole Journalists** = రంధ్రాన్వేషకులు (అనవసరమైన విషయాలపై అపరాధ పరిశోధన చేసే జర్నలిస్టులను యిలా పిలుస్తారు)

**Kiteflying** = పరోక్షమైన కూపీ (ప్రజలేమనుకుంటున్నారో కర్ణాకర్ణిగా తెలుసుకువచ్చి చేసే నివేదన)

**Lead and the Body** = సూచీ భాగం - వివరణ భాగం (వార్తలోని తొలివాక్యంలోనే వార్త సారాంశాన్ని చెబుతారు దీనినే మనం 'సూచీ వాక్యం' (lead Para) అంటాం. మిగతా వివరణాత్మక భాగాన్నంతటినీ వివరణ భాగం (Body) అంటాం.

**Middles** =మధ్యంతర రచన (సంపాదకీయానికీ, హాస్య రచనకీ మధ్యంతరంగా సాగే విశ్లేషణ)

**Newsy** =వార్తాసహితమైన

**Overshooting** =[illegible] / (వాస్తవంగా రాయవలసిన [illegible] వార్త పరిమాణాన్ని పెంచడం)

**Padding** =వార్తను విస్తృతపరచడం (అదనపు సమాచారంతో విస్తృతంగా ఆకర్షణీయంగా మలచడం)

**Press Commission** =ప్రెస్ కమిషన్ (పత్రికల తీరు తెన్నులూ, వాటి పరిస్థితులూ పత్రికా స్వేచ్ఛ మొదలైన విషయాలను వివిధ సందర్భాల్లో విచారించేందుకు ఏర్పాటైన కమిషన్ జర్నలిజంలో ఉన్నత ప్రమాణాల పరిరక్షణ దీని విధులలో ఒకటి 1952లో ప్రెస్ కమీషన్ ఏర్పాడింది)

**Scoop** =స్కూప్: కూపీ (మరే యితర విలేకరి యివ్వని అతి ముఖ్యమైన వార్త ఇదొక ప్రత్యేక కధనం అయితే ఆ ప్రత్యేక కధనం రాయకపోవడాన్ని మిగతా పత్రికలన్నీ వెలితిగా భావిస్తే, రాసిన విలేకరి దానిని 'స్కూప్'గా భావించవచ్చు)

**Source (of News)** =వార్తకు ఆధారం (సమాచారాన్ని అందించే వ్యక్తి లేదా సంస్థ లేదా సమాచార పత్రం: Person from whom or the means through which the information was obtained )

**Suppresio veri Suggestio falsi** =ఒక తప్పుడు సమాచారం అందిస్తూనే, మరొక వైపు నుంచి వాస్తవాన్ని బుద్ధిపూర్వకంగా తొక్కి పట్టే రిపోర్టింగ్ టెక్నిక్‌ను ఇలా అంటారు

**Reuters** =బ్రిటిష్ న్యూస్ ఏజెన్సీ దీని స్థాపకుడు బారన్ పాల్ జూలియస్ వాన్ రాయిటర్ అధికారికంగా వాడే పేరు మాత్రం బహువచనంలో ఉంటుంది - "రాయిటర్స్" లిమిటెడ్ అని ఇది సంస్థ పేరు అయినందున, దీని తరపున వ్యవహరించే విలేఖరిని మాత్రం "రాయిటర్ కరెస్పాండెంట్" అనీ, అతని వార్తా కథనాన్ని 'రాయిటర్ స్టోరీ" అనీ ఏకవచనంలో మాత్రమే వ్యవహరిస్తారు

**Press Council** =ప్రెస్ కౌన్సిల్ : పత్రికలపై వచ్చే ఫిర్యాదులను / ఆరోపణలను పరిశీలించి, సత్యాసత్యాల ఆధారంగా ఆరోపకులనుగాని లేదా ఆరోపితులనుగాని సందర్భాన్నిబట్టి మందలించే సంస్థ

**PTI** = Press Trust of India

**Pulitzer Prizes** =జర్నలిజంలో, కళా రంగంలో ఉన్నత శిఖరాలందుకున్న వ్యక్తులకు ప్రతి ఏటా ఇచ్చే పురస్కారాలు "న్యూయార్క్ వరల్డ్" అనే పత్రికకు అధిపతిగా ఉన్న స్వర్గీయ జోసెఫ్ పులిట్జర్ ఈ బహుమానం ప్రవేశపెట్టాడు మొదటి బహుమానం 1917లో ఇచ్చారు సలహా మండలి సిఫారసులపైన కొలంబియా యూనివర్సిటీ (అమెరికా) ధర్మకర్తలు ఈ అవార్డులు నిర్ణయిస్తారు

**UNI** = United News of India

**United Press International (UPI)** = యునైటెడ్ ప్రెస్ ఇంటర్నేషనల్ న్యూస్ సర్వీసుల విలీనీకరణ ఫలితంగా 1958లో ఏర్పడిన ప్రయివేట్ న్యూస్ ఏజెన్సీ పేరు

**Yellow - Journalism** =ఎల్లో జర్నలిజం / నిందా పూర్వక రచన కేవలం పాఠకులను ఆకర్షించి, ప్రభావితం చేసేందుకు అనుసరించే చౌకబారు రచనా పద్ధతులను, రచనలనూ ఇలా అంటారు పత్రికల మధ్య పోటీలో ఈ వికృత చేష్టలు బయటపడుతూ ఉంటాయి. "ఎల్లో జర్నలిజం" అన్న పదం 1895లో పుట్టింది న్యూయార్క్ వరల్డ్ పత్రిక వ్యంగ్య చిత్రమాల నడిపేది దాని పేరు "ఎల్లో-కిడ్" ("Yellow-Kid") ఎల్లో జర్నలిజానికి మూలం ఇది!

# విజ్ఞాన, సాంకేతిక, భౌగోళిక, రోదసీ శాస్త్రాలు

**A-Bomb** = అటామిక్ బాంబ్ (అణుబాంబు / ఆటంబాంబు) (1945-ఆగస్టు 6 మానవ చరిత్రలో ఓ దుర్దినం అది రెండవ ప్రపంచ యుద్ధ కాలం తొలి అణుబాంబు పాటవ పరీక్షను అమెరికా తన దేశంలో కాకుండా జాపనీస్ పట్టణమూ, సైనిక స్థావరమూ అయిన హిరోషిమాపై జరిపింది దీని మారణ శక్తి 20,000 టన్నుల టి ఎన్ టి (20 కిలో టన్నులు) నాలుగు చదరపు మైళ్ళ ప్రాంతాన్ని ఇది ధ్వంసం చేసింది క్షణంలో 1 లక్షా 60 వేల మంది ప్రజలు చనిపోవడమో, క్షతగాత్రులు కావడమో జరిగింది)

**Abrasion** = తాకిడి (నదీజలాల్లో ఇసక, మట్టి, రాళ్ళు కొట్టుకొని వచ్చేటప్పుడు అవి నది అడుగు భాగంగా ఉన్న నదీలోయను, నది పొత్తిటిలో ఉన్న శిలలను తాకి శిథిలం చేస్తాయి ఈలాంటి తాకిడినీ అపఘర్షణ అని కూడా అంటారు)

**Absolute** = కేవల స్థలం (ఇది న్యూటన్ సిద్ధాంతం) కాని ఈ ప్రతిపాదన రుజువుకు నిలబడలేకపోయింది.

**Absolute Magnitude** = యధార్థకాంతి

**Absolute Time** = కేవల కాలం (కేవల స్థలం ఎంత మిథ్యో ఇదీ అంతే)

**Absolute Zero** = కేవల శూన్యం (ఇది మైనస్ (–) 273 సెంటీగ్రేడ్ డిగ్రీలకు సమానం ఈ స్థాయిని సృష్టించడం అసాధ్యం)

**Acceleration** = వేగం మార్పు రేటు (వేగాన్ని శీఘ్రపరచడం) Rate of change of velocity దీన్ని $m/sec^2$ యూనిట్లతో కొలుస్తారు

**Acquired Characteristics** = అర్జిత లక్షణాలు / పొందిన లక్షణాలు

**Action** = క్రియ

**Ad-infinitum** = అనంతం / అపారం

**Adam's apple** = కుతికకాయ

**Adenine** = న్యూక్లిక్ యాసిడ్స్‌లో వుండే ప్యూరిన్ బేస్‌ను ఇలా అంటారు. దీని సూత్రం $C_5H_3N_4NH_2$.

**Adventitious buds** = అంటుమొగ్గలు

**Aerated water** = సోడా / బిస్లరీ వగైరా

**Aeronautical Charts** = ఏరోనాటికల్ చార్ట్స్ (చిన్న కొలతలో పెద్ద భూభాగాలను చూపే పటాలు)

**Afferent nerves** = స్పర్శనాడులు

**Agaricus** = కుక్కగొడుగు

**Agave** = కిత్తనార

**Aggradation** = అధిక వృద్ధి

**Alabaster** = చలువరాయి / చంద్రకాంతశిల

**Albumen** = ప్రాణధాతువు / శ్వేతధాతువు

**Aldehydes** = సేంద్రియ మిశ్రమాలలో యౌగికాల్లో ఇది ఒక రకం

**Algae** = నీటిపాచి, శైవలాలు

**Allotropy** = బహురూపత

**Alloy** = మిశ్రమలోహం

**Alluvial soil** = పంటభూమి

**Almond** = బాదం

**Aloe** = కలబంద

**Alpha centauri** = సూర్యుని తర్వాత కనిపించే మొదటి నక్షత్రం

**Alpha particle** = "ఆల్ఫా" శకలం (అణుగర్భంనుంచి వెలువడే ఒక శకలం రెండు ప్రోటాన్లు, రెండు న్యూట్రాన్‌లు కలిసి ఉన్న శకలాన్ని ఇలా అంటారు ఇది పాజిటివ్ చార్జి ఉన్న శకలం)

**Altitude** = ఎత్తు : నిర్దిష్ట ప్రదేశం ఉష్ణోగ్రత సముద్రమట్టంనుంచి ఆ ప్రదేశం ఎత్తునుబట్టి మారుతూంటుంది (ప్రతి 303 మీటర్ల ఎత్తుకు వేడిమి $1\,8^0$ సెంటీగ్రేడ్ చొప్పున తగ్గుతుంది).

**Alum** = పటిక

**Alzheimer's Disease** = (ఆల్జిమర్స్ వ్యాధి) మెదడు నరాల జబ్బు. పటుత్వం సడలిపోయినప్పుడు వచ్చే జబ్బు ఇది ఈ వ్యాధి 40-50 సంవత్సరాల వయస్సులో ఉన్న వారికి వస్తుంది ఈ వ్యాధి వల్ల మరణిస్తున్న వారి సంఖ్య ఏడాదికి 1,50,000 అని అంచనా. వ్యాధి లక్షణాలు : జ్ఞాపక శక్తి కోల్పోవడం, గ్రహింపు శక్తి క్షీణించడం, భాషలో తొట్రుపాటు, నేర్చుకొనే శక్తి సన్నగిలడం కాని వ్యాధి కారణం ఇంతవరకు

[illegible] / [illegible] లేదా [illegible] పేరు

**Amenorrhoea** = ముట్టుమానటం / ముట్టుస్రావం ఆగ్గటం

**Amino acids** = [illegible] (జీవకణాల్లో అణువుల సంయోగంవల్ల కొన్ని మోలిక్యూల్స్ ఏర్పడతాయి ఇవి జీవంతో ఉన్న మోలిక్యూల్స్ ఇవి రెండు రకాలు: ప్రోటీన్ మోలిక్యూల్స్, న్యూక్లిక్ యాసిడ్స్ ప్రోటీన్ జీవపదార్థం ప్రోటీన్ మోలిక్యూల్స్ ప్రాణదాతలయితే న్యూక్లిక్ యాసిడ్స్ జీవుల వారసత్వ ప్రదాతలు!)

**Amino acids** = ఎమైనోయాసిడ్స్: ఇవి 24 రకాలు వీటి కలయిక వల్ల ప్రోటీన్లు ఏర్పడుతూంటాయి

**Amnion bag** = పిండసంచి

**Amphibians** = ఉభయచరాలు (నీటిలోను, నేలమీద చరించే జీవులు)

**Amputation** = అంగచ్ఛేదనం (కాలు/చేయి శస్త్రచికిత్సద్వారా తీసివేయడం)

**Anabolism** = నిర్మాణ జీవన వ్యాపారం

**Anaemia** = పాండురోగం / రక్తహీనత (ఎర్ర రక్త కణాలు లోపిస్తే ఏర్పడే బలహీనత)

**Anatomy** = శరీర ధర్మ శాస్త్రం

**Androgynous** = అర్ధనారీశ్వరాకారం

**Andromeda** = భూమికి అతి దగ్గరగా ఉన్న నక్షత్రరాశి

**Angina pectoris** = ఛాతీలో నొప్పి / రొమ్ము శూల

**Angstrom** = ఇది నిడివి పరిమాణం 10 బిలియన్ల ఆంగ్‌స్ట్రామ్స్ ఒక్క మీటర్‌కు సమానం (A unit of length. Ten billion angstroms equal one metre) తరంగ దైర్ఘ్యాలను దీనితో కొలుస్తారు

**Angular momentum** = ప్రదక్షిణ గతిభారం

**Animal Geography** = జంతు సంబంధిత భూగోళశాస్త్రం

**Animate world** = చేతన ప్రపంచం

**Annelida** = నీటి పురుగులు

**Antelopes** = దుప్పులు

**Antenna** = (యాంటెనా) రేడియో తరంగాలను వ్యాపింప చేయడానికి లేదా స్వీకరించడానికి ఉపయోగించే సాధనం (కండక్టర్). A conductor for radiating or receiving radio waves

**Anthropoid** = మనిషి ఆకారంలో ఉన్న జంతువు (కోతి)

**Anti-clockwise** = అప్రదక్షిణం (అపసవ్యం)

**Anti-gravity** = గురుత్వ వికర్షణ శక్తి

**Anti-matter** = వ్యత్యస్త పదార్థం

**Anti-particles** = వ్యతిరేక అణు శకలాలు

**Antibiotics** = సూక్ష్మ జీవనాశకాలు, ఉదా: టెట్రామైసిన్, సిప్రోఫ్లోక్సాసిన్ వంటి మందులు

**Antibodies** = ప్రతికూల సూక్ష్మజీవులు / రోగ నిరోధక సూక్ష్మజీవులు

**Antidote** = విరుగుడు

**Antigenic factors** = రోగనిరోధకాంశాలు

**Antigens** = ప్రతి జనకాలు

**Antimony** = నీలాంజనం (లోహంపేరు)

**Antiseptic** = క్రిమిహారిణి

**Aorta** = బృహద్ధమని

**Ape** = కోతి

**Apex** = శీర్షం

**Aphonia** = మూగతనం (హిస్టీరియా సంబంధం)

**Aphrodisiac** = కామోద్దీపకం

**Apogee** = (అపోజీ) = భూమికి అత్యధిక దూరంలో ఉపగ్రహం చేరుకోగలిగే చోటుని (బిందువును) ఇలా అంటారు The point at which a satellite is farthest from the earth

**Apparent magnitude** = దృశ్యకాంతి

**Applied Science** = వ్యవహారోపయుక్త శాస్త్రం

**Apricot** = జల్దారు పండు

**Aquapolis** = సాగర నగరం

**Aquatic** = జల సంబంధమైన / జల సంచరమైన

**Aqueous rocks** = జలజశిలలు

**Archegonium** = స్త్రీ బీజాశయం

**Archezoic** = ఆదిజీవ మహాయుగం

**Archipelago** = ద్వీపసమూహంలో ఉన్న సముద్రం

**Areca** = పోక చెట్టు

**Argon** = అరుదైన వాయువు అని దానికి పేరు (rare gas) (Krypton, Neon వాయువులు

కూడా ఈ జాతివే)

**Arsenic** = పాషాణం

**Artery** = శుద్ధ రక్తవాహిని / ధమని

**Arthritis** = కీళ్ళవాతం

**Artificial insemination** = కృత్రిమ గర్భధారణం

**Asafoetida** = ఇంగువ

**Asbestos** = రాతినార

**Ascending node** = సూర్య కక్ష్యను దాటి పోయి చంద్రకక్ష్య ఉత్తరానికి పోతే 'ఎసెండింగ్ నోడ్' అంటారు

**Asexual** = అలైంగికం

**Asexual cycle** = అలైంగిక జీవిత చక్రం

**Asp** = కట్లపాము

**Asphyxia** = శ్వాసబంధం / ఊపిరి సలపకపోవడం

**Asteroid** = గ్రహ శకలం (గ్రహం ముక్క): సూర్యుని చుట్టూ పరిభ్రమించే చిన్న ఖగోళ వస్తువులలో ఒకటి. ఇది అంగారకునికి (మార్స్‌కి), గురునికి (జూపిటర్‌కి) మధ్య తిరుగుతూ ఉంటుంది గ్రహ శకలాల్ని 'మైనర్ ప్లానెట్స్' అంటారు అయితే సైజులో చిన్నవి కావచ్చు. గాని ఇవి సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉన్నందున ఇవి కూడా గ్రహాలే మరి చంద్రుడు ఎంత గొప్పవాడైనా గ్రహం కాదు ఉపగ్రహమే కదా!

**Asteroids** = గ్రహ శకలాలు

**Astigmatism** = దృష్టిలోపం (దీనిని సిలింద్రికల్ లెన్స్‌తో సరిచేస్తారు)

**Astrology** = జ్యోతిష శాస్త్రం (ఖగోళ శాస్త్రార్థాన్ని తారుమారు చేయజూస్తున్న శాస్త్రం).

**Astronaut** = విశ్వగామి / వ్యోమగామి / గగన విహారి / రోదసీ యాత్రికుడు / రోదసీ చోదకుడు (One who pilots a spacecraft)

**Astronomical Unit** = ఖగోళ కొలమానం: భూమినుంచి సూర్యుడికి ఉన్న దూర (15 కోట్ల కిలోమీటర్లు) ప్రమాణాన్ని ఇలా అంటారు. A unit of length, usually defined as the distance from the earth to the sun, about 150,000,000 Km.

**Astronomy** = ఖగోళ శాస్త్రం

**Atmosphere** = (కేవల) వాతావరణం, భూమిని ఆవరించి వున్న వాయు మండలం (The envelope of air surrounding the earth)

**Atmospheric pressure** = వాతావరణ పీడనం (ఉష్ణోగ్రతలోని వ్యత్యాసాలవల్ల పీడనంపై ప్రభావం పడుతుంది )

**Atom** = పరమాణువు

**Atomic (Nuclear) Power** = అణు విద్యుచ్ఛక్తి

**Atomic Age** = అణుయుగం : ఇది 1942 డిసెంబర్ 2న ఆవిష్కరించుకుంది అణు విచ్ఛేదనం ద్వారా స్వయంసమృద్ధమైన, అపారమైన శక్తిని మొదటిసారిగా చికాగో యూనివర్సిటీ ప్రయోగశాలలో సాధించారు శాస్త్రవేత్తలు. ఆ రోజునే అణు యుగావిష్కరణ

**Atomic Hydrogen** = హైడ్రోజన్ అణువు ("H"), మోలెక్యూలర్ హైడ్రోజన్‌లో రెండు హైడ్రోజన్ అణువులుంటాయి ($H_2$)

**Atomic number** = అణు సంఖ్య (ధాతువుల ద్రవ్యరాశిని ఇలా అంటారు)

**Atomic Weight** = అణుభారం (ఉదా: 80వ నంబర్ పాదరసం అనే ధాతువుకు అణుభారం 200, యురేనియం - 238)

**Atomism** = అణువాదం

**Atrophy** = క్షీణించిపోవడం / క్షయం

**Attitude** = రోదసీ నౌక ఏ ఎత్తు / దిశలో ఉంటుందో ఆ ఎత్తు / దిశ (The position or orientation of a space craft).

**Attraction** = ఆకర్షించుకోడం

**Attrition** = రాపిడి (తాకిడిలో శిలలు ఒకదానికొకటి ఒరచుకుపోయి క్షయమవుతాయి క్రమంగా నదిలో కొట్టుకుపోతూ ఈ శిలా ఖండాలు గుండ్రని రాళ్ళుగా మారతాయి).

**Auger** = బర్మా

**Auricle** = కర్ణిక

**Autospores** = స్వయంసిద్ధ బీజాలు

**Avalanche** = దొర్లిపడే మంచుగడ్డ (కొండమీద నుంచి)/మంచుతుఫాను/హిమపాతం

**Average Density** = (సగటు) ఘన సాంద్రత

**Awl** = చెప్పులు కుట్టేవారు ఉపయోగించే సూది

**Axis** = (అక్షం) (ఉత్తర - దక్షిణ ధ్రువాల్ని కలిపి కేంద్రం గుండా పోయే ఊహారేఖను అలా అంటారు)

**Bacillus** = దండాణువు / బీజాణువు

**Bacteria** = సూక్ష్మజీవులు

**Bacterial Cells** = సూక్ష్మజీవకణాలు

**Bacteriology** = సూక్ష్మజీవశాస్త్రం

**Bacterio phase** = సూక్ష్మ జీవులను (బాక్టీరియాను) ఆశ్రయించి పెరుగుతూండే ఒక వైరస్ క్రిమి

**Badellium** = గుగ్గిలం

**Ballistic Trajectory** = రోదసీ నౌక ప్రయాణ మార్గం. రోదసీ నౌక గురుత్వాకర్షణ శక్తుల వల్ల, వాయు ప్రతిఘటనల ప్రభావంలో ముందుకు సాగే మార్గం (Path followed by a space-craft only under the influences of gravitational pull and air resistance).

**Balsam** = నీలిగోరింట

**Band** = వివిధ ఫ్రీక్వెన్సీల బంధం

**Bar graphs** = బారుగ్రాఫులు (వివిధ పరిమాణాలను పోల్చడానికి ఉపయోగించే సులభ చిత్రాలు)

**Barge** = అఖాతం

**Barnacle** = నత్తగుల్ల

**Barometer** = భారమితి (వాతావరణ పీడనశక్తి కొలిచే సాధనం)

**Basin** = నదుల పరీవాహ ప్రాంతం

**Basins** = రాతిగర్తలు

**Bastard teak** = మోదుగ

**Beaches** = దిబ్బలు/సముద్రతీరాన ఉండే ఇసుక ప్రాంతాలు

**Beetle** = కుమ్మరి పురుగు / పేడ పురుగు

**Bell-metal** = కంచు

**Bellows** = కొలిమితిత్తులు

**Bench mark** = సర్వేగుర్తు

**Benzoin** = సాంబ్రాణి

**Beriberi** = ఉబ్బువాత వ్యాధి / తిమ్మిరివ్యాధి

**Beta Particle** = "బీటా" కణం (ఇది మరో రకం కణం ఇది నెగెటివ్ చార్జి కణం)

**Beverages** = పానీయాలు

**Big Bang theory** = పెద్ద పేలుడు సిద్ధాంతం (విశ్వపదార్థం ఒకనొక దశలో ఒక్క క్షణంలో బద్దలైపోయి క్రమ పరిణామంలో నేటిస్థితికి వచ్చిందన్నది సిద్ధాంతం)

**Bile** = పైత్యరసం

**Bile-duct** = పైత్యవాహిక / పిత్త నాళిక

**Binary digital** = ద్విసంఖ్యాకం (కంప్యూటర్ నిర్వహణ రెండు అంకెలపైనే (01) మీదనే ఆధారపడి ఉంది)

**Binary fission** = రెండుగా చీలడం

**Bio-Statistics** = జీవగణాంకం జనన మరణాలు, జనాభివృద్ధి క్షయాల గురించి వివిధ వయోవర్గాల్లో వీటి లెక్కల గురించి పరిశీలించేందుకు గణాంక శాస్త్రాన్ని అన్వయింపజేస్తారు

**Biochemical** = జీవరసాయనిక

**Biochemistry** = జీవ రసాయనిక శాస్త్రం

**Biogeography** = జీవ భౌగోళిక శాస్త్రం

**Biological** = జీవశాస్త్ర సంబంధమైన

**Biological control** = జీవ నియంత్రణ

**Biological environments** = ప్రాణికోటి పరిసరాలు (జంతు వృక్షజాలాలు)

**Biology** = జీవశాస్త్రం

**Biometrics** = జీవమాపన శాస్త్రం

**Biometry** = జీవమాపనం

**Biosphere** = జీవావరణం

**Biotic factors** = జీవ కారకాలు

**Bird's-eye-views** = స్థూల సమీక్షా పటాలు

**Bit** = సమాచారం పరిమాణం (a unit of information) : కంప్యూటర్‌లో మాదిరిగా రెండంకెల మీద (1 లేదా 0) ఆధారపడి ఈ సమాచారం ఎలక్ట్రానిక్స్ సహాయంతో బట్వాడా అవుతుంది. '1' indicates the presence of a logic pulse and '0' indicates its absence.

**Bitnoben** = బిడాలవణం

**Bitumen** = శిలాజిత్తు తైలం / మట్టి తైలం

**Black dwarf** = కృష్ణమరుగుజ్జుతార
**Black plum** = నేరేడు
**Blast furnace** = ఉక్కు కొలిమి
**Bleaching Powder** = బ్లీచింగ్ పౌడర్
**Blizzard** = మంచుతుఫానువాయుఘాతం / చీకటిలా ముసురుకొచ్చే హిమపాతం
**Block mountains** = ఖండ పర్వతాలు (ఉ॥ భూభాగాలు ఉవ్వెత్తుగా లేవడం వల్లగాని లేదా భూభాగాలు కుంగినప్పుడుగాని ఏర్పడిన వాజెస్, బ్లాక్ ఫారెస్ట్ ప్రాంతాలు )
**Blood group** = రక్తవర్గం
**Blood meal** = రక్తపు పొడి
**Blue giants** = నీలమహాతారలు (ఈ 'నిలిమ' అంతటా ఉన్నదే అందుకే కవి శేషేంద్ర అని ఉంటాడు: 'నీలి జలంబు / నీలి ధరణీ వలయంబు / వినీల శైలముల్ / నీలి తరు ప్రపంచములు / నీలి యనంతము - ఎందుజూచినన్ నీలిమ" అని!)
**Blue green Algae** = నాచుమొక్కలు
**Blue stars** = నీలవర్ణ నక్షత్రాలు
**Blue stellar objects** = వినీల ఖగోళ వస్తువులు (ఇవి నక్షత్రాల్లా ఉంటాయి)
**Boiling gases** = మరిగే వాయువులు
**Bone Marrow** = ఎముక మూలుగ
**Bone Meal** = ఎముకపొడి
**Borax** = వెలిగారం
**Brackish water** = ఉప్పునీరు
**Braille** = (బ్రైలీ) గుడ్డివాళ్ళకోసం తయారైన లిపి / అంధలిపి (లిపిని కనుగొన్న శాస్త్రవేత్త బ్రైలీ)
**Break-water** = తరంగ తిరస్కరణి
**Bright's Disease** = (బ్రైట్స్ వ్యాధి) మూత్ర పిండాలవ్యాధి ఈ వ్యాధిని మొదటిసారిగా కనిపెట్టిన లండన్ వైద్యుడు రిచర్డ్ బ్రైట్
**Brill's Disease** = (బ్రిల్స్ రోగం) అంటురోగంగా పరిణమించిన ఒక రకం టైఫస్ జ్వరం ఇది ఒకసారి సోకి తగ్గిన తర్వాత - కొన్నేళ్ళకు మళ్ళీ వస్తుందీ వ్యాధి దీన్ని కనిపెట్టిన వైద్యుడు నాథన్ బ్రిల్
**Bronchitis** = ఊపిరితిత్తులలో మ్యూకస్ పొర వాపు
**Broncho-Pneumonia** = రొమ్ము పడిశెం / ఊపిరితిత్తుల వాపు జ్వరం
**Broncho-tracheal** = శ్వాసనాళ సంబంధమైన
**Bryology** = నాచు జాతి మొక్కల శాస్త్రం
**Bryony** = బుడమదొండ
**Bubo** = గజ్జల్లోగాని, చంకలోగాని వచ్చేగడ్డ / బిళ్ళ
**Bubonic plague** = ప్లేగు మహమ్మారి (ఇది ఎలుకల వల్ల వస్తుంది)
**Bubonocele** = ఒరుబీజం
**Butter-tree** = ఇప్పచెట్టు
**C-Band** = రేడియో ఫ్రీక్వెన్సీ బ్యాండ్ (3 9 నుంచి 6 2 గిగాహెర్జ్ వరకు ఉండే ఫ్రీక్వెన్సీలు )
**Cactus** = నాగజెముడు / బ్రహ్మజెముడు
**Cadastral maps** = రేఖా పటాలు (శిస్తులు విధించడానికి, భూమిపైన స్వంత హక్కులను నిరూపించడానికి తోడ్పడే పటాలు)
**Cainozoic Period** = (సీనోజొయిక్) నవ జీవనయుగం
**Caloric** = ఉష్ణం / వేడిమి
**Canal** = కాలువ / కుల్య (కుజగ్రహంలో "కాల్వ' 'లున్నాయని కొన్నాళ్ళు ప్రచారం జరిగింది కాని అవి కాల్వలూ కావు, వాగులూ కావు కుజునిలో రెండు చుక్కల్ని కలిపే ఓ సన్నని రేఖ కనిపించగానే ఇటాలియన్ ఖగోళ వేత్త షియాపరెలీ దాన్ని 'కాల్వ'గా పొరబడి అలా పిలవసాగాడు ఈ రేఖకు అతడు మొదట పెట్టిన పేరు 'కెనాలి' అని అదే ఆంగ్లపదం "కెనాల్" (కాల్వ)కు ఆధారమైంది ఈ కెనాల్ ఖగోళ శాస్త్రవేత్తల బుర్రలను ఏళ్ళ తరబడి తినేసింది
**Cancer** = పుట్టవ్రణం
**Canker disease** = పుండు తెగులు (వృక్షాలకు)
**Canna** = మెట్ట తామర
**Cape of Good Hope** = గుడ్‌హోప్ అగ్రం (తూర్పు ఇండియా దీవులపై పోర్చుగల్ కన్ను పడకముందు ఈ ఆఫ్రికా దక్షిణాగ్రానికి "కేప్ ఆఫ్ స్టోర్మ్స్" అని పేరు దీవుల సంపదను చూచిన తర్వాత దానికి ఆశాజనకమైన 'అగ్రం'గా మార్చేశారు )
**Capillaries** = కేశనాళికలు

**Caravan** = బిడారు / సార్థవాహం / బాటసారుల సమూహం

**Carbohydrates** = పిండి పదార్థాలు (శరీరంలో)

**Carbon dioxide** = బొగ్గుపులుసు వాయువు

**Carbonation** = కర్బనీకరణం

**Carbuncle** = రాచపుండు

**Cardamom** = ఏలకికాయి

**Cardiac arrest** = గుండె ఆగిపోవడం

**Cardiac cycle or beat** = గుండె కొట్టుకోవడం

**Cardiac stimulants** = హృదయోత్తేజకాలు

**Carnivorous** = మాంసాహారి

**Cartography** = దేశ పట రచనా శాస్త్రం

**Cast iron** = పోత ఇనుము

**Casting** = పోతపోయడం

**Casuarina** = సరుగుడు చెట్టు

**Catalyst** = ప్రేరకం / ప్రేరణ కల్గించేది / ఉద్దీపన శక్తి / ఉత్ప్రేరకం

**Cataract** = నేత్ర పటలం

**Catastrophe** = విపత్తు / అవాంతరం

**Cauldron type** = బాన (భాండీ) పర్వతాలు

**Caverns** = కందరాలు (భూమిలోపలి శిలల్లో ఉన్న గుహలు విశాలంగా ఉండడాన్ని ఇలా అంటారు)

**Cell** = జీవకణం

**Cell membrane** = కణ కవచం

**Cellulose** = జీవకణ నిర్మాణ ద్రవ్యం

**Cenozoic** = ఆధునిక జీవ మహాయుగం

**Centre of gravity** = గరిమినాభి

**Centrifugal force** = బాహ్యాకర్షక శక్తి

**Centrifuge** = విమాన వేగాన్ని లేదా రాకెట్ వేగాన్ని పుంజుకొనేందుకు వీలుగా వివిధ గతులలో తిరిగే యంత్రం

**Centriole** = సెంట్రోసోమ్ కేంద్రస్థానంలో ఉండే ఒక చిన్న చుక్కలాంటి పదార్థం

**Centripetal force** = కేంద్రాకర్షక శక్తి

**Centromeres** = సెంట్రియోల్ నుంచి సన్నని దారాల్లా బయటకొచ్చే పీచులాంటి పదార్థం

**Centrosome** = జీవకణం న్యూక్లియస్‌కు దగ్గరలో ఉండే చిన్న పదార్థం దీని మధ్యలో సెంట్రియోల్ ఉంటుంది

**Centrosphere** = (భూమి) కేంద్రావరణం

**cereals** = తృణధాన్యాలు (వరి, గోధుమలు వగైరా)

**Cerebral haemorrhage** = మెదడులోని రక్తనాళాలు చిట్లిపోవడం

**Cerebrum** = మెదడుపైన ముందు భాగాన ఉండే భాగం ఇది రెండు అర్ధగోళాలుగా ఉంటుంది (పెద్ద మెదడు) (1) మస్తిష్కం (పెద్ద మెదడు) (2) చిన్న మెదడును మెడుల్లా ఆబ్లంగేటా అంటారు

**Cervical canal** = గర్భాశయ ద్వారం

**Cetus** = తిమింగలం

**chameleon** = ఊసరవెల్లి

**Chamomile** = చేమంతి

**"Chandrasekhar's Limit"** = ("చంద్రశేఖర పరిమితి") నక్షత్రం ద్రవ్యరాశి సూర్యుని కంటే 1 4 రెట్లు మాత్రమే ఉండాలని తొలిసారిగా కనుగొన్నవాడు మన శాస్త్రవేత్త ఎస్ చంద్రశేఖర్ ఇలా తార ద్రవ్యరాశి పరిమితిని నిర్ణయించినందుకు ఈ పేరు వచ్చింది సూర్య ద్రవ్యరాశి చంద్రశేఖర్ పరిధిలోనే ఉంది

**Channel** = వాగు / ప్రవాహం

**Chemical Combination** = రసాయనిక సంయోగం

**Chemical preservatives** = నిల్వచేసే రసాయనిక ద్రవ్యాలు.

**Chemistry** = రసాయన శాస్త్రం

**Chemotaxonomy** = రసాయనాధార వర్గీకరణ శాస్త్రం

**Chicken pox** = ఆటలమ్మ

**Child convulsions** = చంటిబిడ్డ గుణం (దీని ప్రధాన లక్షణం మూర్ఛ, ఫిట్స్)

**China-rose** = మందార

**Chirographist** = సాముద్రికుడు

**Chiromancy** = సాముద్రికం

**Chlorochromatic maps** = పంటల వివరణ పటాలు

**Chlorophyll** = పత్రహరితం

**Chloroplast** = హరితరేణువు

**Cholum** = జొన్నలు

**Chorography** = ప్రత్యేక భూగోళశాస్త్రం (చిన్న చిన్న భూభాగాల వర్ణనకు లోలమి పెట్టిన పేరిది)

**Chromatids** = క్రోమోజోములలోని దారాలను ఇలా అంటారు. చూడ్డానికి క్రోమోజోములూ, ఇవీ ఒకే విధంగా ఉంటాయి

**Chromatin** = క్రోమోజోముల్లోని పదార్థం

**Chromosomes** = క్రోమోజోమ్‌లు (సెల్ న్యూక్లియస్‌లో పలచని, పొడువాటి దారాల్లా ఉండే పదార్థాలు. జీవకణం చీలిపోయే ముందు మాత్రమే ఇవి తయారవుతాయి. మనిషి జీవకణాల న్యూక్లియస్‌లో ఉండే క్రోమోజోముల సంఖ్య 46. ఇవి సరిసంఖ్యలో ఉంటాయి

**Chromosphere** = వర్ణావరణం (సూర్య వాతావరణం ఎర్రెర్రగా ఉంటుంది కాబట్టి దాన్ని "క్రోమోస్ఫియర్" అన్నారు. ఇది- ఫోటోస్ఫియర్‌కు ఎగువన ఉంటుంది)

**Chronograph** = లేఖన యంత్రం

**Chronology** = కాలపట్టిక

**Chrysolite** = చంద్రకాంతమణి

**Chrystalline rock** = స్ఫటికశిల

**Cleafrice / cieafrix** = పుట్టుమచ్చ

**Cilia** = నూగు

**Cinnamon** = లవంగపట్ట / దాల్చినచెక్క

**Circle** = వృత్తం

**Circle of illumination** = వెలుతురు వృత్తం

**Circuit** = వలయం (విద్యుత్)

**Circulatory system** = రక్త ప్రసరణ మండలం

**Cirques** = 'సిర్క్యూలు' (లోయలు ప్రారంభమైన ప్రాంతంలో మంచుగడ్డ ఒరపిడివల్ల, చేతులకుర్చీ ఆకారంలో పల్లాలుగా ఏర్పడతాయి. వీటిని ఇలా అంటారు)

**Cissus** = నల్లేరు

**Citron** = దబ్బకాయ

**Citrus species** = నిమ్మ, నారింజ జాతులు

**Citrus** = నారింజ జాతి పండ్లు

**Clairvoyance** = "దివ్యదృష్టి" / జ్ఞానదృష్టి

**Clearing-nut** = చిల్లగింజ

**Cliffs** = నిట్రపు కొండలు (తరంగాల ఒరపిడి వల్ల నిట్రంగా ఏర్పడినకొండలకు ఈ పేరు పెట్టారు)

**Climate** = శీతోష్ణస్థితి (కొన్ని సంవత్సరాల సగటు ఉష్ణోగ్రత, వాయుపీడనం, పవనాలు, వర్షపాతం వగైరా భౌతిక పరిస్థితులను తెలిపేది. మొత్తం జీవరాశిపైన ప్రభావం కలిగించే స్థితి ఇది).

**Climatic regions** = శీతోష్ణ ప్రాంతాలు

**Clockwise** = ప్రదక్షిణం (సవ్యం)

**Cloud of gas** = వాయుమేఘం

**Clove** = లవంగం

**Clunch** = సున్నపురాయి

**Cluster-beans** = గోరుచిక్కుడు

**Coagulation** = (కాగ్యులేషన్) రక్తం గడ్డ కట్టడం

**Coastal plains** = తీరమైదానాలు

**Coastal waters** = కోస్తా (Coast)కు 20 మైళ్ళ దూరందాకా వ్యాపించి ఉండే జలాలను ఇలా అంటారు

**Coces** = చామ

**Cockatoo** = తురాయి చిలుక (నెత్తిపైన పింఛంలా ఉంటుంది. ఈ చిలుక ఆస్ట్రేలియాది)

**Coefficient** = గుణకం

**Coherent** = పరస్పరాన్వయం

**Cohesive forces** = బంధన శక్తులు

**Coil** = తీగెచుట్ట

**Coiled** = చుట్లు తిరిగిన

**Coinage** = నాణాల తయారీ

**Coke** = కారుబొగ్గు

**Cold Body** = శీతల వస్తువు / పదార్థం

**Cold Currents** = శీతల ప్రవాహాలు

**Cold storage** = శీతల కేంద్రం

**Colon** = పెద్దపేగు

**Combustion** = జ్వాల / మంట

**Comet** = తోకచుక్క

**Common centre of gravity** = సమష్టి గరిమనాభి (భూమి, చంద్రుడు అనే రెండు గోళాలకు కేంద్రంగా ఉండే గరిమనాభి)

**Communication** = సంవేదం / ప్రసారం
**Communication network** = వార్తా ప్రసార వ్యవస్థ
**Compass** = దిక్సూచి
**Compass needle** = దిక్సూచి
**Compasses** = వృత్తలేఖిని
**Compounds** = సంయోగాలు/సంయుక్త పదార్థాలు / వస్తువులు (వివిధ ధాతువుల వల్ల లేదా మిశ్రమం వల్ల ఏర్పడే వస్తువులు ఇవి)
**Compression** = సంపీడనం
**Compressor** = సంపీడకం
**Computer** = ఫీడ్ చేసిన రకరకాల సమాచారాన్ని చకచకా లెక్కించి అందించే యంత్రం. A Computer processes data to give useful information at a high speed and accuracy. It is endowed with a main memory and auxiliary storage & communication devices
**Computer Technology** = కంప్యూటర్ శాస్త్రం
**Concentration or Condensation** = సాంద్రీకరణం
**Conceptual experiments** = ఊహా ప్రయోగాలు
**Conduction** = వాహకం
**Conductivity** = వాహకత్వం
**Cone Shaped mountains** = కోణాకార పర్వతాలు
**Conical** = శంఖాకారం
**Conjunctivitis** = కండ్లకలక
**Consolidation** = ఘనీభవనం
**Constant** = స్థిరం / స్థిరపరిమాణం / స్థిరమైన
**Constant pressure cycle** = స్థిర పీడనావృత్తి
**Constant volume cycle** = స్థిర ఆయతనావృత్తి
**Constellation** = నక్షత్ర రాశి (ఒక్కో నక్షత్రంలో ఎన్నో నక్షత్రాలుంటాయి)
**Constellations** = నక్షత్రరాసులు
**Constipation** = మలబద్ధకం
**Contact metamorphism** = స్పర్శ రూపాంతర ప్రాప్తి (శిలల సం॥)
**Contageous deseases / Transmittable diseases** = అంటువ్యాధులు
**Continental glaciers** = ధృవప్రాంతపు హిమానీ నదాలు
**Continental shelf** = ఖండపు అంచు
**Continental slope** = ఖండతీరపు వాలు
**Continental drift** = భూఖండం కదలిక
**Continental drifts** = ఖండాలచలనం
**Continental shelf** = ఖండతీరపు అంచు
**Continental slope** = నిట్ర ప్రదేశం
**Contours** = నిమ్నోన్నత రేఖలు
**Contours** = నిమ్నోన్నతాలు / నిమ్నోన్నత రేఖలు
**Contraction of Universe** = విశ్వముకుళీకరణ
**Contusion** = బొప్పి
**Convex** = కుంభాకార
**Convex mirror** = కుంభాకార దర్పణం
**Cool Temperate Zone** = శీతల సమశీతోష్ణ మండలం
**Copernican theory** = కోపర్నికస్ సిద్ధాంతం (భూమి ఇత్యాది గ్రహాలు సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్నాయన్న సిద్ధాంతం)
**Copulation** = సంపర్కం
**Copulatory organs** = సంపర్కావయవాలు
**Coral Islands** = ప్రవాళ (పగడాల) ద్వీపాలు
**Coral reefs** = పగడాల దిబ్బలు (భిత్తికలు)
**Core** = ప్రధానభాగం : (కేంద్రభాగం) ఇందులో కొంత ఘన రూపంలోనూ, మరికొంత ద్రవరూపంలోనూ ఉంటుంది (Solid core + liquid core) దీన్ని "ప్లాస్టిక్ మాంటిల్" అని కూడా అంటారు
**Cornea** = శుక్ల మండలం (కన్నులో)
**Corona** = "కొరోనా" : కిరీటిక (సూర్య వాతవరణంలో ఇతర పొరలకంటే పై పొరను ఇలా అంటారు. దీని అర్థం "కిరీటం". విశ్వకవి టాగోర్ దీనికి "కిరీటిక" అని బెంగాలీలో పేరుపెట్టాడు. కాని

శాస్త్రవేత్త జార్జి గామోవ్ ఇది మొదటిఅనంతర ఐన్‌స్టీన్ చెరిగిన జుట్టులా కల్పించింది. మనం దీన్ని 'విశ్వ శిరోజం' అనుకోవచ్చు. ఇది రామిరెడ్డిగారి 'పలితకేశం' లాంటిది! ఎప్పుడో పూర్వ ప్రమాణ కాలంలో చూడవచ్చు)

**Corpuscles (red)** = ఎర్రరక్తకణాలు

**Corpuscles (white)** = తెల్లరక్తకణాలు

**Corrosion** = క్షయం / తుప్పుపట్టడం

**Corundum** = కురువిందం

**Cosmic dust** = విశ్వధూళి

**Cosmic rays** = విశ్వాంతర కిరణాలు: ఇవి అతి శక్తివంతమైన అణ్వాంతర శకలాలు. ఇవి రోదసి నుంచి భూమిని తాకుతూ ఉంటాయి. ఇవి భూమి వాతావరణంలో ఢీకొని రకరకాల స్వల్పశక్తి కిరణాలను విడుదల చేస్తాయి

**Cosmic evolution** = విశ్వపరిణామం

**Cosmology** = విశ్వశాస్త్రం

**Cosmonaut** = వ్యోమగామి

**Cosmos** = ఖగోళం

**Cotyledons** = బీజదళాలు

**Count-down** = (కౌంట్‌డౌన్) ప్రయోగ సంసిద్ధత: ప్రయోగానికి ముందు రోదసీ నౌకను లేదా వాహనాన్ని చుప్తాగ తనిఖీ చేసి తుది క్షణ సంసిద్ధతలో అట్టిపెడతారు (టైమ్‌ను వెనక్కి సెట్ చెసుకొని ఆ క్రమంలో - 3, 2, 1 అలా క్షణాలు లెక్కిస్తూ పోవడం)

**Cowage** = దురదగొండి

**Crab Nebula** = క్రాబ్ నెబ్యులా = నక్షత్రమేఘం (ఇది ఎండ్రకాయలా ఉంటుంది కనక ఇలా అన్నారు)

**cranial nerves** = మెదడు నాడులు

**Craniology** = కపాలశాస్త్రం

**Cranium** = కపాలం/పుర్రె

**Crank Axle** = వంపు ఇరుసు

**Crank shaft** = ఇరుసు కమ్మి

**Crater** = బిలం (గ్రహ శకలాలు అదాటున వచ్చి భూమిని తాకినప్పుడు ఏర్పడే పెద్ద రంధ్రం)

**Crator** = చషకం / పాత్ర

**Crest** = (తరంగాల ఎత్తు) శృంగం

**Crest gates** = (క్రెస్ట్ గేట్లు) శిఖర ద్వారాలు

**Cricket** = కీచురాయి / ఇలకోడి

**Cricoid** = కంఠుసంధి

**Cro-Magnon** = క్రో-మాగ్నాన్ మానవుడు (క్రో-మాగ్నాన్ ఫ్రాన్స్‌లోని గుహాలు) శ్రీశ్రీ 'దేశ చరిత్రలో'లో "హరప్పా, మొహంజదారో క్రో-మాగ్నాన్ గుహాముఖాల్లో చారిత్రిక విభాత సంధ్యల మానవ కద వికాసమెట్టిది" అని ప్రస్తావించాడు

**Crocus** = కుంకుమ

**Crop rotation** = పంటమార్పిడి / మార్చి మార్చి పంట వేయడం

**Cross pollinatio** = పరపరాగ సంపర్కం

**Croton** = క్రోటన్ మొక్క / చెట్టు

**Crucible** = మూస

**Crude oil** = ముడిచమురు (పెట్రోలియం)

**Crust** = భూపటలం / భూమి బాహ్య పొర: ఈ భూఖండ పటలం సగటున 25 కిలోమీటర్ల మందంలో ఉంటుంది. కొన్నిచోట్ల ఈ మందం 50 కిలోమీటర్లదాకా ఉండొచ్చు. సముద్రపు పొర (Crust) 15 కిలోమీటర్ల మందం ఉంటుంది (పటము చూడండి)




**Cryogenics** = అతి చల్లని వాతావరణంలో, పదార్థాల అధ్యయనానికి సంబంధించిన శాస్త్రం (At temperatures nearing Absolute Zero i.e - 273°C)

**Cryptogram (graph)** = గూఢలిపి

**Crystal** = స్ఫటికం

**Crystalline** = స్ఫటికాకృతి

**Crystallization** = స్ఫటికీకరణం

**Crystallography** = స్ఫటిక శాస్త్రం
**Cube** = ఘన చతురస్రం / ఘనం
**Cube-root** = ఘనమూలం
**Cubebs** = తోకమిరియాలు
**Cultural Geography** = సాంస్కృతిక భూగోళశాస్త్రం
**Cumin** = జీలకర్ర
**Curcuma / Turmeric** = పసుపు
**Curie point** = క్యూరీ బిందువు (మేడమ్ క్యూరీ సిద్ధాంతం ఆధారం)
**Current electricity** = ప్రవాహ విద్యుత్తు
**Curry-leaf** = కరివేపాకు
**Curvature** = వంపు / వంకర
**Curvature of space** = విశ్వవక్రీకరణ (విశ్వంలో స్థల-కాల సమవాయం వంపుతిరుగుతుందని, సూర్యుడు, నక్షత్రాల్లాంటి పెద్ద వస్తువుల దగ్గరలో కాంతి కిరణాల వక్రీకరణను ప్రత్యేకంగా దర్శించవచ్చునీ ఐన్‌స్టీన్ నిరూపించాడు ఇలా పెద్ద ద్రవ్యరాశిగల గోళం వద్ద స్థలం ఇలా వంపు తిరగడాన్నే 'విశ్వవక్రీకరణ' అంటారు).
**Curvature** = వక్రత
**Curve** = వంపు / వక్రం
**Curved surface** = వక్రతలం
**Cusp** = పంటికొన
**Cuss-cuss** = వట్టివేళ్ళు
**Custard apple** = సీతాఫలం
**Cut stone** = మలచిన రాయి
**Cybernetics** = యంత్రభాషా శాస్త్రం: యంత్రానికి భాష అబ్బించిన వాడు మానవుడే 'పశువు కొక్క భాష, నిసువు కొక్క భాష, మానవుడికి మాత్రం సంఖ్యానంతపు పలుకుబళ్ళు' అన్నాడు మహాకవి ఈ అనంత పలుకుబళ్ళతోనే మానవుడు మరమనిషిని (రోబోట్ వగైరా) కూడా అజరామరం చేస్తున్నాడు. మానవుడికీ మానవ నిర్మిత యంత్రానికీ ఉన్న సంబంధాన్ని వివరించే శాస్త్రమే సైబర్నెటిక్స్. దీనికి మూల పురుషుడు అమెరికన్ గణిత శాస్త్రవేత్త నార్బెట్ వీనర్ ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసిన ఇతని గ్రంథం "సైబెర్నెటిక్స్ ఆర్ కంట్రోల్ అండ్ కమ్యూనికేషన్" మానవుల విషయంలోగాని, జంతువులకు సంబంధించిగాని యావత్తు సమాచార నియంత్రణను వివరించే శాస్త్రాన్ని సైబెర్నెటిక్స్ అని పిలవవచ్చని స్పష్టం చేశాడు. గ్రీక్ భాషలో దీనికి (Kybernetics) చోదకుడు అని అర్థం స్వయం చోదకమైనదల్లా 'ఆటోమేషన్' కిందికే వస్తుంది కనుక స్వయంచాలిత యంత్రభాషే 'సైబెర్నెటిక్స్' కంప్యూటర్లకు, రొబోట్స్‌కు, మానవ మేధస్సుకు, సమాజానికి మధ్య ఏర్పడిన అవినాభావ సంబంధాన్ని వివరించే శాస్త్రం ఇది మానవ భాషపై ప్రభుత సాధించిన యంత్రం మానవుని కంటే వేగతివేగంగా ఆ భాషను ప్రయోగంలోకి తెచ్చుకోగలుగుతుందని కొందరు శాస్త్రవేత్తల అంచనా సైబెర్నెటిక్స్‌కు ప్రాణం సమాచారం 1943 సంవత్సరాన్ని యంత్ర నియంత్రణ, సమాచార విజ్ఞాన శాస్త్ర చరిత్రలో ఒక మైలురాయిగా పరిగణిస్తారు ఈ శతాబ్దం చివరి అర్ధ శతాబ్దంలో కనిపెట్టిన మూడు గొప్ప పరిశోధనలలో సైబర్నెటిక్స్ ఒకటి (మిగతా రెండు: అణుశక్తి విస్ఫోటనం, రోదసిని జయించడం) ఈ కొత్త విజ్ఞాన శాస్త్ర సమాచార విభాగం గురించి వీనర్ జోస్యాలుగా పరిగణించదగిన ఆసక్తిదాయకమైన కొన్ని విషయాలు తెలిపాడు : "This new development (automation) has unfounded possibilities for good and for evil the future offers a very little hope for those who expect that our new Mechanical slaves (Computers or Robots etc) will offer us a world in which we may rest from thinking Help us they may, but at the cost of supreme demand upon our honesty and intelligence. The world of the future will be an ever more demanding struggle against the limitations of our intelligence, not a comfortable hammock in which we can lie down to be waited upon

by our robot slaves"

మానవ భాషపై అధికారం సాధించిన యంత్రం మనిషి కంటే వేగంగా పనిచేసి కావలసిన సమాచారాన్ని క్షణాల్లో బోలెడంత గుప్పించగల్గుతుంది ప్రసిద్ధ రచయిత అనటోల్ ఫ్రాన్స్‌కు వచ్చిన సందిగ్ధావస్థే ఎవరికైనా రావచ్చు 'మీకు స్టెనోగ్రాఫర్‌గా ఉంటానండీ' అని ఒకావిడ అనటోల్‌కు చెబుతూ "షార్ట్‌హాండ్‌లో నిమిషానికి 150 పదాలు డిక్టేషన్ తీసుకొంటాను" అన్నదట దానిపై అనటోల్ "నీవు అంత స్పీడులో రాస్తే రాయొచ్చునేమోగాని తల్లీ, ఆ స్పీడుకు తగినన్ని మాటలు నేనెక్కడ్నుంచి పట్టుకురాను" అన్నాడట ఇంతకూ చెప్పొచ్చేదేమంటే 'వేగం' అన్నది ఫీడ్ చేసే ప్రోగ్రామ్ మీద ఆధారపడి ఉంటుంది అనంత పలుకుబళ్ళు అన్నీ నిక్షిప్తమై ఉండేది అక్కడే మరి!

**Cyber porn (Infoporn)** = 'అశ్లీల విశ్వం' అశ్లీలతా ప్రదర్శనకు సెక్స్ విజ్ఞాన దుర్వినియోగానికి కంప్యూటర్ యంత్రాన్ని వాడుకోవడాన్ని ఇలా అంటారు అశ్లీల రచనలను, బొమ్మలను 'పోర్నోగ్రఫీ' అంటారు దానికి సంబంధించిన కంప్యూటర్ సమాచారాన్ని సైబర్ పోర్నో / ఇన్ఫోపోర్నో అంటారు అదుపాజ్ఞలు లేని దీని ప్రభావం యువతమీద ఎంతగా ఉంటుందో అమెరికా నుంచి వచ్చిన వార్తను గమనించండి ప్రపంచ వ్యాపితంగానే ఇది తల్లిదండ్రులకొక హెచ్చరికగా పరిగణించాలి:

LOUISVILLE (U S ) June 12,

A 13-year-old girl thought to have been lured across the country through a computer network was picked up today in Hollywood by the Federal Bureau of Investigation (FBI). Ms. Tara Noble disappeared on May 30, from her suburban Louisville home about two months after getting a computer. Her parents believe she was drawn to California by someone she met through an online network The FBI would not comment on the case but warned that it demonstrates the need for parents to provide oversight and guidance to their children in the use of computers A search of Ms Tara's room uncovered telephone numbers for people across the country whom she had met during dozens of hours chatting on computer networks and a series of sexually explicit images that had been transmitted through the computer's modem.

Her parents also found E-mail between Ms Tara and someone called George in San Francisco, including a message inviting her to stay with George's parents

Tara called the FBI in Los Angeles on Sunday and said she wanted to come home, according to Mr V Dave Kohl, FBI agent incharge for Kentucky

In a similar case, a 16-year-old boy in San Francisco persuaded a 16- year-old boy from Washington state to visit him after they met through America online The Washington youth was found safe at the San Francisco airport on June 4 The FBI is investigating both cases - AP

- *"Hindu" 13th June (1995)*

**Cycle** = ఆవృత్తి

**Cyclone / Typhoon / storm / Tornado/ hurricane** = తుఫాను / పెనుతుఫాను దీనిని వివిధ ప్రాంతాల్లో వివిధ రకాలుగా పిలుస్తారు భారతదేశంలో సైక్లోన్, అమెరికాలో హరికేన్, టార్నోడో, జపాన్‌లో టైఫూన్ అనీ అంటారు

**Cylindrical** = స్థూపాకారం

**Cytochemistry** = కణరసాయన శాస్త్రం

**Cytogenetics** = కణజన్యుశాస్త్రం

**Cytology** = జీవకణ శాస్త్రం

**Cytoplasm** = కణద్రవ్యం (కణంలోని కేంద్రం చుట్టూ ఉండే పదార్థం)

**Cytosine** = న్యూక్లిక్ యాసిడ్స్‌లో ఉండే పిరిమిడిన్ బేస్. దీని ఫార్ములా $C_4 H_5 N_3O$.

**Cytotaxonomy** = కణాధార వర్గీకరణ శాస్త్రం

**Dactylology** = [illegible]

**Dandruff** = చుండ్రు

**Dark Continent** = చీకటి ఖండం (వలస సామ్రాజ్యవాదులు ఆఫ్రికా ఖండానికి పెట్టిన పేరు ప్రపంచ నాగరికతకు జన్మనిచ్చిన తొలి ఖండాలలో ఆఫ్రికా ఖండం ఒకటి)

**Data** = దత్తాంశాలు 0-1 అంకెల రూపంలో ప్రసారమయ్యే సమాచారం (Any information usually sent in the form of binary bits)

**Datura** = ఉమ్మెత్త చెట్టు

**Dead beat** = హఠాత్ స్తంభన

**Deductive method** = ప్రతిజ్ఞావాదం

**Deep Sea plain** = అగాధ సముద్రమైదానం

**Deep freeze** = హిమీకరణ ప్రాంతం

**Deeps** = అగాధాలు

**Defoliation** = ఆకుతీత / ఆకులు రాల్చడం

**Degradation** = నిమ్నీకరణం (ఎత్తైన పర్వతం ఎత్తు తగ్గిపోవడం)

**Dehydration** = నిర్జలీకరణం (శరీరంలో లవణాలు కోల్పోయినప్పటి దశను ఇలా అంటారు )

**Delirium** = అవాకులు / చిత్తభ్రమ /సన్నిపాతం = ఇసుకపర్ర

**Density** = పదార్థ సాంద్రత

**Deposition** = నిక్షేపణం (శిధిలమైపోయిన శిలా పదార్థం తాను ఏర్పడిన చోటునే ఉండదు గాలి నీరు, హిమానీనదాలు 'ఎరోజన్' వల్ల ఈ పదార్థం ఉన్నచోటునుంచి కదిలి తగిన ప్రదేశంలో ఉండిపోతుంది దీనినే "నిక్షేపణం" అంటారు

**Depositional plains** = ఒండ్రు (మట్టి) మైదానాలు

**Deposits** = నిక్షేపాలు/మట్టిపొరలు

**Depression** = వాయుగుండం

**Descending node** = సూర్య కక్ష్యను దాటి దక్షిణానికి పోతే డిసెండింగ్ నోడ్" అంటారు.

**Dew-lap** = గంగడోలు

**Dew-worm** = వానపాము

**Diabetes - insipidus** = అతిమూత్రవ్యాధి

**Diabetes - mellitus** = మధుమేహం ([illegible] ఒకపట్టాన తగ్గదు)

**Diagonal** = కర్ణం

**Diameter** = వ్యాసం

**Diaphoretics** = స్వేదవర్ధకాలు

**Diaphragm** = ఉదర కోశానికి, వక్షః భాగానికి మధ్య ఉన్న పొర

**Diarroea** = అతిసారవ్యాధి

**Diastole** = గుండె వ్యాకోచం

**Die** = ముద్ర / అచ్చు

**Dietetics** = ఆహార విధులు

**Diffusion Velocity** = విస్తరణ వేగం

**Digit** = సంఖ్యాస్థానం

**Digital Computer** = డిజిటల్ కంప్యూటర్

**Digital data transmission** = సంఖ్యా సమాచార ప్రసార వ్యవస్థ

**Dioptre** = సులోచన కొలమానం (కళ్ళద్దాల శక్తిని కొలిచే యూనిట్)

**Dioptrics** = కాంతి కిరణాలు

**Diphtheria** = సర్పివ్యాధి

**Discs** = బింబాలు

**Divider** = విభాగిని / విభజని

**DNA Molecule** = Deoxyribo Nucleic Acid ఇది న్యూక్లిక్ యాసిడ్స్‌లో ఒక రకం సెల్ న్యూక్లియస్‌లో ఉంటుందిది వారసత్వం తబిశీళ్ళన్నీ భద్రంగా ఉండేది ఈ డి ఎన్ ఎ లోనే

**Dock and Harbour construction** = నౌకాశ్రయ నిర్మాణం

**Dogma** = సిద్ధాంతం

**Dogmatic** = పిడివాది

**Dogmatism** = పిడివాదం

**Dolphin rise & Challenger rise** = ఈ రెండూ ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో ఏర్పడిన లోతైన లోయలు

**Dome type mountains** = గోపుర పర్వతాలు

**"Doppler Shift"** = రోదసీ నౌక ప్రయాణ గతిని

కనిపెట్టి ఉండే విధానం (The shift in frequency in which energy reaches receiver when the source is moving) ఉపగ్రహ మార్గాన్ని కనిపెట్టి ఉంచడానికి (ట్రాకింగ్) ఈ షిఫ్టు ఉపయోగిస్తారు

**Double planet** = జంటగ్రహం / జమిలి గ్రహం

**Double stars** = జంటతారలు (విశ్వంలో అసంఖ్యాకంగా ఉన్న ఈలాంటి తారలకు "బైనరిస్" అని సాంకేతిక నామం)

**Douche** = పిచికారి

**Drifts** = ఉపరితల వాహాలు (ఇవి సముద్రం పైభాగంలోనే ఏర్పడతాయి)

**Drilling machines** = తొలిచే యంత్రాలు

**Drills** = డ్రిల్లులు (తొలచడాలు) / బరమాలు

**Dropsy** = నంజు

**Drug plants** = మందు మొక్కలు

**Drum-stick** = మునగకాయి

**Dry-ginger** = శొంఠి

**Ductility** = తీగెలుగా సాగే గుణం / విస్తార్యత

**Dust storm** = ధూళి తుఫాను

**Dutch elm disease** = "డస్ఎల్మ్" తెగులు (చెట్లకు)

**Dwarf stars** = కుబ్జతారలు / చిన్న నక్షత్రాలు (నక్షత్రాల్లో రెండు రకాలున్నాయి మనుషుల్లో మాదిరే - ఆజానుబాహు తారలు, మరుగుజ్జు తారలూ అని)

**Dwarfing** = గిడసరి జబ్బు

**Dye** = రంగు / వర్ణ పదార్థం

**Dye colours** = అద్దకపు రంగులు

**Dyeing** = అద్దకం

**Dykes** = కందకాలు / ఇసుక కట్టలు

**Dynamics** = గతిశాస్త్రం

**Dysentery** = నీళ్ళ విరేచనాలు

**Dysmenorrhea** = రుతుస్థానంలో నొప్పి

**Dyspepsia** = అజీర్ణరోగం

**Dysphagia** = మింగలేకపోవడం

**Dyspnoea** = శ్వాసావరోధం

**Dystocia** = కష్ట ప్రసవం

**$E = mc^2$** = శక్తి, పదార్థం ఒక్కటేనని నిరూపించిన ఐన్‌స్టీన్ సూత్రం **'E'** అంటే ఎనర్జీ, **'m'** అంటే ద్రవ్య రాశి, **'c'** అంటే కాంతి వేగం అటంబాంబు తయారీలో ఈ సూత్రమే పనికొచ్చింది మానవాళి శ్రేయస్సుకు మాత్రమే శక్తిని వినియోగిద్దామని కలలుగన్న ఐన్‌స్టీన్ తన సూత్రం మానవ వినాశానికి వినియోగించుకోడాన్ని ఏవగించుకొని ఎంతగానో దురపిల్లాడు ఇది అపారమైన శక్తి విడుదల కావడానికి ఉపకరించే సూత్రం ద్రవ్యరాశిని కాంతి వేగం స్క్వేర్‌తో హెచ్చిస్తే వచ్చే యూనిట్ల సంఖ్య ఆ పదార్థ శక్తికి సరిసమానం అంటారు

**Earth Station** = భూ పరిశోధనా కేంద్రం: ఉపగ్రహంతో అనుక్షణ సంబంధాలు పెట్టుకొనేందుకు యాంటెనాలు, ఇతర పరికరాలు ఉన్న భూకేంద్రం

**Earthquake** = భూకంపం: రిక్టర్ స్కేలు రీడింగ్‌కూ, జన సమ్మర్ధంగా ఉన్న ప్రాంతాల్లో భూకంపం కల్గించే నష్టానికీ మధ్యనున్న సంబందం ఇలా ఉంటుంది:-

- రిక్టర్ స్కేలుపైన ప్రకంపనం తీవ్రత 3 5 పాయింట్లు ఉంటే కలిగేనష్టం స్వల్పం
- అదే రిక్టర్ స్కేల్ 4కు చెరుకుంటే ఒక మోస్తరు నష్టం వాటిల్లుతుంది
- రిక్టర్ స్కేల్ 5కు చేరితే తగు మాత్రపు నష్టం జరుగుతుంది
- రిక్టర్ స్కేల్ 6కు చేరితే భూకంపం వల్ల తీవ్ర నష్టం సంభవిస్తుంది.
- స్కేల్ 7కి చేరితే భూకంపం వల్ల విస్తారమైన ప్రాంతంలో భారీ నష్టాలు ఉంటాయి
- స్కేల్ 8కి చేరినప్పుడు అది పెను భూకంపం కిందలెక్క అపారమైన నష్టాలు వాటిల్లుతాయి

**Eastern Elongation** = (సూర్యుని) తూర్పుకొన

**Ecliptic** = గ్రహణ సామీప్యం (చంద్రుడు సూర్యకక్ష్య సమీపానికి వెళ్ళి గ్రహణ స్థితిని దగ్గరలో తప్పించుకోవడం)

**Economic geography** = ఆర్థిక భూగోళ శాస్త్రం (వివిధ ప్రాంతాలలోని వృత్తులు, వస్తూత్పత్తి వ్యవస్థలకూ భౌతిక పరిస్థితులకూ మధ్య ఉన్న సంబంధాన్నీ, ప్రాంతీయ వ్యత్యాసాలనూ వివరించే శాస్త్రం)

**Eczema** = గజ్జి / కర్పాటి

**Eddies** = సుడులు

**Efferent nerves** = చలన నాడులు
**Efflorescent** = పుష్పించిన
**Egg cells** = అండ జీవకణాలు
**Egg shell** = గుడ్డు పెంకు
**Egret** = తెల్లకొంగ
**Electric spark** = విద్యుత్ రవ్వ (స్ఫులింగం)
**Electrical pulse** = విద్యుత్ స్పందన
**Electrification** = విద్యుదీకరణం
**Electrocution** = విద్యుదాఘాతంతో చంపడం
**Electromagnet** = విద్యుదయస్కాంతం
**Electromagnetic field** = విద్యుత్ అయస్కాంత కేంద్రం / క్షేత్రం
**Electromagnetic waves** = విద్యుదయస్కాంత తరంగాలు
**Electron Shells** = ఎలక్ట్రాన్ కక్ష్యలు
**Electron** = అణీయు
**Electrostatic Repulsion** = విద్యుత్తిరస్కార శక్తులు
**Elementary particles** = మూల కణాలు
**Elements** = ధాతువులు (ప్రకృతిలో లభించే మూల ధాతువులు 92 అయితే కృత్రిమంగా ఏర్పడేవి వేలు, లక్షలు రసాయనిక సంయోగం వల్ల ఏర్పడేవి కృత్రిమ ధాతువులు (హైడ్రోజన్, ఆక్సిజన్, హీలియం లాంటివి) / మూలద్రవ్యాలు
**Elephant-apple** = వెలగకాయ
**Elephantiasis** = బూ(బో)దకాలు
**Ellipse** = సూర్యునిచుట్టూ గ్రహాలు పరిభ్రమించే కక్ష్యను (as described by planets) ఇలా అంటారు (మరో సందర్భంలో దీర్ఘ వృత్తాకారాన్ని ఇలా అంటారు)
**Elliptical orbits** = దీర్ఘ వృత్తాకార కక్ష్యలు
**Embryo** = పిండకోశం
**Embryogeny** = పిండాభివృద్ధి
**Embryology** = పిండోత్పత్తి శాస్త్రం
**Endocardium** = గుండెలోపలి పొర
**Endocarp** = అంతఃకవచం
**Endoderm / endodermis** = లోపలి చర్మం
**Energy** = శక్తి
**Energy (kinetic)** = చలన శక్తి
**Energy (potential)** = అచల శక్తి
**Entomology** = కీటక శాస్త్రం
**Ephemera** = ఒక్కరోజు మాత్రమే బతికి ఉండే పురుగులు
**Ephemeris time** = పంచాంగ కాలం
**Epicarp** = బాహ్య కవచం
**Epicene / (Bisexual)** = స్త్రీ, పురుష లక్షణములు రెండూ ఉన్న వ్యక్తి
**Epicentre** = భూకంపన కేంద్రం
**Epidemic** = సర్వవ్యాపిత వ్యాధి / బహుళవ్యాపక వ్యాధి
**Epidermis** = బాహ్య చర్మం
**Epihelion** = దూరంగా జరగడం
**Epilepsy** = అపస్మారం / మూర్ఛ
**Epithermal** = అల్పతాపం
**Equation** = సమీకరణం
**Equator** = గురుమధ్యరేఖ ('గురుడు' సౌర గ్రహాలన్నింటిలోకి పెద్దవాడు కనుకనే 'అపర సూర్యుడు' అన్నారు) / భూమధ్యరేఖ
**Equatorial calms** = భూమధ్యరేఖా ప్రశాంత మండలం
**Equatorial region** = భూమధ్య రేఖామండలం
**Equilibrium** = సమతౌల్యం / స్థిరత్వం
**Erect-apeman** = కోతి మనిషి (నిటారుగా నిలబడే కోతిని పోలిన మనిషి) - మరో పేరు "పితకాంత్రోపస్ ఎరెక్టస్" నరవానరం అన్నమాట
**Erosion** = అరుగుదల / కోసుకుపోవడం (నదికట్టలు, భూమి సం॥)
**Erosion hills** = ఒరపిడి వల్ల ఏర్పడిన కొండలు
**Erosion Plains** = ఒరపిడి వల్ల ఏర్పడే మైదానాలు
**Erotomania** = మదపిచ్చి
**Erythema** = దద్దురు
**Escape velocity** = పలాయన వేగం: ఉపరితల గురుత్వాకర్షణ శక్తిని తప్పించుకొని పోగల వస్తువుకు అవసరమైన వేగాన్ని ఇలా అంటారు.

**Esophagus** = అన్నవాహిక

**Estuary** = నీటికయ్య (డెల్టాలు - మైదాన ప్రాంతాలు - లేని నదీ ముఖద్వారాన్ని ఇలా అంటారు) సంగమ స్థలం / నదీముఖం

**Ether** = సూక్ష్మ పదార్థం ("కేవల స్థలాని"కి కొన్ని వస్తుగుణాలను ఆపాదించడానికి కొందరు శాస్త్రజ్ఞులు ప్రయత్నించారు శూన్యంలో ఇలాంటి సూక్ష్మాతి సూక్ష్మ పదార్థం ఉందని ఊహించి అలా ప్రచారం చేశారు శూన్య స్థలంలో భూమి ఈదర్‌లో తిరుగుతుందని, ఈధర్ లేకపోతే కాంతి ప్రయాణించదనీ ప్రచారం చేశారు కాని ఈ సిద్ధాంతం రుజువు కాలేదు ఐన్‌స్టీన్ ప్రకారం 'ఈధర్' లేదు. అది కల్పన అన్నాడు దేవుడికి అస్తిత్వం లేనట్లే దీనికీ లేదని తెగేసి చెప్పాడు దీన్ని తన విశిష్ట సాపేక్ష సిద్ధాంతంతో - స్పెషల్ థీరీ ఆఫ్ రెలెటివిటీతో - తోసిపుచ్చాడు

**Etiology** = రోగ కారణ శాస్త్రం

**Etymology** = శబ్దవ్యుత్పత్తి శాస్త్రం

**Eugenics** = మర్మశాస్త్రం

**Euthanasia** = ఐచ్ఛిక మరణం (భీష్మవాంఛ): రోగి బాధ భరించలేనప్పుడు రోగి కోరిక ప్రకారం సుఖ మరణానికి తగిన మందులు వాడడాన్ని ఇలా అంటారు. ఈ సమస్య వివాదాస్పదంగా తయారైనా ఇప్పుడిప్పుడూ అనేక దేశాలలో ఈ వైద్యాన్ని అనుమతిస్తున్నారు. శాసన సమ్మతం, న్యాయశాస్త్ర సమ్మతం చేస్తున్నారు.

**Evaporation** = బాష్పీకరణం (ఆవిరికావడం)

**Evolution theory of Universe** = విశ్వ పరిణామవాదం

**Evolution** = పరిణామం

**Evolution of life** = జీవపరిణామ వాదం

**Excavation** = తవ్వకం/ఖననం

**Expansion of Universe** = విశ్వ విస్తరణ

**Exploration** = అన్వేషణ

**Explorers** = (భూగోళ) పరిశోధకులు

**Explosion** = ప్రస్ఫోటనం / విస్ఫోటనం

**Extrusive rocks or Volcanic rocks** = ఉద్గమ శిలలు / అగ్ని పర్వత శిలలు (శిలాద్రవం భూ ఉపరితలం పైకి వచ్చి చల్లారిన తర్వాత ఘనీభవించి ఏర్పడే శిలలను ఇలా అంటారు)

**Eye of the cyclone** = తుపాను కేంద్రం / చక్రవాత కేంద్రం

**Facial paralysis** = ముఖవాతం (పక్షపాతం)

**Facsimile** = యదార్థపత్రం / చిత్రం, ఒక డాక్యుమెంటుగాని లేదా ఒక బొమ్మనుగాని అచ్చు అలాగే కాపీచేసి దూర ప్రాంతాలకు బట్వాడా చేసే సాంకేతిక చిట్కాను 'ఫాసిమైల్' అంటారు (Technique to reproduce an exact copy) లిఖిత పత్రాన్ని ఒక చోటునుంచి మరో చోటుకి ఫాక్స్ సహాయంతో అతి స్వల్ప వ్యవధిలో పంపవచ్చు

**Factor** = కారణాంకం

**Faeces** = మలం

**Falling star / shooting star** = రాలేచుక్క

**Fan leaf disease** = విసనకర్ర ఆకు తెగులు

**Fascicles** = గుత్తులు

**Fatalism** = దైవికవాదం

**Fatty oils** = కొవ్వు నూనెలు

**Feeder roots** = నీటిని పీల్చుకునే వేళ్ళు

**Fermentation** = పులియబెట్టడం

**Fertile crescent** = "సారవంతపు నెలవంక" (మెసపొటోమియా మైదానాలకు ఇదో మారు పేరు)

**Fertile lands** = సారవంతమైన భూములు

**Fertilization** = ఫలదీకరణం

**Fibre glass** = నారగాజు

**Fibre synthetics** = కృత్రిమ దారాలు

**Fibre-reinforced plastics** = ప్లాస్టిక్ వస్తువు మిశ్రమ పదార్థం గ్లాస్ (గాజు) లాంటి పదార్థాల తీగెలను పాస్టిక్ పదార్థానికి కలిపి ఈ ప్లాస్టిక్ వస్తువును చెక్కు చెదరని గట్టి వస్తువుగా మలుస్తారు

**Field study** = క్షేత్ర పరిశోధన

**Filtration** = వడపోత

**Fission** = విచ్ఛేదనం (అణువిచ్ఛేదనం) / విచ్ఛిత్తి

**Fissure** = పగులు

**Fixed stars** = స్థిరతారలు (తారలు కదులుతున్నట్లు కనబడవు కాబట్టి).

**Flares** - జ్వాలలు (సూర్యబింబంపై ఉద్భవించి ఒక క్షణం కన్పించే వెలుగులు)
**Flash flood** = ఆకస్మిక వరద (వెల్లువ) ఇది భారీ వర్షాల వల్లనేగాక, భారీ ఎత్తున హిమపాతం కరిగిపోవడంవల్ల కూడా వస్తుంది
**Flatulence** = కడుపుబ్బరం
**Flint** = చెకుముకిరాయి
**Flora and Fauna** = వృక్షజాలం, జంతుజాలం
**Fluorescence** = స్ఫోరకత / కాంతి
**Flying Saucers** = ఎగిరే పళ్ళాలు (ఇతర గ్రహాలలో ప్రాణికోటి ఉందని ఊహించి, నిరాధారంగా ప్రచారంలోకి తెచ్చిపెట్టిన వస్తువులివి అమెరికన్ నిపుణుల కమిటీ ఇవి బూటకం అని స్పష్టం చేసింది రెండవ ప్రపంచ యుద్ధం తరువాత వచ్చిపడిన ప్రచారం ఇది
**Foetus** = పిండం
**Fold mountains** = ముడుత పర్వతాలు (ఉదా: అలల్లా మడతలుబడి విశాలంగా వ్యాపించిన ఆల్ప్సు, హిమాలయ పర్వతాలు)
**Foot & mouth disease** = గాళ్ళరోగం
**Forceps** = శ్రావణి
**Fossil** = శిలాస్థి (శిలాజం)
**Fraction** = భిన్నం / భాగం
**Freezing** = ఘనీభవనం
**Freezing point** = ఘనీభవ స్థాయి
**Freezing drizzle** = మంచుతుఫాను (ice storm)కు ఇది మరో పేరు
**Frequency** = తరచుగా రావడం / పౌనఃపున్యం
**Friction** = ఒరిపిడి
**Frith / firth** = చిన్న సముద్రశాఖ
**Frontal bone** = లలాటాస్థి
**Frost** (or) **dew** = పొగమంచు
**Fulcrum** = ఆధారం (ఉదా: త్రాసు)
**Functional disease** = ఇంద్రియ వ్యాపార లోపం వల్ల వచ్చే వ్యాధి
**Fungal spores** = శిలీంధ్ర జీవబీజాలు
**Fungi** = శిలీంధ్రాలు
**Fungicide** = శిలీంధ్ర నాశకం
**Fusion** = సంయోగం (అణుగర్భ సంయోగం)
**G C.M.** = గరిష్ఠ సామాన్య ప్రమాణం (Greatest Common Measure).
**Gale** = ఈదురుగాలి (గంటకు 39-54 మైళ్ళ వేగం)
**Gall** = చేదు
**Gall-bladder** = పిత్తాశయం
**Gametes** = గ్యామేట్స్ (చెరిసగంగా చీలే స్త్రీ పురుష జీవకణాలను ఇలా అంటారు ) / సంతానకణాలు
**Gamma rays** = 'గామా' కిరణాలు అణుగర్భం విచ్ఛిత్తి సమయంలో వెలువడే మరో కిరణ శకలం
**Gangrene** = మాంసాన్ని కుళ్ళజేసే పుండు
**Garden radish** = ముల్లంగి
**Garlic** = వెల్లుల్లి
**Gaseous fuel** = వాయు రూపంలో ఇంధనం
**Gases** = వాయుపదార్థాలు
**Gene** = జన్యువు
**Genealogy** = వంశ చరిత్ర
**General Geography** = సామాన్య భూగోళ శాస్త్రం
**Genes** = (జీన్స్) = వారసత్వ లక్షణాలు నిక్షిప్తమై ఉన్న అరలు, పొరలు ఇవి డి ఎన్ ఎ మోలిక్యూల్స్‌తోనే తయారవుతూంటాయి
**Genesis rocks** = జనక శిలలు
**Genetic code** = జన్యు లక్షణపేటిక.
**Genetic characters** = జన్యు లక్షణాలు
**Genetic factors** = వంశపారంపర్య దోషాలు
**Genetics** = అనువంశిక లక్షణ శాస్త్రం
**Genital diseases** = జననేంద్రియ రోగాలు
**Genome** = (జినోమి) = జన్యుకణరాశి : క్రోమోజోమ్స్‌లో నిక్షిప్తమై ఉండే అన్ని జన్యు కణాలను కలిపి ఇలా అంటారు. తల్లిదండ్రులనుంచి ఈ కణరాశే వారి సంతానానికి వారసత్వంగా సంక్రమిస్తుంది.
**Genus** = ఒకేరకం పోలికలున్న జాతి.
**Geo technology** = భూసాంకేతిక శాస్త్రం
**Geo-Morphology** = భూమి ఉపరితల నైసర్గిక స్వరూప పరిణామ శాస్త్రం

**Geochemistry** = భూరసాయనిక శాస్త్రం
**Geographical Determinism** = జీవన నిర్ణయ సిద్ధాంతం (మానవుడి నివాసం, జీవిత విధానం ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని అతడు నివసించే పరిసరాల ప్రభావంపై ఆధారపడి ఉంటుందన్న సిద్ధాంతం)
**Geological cycle** = భూతత్త్వ ఆవృత్తి
**Geology** = భూగర్భ (భూతత్వ) శాస్త్రం
**Geomagnetic field** = భూ అయస్కాంత క్షేత్రం
**Geomorphologist** = భూమి ఉపరితల పరిణామ శాస్త్రవేత్త
**Geophysics** = భూ భౌతిక శాస్త్రం
**Geotectonics** = శిలావరణగతిశాస్త్రం
**Geotropism** = భూమ్యాకర్షణ ప్రకారం చెట్లు పెరగడం
**Germicide** = క్రిమినాశకం
**Germination** = మొలకెత్తడం(విత్తనాలు)
**Germplasm** = బీజ పదార్థం
**Gestation period** = పిండాభివృద్ధి దశ
**Giant stars** = మహాతారలు
**Giga Hertz (GHz)** = గీగాహెర్జ్ : విద్యుదయస్కాంత / కాంతి తరంగాల ఫ్రీక్వెన్సీ కొలమానాన్ని ఇలా అంటారు రోదసీ నౌక వేగాన్ని పుంజుకొంటున్నప్పుడు అందులో వ్యోమగామిపైగాని, వాహనంపైగాని ఉండే పీడనను గణించడానికి ఈ కొలమానాన్ని వినియోగిస్తారు
**Gills** = మొప్పలు (చేపలవి)
**Glacial age** = మంచుయుగం
**Glaciation** = హిమ ప్రళయం
**Glacier** = భూమిమీద పెద్దఎత్తున పేరుకుపోయిన మంచు / హిమానీనదాలు
**Glass fibre** = గాజునార
**Glaucoma** = (కనుగ్రుడ్డు పాడవడం వల్ల కలిగే) దృష్టిలోపం
**Global Internet** = విశ్వ సమాచార వ్యవస్థ
**Globule** = గోళిక
**GMT** = (గ్రీనిచ్ మీన్‌టైమ్) = గ్రీన్‌విచ్ కాలమానం: లండన్ పట్టణానికి దగ్గరలో గ్రీనిచ్ అనే ప్రాంతం ఉంది ప్రసిద్ధ ఖగోళ పరిశోధనా కేంద్రం ఇక్కడనే ఉంది ఇది ప్రపంచ కాలమానానికి గురు కేంద్రం(!) ఈ కేంద్రం మీదుగా గీసిన ఊహారేఖే రేఖాంశం (మధ్యాహ్నరేఖ) ఇదే ప్రామాణిక రేఖాంశం దీనిని (జీరో) $0^0$ రేఖాంశం లేదా గ్రీనిచ్ రేఖాంశం (గ్రీనిచ్ మెరిడియన్) అంటారు ఉత్తర - దక్షిణ ధ్రువాలకు సరిసమాన దూరంలో భూమిపైన ఉన్న బిందువును కలుపుతూ గీసిన ఊహారేఖను భూమధ్యరేఖ (ఈక్వేటర్) అన్నారు దీనినే $0^0$ అక్షాంశం అని కూడా అంటారు ఈ రేఖ భూమిని రెండు అర్ధ గోళాలుగా విభజిస్తుంది ఒకటి రేఖకు ఉత్తరాన ఉన్న అర్ధభాగం ఉత్తరార్ధ గోళం, రెండు - దక్షిణ భాగానికి దక్షిణార్ధగోళం అలాగే ఉత్తర-దక్షిణ ధ్రువాలను కలుపుతూ భూమి ఉపరితలంపైన గీసిన ఊహారేఖలను రేఖాంశాలు అంటారు ఈ రేఖపై అన్ని ప్రాంతాలలోనూ ఒకేసారి మిట్టమధ్యాహ్నం అవుతుంది కనుక వాటన్నింటికీ మధ్యాహ్నమే వీటిని మధ్యాహ్నరేఖలని కూడా (మెరిడియన్స్) అంటారు అయితే స్థిరత్వం ఉన్న ధ్రువాలకు సరిసమాన దూరంలో ఉన్న భూమధ్య రేఖలాగే ఈ మధ్యాహ్న రేఖలకు కూడా ఎక్కడో ఒకచోట మొదలంటూ ఉండాలి కదా! ఆ ప్రారంభ రేఖను గ్రీనిచ్ (1884)లో ఎన్నుకున్నారు ఈ గ్రీనిచ్ రేఖకు తూర్పున $180^0$ దాకా 180 తూర్పు రేఖాంశాలున్నాయి పశ్చిమంగా $180^0$ వరకూ 180 పశ్చిమ రేఖాంశాలున్నాయి గ్రీనిచ్ రేఖాంశంలానే వీటిలో కూడా ఒక ప్రధాన రేఖాంశం ఉంది $180^0$ రేఖాంశానికి ఒకవైపున తూర్పు రేఖాంశాలు, ఇంకోవైపున పశ్చిమ రేఖాంశాలు ఉన్నాయి భూమి తన అక్షంపైన ఒకసారి పరిభ్రమించడానికి 24 గంటలు పడుతుంది కాబట్టి భూమి గంటకు $360^0$ (180 + 180) / 24 = $15^0$ తిరుగుతుంది కనుక భూమి $1^0$ తిరగడానికి 60 నిమిషాలు / 15 = 4 నిమిషాలు పడుతుంది అందువల్ల గ్రీనిచ్ రేఖాంశాన్ని ముఖ్య రేఖాంశంగా పరిగణించినప్పుడు ఈ రేఖనుంచి తూర్పునకు జరిగిన కొద్దీ డిగ్రీకి 4 నిమిషాలు చొప్పున కాలం పెరుగుతూంటుంది ఒక్క రేఖాంశంపై పగలు సూర్యుడు నడినెత్తికి చేరినప్పుడు 12 గంటలు (మధ్యాహ్నం)గా భావించి నిర్ణయించిన కాలాన్ని స్థానిక

కాలం (లోకల్ టైమ్) అంటారు ఇలా ఏ దేశానికా దేశానికి లేదా ప్రాంతానికి ఒక ప్రామాణిక రేఖాంశం నిర్ణయించుకుంటారు ఆరేఖాంశంపై ఉన్న స్థానిక కాలాన్ని ఆ ప్రాంతం మొత్తానికి ప్రామాణిక కాలం (స్టాండర్డ్ టైమ్)గా పరిగణిస్తారు ప్రపంచానికంతకూ గ్రీనిచ్ స్థానిక కాలాన్నే ప్రామాణిక కాలమానంగా వాడుతున్నారు (Greenwich Standard Time) దీనిని ఆధారం చేసుకొని అన్ని దేశాల రేఖాంశాలపైన ప్రామాణిక కాలాన్ని నిర్ణయిస్తారు బ్రిటీష్ ప్రమాణాల (యూరోపియన్‌ల) ప్రకారం 180° తూర్పు రేఖాంశంపైన సూర్యుడు నడినెత్తికి చేరినప్పుడు రోజు ప్రారంభం అవుతుంది అప్పుడు గ్రీనిచ్ రేఖాంశంపైన రాత్రి 12 గంటలవుతుంది కనుకనే ఇంగ్లండ్‌లో రాత్రి 12 గంటలకు రోజు మొదలవుతుంది భారతీయ సంప్రదాయం ప్రకారం సూర్యోదయంతో రోజు ప్రారంభమై మరుసటి రోజు అదే కాలానికి ముగుస్తుంది (బ్రిటీష్ పాలనలో ఉన్న దేశం బ్రిటన్ సంప్రదాయాన్ని అనుసరించడం వల్ల రోజును రాత్రి 12 గంటలనుంచి లెక్కగడుతూ వచ్చారు) కనుక మన దేశ ప్రామాణిక రేఖాంశం ప్రకారం నిర్ణయించే కాలాన్ని (గ్రీనిచ్‌తో పోల్చుకొని) "భారత స్థానిక కాలమానం ప్రకారం" అని అనువర్తించుకొంటూ ఉంటాం

**Gorge** - వాగుచాలు

**Gorges or Canyons** - అగాధాలు: ఇరుకైన లోతైన నదీలోయలు (ఉదా: గంగ, బ్రహ్మపుత్రలోయలు /కొలరెడోలోని గ్రాండ్ కేనియన్స్ / కృష్ణా నదికి శ్రీశైలం వద్ద గోర్జి )

**Gourd (bottle)** - సొరకాయ

**Gourd (snake)** - పొట్లకాయ

**Gradation** - క్రమానుగత చర్య

**Grafting** - అంటుకట్టడం

**Granite** - తెల్లశానపు రాయి

**Granules** - గుళికలు

**Graphs** - రేఖాచిత్రాలు / గ్రాఫులు

**Grasshopper disease** - మిడత తెగులు

**Gravity** - గురుత్వాకర్షణ శక్తి

**Great circles** - పెద్ద వర్తులాలు

**Green algae** - హరిత శైవలాలు

**Grooves** - గాడులు

**Guanine**- (గ్వానిన్): న్యూక్లియోటైడ్స్‌లో ఉండే 4 రకాల నైట్రోజనస్ బేస్‌లలో ఇది ఒకటి దీని సూత్రం $C_5 H_5 N_5O$.

**Guinea pig** - సీమ పందికొక్కు (మనిషిని శస్త్ర ప్రయోగానికి వినియోగించినప్పుడు కూడా అతన్ని ఇలా అంటారు)

**Gulf** - సింధుశాఖ

**Gulls** - సముద్రపు కొంగలు

**Gynaecology (gynecology)** - స్త్రీ రోగ శాస్త్రం

**Gynoecium** - అండకోశం

**Gyroscope** - (గైరోస్కోప్) = చోదక పరికరం "A guidance system, consisting of a rapidly spinning wheel suspended in a special frame The axis of rotation remains the same, irrespective of the frame's movement"

**H-Bomb** - హైడ్రోజన్ (ఉదజని) బాంబు

**Haemoglobin** - హిమోగ్లోబిన్ రక్తంలో ఎర్రకణాలకు రంగుఇచ్చే పదార్థం

**Haemoptysis** - దగ్గులో రక్తం కక్కడం

**Haemorrhage** - రక్తస్రావం (రక్తనాళాలు చిట్లిపోవడం)

**Halley's Comet** - హేలీ తోకచుక్క దీన్ని కనిపెట్టినవాడు ఎడ్మండ్ హేలీ. ఇది 76 ఏళ్ళకొకసారి భూమికి దగ్గరగా వస్తుందని చెప్పాడు 1910 మేలో వచ్చిన గొప్ప తోకచుక్కను చూచినవాడు గురజాడ. మళ్ళీ 76 ఏళ్ళకు వస్తుందన్నాడు అలాగే 1986లో భూలోకానికి దగ్గరగా వచ్చింది తోకచుక్క. మూఢ విశ్వాసాలనుంచి జాతిని విముక్తం చేసే కృషిలో గురజాడ తోకచుక్కవల్ల కీడు మూడుతుందన్న మూఢ విశ్వాసాన్ని పటాపంచలు చేస్తూ ప్రజలకు ధైర్యమిస్తూ ఆ చుక్కను మన ఇంటికి వస్తున్న "దూరబంధువు"గా భావించి ఆహ్వానించాడు తోకచుక్కను సంఘ

సంస్కరణోద్యమానికి పతాకంగా ఎంచుకుంటానని మొండికెత్తి విజ్ఞాన కాంతులు పంచిపెట్టాడు )
**Halley's Magnetic Chart** = అయస్కాంత పటం (17వ శతాబ్దంలో హాలి అనే ఇంగ్లీషు పట చిత్రకారుడు సిద్ధపరిచిన పటం)
**Halogens** = లవణజన్యాలు
**Harbour** = నౌకాశ్రయం
**Hatching** = పొదగడం
**Headward** = (ప్రవాహానికి) శీర్షదిశ
**Helium** = ఒక వాయువు మూలధాతువులలో ఇదొకటి
**Hemisphere** = గోళార్థం
**Henotheism** = అద్వితీయేశ్వర మతం
**Hepatic** = కాలేయ సంబంధమైన
**Hepatitis** = కామెర్ల వ్యాధి (Jaundice)
**Herbivoress** = మొక్కలనుభుజించే ప్రాణులు / మూలికాహారి
**Herbivorous animals** = ఆకూ, అలమూ తిని బతికే జంతువులు
**Hereditary (Inherited)** = అనువంశికం / వంశానుగతం
**Heredity** = వంశపారంపర్యం
**Hernia** = వరిబీర్జం
**Herpes** = బొబ్బలు
**Herpetology** = సరీసృప (పాకే) జంతుశాస్త్రం
**Hertz (Hz)** = ఆల్టర్‌నేటింగ్ కరెంట్ ఫ్రీక్వెన్సీ కొలతః దీనిని సైకిల్స్‌లో గణిస్తారు (Cycles per second (c/s), name after Heinrch Hertz) మనదేశంలో ఎ సి సప్లై ఫ్రీక్వెన్సీ 50 హెర్జ్
**Heterogeneous** = సంకర
**Hexagon** = షట్కోణం (ఆరు కోణాలుగలది) షడ్భుజం.
**Hiccough** = ఎక్కిళ్ళ రోగం
**High Frequency (HF)** = 3-30 మెగా హెర్జ్
**High mean temperature** = సగటు హెచ్చు ఉష్ణోగ్రత
**High pressure** = అధిక పీడనం
**High pressure belt** = అదిక పీడన ప్రాంతం (మెఖల)
**High water** = పూటు నీటిమట్టం
**Hightide** = పోటు నీటిమట్టం
**Histochemistry** = కణజాల రసాయన శాస్త్రం
**Histology** = సూక్ష్మ శరీర శాస్త్రం
**Historical geography** = చారిత్రిక భూగోళ శాస్త్రం (చరిత్రకు దాన్ని ప్రభావితం చేసే భౌగోళిక పరిస్థితులకు మధ్య సంబంధాన్ని వివరించే శాస్త్రం మారుతున్న రాజకీయ సరిహద్దులను కూడా ఇది స్పృశిస్తుంది)
**Hog-plum** = మారేడు పండు
**Hologram** = త్రీ-డైమెన్షనల్ బొమ్మను నిర్మించటానికి ఉపయోగించే సాధనం
**Holophytic nutrition** = కేవల వృక్షాహారం
**Holozoic nutrition** = కేవల జంత్వాహారం
**Homo** = మానవుడు
**Homo sapiens** = మానవజాతి
**Homogeneous** = సజాతీయం
**Homologous** = సమజాతీయం
**Horizontal** = క్షితిజ సమానాంతరం
**Hormones** = పోషక ద్రవ్యాలు
**Horse power** = అశ్వశక్తి (మోటార్ రేటింగ్‌ను హార్స్‌పవర్‌లో గణిస్తారు 1 హెచ్ పి = 746 'వాట్లు' శక్తి (ఇది యంత్రశక్తికి కొలమానం)
**Hot or tropical Zone** = ఉష్ణమండలం
**Human Geography** = మానవపరమైన భూగోళ శాస్త్రం
**Humidity** = (గాలిలో) తేమ/చెమ్మ
**Humus** = ఆకు పెంటి
**Hydraulics** = జలశక్తి శాస్త్రం
**Hydrocele** = బుడ్డ (పురుషునికి వచ్చేది)
**Hydroelectric** = జల విద్యుత్ సంబంధమైన
**Hydrogen** = ఉదజని వాయువు : మరో మూలధాతువు విశ్వంలో ఉండేది ఎక్కువపాలు ఇదే
**Hydrogenation** = ఉదజనీకరణం
**Hydrology** = జలశాస్త్రం

**Hydrolysis** = జల విశ్లేషణ
**Hydrophobia** = [illegible]
**Hydrophone** = జలాంతరాల ధ్వనుల్ని [illegible] పరికరం
**Hydrophytes** = జలవృక్షాలు
**Hydrosphere** = జలావరణం
**Hydrostatics** = జలస్థితి శాస్త్రం
**Hyena** = సివంగి
**Hypothermal** = అల్పతాపం
**Hypothesis** = అనుమాన ప్రమాణం
**Ice ages**= హిమయుగాలు : ఇవి 6 లక్షల యేళ్ళ క్రితం ప్రారంభమైనవని అంటారు వీటిని హిమానీ నదాలు ప్రవహించిన శకాలుగా (గ్లేసియల్) పేర్కొన్నారు తొలి హిమానీయుగం (ప్లీస్టోసిని యుగం) ఉత్తర అమెరికా, యూరప్ వాయువ్య ప్రాంతాలకూ పరిమితమయింది కాగా వర్తమాన యుగంగా చెప్పదగిన హెలోసిని యుగంలో హిమయుగం 12 వేల సంవత్సరాలనాడు ప్రారంభమైంది ఈ దశలో ఖండపు హిమానీ నదాల ప్రవాహం అంటార్కిటికాకు, గ్రీన్‌లాండ్‌కు పరిమితం అయిందంటారు
**Icebergs** = మంచుకొండలు/సముద్రంలో తేలే విశాలమైన మంచుగడ్డలు
**Ice Sheets** = హిమ పటాలు
**Ice-Caps** = హిమావరణాలు
**Iceberg**= హిమరాశి
**Igneous rocks** = అగ్ని పర్వత శిలామయాలు
**Igneous soils** = అగ్నిమృత్తికలు
**Ignition** = రవ్వ / మంట / జ్వలనం
**Iguana** = ఉడుము
**Illumination** = దీప్తి / ప్రకాశమానం
**Immunity** = రోగనిరోధకశక్తి / రక్షణ శక్తి
**Impact** = తాకిడి
**Inanimate World** = అచేతన ప్రపంచం
**Incubation** = కృత్రిమంగా పొదగడం
**Index** = ఘాతాంశం (లెక్కలకు సంబంధించి)
**Inductive method** = ఉదాహరణవాదం
**Inert gas / Noble gas** = ప్రభువాయువు
**Inert gases** = జడవాయువులు
**Inertia** = జడత్వం
**Inertial Guidance** = Guidance in aerospace, which does not depend on any contact with the ground
**Infall theory** = అణుపాత సిద్ధాంతం
**Infantile paralysis** = పిల్లల పక్షవాతం
**Infection** = రోగ సంక్రమణం
**Inferior conjunction** = దిగువ కూడలి (భూమి, శుక్రుడు, సూర్యుడు ఒక వరుసలో ఉన్నప్పుడు ఇలా అంటారు)
**Infobahn or Super Highway** = ఇన్‌ఫోబాన్ = విశ్వ సమాచార మాలిక దీనినే సూపర్ హైవే అని కూడా అంటారు
**Infra-red rays** = పరారుణ కిరణాలు (ఇవి కాంతి వాతావరణాన్ని ఛేదించుకుపోతాయి వీటిని వైద్య చికిత్సలో వాడుతూంటారు )
**Inland waters** = దేశీయ కాల్వలు (ఉదా: బకింగ్‌హామ్ కాల్వ)
**Inorganic Matter** = నిస్సేంద్రియ పదార్థం
**Inorganic rocks** = నిర్జీవశిలలు
**Input-output** = ఆదాన ప్రదానాలు
**Insecticides** = కీటక నాశకాలు
**Insipid** = చప్పని
**Insomnia** = నిద్రకు వెలికావడం
**Installed capacity** = స్థాపిత శక్తి (ఒక పరిశ్రమను స్థాపించినప్పుడు ఆ పరిశ్రమ పూర్తి అయిన తర్వాత దాని పరిపూర్ణ ఉత్పాదక శక్తిని ఇలా అంటారు)
**Intercellular layer** = కణాంతర పొర
**Intercontinental Ballistic Missile** = ఖండాంతర క్షిపణి
**Internet** = International network, (సమాచార సంబంధిత) ప్రపంచ సమాచార వ్యవస్థ, విశ్వ సమాచార సంచయం
**Interplanetary travel** = గ్రహాంతర యానం

**Interstellar gas clouds** = హైడ్రోజన్ వాయు మేఘాలు

**Intestines** = పేగులు (small / large)

**Intrusive rocks** = అంతర్గమ శిలలు (శిలాద్రవం ప్రవాహంతో మధ్యలో భూమి ఉపరితలానికి కొద్దిగా లోతులో ఘనీభవించి రూపొందే శిలలను ఇలా అంటారు )

**Inversion Temperature** = విలోమ ఉష్ణోగ్రత : కొన్ని ప్రదేశాల్లో ఎత్తునుబట్టి, ఉష్ణోగ్రత తగ్గడానికి మారు పెరుగుతుంది ఈ పరిస్థితిని ఇలా అంటారు ఇలాంటి స్థితి పర్వత లోయల్లో ఉంటుంది

= అయనీకరణం / అణుశకలీకరణం (అణువులను ధన, ఋణ విద్యుత్‌గల 'అయాన్లు'గా విభజించడం: ఉదా: ఉప్పును సోడియం, క్లొరైడ్ అయాన్లుగా విడగొట్టడం

**Ionosphere** = అణుశకలావరణం/అయనావరణం భూమికి 50 మైళ్ళు ఎత్తు దాటంగానె ఈ ఆవరణం వస్తుంది

**Isobars** = సమభార రేఖలు (సమానమైన వాయు పీడనం ఉన్న ప్రదేశాలను కలిపే ఊహా రేఖాలివి వాయు పీడనం తెలుసుకోడానికి వాటిని గీస్తారు )

**Isochronism** = సమకాలికత్వం

**Isohel** = సమసూర్యరశ్మిరేఖ

**Isohyets** = సమవర్షపాత రేఖలు (వివిధ ప్రాంతాలలో సమాన వర్షపాతాన్ని తెలిపే రేఖలు)

**Isohyetose** = సమవర్షపాతరేఖ

**Isonephs** = సమమేఘావృత రేఖలు

**Isotherms** = సమోష్ణోగ్రత రేఖలు (ఇవి ఉష్ణోగ్రతలో తారతమ్యాలను తెలునుకోడానికి ఈ రేఖలు తోడ్పడతాయి ఈ రేఖలు సమాన ఉష్ణోగ్రత ఉన్న ప్రదేశాలను కలిపే రేఖలు)

**Isotopes** = ఐసోటోప్స్ (వేర్వేరు ధాతువులను కూడా ఇలా పిలుస్తారు కొన్ని ధాతువుల్లో (ఉదా: హైడ్రోజన్) అణు బరువు పెరిగినా దాని రసాయన లక్షణం మారదు. అలాంటి ధాతువును ఐసోటోప్ అంటారు దీనికి మరో పేరు 'ధాతుభేదం' అంటే, వివిధ అణువుల్లో ఉండవలసిన న్యూట్రాన్ల కంటె అక్కువగాని ఎక్కువగాని ఉన్న సందర్భాల్లో ఈ 'భేదం' వస్తుంది)

**ISRO** = భారత రోదసీ పరిశోధనా సంస్థ (Indian Space Research Organisation)

**Isthmus** = భూసంధి (రెండు భూభాగాలు కలిసె మధ్య ప్రదేశం)

**Italian millet** = కొర్రలు

**Jasper** = పచ్చరాయి / సూర్యకాంతి

**Jelly** = జిల్లిక

**Jelly fish** = నీటికాయ / బుడగచేప

**Jetstreams** = అతి వెగ వాయు పవనాలు (ఆసియా ఋతుపవన వ్యవస్థ ఏర్పడడానికి ఈ పవనాలు పునాది అని శాస్త్రవెత్తల భావన ఇవి వాతావరణం ట్రొపోస్ఫియర్ పై భాగంలో వీస్తాయి)

**Jurassic** = "జురాసిక్" : పాత-కొత్త రాతియుగాలకు మధ్యనున్న "మిసోలిథిక్" యుగాన్ని ఇలా అంటారు దీని కాలం క్రీస్తు పూర్వం 8000-3400 సంవత్సరాల మధ్య ఇటీవల అందరినీ అలరించిన "జురాసిక్ పార్క్" చిత్ర నిర్మాణానికి ఉద్దీపన ఈ పురాయుగపు జీవరాశీ, ఆనాటి వాతావరణమే

**Kala -azar** = (కాలజార్) విషపాండుజ్వరం

**Kaleidoscope** = చిత్రరూపదర్శిని

**Katabolism** = అపచయక్రియ

**Keel** = ఓడకింది దూలం / నౌతలం

**Kernel** = గింజ / గుంజు / పప్పు

**Ketones** = (కీటోన్స్) సేంద్రియ మిశ్రమాలలో ఇది ఒక రకం

**Kidneys** = మూత్రపిండాలు

**Kinetic** = గతిజన్య

**Kinetic theory of gases** = వాయు పదార్థాల చలన సిద్ధాంతం

**Kleptomania** = దొంగబుద్ధి / చౌర్యబుద్ధి

**Komiscope** = గాలిలో ధూళిని కొలిచే పరికరం

**"Kurosiwo"** = ఉష్ణ జల ప్రవాహం (పసిఫిక్ సముద్రంలోది).

**L.C.M.** = కనిష్ఠ సామాన్య గుణకం (Least Common Multiple)

**Laboratory** = ప్రయోగశాల
**Lacrymal glands** = బాష్పజల గ్రంథులు
**Lactation** = [illegible]
**Lactation fever** = [illegible]
**Lacustrine plains** = సరోవర మైదానాలు
**Lagoon** = మడుగు
**Lake** = సరస్సు / చెరువు
**Land breeze** = స్థల పవనం
**Land dunes** = ఇసుక తిన్నెలు
**Land slip** = భూపాతం
**Larva** = క్రిమిదశ
**Larvae** = కీటస్థితి
**Laryngitis** = స్వరపేటిక వాపు
**Larynx** = కంఠనాళం
**Lateral erosion** = పార్శ్వపు ఒరపిడి
**lateral** = పార్శ్వం
**Latitude** = భూమధ్య రేఖ (ఈక్వేటర్) వద్ద ఉష్ణోగ్రత హెచ్చుగా ఉంటుంది ధ్రువాల వైపుగా పోయిన కొద్దీ ఆ వేడిమి తగ్గిపోతుంది కనుకనే భూమధ్యరేఖ వద్ద ఉన్న ప్రాంతాల్లో ఉష్ణోగ్రత ఎక్కువగా ఉంటుంది భూమధ్య రేఖనుండి వంపుగా ఉండే భూమి పైభాగంలో ఉన్న ఒక బిందువు కోణ దూరానికి ఆ బిందువుకు సంబంధించిన అక్షాంశమని పేరు
**Laudanum** = నల్లమందు
**Lavee ridges** = "లివీ గట్లు" (ప్రవాహ గతిలో నది మలుపులు తిరుగుతున్నప్పుడు నదికి రెండువైపుల ఒండ్రుమట్టి గుట్టలుగా ఏర్పడుతూంటుంది వీటిని "లివీగట్లు" అంటారు)
**Lawrention shield** = విశాలరాతిమైదానం / విశాల పీఠభూమి
**Legume** = కాయధాన్యం (గింజలున్న కాయ ధాన్యాలు. ఉదా: చిక్కుడు, పల్లీలు వగైరా)
**Leucoderma** = బొల్లి
**Leucoplast** = శ్వేతరేణువు
**Levelling instrument** = సమతల కొలమాన పరికరం
**Ligament** = స్నాయువు
**Light waves** = కాంతి తరంగాలు
**Light years** = కాంతి సంవత్సరాలు
**Line graphs** = రేఖాపటాలు
**Lingual nerve** = జిహ్వానాడి
**Liniment** = లేపం / తైలం
**Linseed** = అవిసె
**Lipid** = కొవ్వు
**Liquids** = ద్రవపదార్థాలు
**Liquification** = ద్రవీకరణం
**Living fossil** = సజీవ శిలాజం
**Local Time** = స్థానిక కాలం
**Locust pest** = మిడుతలదండు
**Locusts** = మిడుతల జాతి
**Logarithm** = ఘాతాంకగణనం
**Long sight** = చత్వారం
**Longitude** = దీర్ఘాంశం (ధృవాలను కలుపుతూ గీచిన ఒక రేఖకు తూర్పునగాని పడమరగానీ ఉండే ప్రదేశం ఎంతదూరంలో ఉందో తెలిపే రేఖ)
**Loop** = మెలి / వంపు (స్త్రీ విషయంలో సంతాన నిరోధక సాధనం)
**Love Birds** = ప్రేమపక్షులు / వలపు పిట్టలు
**Low lands** = పల్లపు భూములు
**Low Pressure** = అల్ప పీడనం
**Lubricant** = కందెన (నున్నగా చేసేది)
**Lumbago** = నడుంనొప్పి / కటివాతం
**Luminosity** = కాంతి
**Lunar Craters** = (చంద్రునిలో కనబడే) గుంటలు / కందకాలు
**Lunar month** = చాంద్రమాసం
**Lunar year** = చాంద్రమాన సంవత్సరం
**Lupus** = ఇదీ "ఎయిడ్స్" లాంటి వ్యాధేగాని, దాని లక్షణాలు వేరు. "ఎయిడ్స్" మనిషి వ్యాధినిరోధక శక్తిని నాశనం చేస్తుంది "లూపస్" సరిగ్గా దీనికి విరుద్ధం "లూపస్" లక్షణం - వ్యాధి నిరోధక శక్తిని అపరిమితం చేస్తుంది. దీనివల్ల వచ్చే నష్టం అసాధారణమైన యాంటీబాడీస్ ఉత్పత్తి కావడం. ఇవి శరీరంలోని స్వీయకణాలను, కణజాలాన్ని

ధ్వంసం చేస్తాయి యాంటీబాడీస్ మరింత ఎక్కువైనకొద్దీ కీళ్ళు, మూత్రపిండాలు, గుండె, ఊపిరితిత్తులు, రక్తం దెబ్బతినిపోతాయి

**Lyman-Alpha radiation** = హైడ్రోజన్ ధార్మిక శక్తి: 1216 ఆంగ్‌స్ట్రామ్స్ వద్ద హైడ్రోజన్ వెదజల్లే కిరణాలను ఇలా అంటారు

**Lymph** = శోషరసం (రక్తంలాంటి ద్రవం)

**Lymph Corpuscles** = తెల్లరక్తకణాలు

**Lymphatic gland** = శోషరస గ్రంధి

**Lymphatics** = శోషవాహికలు

**Mach-Number** = ఒకనిర్దిష్ట ఉష్ణోగ్రత, పీడనం స్థాయిలో ఒక వాహన వేగానికి, ధ్వని వేగానికి మధ్య వుండే నిష్పత్తి

**Macrobiote** = చిరజీవి

**Magic lamp** = యక్షిణీ దీపం

**Magma** = శిలాద్రవం

**Magnetic field** = అయస్కాంతక్షేత్రం / ధ్రువం

**Magnetic poles** = అయస్కాంత ధ్రువాలు

**Magnetic storms** = అయస్కాంత కల్లోలం

**Magnetosphere** = అయస్కాంతావరణం (భూమి వాతావరణం వేయి మైళ్ళ ఎత్తులో అంతరించినా, దాని ప్రభావం అయస్కాంత శక్తి రూపేణా విస్తరించే ఉంటుంది కనుకనే ఈ పేరు)

**Magnitude** = కాంతిమత్వం / పరిమాణం (నక్షత్రాల్లో కొన్ని ప్రకాశవంతంగానూ కొన్ని కనపడీ కనపడనట్టుగానూ, ఇంకొన్ని ఒక మోస్తరు కాంతివంతంగానూ కనిపిస్తాయి. ఈ కాంతి భేదాల్నిబట్టి నక్షత్ర కాంతుల్ని ఖగోళ శాస్త్రవేత్తలు 'మాగ్నిట్యూడ్స్' కింద పరిగణించారు దీన్నే నక్షత్ర కాంతి పరిమాణం అన్నారు మరో మాటలో దీన్ని 'కాంతిమత్వం' అన్నారు )

**Malleability** = షీట్లను పొరలుగా అదిమిపెట్టే గుణం.

**Malnutrition** = పోషకాహార లోపం

**Mammals** = స్తన జీవులు : (నరులు, వానరులు వగైరా)

**Mammary glands** = క్షీరరసగ్రంథులు

**Mantle** = (మాంటిల్) = ముసుగు (కఠిన పదార్థం): ఇది భూమి బాహ్య పొరకింద రెండు పొరలుగా ఉంటుంది ఈ రెండు పొరలనూ ఒక మధ్యంతర మండలం (Transition zone) వేరు చేస్తుంది ఈమాంటిల్ 2,900 కిలోమీటర్ల మేర మందంగా వ్యాపించి ఉంటుంది

**Margosa** = వేప

**Marine geology** = సముద్రగర్భ శాస్త్రం

**Marine navigation** = సముద్ర యానం

**Mariner's compass** = నావికా దిక్సూచి

**Marrow** = మూలుగ

**Marsupial** = తిత్తిలో పిల్లల్ని పెంచే జంతువులు (ఉదా: కంగారు జంతువు)

**Mass** = ద్రవ్యరాశి / పదార్థరాశి

**Mass defect** = ద్రవ్య నష్టం

**Mastication** = చర్వణం / నమలడం

**Mastitis** = స్తనశోష (స్త్రీలలో)

**Masturbation** = ముష్టిమైదునం / హస్తప్రయోగం (పురుషుల్లో)

**Mathematical geography** = గణిత భూగోళశాస్త్రం

**Mathematics (Abstract or pure)** = శుద్ధ గణితం

**Mathematics** = గణిత శాస్త్రం

**Mathematics Applied or Mixed** = మిశ్రగణితం / అనువర్తిత గణితం / ఉపయుక్త గణితం

**Matter** = పదార్థం

**Mean** = సగటు / మధ్యమం

**Mean annual range** = సగటు శీతోష్ణాల వ్యత్యాసం

**Mean solar day** = మధ్యమ సౌరదినం

**Mean values** = సగటు విలువలు

**Meanders** = (నదీ) వక్రాలు / వంపులు

**Measles** = పొంగు / తట్టు

**Mechanics** = యంత్రవిద్య / యంత్రనిర్మాణ శాస్త్రం

**Mechanism** = యంత్రాంగం

**Medical Geography** = వైద్య సంబంధిత భూగోళ శాస్త్రం

**Medulla** = మజ్జ (మెదడులో ఒక భాగం)

**Medulla oblongata** = మజ్జాముఖం / చిన్న మెదడు

**Mega Hertz (MHz)** = మెగాహెర్ట్జ్ ఫ్రీక్వెన్సీ కొలమానం. పది లక్షల హెర్ట్జ్‌తో సమానం

**Meiosis** = సంతాన కణాలలోని క్రోమోజోమ్స్ రెట్టింపుగా చీలకుండా సమాన సంఖ్యలో విడిపోయే ప్రక్రియను ఇలా అంటారు

**Melanin** = చర్మ కణాల్లో ఉత్పత్తి అయ్యే గోధుమ వన్నె పదార్థం. ఇది చిక్కగా ఉంటుంది. చర్మం రంగు, జుత్తు రంగూ నిర్ణయించేది ఈ పదార్థమే

**Melanocytes** = చర్మకణాలు

**Melanoma** = ప్రమాదకరం చర్మవ్యాధి (క్యాన్సర్ వల్ల వచ్చేది)

**Melting Point** = ద్రవీభవన దశ

**Membrane** = పల్చని పొర

**Meningitis** = మెదడువాపు వ్యాధి

**Menopause** = ఋతుస్రావం ఆగిపోవడం / రజోనివృత్తి

**Menorrhagia** = అత్యధిక ఋతుస్రావం

**Menstruation** = ఋతుస్రావం

**Mensuration** = కొలతల శాస్త్రం / క్షేత్రమితి

**Meridian** = మధ్యాహ్నరేఖ (ధ్రువాలను కలుపుతూ భూమిపైన గీసిన అర్థ వృత్తాన్ని ఇలా అంటారు. ఒకే మధ్యాహ్నరేఖ మీద ఉన్న అన్ని ప్రదేశాలలోను ఒకే సమయంలో మధ్యాహ్నం అవడం వల్ల ఈ రేఖకు ఈ పేరు వచ్చింది)

**Mesosphere** = మధ్యావరణం - ఇది భూమికి 50 మైళ్ళ ఎత్తులో ఉంది.

**Meta galaxy** = మహావిశ్వం (వందల కోట్ల పాల పుంత గుత్తులు కలిసి ఇది ఏర్పడింది)

**Metabolic activity** = పచన ప్రవృత్తి

**Metabolism** = ప్రాణిలో జరిగే రసాయన ప్రక్రియలు/పచనక్రియ/జీర్ణక్రియ/చయాపచయక్రియ.

**Metallurgy** = లోహ శాస్త్రం

**Metamorphic hills** = మార్పుచెందే కొండలు (అగ్ని పర్వతాలుగాని, వాటి కొండలుగాని మారి పోవడం వల్ల ఇవి ఏర్పడతాయి)

**Metamorphism / Metamorphosis** = రూపాంతరీకరణం

**Metaphysical science** = ఆధ్యాత్మిక శాస్త్రం

**Meteorites** = కొన్ని వాతావరణం వత్తిడికి తట్టుకుంటూ కిందికి వచ్చి నేలమీద రాలినప్పుడు ఇలా అంటారు

**Meteoroids** = వాటి మానాన అవి పోతున్న ఉల్కలను ఇలా అంటారు

**Meteorology** = వాతావరణశాస్త్రం

**Meteors** = ఉల్కలు (భూమి వాతావరణంలో ప్రవేశించి భగ్గున మండి చూర్ణమై పోతున్నప్పుడు ఇలా అంటారు).

**Methane** = ఒక మిశ్రమ వాయువు. దీని సూత్రం $CH_4$.

**Metric system** = మీటరు మానం

**Metropolitan** = నగర ప్రాంతం

**Mexican Poppy** = రక్కెన

**Micro meteorology** = సూక్ష్మ వాతావరణ శాస్త్రం

**Micro-gravity** = భారరాహిత్యం. గురుత్వాకర్షణ శక్తి తదితర శక్తులు మనిషిపై ఎలాంటి ప్రభావం కలిగి ఉండని స్థితి

**Microbiology** = సూక్ష్మ జీవ శాస్త్రం

**Microcosm** = సూక్ష్మ ప్రపంచం

**Micrometer** = మైక్రోమీటర్. దీనిని మునుపు మైక్రాన్ అని కూడా పిలిచేవారు. పదిలక్షల మైక్రోమీటర్లు కలిస్తే ఒక మీటరవుతుంది. అతి తక్కువ దూరాలను కొలిచేందుకు మైక్రోమీటర్లను కొలమానంగా తీసుకుంటాము

**Micropyle** = అండద్వారం

**Microwave** = మైక్రోవేవ్. కాంతి తరంగాలవలె నేరుగా ప్రయాణించే రేడియో తరంగాలు. వీటి ఫ్రీక్వెన్సీ వెయ్యి మెగా హెర్ట్జ్ కన్నా ఎక్కువగా ఉంటుంది. దూర సమాచార ప్రసారంలో మైక్రోవేవ్ తరంగాలను

ఉపయోగిస్తారు ఈ రోజు వంటిళ్ళలో మైక్రోవేవ్ పొయ్యిలు వచ్చేశాయి

**Middle Latitude Deserts** = మధ్య అక్షాంశ ఎడారులు

**Mildew** = పొగచూరడం

**Milky way or Galaxy** = పాలపుంత / తారకావళి

**Mineral deposits** = ఖనిజ నిక్షేపాలు

**Mineral nutrients** = ఖనిజ పోషకాలు

**Mineralisation** = ఖనిజీకరణం

**Minerology** = ఖనిజశాస్త్రం

**Mirages** = ఎండమావులు

**Miscarriage** = గర్భపాతం

**Missile** = క్షిపణి

**Mist** = పొగమంచు

**Mitosis** = జీవకణాల విచ్ఛిత్తి (ఒక జీవకణం రెండు, రెండు నాలుగు, నాలుగు ఎనిమిది జీవకణాలుగా విడిపోతేనే జీవి పెరుగుతూ ఉంటుంది )

**Mixture** = మిశ్రపదార్థం

**Module** = స్వతంత్రంగా పనిచేసే ఒక పేటిక దీనిని రోదసీ నౌకలలోను, ఇతర సాంకేతిక వ్యవస్థలలోను ఉపయోగిస్తారు

**Molecular attraction** = అణ్వాకర్షణ

**Molecular Hydrogen** = అణు హైడ్రోజన్

**Molecule** = అణువు/కణం (ఉదా: సోడియం క్లోరైడ్ మోలిక్యూల్ = ఉప్పుకణం)

**Molecules** = కణాలు

**Monocotyledons** = ఏకదళ బీజాలు

**Monsoons** = రు(ఋ)తుపవనాలు: రుతువులను బట్టి వీస్తాయి అరబ్బీ భాషలో "మౌసమ్" అంటే రుతువు అని అర్థం

**Moraines** = మొరైన్లు (హిమవాహినులు కరిగినప్పుడు అవి వెంట తీసుకుపోయే పదార్థాలను ఇలా అంటారు)

**Morphology** = రూప నిర్మాణ శాస్త్రం

**Multipolar** = బహుధ్రువ

**Multispectral Scanner** = కొన్ని వస్తువులు/ శకలాలు వివిధ తరంగ దైర్ఘ్యాలలో వెదజల్లే కిరణాలకు సంబంధించిన సమాచారాన్ని గ్రహించే పరికరం.

**Mumps** = గవదబిళ్ళలు

**Mutation** = (కొత్త జీన్స్‌లో వచ్చే) ఆకస్మిక మార్పు ఈ ఆకస్మిక మార్పువల్ల సరికొత్త వారసత్వ లక్షణాలు పుట్టుకొస్తాయి సృష్టి పరిణామానికి మూలం అంతా ఈ మ్యూటేషన్‌లే వానరం నుంచి నరుని పరిణామం ఇందుకు ఉదాహరణ

**Mycelium** = బూజు

**Nano second** = అతి సూక్ష్మంగా కాలాన్ని కొలిచేందుకు నానోసెకన్లను ఉపయోగిస్తారు

1 Second = $10^9$ Nano seconds

**Narcotics** = మాదక ద్రవ్యాలు / మత్తు పదార్థాలు

**NASA** = నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్ (రోదసీ ప్రయోగాల నిర్వహణ సంస్థ)

**Natural environment** = సహజ పరిసరాలు

**Natural gas** = చమురు వాయువు / సహజ వాయువు

**Natural levees** = సహజమైన గట్లు : వరదలువచ్చినప్పుడు నదీ మైదానాలలో విశాల ప్రాంతాలు వరద నీటిలో మునుగుతుంటాయి అప్పుడు నదీ ప్రవాహానికి రెండువైపులా నిక్షేపాలు ఏర్పడుతాయి (మట్టి, ఉప్పు నీరు వగైరా) ఈ నిక్షేపణవల్ల నదీ తీరంలో ఎత్తైన గట్లు ఏర్పడతాయి వీటిని సహజమైన గట్లు అంటారు

**Natural regions** = ప్రకృతి సిద్ధ మండలాలు

**Natural selection** = "ప్రాకృతిక నిర్ణయం" (జీవరాశి లక్షణాలను ప్రకృతే నిర్ణయిస్తుందని డార్విన్ సిద్ధాంతం)

**Nausea** = వికారం

**Neanderthal man** = ఇది మనిషిని పోలిన కోతి మనిషిని పోలిన మృగజాతి ఈ మనిషి పొట్టివాడు

**Near shore waters** = (తీర సమీపజలాలు) తీరనుంచి అయిదు మైళ్ళ పర్యంతం వ్యాపించిన నీటిని ఇలా అంటారు.

**Nebula (pl. Nebulae)** = మబ్బుతునక ('పాలపుంత'లో ఇదో శకలం మన ప్రాచీనులు దీన్ని 'నీహారిక' అన్నారు. ఉదా: 'ఆంద్రోమెడా' అనే మబ్బుతునక నక్షత్రరాశి దిశగా కన్పిస్తుంది.) ఇలాంటి

[illegible] నెబ్యులాలు ఉంటాయి

**Nebular Hypothesis** = మేఘ సిద్ధాంతం (ప్రపంచ ఉత్పత్తి సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవారు ఇమ్మాన్యుయెల్ కాంట్ దాదాపు ఇదే సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన మరో శాస్త్రవేత్త లాప్లెస్ (వాయు మేఘం) కనుక దీన్ని 'కాంట్-లాప్లెస్ థీరీ' అని కూడా అంటారు)

**Necrosis**= కణజాల క్షయం

**Nectar** = మకరందం

**Negation** = అభావం

**Negative charge** = రుణవిద్యుత్తు

**Nematode** = నులి పాము

**Nerve plexuses** = నాడీ వ్యవస్థ

**Nervous debility** = నరాల బలహీనత

**Nervous system** = నాడీమండలం

**Newt** = నలికళ్ళపాము

**Night blindness** = రేజీకటి

**Nimbus clouds** = కారుమబ్బులు

**Nitrifying bacteria** = నత్రజనీకరణకు తోడ్పడే సూక్ష్మజీవులు (నత్రజనీకరణ)

**Nive / Firn** = గట్టిపడిన మంచు

**Nodes** = నోడ్స్ (సూర్య కక్ష్యను చంద్రకక్ష్య దాటిపోతున్నట్టుగా కనిపించే చోట్లు అవి)

**Nodule** = కంతి / గడ్డ

**Nomenclature** = పరిభాష

**Notation** = సంజ్ఞాగణితం / అంకగణితం (సాంకేతిక గుర్తులతో అంకెలు వేయడం)

**Notion** = అనుభవం

**Novae** = నవ్యతారలు (ఇవి అస్థిరతారలలో కొన్ని అంతేగాని అందులో ప్రత్యేకించి నవ్యత ఏమీ లేదు కొత్తగా పుట్టినవి కావు)

**Nuclear fission** = అణువిచ్ఛిత్తి

**Nuclear fuel** = అణు ఇంధనం

**Nuclear fusion** = అణు సంయోగం

**Nuclear Physics** = పరమాణు భౌతికశాస్త్రం

**Nuclear power** = అణువిద్యుత్తు పరమాణుశక్తి

**Nuclear Reactor** = అణు విద్యుదుత్పాదక యంత్రం

**Nucleic acid** = చిన్న అణువులతో ఏర్పడే మాలిక్యూల్స్‌ను న్యూక్లిక్ యాసిడ్ అంటారు ఇందులో వారసత్వ సమాచారం ఉంటుంది

**Nucleolus** = జీవస్థానగర్భం

**Nucleoplasm** = సెల్ న్యూక్లియస్‌కు లోపల ఉండే ప్రోటోప్లాజమ్‌ను ఇలా అంటారు

**Nucleoproteins** = జీవకణం న్యూక్లియస్‌లో క్రోమోజోములుగా ఉండే యాసిడ్స్, ప్రోటీన్లు కలిసి వున్న మిశ్రమ పదార్థాలు

**Nucleotides** = ఇదొక మిశ్రమ పదార్థం ఇందులో నైట్రోజినస్ బేస్ (అడినిన్, గ్వానిన్, థైమిన్, సైటోసిన్‌లలో ఒకటి) ఒక షుగర్ కణం, ఒక ఫాస్ఫేట్ కణం ఉంటాయి వీటితోనే న్యూక్లిక్ యాసిడ్స్ ఏర్పడతాయి

**Nucleus** = అణుకేంద్రం (అణువులో ఉండేవి మూడు రకాల శకలాలు : 1 ప్రోటాన్ : అణుకేంద్రం దీని స్థానం దీనికి ధన విద్యుత్ ఉంటుంది 2 ఎలక్ట్రాన్ : ఇది అణుకేంద్రం చుట్టూ తిరుగుతుంది దీనికి ఋణ విద్యుత్ ఉంటుంది 3 న్యూట్రాన్ : దీనికి ఏ విద్యుత్తూ లేదు అంటే నెగిటివ్ చార్జీ లేదు, పాజిటివ్ చార్జీ లేదు ఇది తటస్థంగా ఉంటుంది. కనుకనే న్యూట్రాన్ అన్నారు )

**Numeration** = సంఖ్యామానం

**Nymphomania** = మదపిచ్చి

**Oasis** = (ఒయాసిస్సు) ఉపరితలపు నీరు (నీటిబుగ్గల ద్వారా ఉపరితలానికి చేరే నీరు)

**Obesity** = స్థూలత / లావు

**Oblong** = దీర్ఘచతురం

**Observatory** = పరిశోధనాశాల / వేధశాల

**Ocean currents** = సముద్ర ప్రవాహాలు

**Ocean deeps** = అగాధ సముద్ర ప్రాంతం.

**Ocean deposits** = సముద్ర నిక్షేపాలు

**Ocean floor** = సముద్రతలం

**"Ocean of storms"** = తుఫానుల మహాసముద్రం

**Ocean surface** = సముద్రోపరితలం

**Oceanography** = సాగర శాస్త్రం

**Oesophagectomy** = అన్ననాళికా శస్త్రచికిత్స
**Oesophagus** = అన్ననాళిక
**Offshore waters** = (దూరతీరం జలాలు) తీరంనుంచి 250 మైళ్ళదాకా వ్యాపించిన జలరాశిని ఇలా అంటారు
**Olfactory Nerves** = ఘ్రాణనాడులు
**Omnivorous** = సర్వభక్షక
**Oozes** = స్రావాలు
**Opaque** = కాంతినిరోధకం (కనిపించనిది)
**Ophiology** = సర్ప శాస్త్రం
**Ophthalmology** = నేత్ర చికిత్సాశాస్త్రం
**Ophthalmoscope** = నేత్రదర్శిని
**Optical Disk** = (ఆప్టికల్ డిస్క్) కాంతిపేటిక లేజర్ ద్వారా గ్రహించి, రికార్డు చేసిన డేటాను నిల్వచేసే కంప్యూటర్ సాధనం (A storage device used to store information in Computers)
**Optical fibre** = గాజు తీగె: ఇది సమాచార ప్రసార మాలికలో ఉపయోగించే గాజుతీగె సంప్రదాయంగా అమలులో వున్న కోయాక్సియల్ తీగెలకన్నా ఈ గాజు తీగె ఎన్నో రెట్లు శక్తివవంతమయింది అనేక టెలిఫోన్ కనెక్షన్లను అతి తక్కువజాగాలో ఇమడ్చగల్గడం దీని విశిష్టత వైద్య చికిత్సలో కూడా వీటిని వాడుతారు (A glass fibre used in place of Coaxial Cable in communication networks)
**Optical nerve** = నేత్రనాడి
**Opto electronic devices** = కాంతి సహాయంతో పనిచేసే ఎలక్ట్రానిక్ పరికరాలు
**Orbit** = కక్ష్య
**Orbital velocity** = కక్ష్యలో ప్రయాణవేగం
**Organic matter** = సేంద్రియ పదార్థం
**Organic world** = జీవ ప్రపంచం
**Origin of species** = జీవరాశి ప్రాదుర్భావం (డార్విన్ పరిణామవాదానికి ఆధార సిద్ధాంతం).
**Ornithology** = పక్షిశాస్త్రం
**Orogeny** = పర్వతోత్పాదనం
**Oscillation** = డోలనం
**Osteology** = అస్థిశాస్త్రం (ఎముకలకు సంబంధించిన)
**Ostrich** = ఉష్ట్రపక్షి / నిప్పుకోడి ("సుకలోన తలదూర్చిన ఉష్ట్రపక్షి బాపతు " శ్రీశ్రీ నిజాన్ని గమనించడానికి ఇష్టం లేనివాళ్ళనే ఉష్ట్రపక్షి బాపతు' అంటారు )
**Otorrhoea** = కర్ణస్రావం (చెవులో చీము కారడం)
**Outer ring / Bright ring / Crape ring** = ఈ మూడూ శని గ్రహానికి ఉంగరాల్లాంటి రింగులే వీటివల్ల శని శోబాయమానంగా ఉంటుంది వెలుపల ఉన్న రింగును అవుటర్ రింగ్, కాంతివంతమైనది 'బ్రైట్ రింగ్', ఆ తర్వాతిది క్రేప్ రింగ్ అన్నారు ఇవిగాక శనికి పది 'చందమామ'లూ ఉన్నాయి
**Ovaritis** = అండాశయ వాపు
**Ovary** = అండాశయం
**Oven** = కొలిమి
**Ovulation** = అండ విమోచనం
**Ovules** = అండాలు
**Ovum** = స్త్రీ గ్యామేట్
**Oxidation** = తుప్పుపట్టడం / ఆక్సీకరణం (కుజుడు ఎర్రగా కనపడడానికి కారణం ఇలా తుప్పుపట్టినట్టు కన్పించడమే) / ఆక్సిజన్ మరో పదార్థంతో కలవడం
**Oxides** = ఆమ్లజనిదాలు
**Ozone** = మూడు ఆక్సిజన్ అణువులతో కూడిన వాయువు దీని ఫార్ములా $O_3$.
**Pager** = పేజర్ దీనిని పాకెట్ టెలిఫోన్ అనవచ్చు క్షణాల్లో సమాచారం అందించే సాధనం
**Paging** = (పేజింగ్) = క్షణంలో సమాచారం అందించే పద్ధతి టెలిఫోన్ సౌకర్యంవేరు, ఇది వేరు ఇదీ ఫోన్ లాంటి పరికరమేగాని స్థానికంగా నిర్దిష్టమైన పరిధిలో వ్యక్తి (పత్రికా విలేకరి, డాక్టరు, వ్యాపారి, కార్పోరేట్ ఎగ్జిగ్యూటివ్స్ వగైరా) ఎక్కడ తిరుగుతున్నా సమాచారాన్ని ఈ సాధనం ద్వారా క్షణాల్లో పొందవచ్చు, అందించవచ్చు
**Palaeobotany** = పురావృక్ష శాస్త్రం
**Palaeontology** = పురాజీవ శాస్త్రం
**Palaeozoic** = పురాజీవ మహాయుగం

**Palearctic region** = ప్రాచీన భూమి మండలం
**Pallium** = సెరిబ్రం పై భాగం (రెండు అర్ధగోళాలుగా మెదడుపైన ముందు వైపు ఉండే భాగాన్ని సెరిబ్రం అంటారు)
**Panoramic view** = సర్వదిగ్దర్శక దృశ్యం
**Panotitis** = చెవిపోటు
**Papyrus** = రెల్లు
**Parakeet** = తోక చిలుక (ఆఫ్రికా, ఇండియాల్లో)
**"Parallax"** = స్థానభ్రంశం / నక్షత్ర దూరమానం (నక్షత్రాల దూరాలను కొలిచే పద్ధతిని ఇలా అంటారు ఉజ్జాయింపుగా వస్తువుల దూరం కొలవడం)
**Parallax error** = దృష్టి కేంద్రం మార్పు వల్ల కొలతలో వచ్చే వక్రీకరణం / స్థాన భేదభ్రమ
**Parallelogram** = సమాంతర చతుర్భుజం
**Parameter** = పరామితి
**Parametric** = పరామితీయ
**Parasite** = పరాన్నభుక్కు / పరాన్నజీవి
**Parotid glands** = గవద బిళ్ళలు
**Particles** = అణుశకలాలు
**Pathogenesis** = వ్యాధిజననం
**Pathology** = వ్యాధినిర్ణయశాస్త్రం / రోగనిదానశాస్త్రం
**Payload** = రోదసీ నౌక మోసే భారం - మనుషులు, పరికరాలతో సహా
**Peak load** = గరిష్ఠ భారం
**Peaks of Radio signals** = రేడియో సిగ్నల్స్‌కు గరిష్ఠ స్థాయిలు
**Pedigree** = వంశం / మూలం/ మాతృక
**Peepul tree** = రావిచెట్టు
**Pellet** = గుళిక
**Pelvis** = కటి / కూపకం
**Pendulum** = లోలకం
**Pene or Crosional plains** = కోత మైదానాలు
**Percolation** = నీళ్ళు ఊరడం
**Pericardium** = హృత్కోశం
**Pericarp** = బీజకోశం
**Pericycle** = ఒడ్డాణం
**Perigee** = పెరిజీ  ఒక ఉపగ్రహం భూమికి అతి దగ్గరగా చేరుకునే బిందువును / చోటును ఇలా అంటారు
**Perihelion** = దగ్గరగా రావడం
**Perimeter** = కైవారం / చుట్టుకొలత
**Periodic table** = మూల ధాతువుల క్రమపట్టిక (అణుశాస్త్రంలో ఇదో ముఖ్య ఘట్టం  ప్రకృతిలో లభించే ధాతువులను వాటి వాటి రసాయనిక భౌతిక లక్షణాల ప్రకారం వరస క్రమంలో అమర్చడం  ఈ పట్టిక కర్త మెండెలీవ్)
**Perspiratory glands** = స్వేదోత్పాదక (చెమట కారణమైన) గ్రంథులు
**Petrology** = శిలాశాస్త్రం
**Phantom** = మిథ్య
**Pharmaceuticals** = మందులు / ఔషధాలు
**Pharmacopoeia** = ఔషధ గ్రంథం
**Pharmacy** = మందుల ఉత్పత్తి శాస్త్రం
**Pharynx** = ఫారింక్స్ ముక్కుకీ మూతికీ మధ్యనున్న ఖాళీ ప్రాంతం
**Phlegm** = శ్లేష్మం / కఫం
**Phonetics** = స్వర (ధ్వని) శాస్త్రం
**Photo synthesis** = కిరణజన్య సంయోగ క్రియ
**Photons** = తేజఃఖండాలు
**Photosphere** = తేజో మండలం (సూర్యగోళం ఉపరితలాన్ని 'ఫోటోస్ఫియర్' అంటారు  ఈ పై పొర లోతు 200 మైళ్ళు మనకొచ్చే సూర్యకాంతి ఈ పొరనుంచే వస్తుంది )
**Physical environments** = ప్రధాన భౌతిక పరిసరాలు (భూమి, నీరు, గాలి)
**Physical maps** = భౌతిక స్వరూప పటాలు
**Physical states** = భౌతిక స్థితులు ( ప్రతి పదార్థానికి మూడు స్థితులుంటాయి : 1) ఘన స్థితి, 2) ద్రవ స్థితి, 3) వాయు స్థితి  అయితే తర్వాత తర్వాత నాల్గవ స్థితి కూడా ఉంటుందని తేల్చారు శాస్త్రవేత్తలు 4) దీనినే ఫోర్త్ స్టేట్ అన్నారు. దీన్ని 'ప్లాజ్మా' అన్నారు ఈ స్థితిలో అణువులు అణువులుగా ఉండవు. సూర్యుని కేంద్రంలో ఈ 'ప్లాజ్మా' ఉంది. విపరీత ఉష్ణోగ్రతవల్ల అణువులు బతకవు).
**Physiology** = శరీర ధర్మశాస్త్రం

**Pigments** = వర్ణ ద్రవ్యాలు (వర్ణానికి సంబంధించి)
**Piles** = మూలశంక / మూలవ్యాధి / మొలలు
**Pin worms** = నులి పురుగులు
**Pincers** = గ్రాహణం
**Pitch axis** = భూమి ఉత్తర దక్షిణ ధ్రువాలను కలిపే రేఖకు సమాంతరంగా ఉండే రేఖ
**Pituitary gland** = పీయూష గ్రంధి / మెదడులోని పోషక గ్రంధి
**Placenta** = మావి (జంతు సంబంధమైనది) ఉమ్మనీరు (మానవ సంబంధమైనది)
**"Planet -X"** = అజ్ఞాత గ్రహం (నవగ్రహాల్లో ఒకటైన "నెప్ట్యూన్"ను కనిపెట్టిన తర్వాత, అది కూడా తన కక్ష్యలో తిరగకుండా పక్కలకు జరుగుతుండడాన్ని బట్టి దీన్ని పక్క దారి పట్టిస్తున్న గ్రహం మరొకటి ఉండాలని శాస్త్రవేత్తలు ఊహించారు. ఆ అజ్ఞాత గ్రహాన్ని కనిపెట్టే దాకా ఊహామాత్రంగా వాడిన పేరు "ప్లానెట్-ఎక్స్" అని! 1930 మార్చిలో "ప్లూటో" ఉనికిని ప్రకటించారు
**Planet** = గ్రహం / సంచార నక్షత్రం (మనకు దగ్గరలో ఉన్న గోళాలు కదులుతున్నట్టు ఉంటాయి గనుక)
**Planetary winds** = విశ్వపవనాలు (ఉష్ణోగ్రత వ్యత్యాసాలవల్ల అల్పపీడన, అధిక పీడన మండలాలు ఏర్పడుతుంటాయి. ఇందువల్ల వీచే నిరంతర పవనాలను ఇలా అంటారు)
**Plant genetics** = వృక్షోత్పాదన శాస్త్రం
**Plant Geography** (or) **Phytogeography** = వృక్షభూగోళ శాస్త్రం
**Plant pathology** = వృక్ష వ్యాధి శాస్త్రం
**Plasma** = ప్లాజ్మా (ప్రతి పదార్థానికీ మూడు రకాల భౌతిక స్థితులు - ఫిజికల్ స్టేట్స్ - ఉంటాయి. అలాంటి నాల్గవ స్థితిని "ప్లాజ్మా" అన్నారు).
**Plasmogamy** = జీవపదార్థాల సంయోగం
**Plaster of Paris** = ప్యారిస్ జిగురు
**Plate Tectonics** = శిలాచలన అధ్యయన శాస్త్రం : భూమి పొర (పటలం)లో పెద్దవి ఏడు విభాగాలూ, చిన్నవి 12 భాగాలూ ఉంటాయి. వీటిని "ఫలకలు" (ప్లేట్స్) అన్నారు. ఇవి కిందిభాగంలో ఉన్న అప్పర్ మాంటిల్ వరకు వ్యాపించి ఉంటాయి. మాంటిల్ శిలాద్రవంపైన ఈ ప్లేట్లు తేలుతూ ఉంటాయి. ఈ ఫలకాలు ఉష్ణప్రవాహాల వల్ల కదులుతూ ఉంటాయి. ఫలితంగా ఇవి ఒకప్పుడు విడిపోతూ మరొకప్పుడు కలుసుకుంటూనూ ఉంటాయి. అప్పుడప్పుడూ ఇవి అగ్ని పర్వత ప్రేలుళ్ళగానూ, భూకంపాలుగానూ అవతరిస్తాయి
**Plateau** = పీఠభూమి
**Platinum** = అపురూప రజతలోహం
**Pneumonia** = సన్నిపాత జ్వరం
**Point** = బిందువు (ఫిజిక్స్‌లో)
**Poison gland** = విషగ్రంధి
**Polar - region** = ధ్రువ ప్రాంతం / లేదా హిమాచ్ఛాదిత ప్రాంతం
**Polar lights** = ధ్రువ కాంతులు
**Polar or Frizid Zone** = అతి శీతల (ధ్రువ) మండలం
**Polar winds** = ధ్రువ పవనాలు
**Political geography** = రాజకీయ భూగోళ శాస్త్రం (సంఘానికీ, అది జీవించే ప్రదేశానికీ మధ్య సంబంధాన్ని గూర్చి వివరించే శాస్త్రం ఇది)
**Pollen** = పుప్పొడి
**Pollen grains** = పుప్పొడి రేణువులు
**Pollination (self)** = ఆత్మపరాగ సంపర్కం
**Pollination** = పరాగ సంపర్కం
**Polyarthritis** = కీళ్ళవాపులు
**Pomology** = ఫలవిజ్ఞానశాస్త్రం
**Positive charge** = ధనవిద్యుత్తు
**Positron** = పాజిట్రాన్. అణు గర్భంనుంచి వచ్చే కొన్ని ఎలక్ట్రాన్‌లకు ధన విద్యుత్ (పాజిటివ్ చార్జి) ఉంటుంది. అందుకే ఆ పేరు.
**Postnatal** = జననంతర
**Postulation** = స్వీకృత సిద్ధాంతం
**Powdery mildew** = బూడిద తెగులు
**Power grid** = విద్యున్మాలిక
**Precipitation** = అవపాతం (వాతావరణంలోని నీరు భూమికి చేరితే వర్షపాతం అంటారు. కాగా

వాతావరణంలోని నీటి ఆవిరి నీరుగా మారి భూమిపైన మంచుగా, వర్షంగా, పొగమంచుగా, వడగండ్లుగా పడితే దానిని "అవపాతం" అంటారు )

**Precise** = నిశ్చితమైన

**Premise** = ప్రతిపాదన

**Presbyopia** = చత్వారం

**Preservatives** = సంరక్షక పదార్థాలు

**Pressure** = వాయు పీడనం

**Pressure Gradient** = పీడన మార్పు రేటు

**Primaeval atom** = బ్రహ్మాణువు (ఆరువేల కోట్ల నాడు విశ్వంలోని సమస్త నక్షత్రరాశి ఒకే ముద్దగా ఉండేదని కొందరు శాస్త్రవేత్తల సిద్ధాంతం)

**Primary waves** = ప్రాథమిక అలలు

**Primates** = నరజాతికి ముందు వచ్చిన వానర జాతులు

**Prime number** = అభాద్య సంఖ్య

**Prism** = (ప్రిజం) పట్టకం, గాజు దిమ్మ

**Prismatic compass** = ప్రిస్మాటిక్ కంపాస్ (త్వరత్వరగా సర్వేలు జరపడానికి ఉపకరించే సాధనం).

**Process** = ప్రక్రియ

**Profiles** = ఆకృతి చిత్రాలు

**Prognosis** = సాధ్యాసాధ్యవిచారజ్ఞానం

**Projectile** = (విసిరే) గుండు

**Prolapse** = చ్యుతి / దిగజారడం

**"Prominence"** = సూర్యునిపై ఉవ్వెత్తున లేచిన ఓ అగ్ని "శిఖరా"న్ని ఇలా అంటారు. ఇది ఎత్తుగా ఉంటుంది

**Proof (direct)** = ప్రత్యక్ష నిరూపణం

**Proof (analytical)** = అన్వయ నిరూపణం

**Proof (Indirect)** = పరోక్ష నిరూపణం

**Propellant** = రోదసీ ఇంధనం రోదసీ నౌకను పైకి నెట్టేందుకు అవసరమైన శక్తిని పుట్టించేందుకు కాల్చే ద్రవ లేదా ఘన రూపంలో ఉండే పదార్థం.

**Proteins** = మాంసకృత్తులు: జీవానికి ప్రధానమైన సేంద్రియ మిశ్రమ పదార్థాలు.(organic compounds) ఇవి సైటోప్లాజంలో ఉత్పత్తి అవుతాయి.

**Protoplasm** = ప్రోటోప్లాజమ్ : జీవపదార్థం. (ఇది 'జెల్లీ'లా ఉంటుంది జీవకణం దీనితోనే తయారవుతుంది జీవకణం (సెల్) మధ్యలో ఉండేది న్యూక్లియస్ అణువులోని న్యూక్లియస్ వేరు, ఇది వేరు కనుకదీన్ని సెల్ న్యూక్లియస్‌గా పేర్కొనడం మంచిది సెల్ న్యూక్లియస్‌కు బయట ఉండే ప్రోటోప్లాజమ్‌ను సైటోప్లాజం అంటారు

**Prototype** = తొలిరూపం / ఆదిస్వరూపం / అచ్చు అలాగే వుండడం

**Proxima centauri** = సమీప నక్షత్రం (ఇది మామూలుగా కంటికి కనిపించదు ఇది "అల్ఫా సెంటారై" అనే మూడు నక్షత్రాల సముదాయంలో ఒకటి సూర్యుని తర్వాత భూమికి అతిసమీపంలో ఉన్న నక్షత్రం కాబట్టి 'సమీప నక్షత్రం' అనొచ్చు భూమికి ఇది 25 లక్షల కోట్ల మైళ్ళ దూరంలో ఉంది ) "ప్రాక్సిమా" అంటే సమీపం

**Pruning** = కత్తిరింపు

**Psoriasis** = చర్మవ్యాధి (ఎర్రటి మచ్చలు రావడం దీని లక్షణం)

**Puerperal convulsions** = బాలింత గుణం

**Pulpy** = గుజ్జులాంటి

**Pulsars** = పల్సార్స్ ఇవి రేడియో తరంగాలను ప్రసరించే నక్షత్రాలు క్వాజార్ల కంటే ఇవి చిన్నవి ఈ రేడియో తరంగ నక్షత్రాలనుంచి, రేడియో సిగ్నల్స్ వస్తూంటాయి ఇలాంటి నక్షత్రాలు అయిదున్నట్లు కనుగొన్నారు

**Pulsation** = స్పందన

**Pulses** = పప్పులు (కాయధాన్యాలు)

**Pulverizer** = చూర్ణిక / చూర్ణం చేసేది

**Pure Science** = శుద్ధ శాస్త్రం

**Purines** = ఇవీ సేంద్రియ మిశ్రమాలే (ఉదా: అడినిన్, గ్వానిన్ వగైరా)

**Push waves** = నెట్టే అలలు

**Pyaemia** = నెత్తురు జబ్బు

**Pyrimidines** = ఇంకోరకం సేంద్రియ మిశ్రమ పదార్థాలు. (ఉదా: యూరాసిల్, సైటోసిన్, థైమిన్ అనే న్యూక్లియోటైడ్స్‌లో ఇవి ప్రధాన భాగాలు)

**Pythagoras theorem** = పైథాగరస్ సిద్ధాంతం

**Quack** = కపట వైద్యుడు
**Quadrangle** = చతుష్కోణం
**Quadrilateral** = చతురస్రం / చతుర్భుజం
**Quadruple** = నాలుగంతలు
**Quantum** = విద్యుదయస్కాంత శక్తి పేటిక (a packet of electromagnetic radiational energy); పరిమాణం / రాశి
**Quantum theory** = క్వాంటమ్ సిద్ధాంతం (పదార్థ రాశి / పరిమాణానికి చెందిన సిద్ధాంతం)
**Quarks** = ప్రాథమిక శకలాలు
**Quartz** = శిలాస్ఫటికం
**Quasars** = ఇదో నక్షత్రం ఒక వినీల వస్తువు, విభ్రాంతి కల్గించే బ్రహ్మాండమైన తార (దీని దీర్ఘనామం "Quasi stellar Radio Sources".) సూర్యునిలాంటి వందకోట్ల నక్షత్రాలకంటే పదివేల రెట్లు కాంతిని ఒక్క క్వాజార్ వెదజల్లుతుందట
**Raabe's test** = రాబి పరీక్ష
**Rabies** = పిచ్చికుక్క కాటు వ్యాధి
**Radiation** = తాపశక్తి / ధార్మిక శక్తి
**Radio - astronomy** = రేడియో ఖగోళ శాస్త్రం ఖగోళ వస్తువులను అవి వెదజల్లే రేడియో ఫ్రీక్వెన్సీ కిరణాలను బట్టి గుర్తించి అధ్యయనం చేసే ఖగోళ శాస్త్రం
**Radio Active minerals** = రేడియో ధార్మిక ఖనిజాలు
**Radio-telescope** = రేడియో దూరదర్శిని ఖగోళాంతరాల నుంచి వచ్చే రేడియో తరంగాలను గ్రహించి, వాటి స్థాయిని పెంచే ప్రక్రియను రేడియో టెలిస్కోప్ చేస్తుంది.
**Radioactive elements** = అణుధార్మిక ధాతువులు: ఉదా: యురేనియం, థోరియం, ఇవి అల్ఫా, బీటా, గామా కిరణాలను వెదజల్లుతాయి.
**Radioactive** = రేడియో ధార్మిక
**Radioactivity** = రేడియో ధార్మిక శక్తి
**Radish** = ముల్లంగి
**Rainbow** = ఇంద్రధనస్సు
**"Raman Effect"** = రామన్ పరిశోధన (అణుచలనం, కిరణ ప్రసరణానికి సంబంధించి సి వి రామన్ చేసిన కొత్త పరిశోధన)
**Ramanujan's trigonometric sum** = రామానుజన్ త్రికోణమితీయ మొత్తం
**Ravine** = కోన / కనుమ
**Reaction** = ప్రతిక్రియ
**Reactivity** = ప్రతిక్రియాశక్తి
**Real time** = ఒక ఘటన జరుగుతుండగానే రికార్డు అవుతుంటే ఆ కాలాన్ని రియల్ టైమ్ అంటారు
**Rectangle** = దీర్ఘచతురస్రం
**Rectification** = ఆల్టర్నేట్ కరెంటు లేదా వోల్టేజిని డైరెక్ట్ కరెంట్‌గా మార్చడం
**Rectum** = పురీషనాళం
**Recurrent Novae** = పునర్నవ్య తారలు
**Red custard apple** = రామాఫలం
**Red giants** = అరుణ మహాతారలు (ఉదా: అంటారెజ్ బేటెల్ జూస్)
**Red sanders** = ఎర్రచందనం
**Red Shift** = (రెడ్‌షిఫ్ట్) = కిరణాలు దీర్ఘతరంగాలుగా వెడుతూ ఎరుపు రంగువైపు జరుగడాన్ని ఇలా అంటారు ఇది నక్షత్ర దూరాలను, వాటి పలాయన వేగాలను గణించడానికి తోడ్పడుతుంది దీనికి మరో పేరు :డాప్లర్ ఎఫెక్ట్" (డాప్లర్ శాస్త్రవేత్త)
**Red Sorella** = పుల్లగోంగూర
**Reefs** = తీరంలో కొండ గుట్టలు
**Refining** = శుద్ధి చేయడం
**Reflection** = పరావర్తనం
**Reflex action** = ప్రతీకారచర్య
**Refraction** = వక్రీభవనం
**Refrigeration** = శీతలీకరణం
**Regional Geography** = ప్రాంతీయ భూగోళశాస్త్రం
**Regional power grid** = ప్రాంతీయ విద్యున్మాలిక
**Reindeers** = ధ్రువప్రాంతపు లేళ్ళు
**Relative** = సాపేక్షత / అపేక్షత
**Relative density** = తారతమ్య సాపేక్ష సాంద్రత

**Relative error** = సాపేక్ష దోషం

**Relative magnitudes** = సాపేక్ష కాంతిమత్త్వాలు

**Relativity** = సాపేక్షత్వం

**Relativity of Motion** - సాపేక్ష చలనం "చలన సాపేక్షత్వం" (అంటే చలించేవాటికీ, చలించకపోయేవాటికి ఆక్షేపం

**Remote Sensing** = దూర గ్రాహ్యత భూతలంపై ఉన్న ప్రదేశాలనుగానీ, వస్తువులనుగానీ దూరాన ఉన్న ఉపగ్రహాలనుంచి లేదా రోదసీనౌకనుంచి వీక్షించడం

**Renal** = మూత్రపిండ సంబంధం

**Rendezvous** = ముందు అనుకొన్న పథకం ప్రకారం రెండు ఖగోళ వాహనాలు ఒక చోట కలవడాన్ని ఇలా అంటారు మరో సందర్భంలో కూడా ఇలా ముందు అనుకొన్న చోటికి కొందరు చేరుకుంటే ఆ స్థలాన్ని "రాండెవూ" అని పిలుస్తారు

**Reptiles** = సరీసృపాలు (స్కాలోసారస్, టిరానోసారస్, డిప్లోడోకస్ వగైరా జంతువులు)

**Repulsion** = వికర్షణ (ఒకేరకమైన అయస్కాంత ధ్రువాలమధ్య / ఒకేరకమైన విద్యుదాంశాల మధ్య పెరిగే అంతరం)

**Reservoir** = జలాశయం

**Residual deposits** = అవశిష్ట నిక్షేపాలు

**Resin** = జిగురు

**Resultant** = పరిణామం / ఫలశ్రుతి

**Retarded velocity** = క్షీణమానవేగం

**Retina** = అంతఃపటలం

**Retrogressive** = తిరోగమనశీల

**Retrogressive evolution** = తిరోగమన పరిణామం

**Revolving / Revolution** = పరిభ్రమణం

**Rheumatism** = కీళ్ళవాతం

**Richter Scale** = (రిక్టర్ స్కేల్) = భూకంపనలను నమోదు చేసే సాధనాలు రెండు: (1) రిక్టర్ స్కేలు (2) మెర్కలీ స్కేలు. ప్రకంపనం అంతఃశక్తి ఏ మేరకు ఉందో ఎంతవరకు విస్తరించి ఉందో సమాచారం అందిస్తుంది రిక్టర్ స్కేలు కంపనం వచ్చిన ప్రాంతానికి మాత్రమే పరిమితమై ఏ మేరకు అది జనంపై ప్రభావితం కల్గించిందో అంచనా వేసేది మెర్కలీ స్కేలు రిక్టర్ స్కేల్ సృష్టి కర్త చార్లెస్ ఫ్రాన్సిస్ రిక్టర్ [1930లలో])

**Ricinus** = ఆముదపు చెట్టు

**Ridge** = గట్టు / మిట్ట

**Riemann integral** = రీమాన్ సమాకలని

**Ring shrub** = మెట్టతామర

**Ringworm** = తామర /దద్దురు

**River bed** = నదీగర్భం

**River bed deposits** = నదీతల్ప నిక్షేపాలు

**River Navigation** = నదీయానం / పడవ ప్రయాణం

**River Piracy** = నదీగ్రహణం (ఒకనది ప్రవాహగతిలో చటుక్కున రెండో పరీవాహంలోకి ప్రవేశించి ఆ నదిని తనలో కలిపేసుకొనడాన్ని ఇలా అంటారు)

**River Valley Projects** = నదీలోయ ప్రణాళికలు

**RNA Molecule** = Ribo nucleic acid ఇది న్యూక్లిక్ యాసిడ్స్‌లో ఇంకోరకం ఇది సెల్ న్యూక్లియస్ బయట ఉంటుంది చీలిన డి ఎన్ ఎ లోని వారసత్వ లక్షణ సమాచారాన్ని ఆర్ ఎన్ ఎ మోలెక్యూల్స్ స్వీకరిస్తాయి ఈ రెండూ జీవరాశి వారసత్వ సమాచార పేటికలు

**Ro-ro Stability** = పడవ ప్రమాదాలను లేక నౌకా ప్రమాదాలను నివారించేందుకు వీలుగా ఫెర్రీడెస్క్ నుంచి వెంటనే నీళ్ళుతోడివేసే సాధనం ఇది.

**Road bridge** = రోడ్డు వంతెన

**Rock dam** = రాతిడాము / ఆనకట్ట

**Rock forming minerals** = శిలా ఖనిజాలు

**Roll axis** = ఉపగ్రహ గతి దిశలో ఉండే రేఖ

**Rolle's theorem** = రోల్ సిద్ధాంతం

**Root** = ఘాతమూలం(గణితం)

**Root square** = వర్గమూలం

**Root cap** = వేరు తొడుగు

**Root stock** = ప్రకాండ మూలం

**Rose apple** = అల్లోనేరేడు

**Roselle** = గోగు

**Rotation** = ప్రదక్షిణం / భ్రమణం

**Round figures** = పూర్ణాంకాలు

**Run-of** = ప్రవాహ ధోరణి
**Run-of-the river plant** = నది ప్రవాహ కేంద్రం
**Runway** = (రన్‌వే) విమానం ఎగరడానికి ముందు నేలపై కొంతదూరం వెళ్ళే ప్రత్యేకమైన రాస్తా
**S-Band** = ఎస్-బంధం 1550 నుంచి 5200 మెగాహెర్జ్ వరకు విస్తరించే రేడియో ఫ్రీక్వెన్సీల సమూహం
**Safety valves** = రక్షక కవాటాలు
**Saffron** = కుంకుమపువ్వు
**Salinity** = లవణీయత
**Salivary glands** = లాలాజల గ్రంధులు
**Sand dunes** = ఇసుక దిబ్బలు (Barchans)
**Sapiens** = బుద్ధి జీవి
**Saplings** = చిరుమొక్కలు
**Sarcoma** = నెత్తురుగడ్డ వ్యాధి
**Sarcosis** = నెత్తురుగడ్డ
**Satellite** = ఉపగ్రహం
**Scaffolding** = పరంజా (భవన నిర్మాణ సమయంలో తాత్కాలికాధారాలు)
**Scalpel** = చాకు / శస్త్రవైద్యుని కత్తి
**Scapula** = రెక్క ఎముక
**Sciatica** = తొంటి నొప్పి
**Scrotum** = అండకోశం
**Scurvy** = నంజువ్యాధి
**Scythe** = వంకరకత్తి (కొడవలి)
**Sea breeze** = జలపవనం (సాగర పవనం).
**Sea of Crisis** = సంక్షోభ సంద్రం
**Sea of Fertility** = సారవంత సాగరం
**Sea of Mists** = పొగమంచు సముద్రం
**Sea of Serenity** = ప్రశాంత సాగరం
**Sea of showers** = తుషార సముద్రం
**Sea of vapours** = ఆవిరుల సంద్రం,
**Sea-weed** = శైవలం / సముద్రపు పాచి
**Seasonal variations** = రుతు వ్యత్యాసాలు
**Sedative** = మత్తు కలిగించే ఔషధం
**Sediment / scum** = మడ్డి / తెట్టు
**Sedimentary rocks** = నిక్షేప శిలలు / గస్సిక శిలలు / మెత్తని మట్టిగుట్టలు
**Seedlings** = నారుమొక్కలు
**Seepage** = ఊట
**Segment** = ఉపభాగం
**Seismic** = భూకంపన సంబంధమైన
**Seismogram** = (సీస్మోగ్రామ్) = కంపనాలను నమోదు చేసే రేఖా చిత్రం
**Seismograph** = (సీస్మోగ్రాఫ్) = భూకంపన తరంగాల నమోదు యంత్రం
**Seismology** = భూకంపన శాస్త్రం
**Selvas** = (సెల్వాలు) = ఉష్ణమండల వర్షారణ్యాలు
**Semen** = శుక్లం
**Sense organs** = జ్ఞానేంద్రియాలు
**Sensory nerves** = స్పర్శానాడులు
**Serum** = రసి / వస
**Sesame** = నువ్వులు
**Sewage** = మురుగునీరు
**Sexual** = లైంగికం
**Shake waves** = కదిలించే అలలు
**Sharks** = సొరచేపలు
**Shells** = కర్పరాలు / చిప్పలు మొదలైనవి సముద్రం అడుగున నిల్వ ఉంటాయి
**Shield Shaped mountains** = డాలు (రూపంలో) పర్వతాలు
**Short staple cotton** = పొట్టి పింజ పత్తి
**Sial** = మిశ్రమశిల (స్ఫటిక శిల లాంటివి 'సిలికా' లోను, అల్యూమినియాలోను ఉండడం వల్ల ఈ పేరు వచ్చింది సిలిక-అల్యూమినియాల సమ్మేళనమే 'సియాల్' )
**Sidereal Day** = సైడీరియల్ డే (భూమి పడమటినుంచి తూర్పు దిక్కుకు ఒక్కసారి చుట్టి రావడానికి పట్టే కాలాన్ని ఇలా అంటారు దీని వ్యవధి 23 గంటల 56 నిమిషాల 4.095 సెకండ్లు.)
**Siderial month** = చంద్రుడు భూమిని చుట్టి, తిరిగి తన చోటుకు చేరుకోవడానికి తక్కువ కాలం పడుతుంది ఆ కాలాన్ని ఇలా అన్నారు.
**Sima** = సిమా (బరువైన శిలాపొర ఇందులో

# న్యాయశాస్త్రం

**Abet =** నేరాన్ని ప్రోత్సహించడం

**Abetter =** నేర ప్రోత్సాహకుడు

**Abrogate =** చట్టాన్ని లేదా సందిపత్రాన్ని రద్దు చేయడం

**Action in personam=** వ్యక్తిపై తీసుకొనే చర్య

**Action in rem =** ఆస్తిపైన లేదా అందరిపైన తీసుకునే చర్య

**Actuary =** మదింపుదారు (భీమా కంపెనీ ప్రీమియమ్స్‌కు మదింపు వేసే భీమా ఉద్యోగి)

**Actusreus =** చట్టవిరుద్ధ చర్య (క్రిమినల్ లా నిషేధించిన ఏ కార్యకలాపాన్నైనా నేరంగా పరిగణించడం)

**Ad hoc=** తాత్కాలికం / పలానా పనికొసం నియుక్తమైన (an ad hoc committee = ప్రత్యేక సమస్య అధ్యయనానికి తాత్కాలికంగా నియమించిన కమిటీ)

**Ad valorem =** మూల్యాధారసుంకం / విలువను బట్టి: (ad valorem duty or tax = సరకుల విలువనుబట్టి మదింపు వేసే పన్నును ఇలా అంటారు)

**Adjudication =** మధ్యవర్తిత్వం

**Affidavit=** అఫిడవిట్ = వాంజ్మూలం / సాక్ష్యపత్రం

**Agenda =** చర్చనీయాంశాలు

**Agent-provecateur=** కవ్వింపుదారు / నేరాన్ని ప్రోత్సహించేవాడు

**Alias** (ఎలియాస్) = మారుపేరు / అన్వర్థనామం / దొంగపేరు (ఉదా: 'the confidence trick-ster used several aliases' - సుబ్బారావు ఎలియాస్ 'సాబో', 'జంబో' )

**Alibi =** మిష (నేరం ఒకచోట జరిగితే నిందితుడు మరొకచోట ఉండడం నేరంతో నిమిత్తం లేకపోయినా ఏదో ఒక మిషపైన ఆ వ్యక్తిపైన నిందను ఆరోపించడం.)

**Alienation =** ఆస్తి బదలాయింపు / వేరు పడడం / దూరం కావడం (alienation of affection = ఒకరి ప్రేమకు మరొకరు దూరం కావడం)

**Alieni Juris =** సంరక్షకుని హక్కు (ఉదా: ఒక మైనర్‌ను వేరొకరి సంరక్షణలో ఉంచినప్పుడు ఎదురు మైనర్‌పైన సంరక్షకునికి హక్కు ఉండడం )

**Alimony=** మనోవర్తి (విడవడిపోయిన లేదా విడాకులిచ్చిన భార్యకు భర్త ఇచ్చే పరిహారం మనోవర్తి)

**Allegiance =** విధేయతా ప్రమాణం (oath of allegiance)

**Amentia =** స్మృతి లోపం

**Amercement=** దయా దండన (జరిమానా విషయంలో)

**Amicus curiae =** న్యాయపరామర్శి / ధర్మాసన మిత్రుడు (కోర్టులో ఒక కక్షిదారు తరపున లాయర్ వాదించకపోవచ్చు కాని క్లిష్టమైన లీగల్ పాయింట్‌ను ఎర్చించి నిగ్గు తేల్చడంలోగానీ, లేదా ప్రజా క్షేమం దృష్ట్యా ఒక అంశంపై వివరణ ఇవ్వడంలోగానీ సాయపడవలసిందిగా కోర్టే న్యాయవాదిని అర్థిస్తుంది అలాంటి అభ్యర్థనకు మారుపేరు ఇది )

**Anarchist =** అరాచకవాది (19వ శతాబ్దం ఆఖర్లో, 20వ శతాబ్దం తొలి రోజుల్లో అరాచకవాదం ప్రబలింది ప్రభుత్వ సైన్యం, సివిల్ సర్వీసు, కోర్టులు, చట్టాలు - ఏవీ ఉండరాదని, పాలకుడెవడూ లేకుండా జనాలు స్వేచ్ఛగా జీవించాలని కోరిన వాదం అరాచకవాదం )

**Animus=** ఇచ్ఛ / వాంఛ / ఉద్దేశం (ఉదా: intention to steal or cancel or stay).

**Annexe / annex =** అనుబంధం / స్వాయత్తం చేసుకోవడం / ఆక్రమించడం (ఉదా: document attached an island was annexed by the neighbouring republic).

**Annuity =** సాధారణ వార్షికం (ఒక వ్యక్తి పెట్టుబడి పెట్టినప్పుడు అతనికి ప్రతి ఏటా ముట్టజెప్పే సాధారణ మొత్తం)

**Annulment =** రద్దు చేయడం (annulment of contract).

**Ante =** పూర్వ స్థితి (status ano ante = situation as it was before).

**Antedate=** పూర్వపుతేదీ (invoice was

antedated to december 31st).

**Anticipatory Bail** = ముందస్తు జామీను (బెయిల్)

**Appeal** = విజ్ఞప్తి (appeal against the Court decision / appeal to the Supreme Court against the Highcourt order / appeal against a sentence).

**Appellant** = విజ్ఞాపకుడు

**Appellate court** = అప్పీలుకోర్టు

**Apprehension** = అరెస్టు చేయడం (suspect was apprehended at a meeting).

**Appropriation** = నిర్దిష్టమైన పనికి నిర్దిష్టమైన కేటాయింపు (డబ్బు) - allocation of money for a specific purpose

**A priori** = ఆదినుంచీ (from the first) = a priori argument = ఊహాజనితమైన అంశంపై చేసే వాదన

**Aribitration** = మధ్యవర్తిత్వం (కోర్టుతో నిమిత్తం లేకుండా కక్షిదారుల మధ్య మధ్యవర్తిత్వం ద్వారా వివాదాలను పరిష్కరించడం )

**Assent** = సమ్మతి / అనుమతి (Presidents' assent to bill to become an Act).

**Attest** = సమ్మతి సంతకం

**Attestation** = ధృవీకరణ సంతకం / సాక్ష్య ధృవీకరణ

**Attorney General** = అటార్నీ జనరల్ (సాధికార న్యాయాధికారి)

**Attorney** = అటార్నీ (ఒకరి తరపున చట్టబద్ధంగా వ్యవహరించే మరో వ్యక్తి ఉదా: Power of attorney).

**Autopsy**= శవపరీక్ష

**Bail** = జామీను / జమానత్

**Bailiff** = బెయిలిఫ్ = ఇతణ్ణి కోర్టు నియమిస్తుంది నిందితులకు సమన్లు వగైరా డాక్యుమెంట్లను పంపేట్టు చూడ్డం, నిందితులు కోర్టు ఉత్తర్వులను శిరసా వహించేలా చూడ్డం ఇతని బాధ్యత ఉదా: Court ordered the bailiff to seize the property of the accused.

**Baptize** = మత దీక్ష తీసుకొను

**Barrister** = బారిస్టర్ లాయర్‌ను ఇంగ్లండ్‌లో ఇలా అంటారు ఉన్నత న్యాయస్థానాల్లో కేసులు వాదించగలిగేవాడితను (మొక్కపాటివారి "బారిష్టర్ పార్వతీశం" అయిన బారిస్టర్ అయిన తర్వాత రాసిందే)

**Bedneath** = ఆస్తి సంక్రమణం (ఇష్టానుసార పత్రంలో (విల్) వ్యక్తి తన ఆస్తిని మరొకరికి సంక్రమింప చెయడం ఉదా: Mother was bedneathed her belongings to her daughter.

**Benediction** = ఆశీర్వాదం

**Bigamy** = (రెండో వివాహం) మారు మనువు / మారు మగువ [ఒకర్ని వివాహమాడిన తర్వాత మరొకర్ని కూడా పెళ్ళి చేసుకోవడం నేరం]

**Blag** = సాయుధ ముఠా చేసే దోపిడీ

**Blasphemy** = దైవ దూషణ / నిరాకరణ

**Blockade** = దిగ్బంధం

**Blue bag** = జూనియర్ బారిస్టర్ కోటును వెంట తీసుకు వెళ్ళే బ్యాగ్‌ను ఇలా అంటారు

**Blue book** = సాధికార నివేదిక: [రాయల్ కమిషన్ (ఇంగ్లండ్) సాధికార నివేదిక]

**Blue laws** = విధి నిషేధ నిబంధనలు (ఆదివారం నాడు ఇది చేయాలి అది చేయకూడదు అని శాసిస్తూ నిర్దేశించే నిబంధనలు)

**Bonafide** = సరైన / విశ్వసనీయమైన / అర్హతలుగల [ఉదా: Ramu acted bonafide]

**Bootleg**= దొంగసారా

**Bootlegger**= దొంగ (మద్యం) సారా ఉత్పత్తిదారు / సప్లయిదారు

**Bootlegging** = దొంగ సారా తయారీ

**Bug / bugging** = రహస్య యంత్రం (వ్యక్తుల / సభ్యుల కూపీలాగే పద్ధతి - చర్చలను దొంగచాటుగా విని రికార్డు చేసే యంత్రం ఈ యంత్ర సహాయంతో చేసే పనిని 'బగ్గింగ్' అంటారు డెమోక్రటిక్ పార్టీ వాటర్‌గేట్ సమావేశమప్పుడు ప్రెసిడెంట్ నిక్సన్ చేసిన పని ఇదే. అదే ప్రసిద్ధి చెందిన 'వాటర్‌గేట్ కుంభకోణం'

అంటే [ఉః the agents bugged the Prime Ministers' office )

**Bunco =** డబ్బు మోసం (ప్రధానంగా జూదంలో)

**Bureau =** కార్యాలయం / సంస్థ

**Bylaw / byelaw / by-law =** క్లబ్బు / సంస్థ నిర్వహణకు సంబంధించి రూపొందించె అంతరంగిక నిబంధనలు

**Cabal =** రాజకీయ ముఠా (ప్రభుత్వాన్ని పడగొట్టడానికి లేదా ఏదైనా చట్ట విరుద్ధమైన పనికిగాని రహస్యంగా కుట్రపన్నే రాజకీయివాదుల ముఠా )

**Cadaver =** శవం

**Cadet =** శిక్షణలో ఉన్న పోలీసు ఆఫీసరు

**Cadre =** ప్రధాన కార్యకర్త

**Capital Punishment =** మరణశిక్ష

**Carte blanche =** పురమాయింపు పత్రం (దీన్నే 'వైట్‌కార్డ్' అని కూడా అంటారు ఒక వ్యక్తి తన తరంపున బాధ్యతలు స్వేచ్ఛగా నిర్వహించడానికి సమ్మతిస్తూ మరో వ్యక్తికి పూర్తి అధికారాన్ని ఇవ్వడం ఉదాః He has carte blanche to act on behalf of the Company)

**Caucus** [కాకస్] = ముఠా / బలీయమైన గ్రూపు (పార్టీ విధానాలను మార్చడంలో తమ పలుకుబడిని ఉపయోగించే బలమైన రాజకీయ గ్రూపు)

**Caveat =** ముందస్తు హెచ్చరిక (కోర్టులో ఎవరైనా కేసు వేసినప్పుడు, అది విచారణకు వచ్చే ముందు నిందితునికి తెలపకుండా ఎలాంటి చర్యకూ పాల్పడడానికి వీలు లేకుండా నిరోధించే న్యాయ సాధనం ఇది )

**Certioriari Order of =** (సర్షరి) = విచారణ ఉత్తర్వు (కేసుం న్యాయాన్యాయం విచక్షణను పరిశీలించాలని కోరుతూ కింది కోర్టులో వున్న కేసును హైకోర్టుకు బదలాయించే ఉత్తర్వు)

**Cesser =** రద్దు (ఒక తనఖానుగానీ, ఒక చార్టర్‌నుగానీ రద్దు చేయడం).

**Chapter =** పార్లమెంట్ చేసే చట్టాన్ని ఇలా కూడా అంటారు (అమెరికాలో "చాప్టర్ 2" అంటే అమెరికన్ బాంక్రప్టస్సీయాక్ట్‌లో ఒక సెక్షన్ అని అర్థం).

**Client =** కక్షిదారు / పార్టీ [పిజా చెల్లించి లాయరును ఏర్పాటు చేసుకొనె వ్యక్తి]

**Cohabitatio =** కలిసి జీవించడం (స్త్రీ పురుషులు వివాహితులైనా, కాకపోయినా సరె)

**Condominium =** ఉమ్మడి పాలన (ఒక వలసనుగాని లేదా ఒక రక్షిత భూభాగాన్ని గాని రెండు అంతకు మించిన దేశాలు కలిసి పాలించువాన్ని ఇలా అంటారు)

**Conjugal rights =** వైవాహిక హక్కులు (పరస్పర ప్రయోజనాలకు సంబంధించి భార్యాభర్తలకు అనుమతించిన హక్కులు)

**Conman =** విశ్వాసపాత్రుడు / జైనాటి

**Consensus =** ఏకాభిప్రాయం / ప్రాబల్యమైన అంగీకారం (ఉదాః In the absence of a concensus Prime Minister could not take a decision)

**Consensus ad =** ఒప్పందంపై ఏకీభావం (Identity of minds).

**Contempt =** కోర్టు ధిక్కారం / శాసన సభా ధిక్కారం

**Contraband =** దొంగ సరుకు (కస్టమ్స్ సుంకం చెల్లించకుండా చట్ట విరుద్ధంగా సరకులను దేశంలోనికి దింపడంగానీ, లేదా బయటకు పంపించడంగానీ జరిగినప్పుడు అలాంటి సరకును ఇలా అంటారు)

**Contractual liability =** కాంట్రాక్ట్‌లో నిర్దేశించి వున్న దానికి లీగల్ బాధ్యత వహించడం

**Copyright =** రచయిత / కళాకారుడు / చిత్ర నిర్మాత / వాగ్గేయ కారుల లీగల్ హక్కు (తమ రచనలను ప్రచురించుకోడానికీ, వాటిని ఇతరులు కాపీ చేయకుండా నిరోదించడానికి వారికి ఉన్న హక్కు)

**Corporal punishment =** ప్రహార శిక్ష ః నేరస్థుడ్ని కొట్టి, శిక్షించడం.

**Corpse =** శవం

**Corpus =** చట్టాల క్రోడీకరణ (body of laws).

**Corraborat =** సాక్ష్య నిర్ధారణ (ఉదాః the witness corraborated the accused's alibi saying that at the time of the murder

he had seen him in Hyderabad).

**Corrigenda** = తప్పొప్పుల పట్టిక / సవరణ పట్టిక

**Cosa nostra** = మాఫియా ముఠా

**Coterminous** = రెండూ ఒక్క సారే రద్దు కావడం (ఉదా: the leases are coterminous)

**Counsel** = కక్షిదారుల తరపు న్యాయవాదులు (ఉదా: ప్రాసిక్యూషన్ కౌన్సెల్, డిఫెన్స్ కౌన్సెల్)

**Counterfeit (currencv)** = దొంగ కరెన్సీ

**Countermand** = ఉత్తర్వు అమలు కాకుండా నిరోధించడం

**Coup (d'etat)** = తిరుగుబాటు: కుట్రతో ప్రభుత్వాన్ని పడగొట్టి, మరో ప్రభుత్వాన్ని గద్దె నెక్కించడాన్ని 'కూ' అంటారు కొద్దిమంది సైనికాధికారులు కలిసి కుట్రపన్ని జరిపే తిరుగుబాటు ఇది 'విప్లవం' అంటే జన బాహుళ్యం చేసే తిరుగుబాటు 'కూ' వల్ల క్యాబినెట్‌లు మాత్రమే మారతాయి విప్లవం వల్ల సాంఘిక వ్యవస్థే మారిపోతుంది

**Covenant** = ఒడంబడిక / ఒప్పందం / పూచీ పత్రం సంధిపత్రం లేదా కాంట్రాక్టు దీనికి పునాది (ఉదా: he signed a covenant against - underletting the entire premises).

**Credentials** = యోగ్యతా పత్రాలు / అర్హతా పత్రాలు

**Criminology** = నేరాధ్యయన శాస్త్రం

**Cross-examinatio** = ఎదురు పరీక్ష / సాక్షుల పరీక్ష

**Daby** = వేలి ముద్రలు

**De facto** = వాస్తవంలో (లీగల్ టైటిల్‌తో నిమిత్తం లేకుండా ఆచరణలో ఉన్న పరిస్థితిని ఇలా అంటారు ) ఉదా: he is the defacto owner of the house).

**De jure** = చట్టరీత్యా (చట్టరీత్యా సవ్యంగ ఉన్నపుడు ఇలా అంటారు. ఉదా: he is the de jure owner of the property).

**De minimis non carat lex** = చిల్లర విషయాలను చట్టం పట్టించుకొనకపోవడం.

**De moto** = మళ్ళీ మొదలు పెట్టడం

**Decree** = అధినేతలు జారీచేసే డిక్రీ (అయితే దీనికి పార్లమెంటు సమ్మతి ఉండదు To goven by decree అంటే, పార్లమెంటులో చర్చించి, సమ్మతి పొందకుండానే డిక్రీల ద్వారా దేశాన్ని పాలిస్తుండడం)

**Demarche** = సాధికారికమైన దౌత్య పురమాయింపు (ఒక విదేశీ కార్యాలయాన్ని సందర్శించడమో లేదా ప్రభుత్వాధినేత నుంచి ఒక పత్రాన్ని మరొకరికి ఇచ్చి రావడమో)

**Deport** = తరలింపు / ప్రవాసం పంపడం (ఉదా: Illegal immigrants were deported to a far off land).

**Deposition** = లిఖిత సాక్ష్య ప్రకటన / ప్రమాణం చేసి ప్రకటన చేయడం

**Deterrent** = నేర ప్రవృత్తి నిరోధక శిక్ష (ఉదా: a long prison sentence will act as a detterent to other possible criminals)

**Docket** = విచారణలో వున్న కేసుల జాబితా

**Domicile** = జన్మస్థలం కాకుండా తానున్న చోటునే శాశ్వత నివాసంగా ప్రకటించుకోవడం (ఉదా: He is domiciled in Hyderabad అంటే వ్యక్తి తన సిద్ధనివాసం చేసుకొన్న ప్రాంతం అని)

**Donatio mortis causa** = మరణానంతర బహుమానం (వ్యక్తి చనిపోయిన తర్వాత అతని ఆస్తిని బదిలాయించడం)

**Duress** = బెదిరించి నిర్బంధించడం (ఉదా: he signed the document under duress)

**Embezzlement** = తనది కాని సొమ్మును దొంగిలించి, వాడుకోవడం (ఉదా: He was sent to jail for four months for embezzlement of funds).

**Emigration** = శాశ్వతంగా అక్కడికి వలస పోవడం (మరో దేశానికి)

**Estoppel** = వాద నిషేధం : న్యాయ సంబంధమైన విషయంలో కోర్టులో తాను అంతకు ముందు ప్రకటించిన వాస్తవాన్ని కక్షిదారు నిరాకరించకుండా లేదా తనదే నిజమని వాది మొండికెత్తకుండా నిరోధించగల సాక్ష్య

నిబంధన ఇది (కోర్టు అంతకుముందె ఒక విషయంపై చెప్పిన తీర్పును మళ్లీ ఎవరూ తిరగతోడకుండా అడ్డుకునె నిబంధనను కూడా ఇలా అంటారు)

**Euthanasia** = "భీష్మవాంచ" / దుర్భర బాధలో వున్న రోగి కోరికపైన అతనికి దయతో స్వచ్ఛంద మరణావకాశాన్ని కల్పించడం దీన్నే 'మెర్సీ కిల్లింగ్' అని కూడా అంటారు

**Ex Officio** = అధికార రీత్యా / ఉద్యోగ ధర్మం ప్రకారం

**Ex gratia** = ఉపకారం ఇచ్చే సొమ్ము (దీనికి ఎలాంటి షరతులూ వుండవు)

**Ex parte** = ఏకపక్షంగా

**Ex post facto** = ఘటనానంతరం

**Expiration** = గడువు ముగిసిపోవడం (ఉదా: expiration of an insurance policy).

**Expropriation** = స్వాధీనం చేసుకోవడం (ఉదా: ప్రజావసరాల నిమిత్తం ప్రయివేట్ ఆస్తిని ప్రభుత్వం పరిహారంతో నిమిత్తం లేకుండా స్వాధీన పరచుకోవడం)

**Extenuation** = క్షమించి వదలడం

**Extradition** = నిందితుడు ఎక్కడున్నానరే పిలవనంపడం (ఈదేశంలో నేరం చేసి మరో దేశంలో తలదాచుకున్న నేరగాడిని విచారణ నిమిత్తం అరెస్టు చేసి ఈ దేశానికి తీసుకురావడం)

**Felony** = తీవ్రమైన నేరం

**Feme covert** = వివాహిత స్త్రీ

**Feme sole** = అవివాహిత స్త్రీ

**Fiat** = శిక్షించడానికి కుదిరిన ఒప్పందం

**Fiduciary** = మరొకరి తరఫున "ట్రస్టీ"గా వ్యవహరించే వ్యక్తి (ఉదా: He was acting in a fiduciary capacity on behalf of the Company)

**Fieri facias** = ఋణగ్రస్తుడైన వ్యక్తి ఆస్తిని జప్తు చేయాలని ఆదేశించే కోర్టు ఉత్తర్వు

**Frivolous complaint** = పనికిమాలిన ఫిర్యాదు

**Functus officio** = ఇకనెంతమాత్రం అధికారం చెలాయించలేని స్థితి no longer having power: "Justices were functi officio")

**Gag** = పత్రికా స్వాతంత్ర్యాన్ని నలిమివేయడం (ఉదా: the govts uses the Official Secrets Act as a meams of gagging the press)

**Gag rule** = చర్చ వ్యవధిని కుదించి వెయిడం (ఉదా: Rule in Legislature which limits the time for debate)

**Gaol** = ఖైదు / ఖైదులో పెట్టడం

**"Godfather"** = మాఫియా ముఠా నాయకుడు

**Grass** = ఇతర నేరస్థులగురించి పోలీసులకు సమాచారం అందించె నేరగాడు

**Gratuity** = ప్రతిఫలం (సహాయం చేసినందుకు ఎవరికైనా ఇచ్చే మొత్తం లెదా సేవలకు గుర్తింపుగా ఇచ్చే మొత్తం)

**Green Book** = న్యాయస్థాన నిర్వహణా నిబంధనలు (క్రింది కోర్టులకు వర్తించే నిబంధనల క్రోడీకరణను ఇలా అంటారు)

**Green Card** = గ్రీన్‌కార్డ్ (ఒక నాన్-అమెరికన్ అమెరికాలో శాశ్వత పౌరుడుగా నివసించాలంటే ఈ రిజిస్ట్రేషన్ కార్డు అవసరం)

**Green Paper** = పార్లమెంటు చర్చించదగిన కొత్త చట్టానికి సంబంధించి ప్రభుత్వ ప్రతిపాదనల తాలూకు నివేదికను ఇలా అంటారు

**Hague Conventions** = హేగ్ సంప్రదాయాలు (యుద్ధ నిర్వచనానికి సంబంధించి కుదిరిన అంతర్జాతీయ ఒప్పందాలను, రసాయన ఆయుధాలను నిషేధిస్తూ కుదిరిన ఒప్పందాలను ఇలా అంటారు )

**Hebeas Corpus** = హెబియస్ కార్పస్ (అన్యాయంగా వ్యక్తిని అరెస్టుచేసి ఖైదు చేసినప్పుడు విడుదల చేయాలని కోరుతూ నిందితుడు కోర్టుకు నివేదించుకొనే విజ్ఞాపన పత్రం ఇది "రిట్"గా దాఖలు చేస్తారు దానిపై కోర్టు నిందితుడ్ని పిలవనంపి, విచారించి ఎందుకు నిర్బంధించారో ప్రభుత్వాన్ని లేదా పోలీసుల్ని నిగ్గదీస్తుంది )

**Hegemony** = పెత్తనం / నాయకత్వం (ఇరుగు పొరుగు దేశాలపైన బలమైన రాజ్యం సాగించే పెత్తనాన్ని, నాయకత్వాన్ని ఇలా అంటారు)

**Holograph** = లిఖిత పత్రం / చేత్తో రాసిన 'విల్లు'

లేదా పీటరామా

**Illicit** = చట్ట విరుద్ధం

**Immigiation** = శాశ్వతంగా ఇక్కడికి వలస రావడం (ఈ దేశానికి)

**Immunity** = అరెస్టు కాకుండా / శిక్ష పడకుండా కల్పించే రక్షణ

**Impeach** = తీవ్ర అభిశంసన (దేశాధినేతను దేశద్రోహి అని తీవ్రంగా ఆరోపించడం లేదా పార్లమెంటులో ఒక వ్యక్తిని తీవ్రంగా అభిశంసించడం )

**Impound** = పన్ను చెల్లించేదాకా వస్తువులను లేదా డాక్యుమెంట్లను తొక్కిపట్టడం

**Impute** = ఆపాదించడం (ఉదా: to impute a motive to someone)

**In absentia** = సమక్షంలో కాకుండా పరోక్షంగా

**In Camera** = రహస్యంగా (ఉదా: the case was heared in Camera)

**In loco parentis** = తల్లి లేదా తండ్రికి మారుగా వ్యవహరించడం (in the place of a parent ఉదా: the court is acting in loco parentis).

**In status Quo** = యధాతధస్థితి / యధా పరిస్థితి

**In toto** = సాకల్యంగా

**Incarceration** = జైలుశిక్ష

**Incest** = వావి వరుసలెరుగని నేరం (రక్త సంబంధీకులతో - తల్లి, తండ్రి, కొడుకు, కూతురు - లైంగిక సంబంధాలు కలిగి వుండడం)

**Incorrigible person** = సవరణకు అతీతంగా ప్రవర్తించే వ్యక్తి

**Incriminating document** = నేర సాక్ష్యం వ్యక్తి నేరం చేశాడని నిరూపించే సాక్ష్య పత్రం

**Indenture** = ఇద్దరు లేదా ఎక్కువమంది పార్టీల మధ్యరాసుకునే దస్తావేజు / పత్రం.

**Informa Pauperis** = న్యాయ సహాయార్థి. (పేదవాడుగా లీగల్ సహాయం అర్థించే నిరుపేద).

**Infringe** = చట్ట ఉల్లంఘన / హక్కుల ఉల్లంఘన (ఉదా: to infringe a copyright).

**Injunction** = ఫలానా పనిచేయొద్దని ఆదేశిస్తూ కోర్టు జారీచేసే ఉత్తర్వు (ఉదా: he got an injunction preventing his rival from selling his car).

**Inns of court** = లండన్‌లో బార్ అసోసియేషన్స్‌ను (సొసైటీలు) ఇలా అంటారు ఇవి నాలుగు సొసైటీలు ఇందులో లాయర్లు సభ్యులు బార్‌లో వీళ్ళని బారిస్టర్‌లుగా వ్యవహరిస్తారు ఈ నాల్గు సొసైటీలకు - గ్రేస్ ఇన్, లింకన్స్ ఇన్, ఇన్నర్ టెంపిల్, మిడిల్ టెంపిల్ అని పేర్లు

**Innuendo** = ద్వంద్వార్థాలతో కూడిన ఆరోపణ (ఉదా: an innocent statement may be defamatory if it carries an innuendo).

**Inquest** = హత్య కారణంపై లేదా మూకుమ్మడి హత్యాకాండపైన జరిపే క్షుణ్ణమైన విచారణ

**Inquorate** = 'కోరం' లేని సమావేశం (సమావేశం జరపడానికి కనీస సభ్యుల సంఖ్య అవసరం ఉదా: the meeting was abondoned because it was declared inquorate).

**Insolvent** = దివాళాకోరు / 'ఐ పి ' దారు (ఉదా: his company was declared insolvent or he declared himself insolvent).

**Inter alia** = తదితరమైన / ఇతర విషయాలతోపాటు

**Interdict** = ఫలానా పని చేయొద్దని కోర్టు నిషేధించడం లేదా లిఖిత పూర్వక ఉత్తర్వు జారీచేయడం

**Interim** = తాత్కాలికమైన (ఉదా: the company paid an interim dividend or a court passed interim order).

**Interlocutory Application** = వ్యాజ్యకాలీన దరఖాస్తు : దావాలో తీర్పు యిచ్చేదాకా ఉన్న పరిస్థితులను యధాస్థితిలో ఉంచడానికి న్యాయస్థానం నుంచి ఆదేశం పొందడానికి పెట్టుకున్న దరఖాస్తు

**Interpol** = అంతర్జాతీయ పోలీసు వ్యవస్థ: (నేరాల పరిష్కారానికి వివిధ దేశాల మధ్య సహకారం కోసం ఏర్పడిన అంతర్జాతీయ పోలీసు వ్యవస్థ ఇది. ఉదా: India urged the Interpol to track down the LTTE Supremo in connection with

his alleged involvement in the assassination of Rajav Gandhi).

**Interregnum** = మధ్యంతరకాలం / వ్యవధి (ఉదా: a period between the death of one ruler and accession of the next incumbent.)

**Intestate** = వీలునామా రాయకుండా చనిపోవడం ఉదా: "to die intestate" = to die without having made a will).

**Intra vires** = అనుమతించిన అధికారాలకు లోబడి ఉండడం ఉదా: the ministers' action was inted to be intra vires).

**Inventory** = ఆస్తివివరాలు / సరకు వివరాలు / నిల్వ వివరాలు

**Invoice** = ఇన్‌వాయిస్ (ఇచ్చిన సరకులకు లేదా అందించిన సేవలకు డబ్బు చెల్లించమని కోరుతూ పంపే 'నోట్'

**Ipse dixit** = సాకల్యంగా

**Ipso facto** = వాస్తవంగా (by fact itself) (the writing of the letter was ipso facto an admission of guilt).

**Ipso jure** = చట్ట ప్రకారం (by the law itself.)

**Jailbird** = "జైలుపక్షి" (కోర్టు పక్షిలాగా : తరచుగా శిక్షపడి జైలుకు వెళ్ళేవాడికిది మారుపేరు )

**Judgement** = తీర్పు

**Judicature** = న్యాయపాలన.

**Judicial precedent** = కోర్టు తీర్పు ద్వారా ఏర్పడే కొత్త సంప్రదాయం (అలాంటి తీర్పును ఉన్నత న్యాయస్థానం మాత్రమే తిరగదోడగల్గుతుంది.)

**Judicial review** = కోర్టు పునర్విచారణ (కింది కోర్టుతీర్పు తప్పుగా ఉన్నప్పుడు రెండవసారి దాన్ని పునః పరిశీలించే హక్కు ఒక్క ఉన్నత న్యాయస్థానానికే ఉంటుంది )

**Judiciary / Justiciary** = జడ్జీలందరిని కలిపి జ్యుడిషియరీ అంటారు / న్యాయ పాలనా వ్యవస్థ

**Jurisdiction** = న్యాయస్థానం అధికార పరిధి

**Jurisprudence** = చట్టాలు, న్యాయవ్యవస్థ తాలూకు అధ్యయనం

**Juvenile Court** = బాల నేరస్తులను విచారణ జరిపే కోర్టు

**Kickback** = దొంగచాటుగా చెల్లించే ముడుపు / వ్యాపార లావాదేవీలో ప్రభుత్వోద్యోగికి ఇచ్చే కమిషన్

**Kleptomania** = దొంగబుద్ధి (దొంగతనానికి పురిగొల్పే మానసిక రుగ్మత)

**Larceny** = ఇతరుల వస్తువులను దొంగిలించడం (ఉదా: Godman was commited of larceny).

**Launder** = దొంగిలించిన డబ్బును లేదా అక్రమంగా పొందిన డబ్బును బ్యాంకి అక్కౌంటులోకి మార్చుకోవడం పట్టుబడకుండా ఉంటే సవా లక్ష మార్గాల ద్వారా ఈ లావాదేవీ జరుగుతూంటుంది అది స్మగ్లింగ్ లేదా మాదక ద్రవ్య వ్యాపారాలకు సంబంధించిన సొమ్ము కావచ్చు (ఉదా: "The proceeds of the smuggling racket were laundered through a bank in Calcutta".)

**Law court** = విచారణ జరిపే స్థలం / జడ్జి కేసులు వినే చోటు

**Law officers** = అటార్నీ జనరల్ / సొలిసిటర్ జనరల్‌ను ఇలా అంటారు.

**Law suit** = ప్రయివేట్ వ్యక్తి నడిపే కేసు.

**Laws of Oleson** = ప్రపంచంలో తొలి వాణిజ్యచట్టాలకు ఇది మారుపేరు. 1216లో వచిన ఈ చట్టాలే ఉత్తరోత్తరా అంతర్జాతీయ చట్టాలకు మూలం అయ్యాయి

**Lead** = ఆచూకీ (నేర పరిష్కారంలో తోడ్పడే ఇలాంటి ఆచూకీని, సమాచారాన్ని "లీడ్" అంటారు )

**Leading question** = అనుకూల ప్రశ్న: సాక్షినుంచి తనకు అనుకూలంగా సమాధానం రాబట్టుకునేందుకు వీలుగా లాయరు తనకు సానుకూలంగా వేసే ప్రశ్న).

**Legacy** = సంక్రమించిన ఆస్తి (చనిపోయే వ్యక్తి విల్లుద్వారా మరొకరికి తన డబ్బును లేదా ఇతరత్రా తన సొంత ఆస్తిని – భూమి మినహా – దఖలు పరచడం).

**Legatee** = వారసుడు.

**Lessee** = లీజుకు తీసుకొనే వ్యక్తి.

**Lessor** = యజమాని (ఆస్తిని వేరొకరికి కౌలుకు / అద్దెకు ఇచ్చే వ్యక్తి)

**Lex loci actus** = నేరం జరిగిన ప్రదేశంలో అమలులో ఉన్న చట్టం

**Libel** = పరువు నష్టం ప్రకటన (ఎదుటివాడి పరువును దెబ్బతీసే విమర్శనగానీ, ప్రచారంగానీ, ప్రకటనగానీ ఇలా అంటారు someone claimed that the "newspaper report was a libel" )

**Libel action** = పరువు నష్టం దావా

**Licit** = చట్ట బద్ధం

**"Lie upon the table"** = శాసన వేదికకు నివేదించిన పిటిషన్‌ను ఇలా అంటారు శాసనకర్త / పార్లమెంటు సభ్యుడు సభకు పిటిషన్‌ను సమర్పిస్తే దాన్ని ఇలా పిలుస్తారు ఇది బ్రిటీష్ సంప్రదాయం

**Lien** (లీన్) హక్కు = బకాయి / రుణం / బిల్లు చెల్లించేదాకా వస్తువులను తన వద్దే అట్టి పెట్టుకొనే హక్కును ఇలా పిలుస్తారు (ఉదా: Company had a lien on employe's car until he paid the amount he has taken it.)

**Lieu** = బదులుగా : in lien of అంటే instead of అని (ఉదా: to "give an employee two months salary in lien of notice to ask him to quit from the post immediately").

**Locus standi** = హోదా / స్థానిక ప్రతిపత్తి / కోర్టువారు వినదగిన అర్హత (వ్యక్తికి) (ఉదా:"the tax payer does not have locus standi in the court" )

**Lumpsum** = ఏక మొత్తంగా / అనేక వాయిదాల్లో కాకుండా ఒక్క కిస్తీలోనే మొత్తం డబ్బు చెల్లించడం

**Lynch** = నిందితుణ్ణి వెంటాడి వెంటాడి చంపటం (ఈ 'వేట'లో విచారణ ప్రసక్తి లేదు)

**Lynch law** = నిందితుణ్ణి విచారణ లేకుండానే మంది చంపేసే పద్ధతిని 'జంగిల్‌లా' మాదిరే 'లించ్‌లా' అంటారు.

**Mafia** = నేరాలకు పాల్పడే రహస్య ముఠా ఇటాలియన్ సీక్రెట్ సొసైటీని ఇలా అంటారు ఇటలీ, అమెరికాల్లో ఈ ముఠా నేరాలకు పాల్పడుతూంటుంది ఈ "మాఫియా" పదమేగాదు, బుద్ధులు కూడా అమెరికా నుంచి ఆంధ్రప్రదేశ్ వరకూ దిగుమతి అయ్యాయి!

**Magna Carta** = హక్కుల మహాపత్రం (గ్రేట్ చార్టర్‌గా పేరుమోసిన ఈ పత్రాన్ని ఇంగ్లండ్ రాజు కింగ్ జాన్ 1215లో ఆమోదించాడు ప్రజలకు కొన్ని రాజకీయ, వ్యక్తిగత స్వాతంత్ర్యాలు దఖలు పడడానికి ఈ చార్టర్ కారణం

**Maiden speech** = తొలి ప్రసంగం (కామన్స్ సభలో ప్రవేశించిన ఎం పి చేసే తొలి ప్రసంగం )

**Malfeasance** = చట్ట విరుద్ధ చర్య

**Malice** = దురుద్దేశం (దురుద్దేశాలు పెట్టుకొని బుద్ధిపూర్వకంగా చేసే చర్యను లేదా నేరాన్ని ఇలా అంటారు )

**Mandamus** = ఆదేశం / ఉత్తర్వు ("We command") : న్యాయశాస్త్ర విధుల నిర్వహణలో ఫలానా విధిని పాటించాలని ఆదేశిస్తూ కింది కోర్టులను పై కోర్టు జారీచేసే ఉత్తర్వు

**Mandarin** = ఉన్నత స్థాయి సివిల్ ఉద్యోగి (బ్రిటీష్ సంప్రదాయం)

**Mandate** = ఒకరి తరపున వ్యవహరించడానికి మరొకరికి సంపూర్ణాధికారాలు దఖలు పరిచే ఆదేశం

**Mandatory** = విధిగా పాటించవలసిన / అమలు పరచవలసిన

**Mandatory injunction** = ఫలానా పని చేసి తీరాలని కోర్టు ఇచ్చే అధికారం.

**Manipulation** = తిమ్మిని బమ్మిని చేయడం / తరకట బురకట (కంపెనీ లాభాలమీద నడుస్తోందని నమ్మించడం కోసం అక్కౌంట్లను తారుమారు చేయడం) అలాగే షేర్ ధరలను తనకు అనుకూలంగా మారేట్టు తిమ్మినిబమ్మిని చేయడాన్ని Market manipulation అంటారు మార్కెట్ ఎకానమీ అవలక్షణాల్లో ఇదొకటి.

**Mareva injunction** = ఇతర దేశాలకు పారిపోయిన వ్యక్తి తాలూకు ఆస్తులను స్వదేశంనుంచి తరలించుకు పోకుండా స్తంభింప చేస్తూ కోర్టు జారీ చేసే ఉత్తర్వు (దక్షిణాఫ్రికాకు చెందిన కంపెనీ "మరే

వాకంపానియా నవీరా" దానికి సంబంధించిన కేసు ఇది అలాంటి అస్తిత్వంబన ఉత్తర్వులకు తర్వాత్తర్వాత ఇలా పేరొచ్చింది )

**Maritalrape** = భార్య ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా భర్త లైంగిక వాంచను తీర్చుకోడానికి భార్యను బలవంతం చేయడం

**Maritime trade** = నౌకా వాణిజ్యం (వాణిజ్య సరకును) ఓడలలో రవాణా చేయడం

**Matricide** = మాతృహత్య

**Memorandum** = లిమిటెడ్ కంపెనీ నిర్మాణం, దాని ఆశయాలు, మూలధనం రిజిస్టర్డ్ ఆఫీసు వివరాలు పొందుపరిచిన లీగల్ డాక్యుమెంటు

**Mens rea**= నేర మనస్తత్వం ('guilty mind').

**Mifeasance** = అసంబద్ధమైన / అసంబద్ధంగా వ్యవహరించడం

**Miscarriage of Justice** = వక్రించిన న్యాయం (తప్పుగానో / అన్యాయంగానో న్యాయస్థానం చేసే నిర్ణయం, కక్షిదారుడి హక్కులకు విరుద్ధంగా చెప్పే తీర్పు అయితే కక్షిదారు అప్పీలుపైన సదరు తీర్పును తిరగదోడవచ్చు )

**Misdemeanour** = స్వల్ప నేరం (ఉదా: తగిన లైసెన్సు లేకుండా కారు నడపడం లాంటిది)

**Misjoinder**= సంబంధం లేని వ్యక్తిని ఒక ఘటనలో ఇరికించడం

**Misprision** = నేరం జరగబోతోందని తెలిసి కూడా 'నిమ్మకు నీరెత్తినట్టు' తనకేమీ పట్టకుండా కూర్చోవడం (ఉదా: "misprision of murder".)

**Mitigation** = శిక్షను తగ్గించడం /చేసిన నేరం తీవ్రమైన స్వభావాన్ని అంతగా పరిగణనలోకి తీసుకోకపోవడం (Ex "in mitigation, counsel submitted evidence of his elients' work for charity".)

**M'Naghten Rules**= నేరారోపణకు, గురైన వ్యక్తి మతి చెలించినవాడా కాడా అని నిర్ణయించడానికి జడ్జి పరిశీలించే నిబంధనలను ఇలా అంటారు. (రివరెండ్ M'Naghten అనే వ్యక్తి కేసు ఆధారంగా ఈ నిబంధనలు రూపొందాయి)

**Modus operandi** = పనిగుట్టు (నేరగాడ్ని గుర్తుపట్టగలిగేటట్టుగా ఒకపద్ధతి ప్రకారం నేరాలు చేయడం)

**Modus vivindi** = జీవన సరళి (ఇరు పక్షాల వారు శాంతియుతంగా జీవించేందుకు వీలుగా రెండు వర్గాల మధ్య కుదిరే ఒప్పందం ఉదా: after years of internecene bends they have achieved a modus vivindi.)

**Molest** = వేధించడం, (మహిళలను లైంగికంగా) బాధపెట్టడం (పిల్లల్ని మానసికంగా)

**Monogamy** = ఏకపత్నీ / ఏక సతీ వివాహ వ్యవస్థ

**Moratorium** = చెల్లింపువాయిదా వేయడం

**Mortgage** = తనఖా / సెక్యూరిటీ పెట్టుకొని అప్పివ్వడం

**Nark**= పోలీసులకు సమాచారం అందజేసే ఇన్ఫార్మర్‌ను ఇలా అంటారు (ఇది అమెరికన్ గ్రామ్యం)

**Nolle prosequi** = "అంతటితో ఆపండి" అని ఆదేశించడం (క్రిమినల్ విచారణను నిలిపివేయమని అటార్నీ జనరల్‌కు ఆదేశించే హక్కుంటుంది

**Null and void** = చెల్లనేరదు (contract between to parties ws become null and void, i e, no longer valid.)

**Obiter dicta** = తీర్పు మధ్యలో న్యాయమూర్తి చేసే వ్యాఖ్య / వ్యాఖ్యలు జడ్జి నిర్ణయానికి ఇవి ప్రధానంగాకపోయినా తీర్పులో భాగంగా ఉంటాయి అంతమాత్రాన వాటిని ప్రామాణికంగా తీసుకొని ఉదహరించరాదు.

**Obscene Publication** = అశ్లీల రచన (ఏది అశ్లీలం అన్నదానిపై దేశదేశాల్లో చర్చోపచర్చలు జరుగుతున్నాయి దీనికి ముగింపు అంటూ లేదు ఈ విషయంలో కొందరు పవిత్ర గ్రంథమని భావించుకొనే "బైబిల్"లో జెనిసిస్ అధ్యాయంలోని కొన్ని భాగాలు అశ్లీలమని భావిస్తే అసలు మానవుడి పుట్టుకే అశ్లీలమని, బూతు అనీ కొందరు వాదిస్తున్నారు. See Irwing wallace "THE PRIZE"= అయితే సామాజిక

[illegible]

Ombudsman = విచారణాధికారి / విచారణ జరిపే పెద్దమనిషి (ప్రభుత్వశాఖలపైగాని, ఇతర పెద్ద సంస్థలపైగాని ప్రజలనుంచి వచ్చే ఫిర్యాదులను విచారించడానికి నియమితుడైన ప్రత్యేక అధికారి / పెద్ద మనిషి)

**Onus of proof**= రుజువు చేసే బాధ్యత (కోర్టులో వచ్చిన ఆరోపణ నిజమైనదో / కాదని రుజువు చేసే బాధ్యత "If there is a prosecution the onus will normally be on the prosecutor to prove the case.)

**Open-ended** = పరిమితిలేని / అనిర్దిష్టమైన It is an open - ended agreement).

**Ordinance** = ప్రత్యేక డిక్రీ : ప్రభుత్వం జారీ చేసే ప్రత్యేక డిక్రీ

**Outlaw** = సంఘ బహిష్కృతుడు / దేశ బహిష్కృతుడు / నిషేధించడం

**Oval office** = వైట్ హౌస్‌లో ఒక గది ఇది అమెరికన్ ప్రెసిడెంట్ ఉపయోగించుకునే ప్రత్యేక గది / 'ఓవల్ ఆఫీస్ ప్రకటన' అన్నా ప్రెసిడెంట్ ప్రకటనగానే భావించాలి

**Overrule** = తోసిపుచ్చడం (కింది కోర్టు తీర్పును పై కోర్టు తోసిపుచ్చడం).

**Palimony** = లైంగిక సంబంధమున్న స్త్రీకి లేదా విడిపోయిన స్త్రీకి రెగ్యులర్‌గా చెల్లించాలని పురుషుడ్ని ఆదేశిస్తూ కోర్టు నిర్ణయించే పరిహారపు సొమ్ము. భర్త విడాకులిచ్చినప్పుడు భార్యకు చెల్లించాల్సిన మనోవర్తిని ఎలిమొనీ అంటారు.

**Papal Numico** = పోప్ నియమించే రాయబారి

**Parole** (పెరోల్) = ఖైదీని తాత్కాలికంగా విడుదల చేయడం.

**Patent** = కొత్తవస్తువును / కొత్త ఉత్పత్తి విధానాన్ని తయారు చేయడానికి, కనుగొనడానికి ఉత్పత్తిదారుని ప్రత్యేక హక్కును స్థిరపరచే సాధికార పత్రం

**Patricide** = పితృహత్య

**Pecuniary** = డబ్బు సంబంధమైన (మోసం ద్వారా డబ్బు సంపాదించగల్గడం / లాభించడం )

**Penal code** = శిక్షాస్మృతి

**Penitentiary** = పెద్ద జైలు

**Penology** = నేర తీర్పుల అధ్యయన శాస్త్రం

**Peppercorn rent** = నామమాత్రపు అద్దె / కౌలు

**Per pro** = మరొకరి తరపున సంతకం పెట్టే అధికారం

**Perjury** = అబద్ధాలాడడం (కోర్టులో చెప్పిన దానికి విరుద్ధంగా అబద్ధం చెప్పడం నేరం)

**Pimp** = తార్పుడుగాడు (వేశ్యలను తార్చడంద్వారా పొట్ట పోసుకొని జీవనం సాగించేవాడు)

**Pirate** = ఓడదొంగ / గ్రంథచోరుడు

**Plagiarism** = కాపీ కొట్టడం / తెరవాటు కొట్టడం

**Plainclothes** = మాఫీలో ఉన్న పోలీసులు

**Plaint** = ఫిర్యాదు

**Plaintiff** = ఫిర్యాది

**Plenipotentiary** = అంతర్జాతీయ వ్యవహారాలపై ప్రభుత్వం తరపున వ్యవహరించే అధికారిని ఇలా అంటారు

**Polygamy** = బహు భర్తృత్వ / బహు భార్యాత్వ వ్యవస్థ

**Polygraph** = అబద్ధాన్ని పసికట్టే యంత్రం (the detctor). పోలీసులు ఇంటర్వ్యూ చేస్తున్న వ్యక్తిలో కలిగే శారీరకమైన మార్పులు, తడబాటు, హావ భావాలనుబట్టి అతడు అబద్ధం ఆడుతున్నదీ లేనిదీ తెలుస్తుంది యంత్రం

**Pornography** = అశ్లీల సాహిత్యం / సినిమాలు / ప్రచురణలు

**Porridge** = జైలుశిక్ష

**Portfolio** = ఒకే వ్యక్తికి చెందిన అన్ని రకాల షేర్లు / మంత్రిత్వ శాఖ / ఏ శాఖ బాధ్యతలూ అప్పగించని మంత్రి (Minister without portfolio).

**Postmortem** = శవపరీక్ష

**Prayer** = విజ్ఞాపన / వినతి (కోర్టులో కక్షిదారు తన పిటిషన్ ముగింపులో చేసుకొనే విన్నపం)

**Preamble** = పరిచయం / ఆముఖమ్ / ఉపోద్ఘాతం

**Precedent** = ఉదాహరణ / పూర్వ సందర్భం, అడుగుజాడ / to set a precedent; to

follow a precedent.

**Prerogative** = ప్రత్యేక హక్కు / ప్రత్యేక అధికారం

**Prevaricate** = తప్పించుకోవడం / సూటిగా సమాధానం చెప్పకపోవడం / ముఖంచాటు చేసుకోవడం

**Prima facie** = ప్రాదమిక ఆధారం (there is a prima facie to book a case against him)

**Primogeniture** = తండ్రి యావదాస్తి పెద్ద కొడుక్కే చెందాలన్న పాత రూలు

**Primus inter pares** = సముల్లో ప్రధముడు (మంత్రులంతా సములే, అయితే ప్రధాన మంత్రి సముల్లో ప్రధముడు అని అర్థం )

**Privacy** = వ్యక్తి ప్రయివేట్ జీవితం (వ్యక్తి పదిమందిలో తిరిగే ప్రముఖుడైనప్పుడు పబ్లిక్ జీవితానికి ప్రయివేట్ జీవితం బద్ధమై ఉండాలన్నది ప్రజాస్వామిక సంప్రదాయం. "వ్యక్తుల ప్రయివేట్ బ్రతుకు వారి వారి సొంతం / పబ్లిక్‌లో నిలబడితే ఏమైనా అంటాం" అని శ్రీశ్రీ ప్రానక్రీడ

**Pro forma** = ఇన్‌వాయిస్ పత్రం (వస్తువులు పంపే ముందు కంపెనీ వాళ్ళు కొనుగోలు దారుకు పూర్తి చేసి పంపమని ఇచ్చే పత్రం)

**Proctor** = శాంతి భద్రతలకు బాధ్యుడైన అధికారి

**Proscribe** = నిషేధించడం

**Protocol** = కరారునామా (పత్రం) / దౌత్య మర్యాదలు / అధికార లాంఛనాలు

**Proviso** = కాంట్రాక్ట్ పత్రంలో / దస్తావేజులలో పొందుపరచే షరతు లేదా నిబంధన

**Pupillage** = స్వతంత్రంగా బారిస్టర్‌గా ప్రాక్టీసు ప్రారంభించే ముందు శిక్షణ పొందే కాలం.

**Purge** = క్షాళన (పార్టీలో అవాంఛనీయ శక్తులను లేదా ఒక గ్రూపులోని ప్రత్యర్థులను తొలగించడం )

**Putative father** = అక్రమ సంతానానికి తండ్రి

**Quarantine** (క్వారెంటైన్) = విదేశాలనుంచి కొత్తగా వచ్చేవారికి రోగాలు ఉన్నప్పుడు వారిని దేశీయులనుంచి వేరుపరచి వుంచే గది.

**Quasi** = దాధాపుగా / దాదాపు సమంగా (ఉదా: Quasi - official body = దాదాపుగా అధికార్ల సంస్థగానే వ్యవహరించడం)

**Quickie** = ప్రత్యేక నిబంధనల సహాయంతో కోర్టు ద్వారా త్వరంగా సాధించె విడాకులు

**Quid pro quo** = చేసిన పనికి మారుగా సహాయం చేయడం

**Racket** = అక్రమ ఒప్పందం / వ్యాపారం (మోసం ద్వారా డబ్బు గడించే డీల్)

**Rape** = ఎదుటి వ్యక్తి సమ్మతితో నిమిత్తం లేకుండా లైంగిక సుఖాన్ని బలవంతంగా పొందడం (నేరం)

**Ratify** = అదికారికంగా ధృవీకరించడం (సంధి పత్రం / ఒప్పందం వగైరా)

**Ratio decidendi** = కోర్టు ప్రామాణిక నిర్ణయం (ఇది ఉదహరించుకోదగింది)

**Ratio legis** = హేతువుపై ఆధారపడిన చట్టం / చట్టం వెనుకనున్న ప్రధాన సూత్రం

**Reclaim** = చెల్లించిన డబ్బును వాపసు ఇవ్వమని కోరడం

**Recusal** = పక్షపాతం చూపినందుకు జడ్జిని అనర్హుడుగా ప్రకటించడం

**Red tape** = లీగల్ డాక్యుమెంట్లను 1) కట్టకట్టి భద్రంగా ఉంచేందుకు వాడే ఎర్రరిబ్బను 2) పరిపాలనా వ్యవహారాల్లో నత్తనడక / సాచివేత (my application has been held up by red tape).

**Redemption** = అసలు ఫాయిదాలతో రుణం / అప్పు చెల్లించు.

**Reprieve** = కోర్టు తీర్పును / ఆదేశాన్ని అమలు జరపకుండా తాత్కాలికంగా ఆపడం

**Reprimand** = అధికార మందలింపు / విమర్శ / జడ్జి లేదా మెజిస్ట్రేట్ మందలింపు

**respondent** = ప్రతివాది

**Restitutio in integrum** = ప్రభుత్వం నుంచి వచ్చిన కేసును / అప్పీలును తిరిగి ప్రభుత్వానికే యధాతధంగా వెనక్కి పంపిచేయడం

**Restitution** = ఆస్తిని తిరిగి కంపెనీకి దఖలు పరచడం

**Riparian rights** = నదీ ప్రాంతంలోని భూములపై ప్రజల హక్కులు / నదిలో చేపలు

పట్టుకునే హక్కు ఉంది

**Rough Justice** = మొరటు న్యాయం (న్యాయ వ్యవస్థ నిర్వాహణలో ఎప్పుడూ న్యాయమే జరుగుతుందనుకోరాదు. అప్పుడప్పుడూ కక్షిదార్లకు అన్యాయం కూడా జరుగుతున్నదని దీని పరమార్థం )

**Sabotage** = విద్రోహం / విఘాతం కల్గించడం (యంత్రాలు, ప్రభుత్వ ఆస్తులు, పరికరాలు, ఉద్యమాలకు సంబంధించి)

**Scaffold** = బలిపీఠం (న్యాయశాస్త్ర పరిభాషలో)/ మంచె (చేలో పిట్టల్ని కొట్టడానికి కాపలదారు ఉపయోగించే ఎత్తైన 'మంచె'ను కూడా 'స్కాఫోల్డ్' అంటారు )

**Scam** = మోసం

**Scotland Yard**= లండన్ నగర పోలీసు కేంద్ర కార్యాలయం

**Sedition** = రాజ్య ద్రోహం (వెనక దీన్ని 'రాజ ద్రోహం' అనేవారు శాంతి భద్రతలకు విఘాతం కల్గిస్తూ ప్రభుత్వాన్ని అభాసుపాలు చేసే రాతకోతలు గాని ఉపన్యాసాలుగాని ఈ నేరం కిందికి వస్తాయి ప్రజాస్వామ్యంలో విమర్శ అనుమతించిన ఆయుధం కాని కొందరి దృష్టిలో 'విమర్శే' రాజ్యద్రోహం )

**Self rule** = స్వపరిపాలన

**Self-determination** = స్వయం నిర్ణయాధికారం

**Sham** = అబద్ధం / అవాస్తవం

**Sine Qua non** = ప్రధానమైన ("agreement by the management is a sine Qua non of all employment contracts )

**Sine die** = నిరవధిక వాయిదా. (Courts' hearing was adjourned sine die)

**Sleeping partner** = నామమాత్రపు భాగస్వామి

**Sodomy / Buggery / Sodomite** = జంతువులతో సంభోగానికి తలపడే నేరం - అలాంటి నేరస్తుడు.

**"Star Chamber"** = ఒకప్పుడు జ్యూరీతో సంబంధం లేకుండా రాయల్ కోర్టు కేసుల్ని విచారించే పీఠాన్ని ఇలా అన్నారు. క్రమంగా ఇప్పుడిది బ్రిటన్‌లో ప్రభుత్వ శాఖల వ్యయకర్తన ప్రతిపాదనలను పరిశీలించే క్యాబినెట్ కమిటీగా మారిపోయింది

**Statute** = లిఖిత శాసనం (ఉదా: పార్లమెంటు చట్టం)

**"Statute Book"** = (చట్ట సంపుటి) = పార్లమెంటు ఆమోదించిన చట్టాలన్నింటిని కలిపి ఇలా అంటారు

**Statutory period** = చట్టం నిర్ణయించిన కాలపరిమితి

**Sub Judice** = కోర్టు పరిశీలనలో ఉండి, ఇంకా ఎటూ తేల్చని అంశంపైన పత్రికలుగాని / శాసన వేదికలుగానీ ప్రస్తావన చేయడం ధిక్కార నేరం అవుతుంది (Print media / electronic media cannot report the case because it is likely sub Judice )

**Sub Poena** = (సబ్‌పెనా) కోర్టులో హాజరు కావాలని సాక్షిని పిలవనంపుతూ జారీచేసే కోర్టు ఉత్తర్వు Journalist was subpoenaed in the prosecution.

**Succession** = వారసత్వంగా ఉన్నతాధికారికి (చనిపోయిన వ్యక్తినుంచి) ఆస్తి సంక్రమించడం

**Succession suit** = వారసత్వ దావా

**Sue** = జరిగిన అన్యాయానికి పరిహారం కోరుతూ అన్యాయానికి పాల్పడినవాడిని కోర్టుకు ఈడ్వడం

**Suffrage** = ఎన్నికల్లో ఓటు హక్కు

**Sui generis** = సొంత వనరులు (ఉదా: మన వెల్లుల్లిపైన, వేపపైన పేంటెంట్ హక్కులు మనకు దక్కకుండా చేయాలని అమెరికన్ బహుళజాతి గుత్త సంస్థలు, ఔషధోత్పత్తి సంస్థలూ విశ్వ ప్రయత్నం చేస్తున్నాయి కాని వేప, వెల్లుల్లి మన సహజ వనరులు మన సంపద )

**Suit** = సివిల్ దావా (దీన్నే 'లాసూట్' అని కూడా అంటారు)

**Supergrass** = పెక్కుమంది క్రిమినల్స్ గురించి పోలీసులకు ఆచూకీ తెలిపే ఇన్‌ఫార్మర్‌ను ఇలా అంటారు

**Suppression veri** = వాస్తవాన్ని తొక్కిపెట్టడం (ముఖ్యమైన విషయం పొక్కకుండా అణచివేయడం).

**Surrogate** = పురమాయింపు దారు. (ఇంకొకరి

తరపున వ్యవహరించడానికి నియమితుడైన వ్యక్తి)

**Surrogate mother** = బిడ్డలు లేని దంపతులకు పిల్లల్ని కని ఇచ్చే తల్లి

**Swindle** = సొమ్ములు స్వాహా చేయడం

**Swindler** = మోసకారి

**Tabs** = లాయర్లు మెడకు తగిలించుకొనే తెల్ల పట్టీ

**Talaq** = ఇస్లామ్‌లో విడాకుల పద్ధతి భర్త ఏక పక్షంగా నోటిమాటగా మూడుసార్లు వదలుకుంటున్నానని భార్యకు చెబితే చాలు - విడాకులిచ్చినట్టే

**Testate** = వీలునామా (విల్) రాయడం

**Testimony** = వాంగ్మూలం

**Tort** = పరిహారహక్కు (ఒక వ్యక్తి మరొక వ్యక్తికి చేసే అన్యాయం అయితే ఇబ్బందికి గురైన వ్యక్తి పరిహారం కోరవచ్చు)

**Toties Quoties** = అవసరమైనంత తరచుగా

**Treason** = దేశద్రోహనేరం

**Tribunal** = న్యాయవ్యవస్థకు వెలుపల పనిచేసే స్పెషలిస్టు కోర్టు ఇది ప్రత్యేక సమస్యలను పరిశీలించి తీర్పులు ఇస్తూంటుంది (ఉదా: Industrial tribunal, lands tribunal, military tribunal, rent tribunal etc )

**Ultra vires** = అనుమతించిన అధికారాలను మించి వ్యవహరించడం. ఉదా: (Ministers action was ultra vires)/ రాజ్యాంగ విరుద్ధం

**Usurp** = నీ హక్కు కాని దాన్ని అనుభవించగోరే హక్కు స్వాయత్తం చెసుకొనే హక్కు / గుంజేసుకొనే హక్కు

**Vandal** = పబ్లిక్ ఆస్తులను ధ్వంసం చేసేవాడు

**VAT** = (వాల్యూయాడెడ్‌టాక్స్) = వస్తువు విలువ పెంచినప్పుడల్లా ఆ విలువ మేరకు వ్యాపారిపై వేసే పన్ను ఒకరకంగా ఇది సింగిల్ టాక్స్, మరోరకంగా మల్టిపుల్‌టాక్స్

**Verbatim** = మక్కీకి మక్కీగా

**Veto** = పార్లమెంటులో ప్రవేశపెట్టిన బిల్లు చట్టం కాకుండా నిరోధించే నిషేధం / ఉత్తర్వు

**Visa** = పరాయిదేశంలో ప్రవేశించడానికి అనుమతించే ప్రత్యేక పత్రం దీన్ని పాస్‌పోర్టులో అమరుస్తారు ఇవి రకరకాలు మల్టిపుల్ వీసా, టూరిస్ట్ వీసా, ట్రాన్సిట్ వీసా

**Viva voce** = మాటమాత్రంగా

**White book** = సుప్రీంకోర్టు నిబంధనలు, వాటి భాష్యాలతో కూడిన పుస్తకం

**White collar crime** = తెల్లచొక్కా (బట్టనలగని)ఉద్యోగుల నేరాలు (లంచాలు, డబ్బు స్వాహా, లోపాయకారీ లావాదేవీలు వగైరా)

**White paper** = శ్వేతపత్రం (ఏదైనా బిల్లును ప్రవేశపెట్టే ముందు ఏదైనా ప్రత్యేక సమస్యపై విధాన ప్రకటన రూపంలో ప్రభుత్వం ప్రచురించే నివేదిక )

**Writ** = హైకోర్టు ఉత్తర్వును వాంఛిస్తూ పిటిషనర్ సిద్ధం చేసే లీగల్ డాక్యుమెంటు

# సాహిత్య కళా రంగాలు

(పై రెండు వాదాల విశేషాలు)

(పై రెండింటికీ మధ్యే మార్గంగా అవతరించిందే నాగార్జునుని మాధ్యమిక వాదం, లేదా శూన్యవాదం)

(పై నాలుగూ గ్రీకులు పేర్కొన్న ప్రధాన సుగుణాలు వీటికి క్రైస్తవం విశ్వాసం (faith), ప్రతీక్ష (hope), ప్రేమ (Love) అని మరి మూడు సుగుణాలు చేర్చింది వీటికి హైందవం మరో మూడు గుణాలను - అహింస, సత్యం, అక్రోధాదులు చేర్చింది )

(పై మూడింటిని తాత్త్విక పరిభాషలో "హేత్వాభాసలు" అంటారు )

(కేవలం బుద్ధి గోచరమైన విశేషాలన్నీ యదార్థాలు కావనీ, బుద్ధికి అందని వస్తువులు కూడా అనేకం ఉంటాయని వీరి సిద్ధాంతం)

(జ్ఞానమతం కోవకు దగ్గరలో ఉన్న మతం ఇది జ్ఞాన, క్రైస్తవ, బౌద్ధ, జొరాష్ట్రియన్ మత సారాంశాల్ని ఇముడ్చుకున్న వాదం ఇది. దీని కర్త పేరు మని లేదా మానికేయస్. అందుకే ఆ పేరు ఇది మనద్వైతం లాంటిది )

(తాత్త్విక సమస్యలకు మనస్తత్వ శాస్త్ర అనుశీలనం ద్వారా పరిష్కారం సాధ్యమని నమ్మే వాదం)

(భావ వాదానికి చెందిన ఈశ్వర మీమాంసలోని పారిభాషిక పదాలివి. ఈశ్వర వ్యాపారం సృష్టి కార్యానికి మాత్రమే పరిమితమని దేవవాదం చెబుతుంది. కాగా, ప్రపంచ నియంత్రణలో ఈశ్వరుడు సదా 'మునగానం తేలానాం' గా ఉండి "జీవాత్మల"తో కూడా సంబంధం కలిగి ఉంటాడని ఆస్తికవాదం చెబుతుంది.)

(మనస్సుకు, శరీరానికి ఉన్న సంబంధాన్ని వివరించే సిద్ధాంతం).

(మానవుని ఆత్మ శరీరంతోపాటు పుట్టుకతోనే తల్లిదండ్రులనుంచి సంక్రమిస్తుందని వాదించే సిద్ధాంతం క్రైస్తవ ఈశ్వర మీమాంస దీనికి ఆధారం)

**A priori** = అనుభవ పూర్వకంగా

**Abnormal** = అసాధారణమైన

**Absolute ego** = కేవలాహంకారం

**Absolute Idealist** = కేవల భావవాది

**Absolute** = కేవలం / పరమం / మౌలికం

**Abstract** = నైరూప్యమైన

**Abstract art** = నైరూప్య చిత్రకళ (ఒక రూపంగానీ, చెప్పదగిన ఒక విషయంగానీ లేకుండానే కేవలం రంగులు, రేఖలతో ప్రత్యేక కూర్పుల ద్వారానే కళానందం సాధ్యం చేసే ప్రక్రియ ఇది సాహిత్యం లేకుండానే కేవల గానం ఎలా ఆస్వాదనీయమవుతోందో, నిర్దిష్ట రూపం లేని రంగులు, రేఖలు, ప్రాదేశికమైన కల్పనలు కూడా కళానుభూతిని కల్గిస్తాయని ఈ కళావాదుల విశ్వాసం )

**Abstract conceptualization** = నైరూప్య సూత్రీకరణం

**Abstract figure** = నిరాకార చిత్రం

**Abstract painting** = నైరూప్య చిత్రకళ

**Abstract Pictures** = నైరూప్య దృశ్యాలు

**Abstract reductionism** = పృథక్కరణ వాదం

**Abstraction** = నైరూప్యం

**Abstraction** = పృథక్కరణం (విడగొట్టడం) / అమూర్తీకరణం

**Accent** = ఉచ్చారణ

**Accoustics**= శబ్ద ప్రసారం

**Acrophomy/acrology** = లిప్యాది ధ్వనిలేఖనం

**Acting ability** = నటనాకౌశలం

**Acting Image** = అభినయ ప్రతిమ (రూపం)

**Action** = క్రియ

**Activism** = క్రియావాదం

**Activity** = ప్రవృత్తి / క్రియాశీలత

**Actuality** = వాస్తవికత

**Admonitive signs** = అనుబోధక లక్షణాలు (ఇంద్రియానుభవ గోచరమైన వస్తు స్థితిని నిరూపించే లక్షణానికిది పేరు).

**Aesthete** = రసజ్ఞుడు, సౌందర్యపిపాస

**Aesthetics** = సౌందర్యమీమాంస

**Agnostic** = సంశయవాది

**Agnosticism** = సంశయవాదం

**"Airport - book"** = కాలక్షేప గ్రంధం (విజ్ఞానం కోసం కాకుండా సరదాకోసం క్షణికోల్లాసం కోసం చదివే పుస్తకాన్ని ఇటీవల ఇలా అంటున్నారు)

**Albastar** = మృదుశిల

**Alienation** = పరావర్తనం

**All-father** = సర్వపిత

**Allegory** = నీతికథ / రూపకాలంకారం

**Alliteration** = అనుప్రాస (ఉదా: లక్ష భక్ష్యములు భక్షించునొక పక్షికుక్షికి నొక భక్ష్యము లక్ష్యమా?)

**Alliteration** = అనుప్రాస

**Allophone** = సవర్ణం

**Alternative** = వైకల్పికం

**Alto** = మధ్యమ స్థాయిలో స్త్రీ కంఠం

**Alto-relief (high relief)** = అధికోల్బణ శిల్పం

**Altruism** = పరహిత వాదం

**Ambassador light** = కాంతిదూత (క్రైస్తవంలో)

**Ambiguity** = సందిగ్ధావస్థ

**Amphitheatre** = వృత్త నాటకశాల

**Analogue** = సదృశ్యరూపం

**Analogy** = సామ్యం

**Analytical** = విశ్లేషణాత్మకం

**Analytical** = విశ్లేషణాత్మకమైన

**Anatomy** = శరీరాకృతి (వైద్య పరిభాషలో దీని అర్థం - శరీర ధర్మశాస్త్రం)

**Angle of vision** = దృష్టికోణం

**Anguish** = పరివేదన

**Anima** = చైతన్యం

**Animatism** = చైతన్యారోపవాదం

**Animatism** = అసురవాదం

**Animism** = వైయుక్తిక ఆత్మవాదం / వైయక్తిక చైతన్యారోపవాదం (వైయక్తిక ఆత్మలు ఉన్నాయని నమ్మడం వైయక్తిక ఆత్మవాదం; పవిత్ర పదార్థాలన్నీ సజీవములని భావించడం అసురభావం).

**Anthesis** = విలోమ ప్రతిపాదన

**Anthropalatry** = మానవ పూజ (షింటో మతంలో [జపాన్] బతికి వున్న వ్యక్తులను, చనిపోయిన వ్యక్తులను దేవతలుగా పూజించే ఆచారం వుంది అదే ఇది)

**Anthropology** = మానవాభ్యుదయ శాస్త్రం

**Anthropomorphism** = మానవీయ గుణారోపణం (మానవేతర ప్రకృతికి - పశుపక్ష్యాదులకు - మానవ గుణాలను ఆపాదించి చెప్పడం ) ఉదా: ఫలానా వాణ్ణి త్రిలోచనుడనో, కైలాసవాసి అనీ, మేఘశ్యాముడనీ, పద్మనేత్రుడనీ, ఇలా ఆరోపించి చెప్పడం వ్యంగ్య చిత్రాలలో రాజకీయవేత్తలను, బురాక్రట్లను గాడిదలుగానూ, కుక్కలూ, నక్కలుగానూ సందర్భోచితంగా పోల్చుతూ ఆరోపిత చిత్రాలను "మార్చ్ ఆఫ్ టైమ్స్" శీర్షికన ప్రఖ్యాత కార్టూనిస్టు శంకర పిళ్ళై గీసేవాడు

**Anti-Climax** = పతనస్థాయి (శ్రీశ్రీ 'మహాప్రస్థానం' లోని 'ఆః!' కవిత చూడండి ఆభాస) / ప్రతిసాలంకారం

**Antimomy** = విరుద్ధార్థం

**Antonomasia** = నామాంతరణం

**Antonym** = వ్యతిరేకార్థం

**Anxiety** = ఉత్కంఠ

**Aphordite** = ప్రేమాధి దేవత

**Aposteriori** = అనుభవ జనితం

**Applause** = హర్షధ్వానం / ప్రేక్షకోత్సాహ ప్రకటన.

**Applied Mathematics** = అనువర్తిత గణితం

**Apstrophe** = సంబోధనలో

**Arc of Noah** = నోవా నౌక (పాప ప్రక్షాళనకోసం 'దైవం' జల ప్రళయం సృష్టించినప్పుడు నోవా రక్షణార్థం సిద్ధపరచిన నౌక)

**Arch** = తోరణం / చాపం

**Archaic** = ప్రాచీన / పురాతన

**Archetype** = దృష్టాంతం

**Archive** = పురావస్తుశాల

**Areography** = ప్రాదేశిక శాస్త్రం

**Art** = కళ / శిల్పం

**Art of dispution** = వాద విద్య

**Art - music** = కళాత్మక సంగీతం.

**Arthemetic** = అంక గణితం

**Articulation** = స్వరశుద్ధి.

**As a unity** = ఏకంగా

**As a whole** = మొత్తంగా / సర్వంగా
**Ascension** = స్వర్గారోహణం
**Ascetic** = సన్యాసి
**Asceticism** = సన్యాసం / తపోనిష్ఠ
**Assumption** = కల్పన / ఊహాగానం
**Astrol (astrology)** = జ్యోతిష శాస్త్రం
**Atheist** = నిరీశ్వరవాది, నాస్తికుడు (కేవలం వేద ప్రామాణాన్ని అంగీకరించని వాణ్ణి కూడా నాస్తికుడని అనేవారు)
**Atmospheric effect**= వాతావరణ ప్రాధాన్యం
**Atomic individualism** = వ్యక్త్యణువాదం
**Atomic theory** = పరమాణువాదం
**Atomistic empiricism** = పరమాణు రూప అనుభవవాదం (అంటే పదార్థ స్వభావ నిర్ణయం అని)
**Atonement** = పరిహారం
**Attachment** = ఆసక్తి
**Audibility** = శ్రావ్యత / వినబడటం
**Auditorium** = ప్రేక్షకాలయం
**Austerity** = తపస్సు
**Authenticated** = ప్రామాణికం
**Axial time** = అక్షీయ కాలం (క్రీ.పూ. 500లకు అటూ-ఇటూ ఉన్న వ్యవధి కాలాన్ని ఇలా అన్నారు. చక్రానికి ఇరుసు మాదిరిగా ఉన్న ఈ కాలంలో ప్రపంచంలో అనేకచోట్ల మతాచార్యులు ప్రాదుర్భవించారని ఒక నమ్మకం కనుక ఈ కాలాన్ని ఆనాటివారు అలా పిలిచారు.)
**Axiology** = యోగ్యతా శాస్త్రం (కొందరు పురుషార్థ శాస్త్రం అంటారుగాని, గ్రీకు తాత్విక శబ్దమయిన 'ఆక్సియోస్'కు అర్థం విలువైనదీ, యోగ్యమైనదని మాత్రమే )
**Axiology** = మూల్యమీమాంస (మూల్యాలు = విలువలు)
**Axioms** = స్వయం సిద్ధ సత్యాలు
**Axis** = అక్షం
**Babbit**= మధ్యతరగతి వ్యాపారి (కళలన్నా, కవితన్నా వీరికి చుక్కెదురు).
**Babel Tower** = భాషలు పుట్టిన గోపురం
**Background** = భూమిక
**Background Music** = నేపథ్య సంగీతం
**Balance** = భారతుల్యత
**Ballad Opera** = రాగ ఫణితాలకు అనుగుణంగా తీర్చిదిద్దిన గేయాలలో, వాచికంతో వర్ధిల్లిన సంగీత రూపక భావం ఇది (18వ శతాబ్దంలో)
**Ballet** = నృత్యనాటిక / నృత్యరూపకం
**Baloney** = అతిశయోక్తులతో కూడిన సంభాషణ
**Baptism** = బాప్తిస్మం (క్రైస్తవ మత స్వీకారం)
**Barbarism** = బర్బరత్వం
**Baroque style**= బరాక్శైలిః అలంకారిక వాస్తుశైలి (వాస్తు నిర్మాణంలో లతాదులు, కుడ్యస్తంభాలు, ఉన్నత స్తంభాలు వగైరాలతో నేత్రోల్లాసం కల్పించడం ఈ శైలి విశిష్టత యూరప్‌లో పునరుజ్జీవనోద్యమ కాలంలో ఈ శైలి తలెత్తింది)
**Basic proposition** = మూల ప్రతిపాదన
**Bass** = మంద్రస్థాయిలో పురుష కంఠం
**Bass-relief (low relief)** = అల్పోల్బణ శిల్పం
**Bass-relief** = శిల్ప ఫలకం
**Baton** = సంగీతనేత్రం
**Behaviourism** = ప్రవర్తనావాదం
**"Being and Nothingness"** = సత్త - అసత్త (అస్తిత్వ వాద [ఉనికివాద] చింతనను వివరించిన ఫ్రెంచి తత్వవేత్త జాపోల్ సార్త్ రచన పేరు కూడా ఇదే మన శ్రీశ్రీ ఈయన సిద్ధాంతాన్ని "జాపోల్ సార్త్ సౌండించిన ఎగ్జిస్టెన్షియాలిజం" అని అభివర్ణించాడు)
**Being** = సత్త (ఉనికి - సత్)
**Benediction** = ఆశీర్వాదం
**Bibliophile**= పుస్తకప్రియుడు
**Bilingual** = ద్విభాషి
**Biolinguistics** = భాషాజీవశాస్త్రం
**Bionomics** = జీవావరణ శాస్త్రం
**Bird's eye - view** = విహంగ దృష్టి.
**Bird's eye** = విహాయస నేత్రం
**Blank verse** = లయరహిత కవిత
**Blasphemy** = నింద / దైవదూషణ
**Bliss** = ఆనందం

Box office = ఆర్థిక విజయం (సినిమా విషయంలో)
Bracketing = కుండలీకరణం
Bronze Age = కాంస్యయుగం (క్రీ పూ 2000-500 సంుఖ)
Bronze image = కాంస్య ప్రతిమ / విగ్రహం
Brouchure = కరపత్రం
Cacophony = (ఉపన్యాసాలలో) అపస్వరం
Calculus = కలన గణితం
Calligrapher = లిపిశిల్పి
Calling = ప్రబోధం
Cantata = గాత్ర సంగీత రచన.
Caricature = పరిహాస చిత్రం
Cartoon = వ్యంగ్య చిత్రం
Carving = మలచడం
Caste annihilation = కుల నిర్మూలన
Caste struggle = వర్ణ సంఘర్షణ
Casting = పాత్రల ఎంపిక
Categorical = నిరపేక్షము
Catharsis = శోధన
Causality = కారణీయత
Causative forms = కారణతారూపాలు
Cause and effect = కార్య కారణ ఫలితం
Centering = కొయ్య చట్రం
Chance = యాదృచ్ఛికం
Change = పరివర్తన
Chaos = అవ్యవస్థ
Character = పాత్ర
Character acting = పాత్రాభినయం
Characterisation = పాత్ర చిత్రణ
Chord = స్వరసింహతి (స్వరాలు ఒకేసారి మ్రోగిస్తే వినవచ్చే ధ్వని విశేషాల 'కార్డ్')
Choreography = నాట్యకళా దర్శకత్వం
Chorus = నట బృందం / నర్తన బృందం / గాయక బృందం / బృందగానం
Chorus dancing = నృత్యపల్లవి
Church Choir = భక్త బృందగానం.
Cine auditorium = చలన చిత్ర మందిరం
Cinematic presentation = ప్రదర్శనా విధానం
Cinematic Acting = చలన చిత్రయుక్త నటనారీతి
Circumcision = సున్తీ / సున్నతి / శస్త్రకర్తనం
Clarification = విశదీకరణ
Class struggle = వర్గ సంఘర్షణ
Classic = చలన చిత్రం / లాక్షణిక నాటకం
Classical Music = శాస్త్రీయ సంగీతం
Classical = సంప్రదాయం
Classicism = సంప్రదాయకతావాదం సాంప్రదాయక ఉద్యమం
Clergy = పురోహిత వర్గం
Climax = పరాకాష్ఠ / పతాకస్థాయి
Closed = సంకుచితం
Cognition = ప్రతీతి (ఖ్యాతి), ఎరుక
Coherence = సంగతం
Combinations = సమాహారాలు
Comedian = విదూషకుడు, హాస్యపాత్ర
Comedy = హాస్యం / సుఖాంతం (నాటకం లేదా సినిమా)
Commercial art = వాణిజ్య కళ
Commitment = నిబద్ధత
Common notions = సామాన్య భావాలు
Common sense = ఇంగిత జ్ఞానం
Communication = సంసర్గం
Communion = భావైక్యం
Compare = పోలిక
Composition = సంవిధానం
Concept = భావన / ప్రత్యయం
Concepts = మూల ప్రత్యయాలు / మౌలికమైన భావనలు
Conceptual confusion = సిద్ధాంతపరమైన తికమక
Conceptualism = ప్రత్యయవాద
Concerts = బృంద వాద్య సమ్మేళనం
Conclusion = ముగింపు / ఫలప్రాప్తి
Concrete = నిర్దిష్టమైన

**Concrete reality** = మూర్త వాస్తవం / విస్పష్టతత్వం
**Conductor** = ప్రయోక్త
**Conflict** = సంఘర్షణ
**Confusion** = మోహం
**Connaturality** = స్వభావ సామ్యం
**Connection** = సంయోజనం (సంబంధం)
**Conquistadores** = విజేతలు
**Conscious state** = వ్యక్తస్థితి
**Consciousness** = చేతన
**Constitutive perfection** = నిర్మాణ సంపూర్ణ (వస్తు సంబంధం)
**Construction** = నిర్మితి
**Constructionism** = నిర్మాణవాదం (ఇది రస్సెల్ సూత్రీకరణ భౌతిక, మనస్తత్వ శాస్త్రాల సమర్థన కోసం ఈ వాదం వచ్చింది)
**Contemplating act** = మానవ క్రియ
**Content** = వస్తువు, సారం, విషయం
**Contingent** = యాదృచ్ఛికం
**Continuity** = అవిచ్ఛిన్నత
**Continuous reality** = అవిచ్ఛిన్నమైన వ్యావహారిక జగత్తు
**Contradictions** = వైరుధ్యాలు
**Contrary** = విరుద్ధం
**Contrast** = తారతమ్యత / వ్యత్యస్తరమ్యత
**Coordination** = సమన్వయం
**Copper Age** = తామ్రయుగం
**Copper-engraving** = తామ్రరేఖా శిల్పం
**Cord vocal** = నాదతంత్రి
**Cosmic Consciousness** = విశ్వ చైతన్యం
**Cosmic Philosohphy** = విశ్వదర్శనం
**Cosmological argument** = కారణతాయుక్తి / విశ్వప్రాదుర్భావ యుక్తి.
**Cosmopolitan** = సార్వభౌమికం
**Cosmos** = విశ్వం
**Costume / make-up** = వేషధారణ / ఆహార్యం
**Counter revolution** = ప్రతిఘాత విప్లవం
**Counterpoint**- ప్రతిస్వరత
**Covenent** = (భావవాద తత్వశాస్త్ర పరిభాషలో) "భగవదాజ్ఞాపత్రం" ఇస్లామిక్ దర్శన శాస్త్రంలో దీనిని "అల్-మీధాక్" అంటారు
**Crafts men** = వృత్తి కళాకారులు
**Crayons** = రంగు కణికలు
**Creation** = సృష్టి / సృజన
**Creative art** = సృజనాత్మక కళ
**Creative Artist** = సృజనాత్మక కళాకారుడు
**Creative faculty** = సృజన శక్తి
**Creativity** = సృజనాత్మకత
**Critique of pure reason** = శుద్ధ తర్క విమర్శ
**Crucifixion** = శిలువ వేయడం
**Crusades** = మతయుద్ధాలు (మతం పిచ్చిలో వున్న వారికి అవే 'పవిత్ర యుద్ధాలు')
**Cubism** = ఘనాకృత వాదం / స్థూలతావాదం (రూపాలను ఘనాలుగా చిత్రించే ఈ ఆధునిక చిత్రకళకు పికాసో ఆద్యుడు)
**Curator** = పురావస్తు సంరక్షకుడు
**Cycle** = ఆవృత్తి
**Cynicism** = వక్ర దృష్టి / వక్ర దర్శనం
**Deciduous Trees** = ఆకులు రాలే చెట్లు
**Decision** = నిశ్చయం
**Decline** = క్షయం
**Decree of toleration** = సహన శాసనం (క్రీ శ 313లో కాన్‌స్టాంటిన్ చక్రవర్తి ప్రకటించిన ఈ డిక్రీ క్రైస్తవంలో శాంతికి తోడ్పడింది)
**Deduction** = నిగమనాత్మకం (ఇది బుద్ధివాదుల తర్కవాదం)
**Deductive inference** = నిగమనానుమానం (ఉపకల్పనలో 'గ' ఇమిడి ఉండి 'క' సత్యమైతే 'గ' సత్యమవుతుందన్నవాదన నిగమన నియమం)
**Definitise** = తిరుగులేనిది / నిష్కర్షగా ఉన్నది (ఉదా: తాపీ ధర్మారావు రాసిన "పెళ్ళి - దాని పుట్టు పూర్వోత్తరాలు" అన్న పుస్తకం ఆ సమస్యపైన "తిరుగులేని పుస్తకం. దానికదే సాటి".)
**Delight** = ఆహ్లాదం
**Design** = అల్లిక

**Design** = రూపకల్పన
**Detachment** = విరక్తి
**Determinism** = నియతివాదం (ప్రతి సంఘటన ఒక నియమాన్ని అనుసరించి జరుగుతుందనే సిద్ధాంతం)
**Determinism** = నిశ్చయతావాదం
**Diachronic** = విస్తృకాలికం
**Diachronic linguistics** = చారిత్రిక భాషా శాస్త్రం
**Diacritics** = విశేష చిహ్నాలు
**Dialect** = మాండలికం: స్థానిక ప్రజల ఉచ్చారణబట్టి, ఇష్టం వడుపును బట్టి వాడే పదాలు ఆంగ్ల మాండలికాల్లో కూడా కద్దు: "Din't you yoosta live at Toidy Toid Street and sekun Amya? Across from damoon pilchess" విశాఖ మాండలికం "మీయాట్లన్నీ ఇయాళ్ళతో కట్టు! నన్ను పాతరేసి కప్పెడితే అమ్మ తల్లిలా లెగిసొచ్చి మీ కళ్ళు బగ్గుమనేలా ఎలుగెలుగుతాను నా నియాల్టికాణ్నించి మీ పొల్టి అమ్మోర్ని అసిరమ్మని" (రా వి శాస్త్రి)
**Dialectic** = గతితార్కం / ద్వంద్వ తర్కం / వాద ప్రతివాదం
**Dialectical materialism** = గతితార్కిక భౌతిక వాదం
**Dialectics** = గతితర్కం
**Dialectology** = మాండలిక శాస్త్రం
**Dialogues** = సంభాషణలు
**Dichotomy** = ద్వైధీభావం
**Diction** = వాక్శైలి / నిర్దిష్ట / ప్రత్యేక పదసంపద
**Didactic Art** = నైతిక కళ
**Diesm** = దేవవాదం
**Dimension** = ఆయతనం
**Diorama** = ద్వితల దృశ్య చిత్రణ (ఉపరితలంపై రంగులతో అరణ్యం, మేఘాలు, చెరువుల దృశ్యాలు - వాటికి ముందు భాగాన ఎండిన చెట్లు, పక్షులు, మృగాల బొమ్మలు సహజ భంగిమలో తయారుచేసి అమర్చడాన్ని ఇలా అంటారు)
**Direct awareness** = సాక్షాత్ (సంవేదనం) చైతన్యం
**Direction** = దర్శకత్వం
**Discontinuity** = విచ్ఛిన్నత
**Discordant** = అసంగతం / (సంగీతంలో వినసొంపుగాని కేకలు వినడ కష్టం దీనినే 'అప్రియ శ్రుతి' అంటారు)
**Disinterestedness** = నిర్లిప్తత
**Dissection** = వ్యవచ్ఛేదనం
**Distemper** = వజ్ర లేపనం
**Distortion** = వికృతీకరణ
**Distortion** = వైరూప్యం / వక్రీకరణ
**Distortion** = వక్రీకరణ
**Divine darkness** = దివ్యాంధ కారం
**Divine Supermen** = దివ్యులైన మానవాతీతులు
**Divine life** = దివ్య జీవనం (అరవిందుడి రచన "Life divine")
**Divine revelation** = దివ్యావిష్కరణం
**Divinity** = దివ్యత్వం
**Doctrine of annihilation** = ఛేదవాదం
**Doctrine of eternality** = శాశ్వత వాదం
**Doctrine** = సిద్ధాంతం
**Doggerd** = అల్పకావ్యం (చతుర్థత మినహా ఇందులో విశేషం ఏమీ ఉండదు)
**Dogmatism** = పిడివాదం (పక్షపాతంతో కూడిన అభినివేశం)
**Doubting Thomos** = అనుమాన పక్షి
**Dragon** = (చైనీస్) = మహానాగు
**Dramatic Action** = అభినయ ప్రక్రియ
**Dramatic forms** = నాటకీయ రూపాలు
**Dramatic values** = నాటకీయ విలువలు
**Dualism** = ద్వైతవాదం
**Dubbing** = భాషాంతరీకరణ / అనుకరణ
**Dynamic** = గతి శీలం
**Dynamism** = చైతన్యభావం
**Dysphemism** = ఉత్ప్రేక్షించి చెప్పడం
**Easter** = జీసస్ సమాధినుండి లేచిన రోజు
**Eccentricity** = మానసిక / ప్రవర్తనా వైపరీత్యం

## ఉచ్చారణ తప్పొప్పులు

| ఇంగ్లీషు | తప్పు | ఒప్పు |
|---|---|---|
| **Arantxa Sanchez** | అరాంట్జా సాంచెజ్ | అరాంచా సాంచెజ్ |
| **Asiad** | ఏషియాడ్ | ఆసియాడ్ |
| **Azharuddin** | అజహారుద్దీన్ / అజారుద్దీన్ | అజరుద్దీన్ |
| **Badminton** | షటిల్ బాడ్మింటన్ | బాడ్మింటన్ |
| **Ball Badminton** | - | బాల్ బాడ్మింటన్ |
| **Batsmen** | బ్యాట్స్‌మెన్లు | బ్యాట్స్‌మెన్ |
| **Batswoman** | మహిళాబ్యాట్స్‌మన్ | బ్యాట్స్ వుమెన్ |
| **Bjorn Borg** | జాన్ బొర్గ్ | బియార్న్ బోర్గ్ |
| **Bowled well** | బౌలర్ బాగా ఆడాడు | బాగా బౌలింగ్ చేశాడు |
| **Bowling** | బౌలింగ్ | బోలింగ్ |
| **Carl Lewis** | కార్ల్ లెవిస్ | కార్ల్ లూయిస్ |
| **Carrom** | కేరమ్స్ | కేరమ్ |
| **Drugs** (Performance enhancing drugs) | మాదక ద్రవ్యాలు | ప్రేరక ద్రవ్యాలు |
| **England** | ఇంగ్లండ్ | ఇంగ్లాండ్ |
| **FIDE (CHESS)** | ఫైడ్ | 'ఫిడె' |
| **First innings** | ఫస్ట్ ఇన్నింగ్ | ఫస్ట్ ఇన్నింగ్స్ |
| **Gloves** | గ్లౌజులు | గ్లోవ్స్ |
| **Goals** | గోళ్ళు | గోల్స్ |
| **Graham Thorpe** | గ్రహమ్ థార్పే / థోర్పే | గ్రహమ్ థోర్ప్ |
| **Grand Prix** | గ్రాండ్ ప్రిక్స్ | గ్రాంప్రి |
| **Greco-Roman** | గ్రీకో రోమన్ | గ్రెకోరోమన్ |
| **Gurusinha** | గురుసింఘె | గురుసింహ |
| **Hansie Cronje** | హాన్సీ క్రోన్జే / క్రానే | హాన్సీ క్రోన్యే |
| **Ivanisevic** | ఇవాని సెవిక్ | ఇవానిసెవిచ్ |
| **Jana Novotna** | జానా నవోత్న | యానా నవోత్న |
| **Katrin Krabbe** | కాత్రిన్ క్రాబే | కాత్రిన్ క్రాబ్ |
| **Kho Kho** | కోకో | ఖోఖో |
| **Leander Paes** | లీండర్ పేస్ | లియాండర్ పేస్ |
| **Martin Crowe** | మార్టిన్ క్రో | మార్టిన్ క్రోవ్ |
| **Medium pacer** | ఫాస్ట్ బౌలర్ | మీడియం పేసర్ |
| **Munich** | మ్యూనిచ్ | మ్యూనిక్ |
| **Olympics** | ఒలంపిక్స్ | ఒలంఫిక్స్ |
| **Out** | అవుట్ | ఔట్ |
| **Pitch** | మైదానం | పిచ్ |

| ఇంగ్లీషు | తప్పు | ఒప్పు |
|---|---|---|
| Power lifting | వెయిట్ లిఫ్టింగ్ | పవర్ లిఫ్టింగ్ |
| Real Madrid | రీయిల్ మాడ్రిడ్ | రియాల్ మాడ్రిడ్ |
| Sachin Tendulkar | సచిన్ టెండుల్కార్ | సచిన్ తెందుల్కర్ |
| Sarajevo | సారాజేవ | సారాయీవో |
| Seoul | సియోల్ | సోల్ |
| Sergie Bubka | సెర్జి బుబ్కా | సెర్గి బుబ్కా |
| Shuttle cock | షటిల్ | షటిల్‌కాక్ |
| Skiing | స్కైయింగ్ | స్కీయింగ్ |
| Soccer | సాసర్ | సోకర్ |
| Sponsor | స్పాన్సంర్ | స్పాన్సర్ |
| Steve Waugh | స్టీవ్ వాగ్ | స్టీవ్ వా |
| Stumps | వికెట్లు | స్టంప్స్ / స్టంపు |
| Tennis racquet | టెన్నిస్ బ్యాట్ | టెన్నిస్ రాకెట్ / ర్యాకెట్ |
| Tilakaratne | తిలకరత్నె | తిలకరత్న |
| Tournament | టౌర్నమెంట్ | టోర్నమెంట్ |
| Umpire | ఎంపైర్ | అంపైర్ |
| Yannick Noah | [illegible] | యానిక్ నోవా |

## Cricket field positions



# మన పదసంపద

అంకె పంచాళం = రెంత వృద్ధించడం
అంకమ్మ శివాలు = వెర్రి మొర్రి ఏడుపులు
'అం' అంటే 'ఘం' అనలేడు = అక్షరం ముక్క రానివాడు
అంగరంగ వైభవం = దేవుడి ఊరేగింపులో అమర్చే హంగులు
అంగుష్ఠమాత్రుడు = మరుగుజ్జువాడు / పొట్టివాడు
**అంటీ / ముట్టక** = సంబంధం లేనట్టు వ్యవహరించడం
**అంటూ సొంటూ** = సంబంధం ఉన్నవాళ్ళు / మిగిలిపోయిన మెతుకులు
**అందీ పొందని** = అతకని
**అందె వేసిన చేయి** = సమర్థుడు (పనిలో సామర్థ్యం చూపినవారి చేతికి 'అందె' వేసేవాళ్ళు )
**అంపకాలు** = ఆడపిల్లని అత్తవారింటికి పంపేటప్పుడు పెట్టే అప్పగింతలు అప్పగింతలప్పుడు తల్లిదండ్రులు, బంధుమిత్రులు కళ్ళనీళ్ళు పెట్టుకోవడం సహజం
**అంబ పలకలేదు** = డబ్బు దొరకనప్పుడు / పనికానప్పుడు ఇలా అంటారు
**అక్కన్న మాదన్నలు** = కలిసి తిరిగేవాళ్ళు / విడవకుండా ఉండే వాళ్ళు
**అక్కుపక్షి** = పనికిమాలినవాడు/కొరగానివాడు (తిట్టులో)
**అక్షర లక్షలు**= రాచరికం రోజుల్లో నచ్చిన కవిత్వానికి అక్షరానికొక లక్ష చొప్పున ఇచ్చేవాడు రాజు అది ఆధారంగా వచ్చిన పలుకుబడి
**అక్షింతలు వేయు** = తిట్లు తిట్టడం
**అగస్త్యభ్రాత** = అనామకుడు
**అగ్గి పిండం** = సాహసి / గుణవంతుడు
**అగ్నిహోత్రుడయ్యాడు** = మండిపడిపోయాడు
**అగ్రతాంబూలం** = ప్రథమస్థానం / వివాహాది కార్యాల్లో పెద్దవారికి ముందు ఇచ్చే తాంబూలం
**అఘోరించడం** = 'ఏడిచావు' అని నిందాపూర్వకంగా వాడకం
**అచ్చికబుచ్చికలు** = ముచ్చట్లు / కల్లబొల్లి కబుర్లు / ఇచ్చకపు మాటలు.
**అచ్చువేసిన ఆబోతు** = అడ్డూ ఆపూ లేకుండా తిరిగేవాడు / స్వేచ్ఛా సంచారి
**అజాగళస్తనాలు** = మెక పడకు వెలాడె వ్యర్థాంగాలు / పనికిమాలినవి / నిరుపయోగమైనవి
**అట్టహాసం పట్టపగలు** = 'వాడి దర్జా మండిపోను' అని ఎద్దేవగా అనడానికి
**అడకత్తెరలో పోక** = చిక్కుల్లో ఇరుక్కుపోవడం
**అడపాదడపా**= అప్పుడప్పుడు
**అడవాబతుకు** = నిరర్థక జన్మ
**అడవిగాచిన వెన్నెల** = వ్యర్థం
**అడుగుజాడ** = పాదముద్ర / గుర్తు ("అడుగుజాడ గురజాడది - అది భావికి బాట")
**అడుగూడడం** = ఆధారం పోవడం
**అడుగూ బడుగూ** = వంట పాత్రలో మిగిలిపోయిన
**అడ్డకాలు వేయు / మోకాలడ్డు వేయు / అడ్డు పుల్ల వేయు** = అడ్డుకోవడం / విఘ్నం కల్గించడం
**అణోరణీయాన్ మహతో మహీయాన్** = చిన్నల్లో చిన్న, పెద్దల్లో పెద్ద (ఇది అణు పదార్థానికి కూడా వర్తిస్తుంది)
**అతంత్రపు మనిషి / అద్దంత్రపు మనిషి** = విశ్వసించడానికి వీల్లేని వ్యక్తి / అయోమయంగాడు.
**అతిరథులూ, మహారథులూ** = ఎద్దేవగా 'వాళ్ళు చాలా గొప్పవాళ్ళులే' అనడం ఇది యుద్ధ పరిభాష.
**అతి వినయం ధూర్తలక్షణం**= 'అది వినయం కాదు, అతి వినయం' అని హెచ్చరించడం. నమ్మరాదని అర్థం
**అతి సర్వత్ర వర్జయేత్** = ఎందులోనూ 'అతి' పనికిరాదు
**అతుకుల బొంత** = వాడి మాటలన్నీ 'అతుకుల బొంత' అని, వాడి సంసారం ఒక అతుకుల బొంత అనీ వ్యంగార్థంలో
**అత్తారబత్తంగా** = అర్చిపేర్చి / ముద్దుపులాగా
**అదుపాజ్ఞ లేక / అద్దూ పొద్దూ లేక** = కట్టుబాటు లేక
**అదురూ బెదురూ లేక** = జంకూ కొంకూ లేక
**అదే పదివేలు** = అమాత్రం చాలు / అదే గొప్ప
**అద్వైతం**=చాదస్తం "వాడిదంతా ఒట్టి అద్వైతంలే"
**అనాఘ్రాత పుష్పం** = వాసన చూడని పూవు /

అనుభవించని పుష్పం
**అనుమానం పెనుభూతం** = అనుమానం చెడ్డది
**అనువుగానిచోట అధికులమనరాదు** = అనువుకానిచోట మన గొప్పలు చెప్పుకోరాదు
**అన్నంలేదు సున్నంలేదు** = (నిరుపేద) ఏమీ లేదనడం
**'అన్నమో రామచంద్రాయను'** = ఆకలితో అల్లాడడం
**అన్నెం పున్నెం తెలియని** = అమాయికమయిన
**అన్యథాశరణం నాస్తి** = గత్యంతరం లేదనడం
**అపర బృహస్పతి** = చాలా తెలివితేటలున్నవాడు
**అపాత్రదానం** = అర్హత లేనివాడికి దానం ఇవ్వడం
**అప్పీలులే** = తిరుగులేదు
**అప్పుచేసి పప్పుకూడు** = అప్పుచేసి అయినా సరే సుఖం అనుభవించడం
**అభయ హస్తం** = భయపడకని ధైర్యం చెప్పడం
**అభాండం వేయు** = అపవాదు వేయు / తీవ్రారోపణ చేయు
**అభ్యుదయ పరంపరాభివృద్ధిగా** = శుభాలు కలుగుగాక
**అమాంతంగా** = ఉన్నట్టుండి.
**అమాంబాపతు** = నానారకాలు
**అమృత హస్తం** = చేయివాసి ('వాడి చేతివాసి మంచిది')
**అమ్మనుపట్టి వసంతానికి దిగడం** = వావివరసలు లేకుండా సరసాలకు దిగడం.
**అయః పిండం** = కొరకరాని కొయ్య / కొరుకుడు పడనిది
**అయిదు వేళ్ళూ నోట్లోకి వెళ్ళాలి కదా** = తినడానికి కాస్తైనా ఉండాలి కదా
**అయిరేని కుండలు / అలివేణి కుండలు / అరివేణి కుండలు** = పెళ్ళిళ్లలో మేళతాళాలతో వెళ్ళి కుమ్మరియింటినుండి తెచ్చే కుండలు వీటిపైన రంగులతో చిత్రించడం రివాజు.
**అయ్యవారిని చేయబోతే కోతి అయింది** = పని వికటించిందని చెప్పటం
**అరకొరగా** = అసంపూర్ణంగా.
**అరచేతి మాణిక్యం** = అందుబాటులో ఉన్న అమూల్య వస్తువు.
**అరచేతి వైకుంఠం** = అందుబాటులోనిదే అని చెప్పడం (తాళ్ళపాకవారు: "శ్రీవైకుంఠపు దాపులమయి యరచేతిది మోక్షము మాకిదివో )
**అరచేతిలో స్వర్గం చూపు** = మోసం చేయడం / మాటలతో కాలక్షేపం చెయడం
**అరటి పండు ఒలిచి చేతిలో పెట్టినట్టు** = సులభంగా చెప్పడం
**అరణ్య రోదనం** = వృథా ప్రయాస / వ్యర్థం
**అరమోడ్పుకనులు** = అర్ధ నిమీలిత నేత్రాలు
**అరికాలి మంట నెత్తికెక్కు** = అతి కోపం రావడం
**అరికాలు తడికాకుండా** = శ్రమ పడకుండా
**అరిషడ్వర్గాలు** = ఆరు ప్రలోభాలు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు
**అలకపాన్పు** = అత్తమామల్ని ఆరడిపెట్టి, తనకు అవి కావాలి, ఇవి కావాలని కోరడం, ఇవ్వకపోతే అలగడం (పెళ్ళిళ్ళలో ఇదో తంతు) ఇప్పుడీ తంతు లేదుగాని, టి వి లు, స్కూటర్లు, మారుతీలు కావాలని అలిగే వారున్నారు.
**అలసిసొలసి** = శ్రమపడి
**అలికి ముగ్గు పెట్టినట్లు** = చక్కగా తీర్చిదిద్దినట్టు
**అలోలక్ష్మణాయను** = బాధలో వేడుకోవడం / మొత్తుకోవడం
**అలోపాలోయను** = కుయ్యోమొర్రో అనడం
**అల్లారుముద్దుగా** = గారాబంగా
**అల్లిబిల్లిగా అల్లుకోడం** = దట్టంగా అల్లుకుపోవడం
**అల్లునేరేళ్ళు** = పిల్లల ఆటలు.
**అల్లోనేరేళ్ళు** = వెన్నెల్లో ఆడే ఆట
**అవతల పుల్ల ఇవతల పెట్టడు** = వొళ్లంగదు / ఏ పనీ చేయడు / సోమరి
**అవాకులు చవాకులు** = పనికిమాలిన మాటలు.
**అవినాభావ సంబంధం** = విడగొట్టలేని బంధం
**అసమర్థ దుర్జనత్వం** = చెడ్డవాడేగాని చెడు చేయగల శక్తి లేనివాడన్న అర్థంలో వాడకం.
**అశ్రుతర్పణం** = నాయకుడు పోయినప్పుడు పెట్టుకొనే కన్నీళ్లు - జలాంజలి
**అష్టాదశ పురాణాలు** = 18 పురాణాలు (మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మవైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ, వారాహ,

విష్ణు నారద, పద్మ, లింగ గరుడ, కూర్మ, స్కాంద పురాణాలు)
**అష్టాదశ వర్ణనలు** = 18 వర్ణనలు (నగరం, సముద్రం, ఋతువు చంద్రోదయం, సూర్యోదయం, ఉద్యానం, జలక్రీడ, మధుపానం, రతోత్సవం విపులంభం, వివాహం, పుత్రోత్పత్తి, మంత్రం, ద్యూతం, ప్రయాణం, నాయకాభ్యుదయం, శైలం, యుద్ధం - వీటికి చెందిన వర్ణనలు )
**అష్టాదశ విద్యలు** = 18 విద్యలు (నాలుగు వేదాలు, ఆరు వేదాంగాలు, న్యాయ శాస్త్రం, వివాహఖండ పురాణం, ధర్మశాస్త్రం, ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వం, అర్థశాస్త్రం కలిపి పద్దెనిమిది 4 వేదాలు = ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం 6 వేదాంగాలు = శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్రం, జ్యోతిషం, కల్పం )
**అష్టావక్రుడు** = వక్రబుద్ధి కలవాడు
**అసిధారావ్రతం** = కత్తిమీద సాము / అతి కష్టం
**అసూర్యంపశ్య** = సుకుమారి / ఎండపొడ ఎరుగనిది
**అస్త్రసన్యాసం చేయు** = చేసే పని కాస్తా మానివేయడం
**అస్తుబిస్తుగా** = చాలీ చాలకుండా

**ఆకతాయి** = శుంఠ.
**ఆకల్లాడ్డంలేదు** = గాలి ఏమాత్రం లేదు ["ఆకల్లాడదదేమొ? నేడు పవనుండాకాశ వాపీ తటాశోకానేక వనాళి గ్రుమ్మరుచు నచ్చే దాగెనో"] నారన-సూరన
**ఆకాశపంచాంగం** = ఉత్తుత్తిది.
**ఆకాశ పురాణం** = వట్టి ఊకదంపుడు
**ఆకాశరామన్న** = ఊరూ పేరూ లేకుండా ఉత్తరాలు అర్జీలు రాసేవాడు
**ఆకాశానికి ఎత్తు** = పొగడడం.
**ఆకాశానికి నిచ్చెనవేయు** = అసాధ్యమైన పని
**ఆకు కందకుండా పోతకు పొందకుండా** = ఏదీ తేల్చి చెప్పడం లేదనే అర్థంలో ప్రయోగం
**ఆకూవక్కా** = తాంబూలం.
**ఆచంద్ర తారకం** = ఎల్లప్పుడూ / కలకాలమూ.
**ఆచంద్రతారార్కం** = సూర్యచంద్రాదులున్నంత కాలం.
**ఆటకట్టు** = పని ముగింపు (' చూడండి, క్షణంలో వాడి ఆట కట్టిస్తా" చదరంగంలో అయితే షహ్ చెప్పగానే ఆటకట్టు)
**ఆటవిడుపు** = సెలవు
**ఆటపట్టించు** = ఏడిపించు
**ఆటపట్టు** = స్థానం
**ఆటలో అరటిపండు** = వట్టిది / ఊహమాత్రమైనది
**ఆటాడించడం** = వేధించడం
**ఆడదిక్కు** = స్త్రీ దక్షత
**ఆడబిడ్డ లాంఛనాలు** = (పెళ్ళిలో) వరుని అక్కచెల్లెళ్ళకు ఇచ్చే కానుకలు
**ఆడబోవు తీర్థం ఎదురవడం** = అనుకున్న పని కాస్తా ఎదురవడం / శ్రమ పడకుండానే కోర్కె తీరడం
**ఆడిందాట, పాడింది పాటగా** = అడ్డుకొనే వాళ్ళెవరూ లేరనడం
**ఆడిపోసుకోవడం** = వచ్చిన మనిషి వెళ్ళిపోయిన తరువాత ఆ వెనకనే అతణ్ణి గురించి తిట్టుకోడం
**ఆదరాబాదరా** = త్వరత్వరగా
**ఆనవాయితీ** = మామూలు.
**ఆనవాలు** = గుర్తు / చిహ్నం
**ఆనుపానులు తెలుసుకోడం** = పుట్టు పూర్వాలు తెలుసుకోడం
**ఆనోటా ఆనోటా** = కర్ణాకర్ణిగా
**ఆపసోపాలుపడు** = అస్సురుస్సురను / అలసిపోవడం.
**ఆపాతమధురం** = వినగానే బాగుండడం
**ఆపోశనం పట్టు** = నీరు లోపలికి తీసుకోడం.
**ఆయకట్టు** = సాగుకు అనువైన భూమి
**ఆరంభ శూరత్వం** = ప్రారంభంలో మాత్రమే కనపడే పట్టుదల
**ఆరగింపులు** = నైవేద్యాలు
**ఆరడిపెట్టు** = అల్లరిపెట్టు
**ఆరు నూరైనా నూరు ఆరయినా / ఆరు మూడైనా మూడు ఆరైనా** = ఏది ఏమైనా
**ఆరున్నొకటి** = అంటే "ఏడు" అని కాని ఏడు అనడం మంగళ ప్రదం కాదు కాబట్టి వాడుకలో 'ఆరున్నొకటి' అని అంటారు.
**ఆరున్నొక్క రాగం తీయు** = ఏడుపు.

**ఆరుబత్తుల కంపెనీ** = దివాళా కంపెనీ
**ఆర్చేవారా తీర్చేవారా** = ఎవరూ దిక్కు లేరని చెప్పడం
**ఆలూచూలూ లేదు** = భార్యాపిల్లలు లేరు
**ఆవగింజలో అరభాగమైనా** = ఏ కొంచెం కూడా
**అవ్వురుమను** = వాపోవు
బావురుమను = ఏడవడం
**ఆవులిస్తే పేగులు లెక్కపెట్టగల** = నిశితబుద్ధిగల
**ఆషాఢభూతి** = వంచకుడు / పైకి అమాయకంగా కనపడుతూ ద్రోహం చేసేబాపతు
**ఆషామాషీ** = కులాసా కబుర్లు
**ఆసేతుహిమాచలం (ఆసేతు శీతనగం)** = యావద్భారతంలోనూ

**ఇంగువ కట్టిన గుడ్డ** = ఆస్తిలేకపోవచ్చు, కాని లోగడ బాగా బతికిన వాళ్ళలో ఔదార్యం, ఉదాత్త సంస్కారం ఉంటుందన్న అర్థంలో వాడకం ఇంగువ లేకపోయినా గుడ్డకు పట్టిన వాసన తొలగదని అర్థం.
**ఇంటా వంటాలేదు** = ఆ పాడు పనులు మా ఇంటా వంటా లేవనడం / అలాంటి అలవాట్లు / దుర్గుణాలు లేవనడం
**ఇంటిపేరు కస్తూరి వారు** = కాని ఇల్లంతా గబ్బిలాల కంపు అన్న నిరసనార్థంలో వాడకం
**ఇంద్రచాపం** = ఇంద్ర ధనస్సు
**ఇంద్రభోగం** = మహా వైభవం
**ఇంద్రుడు చంద్రుడు దేవేంద్రుడు అను** = పొగడ్త
**ఇకఇకలు పకపకలు** = నవ్వుతూ, తుళ్ళుతూ ఉండడం (వ్యంగ్యార్థంలో వాడకం)
**ఇచ్చకాల మారి** = ముఖ స్తుతి చేసేవాడు
**ఇదమిత్థంగా** = నిర్ధారణగా / స్పష్టంగా
**ఇదిగో అంటే ఇన్నాళ్ళండ్లు** = ఇదిగో చేసేస్తున్నా అంటూనే కాలం గడిపితే ఆ సందర్భంగా వాడకం
**ఇనుప కచ్చడాలు** = ఇనుప గోచీలు (నిజానికివి లేవు ఎంత గొప్ప ముని అయినా లైంగిక వ్యవహారానికి వచ్చేసరికి లొంగిపోతారన్న వ్యంగ్యార్థంలో వాడకం)
**ఇనుప గుగ్గిళ్ళు** = (ఇవీ లేవు) కొరుకుడు పడనివి అని చెప్పడానికి ఎద్దేవాగా అనడం
**ఇనుప తెర** = దాటలేని ఆటంకం

**ఇప్పటి ముప్పటి (ఇమ్మడి ముమ్మడి)** = ఎక్కువెక్కువగా / రెండింతలు మూడింతలుగా
**ఇలలో కలలో లేదు** = "అసంభవం" అన్న అర్థంలో
**ఇల్లరికం** = అల్లుడు అత్తవారింట్లోనే ఉండిపోవడం (ఇల్లరికంలో ఉన్న మజా అనుభవించినవారికే తెలుస్తుంది)
**ఇల్లు బావురుమను** = చుట్టాలు, పక్కాలూ వచ్చి వెళ్ళిన తర్వాత ఇల్లు శూన్యంగా తోచడం
**ఇష్టాగోష్ఠి** = అవీ ఇవీ మాటలు / సరదా గోష్ఠి / అవీ ఇవీ ముచ్చటలాడుకోడం
**ఇసుక చల్లినా రాలనంత** = దట్టంగా ఉండడం / జనం అసంఖ్యాకంగా రావడం
**ఇసుక తక్కెడ = పేడతక్కెడ** = దొందు దొందె అనడం / ఇద్దరూ మోసగాళ్ళే అనడం

**ఈకకు ఈక తోకకు తోక** = దేనికదిగా
**ఈగవాలనీయకుండా** = మాటపడనివ్వకుండా / నొప్పి తగలనీయకుండా
**ఈడిగలబడు** = వెనక్కి కూలబడు
**ఈదురోమను / ఈసురోమను** = ఎందుకు పుట్టామురా బాబూ అనుకోడం / బలహీనంగా ఉండడం "ఈసురోమని మనుషులుంటే దేశమే గతి బాగుపడునోయ్" (గురజాడ)
**ఈనగాచి నక్కలపాలు చేసినట్టు** = కష్టించి, కష్టించి అనుభవించాల్సి వచ్చే సరికి ఫలితం మరొకరికి దక్కడం / పంట కోతకొచ్చే చేతికి అందకుండా పోవడం

**ఉంగరాల చేతి మొట్టికాయ** = మామూలు వాడంటే కన్నుమనేవాడు, కానులున్నవాడు అంటే నోరు మూసుకుని భరించి రావడం - వ్యంగ్యార్థం
**ఉక్కిరిబిక్కిరి అగు** = ఊపిరాడకపోవడం / తీరిక లేకపోవడం
**ఉగ్గుతో పెట్టిన విద్య** = చిన్నప్పటి నుంచి వచ్చిన విద్య
**ఉట్టిగట్టుకొని ఊరేగు** = ఉబలాటంకొద్దీ ఎప్పుడెప్పుడా అని ఎదురు చూడ్డం
**ఉడుక్కొను** = బాధపడు.

ఉడుతా భక్తిగా = చేతనయినంత
ఉడుంపట్టు = గట్టిపట్టు (ఉడుము నేలకి కరచుకొంటే పెకలించటం కష్టం లాగా రాదు)
ఉత్త పుణ్యానికి = వృథాగా
ఉత్తరకుమార ప్రజ్ఞలు = కోతలు / డంబాలు
ఉదర పోషణార్థం = పొట్ట నింపుకోడానికి
ఉదర పోషణార్థం బహుకృత వేషం= పొట్ట నింపుకొనడానికి రకరకాల వేషాలు
ఉప్పు తిని ముప్పు తలపెట్టు = తిన్న ఇంటి వాసాలు లెక్కించు
ఉబుసుపోవు = కాలక్షేపమగు
ఉబ్బి తబ్బిబ్బగు = పట్టరాని సంతోషం పొందు
ఉయ్యాల జంపాల = అనారోగ్యంతో తీసుకొని శక్తి పుంజుకోలేక ఊగులాడుతున్న పిల్లను ఇలా అంటారు - నిరసనగా
ఉల్లకుట్టుమాటలు = ఎత్తి పొడుపుమాటలు
'ఉల్దాసీదా' = పైన ఒకటి, లోపల ఒకటి అనడం
ఉసురు తగులు = పాపం తగులు

ఊదరగొట్టు = ఏదో ఒకటి చేసి తీరాలని గోకడడం, పోరు పెట్టడం
ఊదరపెట్టు = పందికొక్కుల్ని వదిలించుకోడానికి వాటి కలుగుల్లో పొగబెట్టడం
ఊరపంది = తిండిపోతు / సోమరి
ఊరంత బలగం = బొలెడంత మంది (ఒకరా,ఇద్దరా)
ఊరూనాడూ ఏకమవడం = అల్లకల్లోలం

ఎంగిలి మంగలం = శుచీ శుభ్రం లేకుండా ఉండడం
ఎంతకైనా తగు = ఎంత నీచానికైనా / చెడుకైనా సిద్ధం
ఎకసెక్కాలు = వేళాకోళాలు / పరిహాసాలు.
ఎకాయకిగా = ఎక్కడా ఆగకుండా
ఎక్కేగుమ్మం దిగేగుమ్మం = పొద్దస్తమానం ఇంటింటికీ తిరగడమే సరిపోయింది
ఎగాదిగాజూచు = దిక్కులు చూడడం.
ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య = ఎటు పోయినా తప్పే అని పలుకుబడి.

ఎగనామం పెట్టు = మోసగించు / ఎగ్గొట్టు
ఎగాదిగా చూడ్డం = తేరిపార జూడడం
ఎడబిడ్డ = వంటోడుకన్నా పెద్దబిడ్డ
ఎడమొగం పెడమొగం = సరిపడని
ఎత్తినకాలు దించకుండా / కాలు మడవకుండా = విరామం లేకుండా పనిచేయడం
ఎత్తిపోతలు = పోషణం
ఎత్తుకు పైయెత్తు వేయు = యుక్తికి ప్రత్యుక్తి పన్ను
ఎత్తువారి చేతిబిడ్డ = ఎవరు మంచిమాట మాట్లాడితే వాళ్ళవైపు తిరిగేవాడు
ఎదుగూ బొదుగూ లేని = ఏమాత్రం పెరగని
ఎదురీత / ఏటికి ఎదురీదు = ప్రవాహానికి ఎదురు ఈదడం / ప్రజాభీష్టానికి భిన్నంగా ప్రవర్తించడం ("శవం ప్రవాహానికి వాలును పోతుంది, ప్రాణమున్న జీవి ఎదురీదుతుంది" సామెత )
ఎదాన కొట్టుకొను = "నీ ఎదాన కొట్టుకో" - నెత్తిన వేసికొను
ఎద్దుమీద వాన కురిసినట్టు / ఎనుపోతుపైన వాన = చలనం లేకుండా / పట్టించుకోకుండా / సోమరి
ఎలుగెత్తి చాటు = గొంతెత్తి చెప్పు
ఎలుకమీద పిల్లి, పిల్లిమీద ఎలుక వేయు = జంతర మంతర చేయడం / టాలా టోలీ చేయడం
ఎవరికి వారే యమునాతీరే = పరస్పరం సంబంధం లేకుండా
ఎవరి ముక్కులోకీ రాదు = ఎవరికీ చాలదు
ఎసరు పెట్టు = ఎత్తులు వేయు

ఏకవచన ప్రయోగం చేయు = చులకనగా పిలవడం ('మీరు' అనకుండా 'నువ్వు 'అనడం)
ఏకాహం = చనిపోయిన వారికి పదకొండవ రోజు చేసే కర్మ
ఏకు మేకవడం = మెత్తగా కన్పించినవాడే క్రూరుడు కావడం.
ఏ గాలికి ఆ చాప ఎత్తు = సమయానుకూలంగా ప్రవర్తించడం
ఏడిపించి ఏడు చెర్వులనీళ్ళు తాగించు = రకరకాల బాధలు పెట్టడం.

ఏడుగడ = దిక్కు / రక్ష
ఏనుగు కళ్ళు = చిన్న కళ్ళు
ఏనుగు కాలు = బోదకాలు
ఏనుగు దాహం = విపరీతమైన దాహం
ఏనుగుపాడి = సమృద్ధి
ఏనుగు పీనుగగు = బలంగా ఉన్నవాడు బలహీనమైపోవడం /చిక్కిపోవడం
ఏ పుట్టలో ఏ పాముందో?= మనిషిలో దాగి ఉన్న శక్తి సామర్థ్యాలను తక్కువ అంచనా వేయరాదని సందేశం
ఏబ్రాసి = వెధవ (తిట్టు) అనాగరికంగా ఉండేవాడు
ఏ యెండకా గొడుగు పట్టు = సమయానుకూలంగా వ్యవహరించడం
ఏరుదాటి తెప్పకాల్చు = అవసరం తీరిన తర్వాత అవతలికి నెట్టేయడం
ఏరుదాటేదాక బోటు మల్లయ్య, దాటింతర్వాత బోడి మల్లయ్య= పనయ్యేదాకా పొగడ్త, అక్కర తీరిన తర్వాత తెగడ్త
ఏళ్ళూ కోళ్ళూ ఏకమవడం = నదులూ కాలువలూ కలిసిపోవడం (కోడు = కాల్వ)
ఐసరుబొజ్జ / ఐసరుబజ్జ = సెభాను / సెబాసు

ఒంటికాలుమీద వచ్చేయడం = మీదపడడం
ఒక ఊపు ఊపిచూడు = ఎదుటివాడి సత్తాను పరీక్షించి చూడడం
ఒక కంచాన తిని ఒక మంచాన పడుకోడం = కలిసిమెలిసి గడపడం / ఎంతో అన్యోన్యంగా ఉండడం
ఒక కొలిక్కి వచ్చేదాకా = ఒక దారికి వచ్చేదాకా
ఒక కన్ను కన్నుగాదు, ఒక బిడ్డ బిడ్డ కాదు =రెండు కళ్ళుంటేనే ఒకటి పోయినా ఒకటైనా ఉంటుంది కనీసం ఇద్దరు బిడ్డలైనా ఉంటేనే ఒకరు పోయినా ఒకరైనా ఉంటారు
ఒక తాటిమీద నడవడం = ఒక్క మాటపైన / ఏకాభిప్రాయంతో మెలగడం
ఒక ఇంటివాణ్ణి చేయడం = పెళ్ళి చేయడం.
ఒకరి మోచేతి కింద నీళ్ళు తాగడం = నీచంగా బతకడం అన్న అర్థంలో.
ఒక లకారమైనా కళ్ళచూడ్డం = ఒక లక్షైనా సంపాదించడం
ఒక వెలుగు వెలగడం = గొప్పగా బతికడం
ఒజ్జబంతి కావడం = ఆదర్శవంతుడు కావడం
ఒట్టిగొడ్డును తొకట్టుపెట్టడం = వ్యర్థం
ఒళ్ళు కాల్చుకోవడం = జోక్యం చేసుకొని నష్టపోవడం
ఒడిసి పట్టుకోవడం = గట్టిగా పట్టుకోవడం
ఒడుదుడుకులు పడు = ఇబ్బందులు పడడం
ఒడుదుడుకులుగా ఉండు = పరిస్థితి సరిగా లేకపోవడం / హెచ్చు తగ్గులుగా ఉండడం
ఒళ్ళు కంపరమెత్తిపోయింది = గగుర్పొడిచింది / భయం కలిగింది
ఒళ్ళు దగ్గర పెట్టుకొని మాట్లాడు = జాగ్రత్తగా మాట్లాడు

ఓ కంట కనిపెట్టు = రక్షణగా ఉండు, చేసే పనిని కనిపెట్టి ఉండు
ఓ కన్నువేసి ఉంచు = కనిపెట్టి ఉండు (జాగ్రత్త సుమా!)

కంకణం కట్టుకోవడం = ప్రతిజ్ఞ పూనడం
కంచంత కాపురం = పెద్ద సంసారం
కంచరగాడిదవాడు = (తిట్టు)
కంచుకాగడా వెలిగించి చూచినా = ఎంత వెదికినా (కనపడకపోవడం)
కంచుగీసినట్టే = ఖంగుమని / ఖణేల్మను (స్వరమాధుర్యం)
కంటిలో కలికానికి లేదు = బొత్తిగా లేదు
కంటిలో కన్ను పెట్టుకొని చూడ్డం = జాగ్రత్తగా చూడ్డం
కంటి తుడుపు మాటలు = పైపైకి చెప్పే మాటలు (ఒట్టి మాటలు)
కంటిలో కారం చల్లడం = మోసం చేయడం
కంటిలో నిప్పులుపోసుకోవడం = అసూయపడడం.
కండ కావరం / కండ్ల కావరం = పొగరు ("కానిమ్ము నీ కండకావరమ్మడతల")
కండ్లకు కట్టినట్టు చెప్పడం = సాక్షాత్తు చూసినట్టే స్పష్టంగా చెప్పడం.

కండ్లలో కారం పోసుకోడం = అసూయపడడం
కళ్ళు పొడుకు పోవడం / కళ్ళు పొరలు కమ్మడం = కొవ్వెక్కడం
కళ్ళు తేలవేయడం / గుడ్లు తేలేయడం = తెలివి తప్పడం / సమాధానం చెప్పలేకపోవడం
"కంపనబడిన కాకి" = చిక్కుల్లో పడిన వ్యక్తి
కకావికలగు = చెదిరిపోవు / గందరగోళమగు
కక్కిరి బిక్కిరిగా = తారుమారుగా
కక్కుర్తిగాడు = స్వార్థంకోసం నీచానికి ఒడిగట్టేవాడు (పీనుగు మీద గుడ్డ తీసుకోడానికి వెరవనివాడు)
కక్కువేయించడం = తిరగలికి ఇనుపముక్కతో గరుగ్గా ఉండేలా కొట్టడం
కట్టి కుడుపు = అంతకంత అనుభవించేట్టు చేయడం
కట్టు గుడ్డలతో బయటపడడం = నామమాత్రంగా మిగలడం / ఆస్తి అంతా పోయి కట్టు గుడ్డలతో మిగలడం
కట్టె వంకర పొయ్యి తీరుస్తుంది = దుర్మార్గుడి పని దుర్మార్గుడే పట్టాలన్న అర్థంలో
కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లు = సూటిగా మాట్లాడ్డం / పెడసరంగా మాట్లాడ్డం / మొగమాటం లేకుండా అనేయడం
కడగొట్టు బిడ్డ = ఆఖరిబిడ్డ
"కడప రాజకీయం" = ముఠా రాజకీయం (ఫాక్షనిస్టులకు మాత్రమే వర్తించేది)
కడిగిన ముత్యంలాగా = శుభ్రంగా / నిర్మలంగా
కడిగిపెట్టిన గంగాళంలా = సర్వ శూన్యంగా
కడుపా చెరువా? = అంత తినడం సాధ్యమా? అంత తిండిపోతా?
కడుపాత్రం వాడు = తిండిపోతు / కడుపు కక్కుర్తివాడు
కడుపార తినడం = కడుపు నిండా తినడం
కడుపు కక్కుర్తి = తిండికోసం దేనికైనా లోబడిపోవడం
కడుపులో చల్ల కదలకుండా = శ్రమపడకుండా
కడుపు చించుకుంటే కాళ్ళమీదపడుతుంది = అయినవారి తప్పుల్ని బయట పెట్టుకోకూడదన్న అర్థంలో.
కడుపు చెక్కలయ్యేలాగా = గట్టిగా (నవ్వు) / కడుపుబ్బగా.
కడుపు చెరువవడం = దుఃఖం పెల్లుబికి రావడం
కడుపునిండిన బేరం = ఉన్నవాడే కాబట్టి డబ్బుమీద ఆసక్తి తక్కువవడం
(నీ) కడుపుడక = తిట్టుగానూ / ప్రేమగానూ వాడతారు
కడుపుమీద కొట్టు = జీవనాధారం పోగొట్టు
కడుపే కైలాసం = స్వార్థం / తిండే సర్వస్వం
(అతడి)కత్తికి ఎదురు లేదు = మాటకు తిరుగు లేదు
కత్తిమీద సాము = కష్టసాధ్యం
కత్తివేసినా నెత్తురు చుక్కలేదు = బిత్తరపోయాడన్న అర్థంలో
కత్తుల బోను = ఎటూ మసలనీని ఆటంకం
కత్తులు నూరడం = పగబట్టడం/కొట్లాటకు సిద్ధంగావడం
కత్తెర ఎండలు = మండుటెండలు
కథలకామరాజు = (వాడొట్టి) కథలపుట్ట
కథాకమామీషూ = పుట్టు పూర్వాలు
కనుకట్టు = మోసగించు (కళ్ళు మూయడం)
కనుపాపలా చూడాలి = అపురూపంగా / జాగ్రత్తగా చూసుకోవాలి
కనుమోడ్పు = నిద్ర
కళ్ళకు గంతలు కట్టాడు = మోసగించాడు
కళ్ళు చింతనిప్పులయ్యాయి = అంత కోపమొచ్చిందన్నమాట
కళ్ళు చెమర్చాయి = దుఃఖం వచ్చింది
కనువిప్పు అయింది = తెలిసొచ్చింది
కన్నీరు మున్నీరుగా = అధికంగా ఏడ్వడం
కన్ను పొడుచుకున్నా కనిపించదు = ఏ మాత్రం కనిపించదు
కళ్ళ కరవుదీరా = తృప్తిగా / కళ్ళార
కన్నుల పండువుగా = నేత్రపర్వంగా
కళ్ళలో నిప్పులు పోసుకోవడం = ఏడుపుగొట్టుతనం / ఓర్వలేకపోవడం.
కన్నెర్ర చేయడం = కోపించడం.
కప్పదాట్లు వేయడం = అసమగ్రమైన వ్రాత / మధ్య మధ్యలో అసంపూర్ణంగా వదలి పెట్టడం / మాటలు మింగేయడం.
కప్పల తక్కెడగా = ఏదీ నిలవకపోవడం / ఒకటి సరిపోతే మరొకటి సరిపోకపోవడం (తక్కెడలో

కప్పలను పెట్టి తూచేప్పుడు ఒకటి పెడ్తే మరొకటి ఎగిరిపోతూ ఉంటుంది)

**కప్పలా నోరు తెరవడం రాదు** = అమాయకంగా నోరెళ్ళబెట్టడం / బుద్ధిమాంద్యం

**కయ్యానికి కాలుదువ్వు** = పోట్లాటకు సిద్ధం కావడం

**కరకర ఆకలి వేయడం** = బాగా ఆకలివేయడం

**కరటక దమనకులు** = వంచకులు (వీళ్ళు ఒకరికొకరు ఎడబాయకుండా ఉంటారు వీళ్ళు ఇద్దరు)

**కరడుకట్టిన మనసు** = పాషాణ హృదయం / గట్టి మనసు

**కరతలామలకం అయిపోయింది** = స్పష్టమైపోయింది

**కరారావుడి చుట్టాడు** = సున్న చుట్టాడు

**కరిమింగిన వెలగపండు** = గుట్టు చప్పుడు కాకుండా లోని సారం పోవడం / ఇక మిగిలిందిలేదని చెప్పడం ("సిరి దాబోయిన బోవును గరిమ్రింగిన వెలగపండు కరణిని సుమతీ")

**కరువులో అధికమాసం** = అదనంగా వచ్చిపడిన ఇబ్బంది / కష్టం (అప్పుడప్పుడు సంవత్సరంలో ఒక అధిక మాసం వస్తూంటుంది ఆ మాసం కరువు వచ్చినప్పుడే వస్తే ఖర్చుల భారం మోయడం కష్టం కదా దానిపై వచ్చిన పలుకుబడి)

**కర్ణాకర్ణికగా** = గాలివార్తగా / వినికిడిగా ఆనోట ఆనోటపడి మాట చేరడం

**కర్ణుడు లేని భారతం** = ముఖ్యమైన విషయమే లోపించడం

**కర్మకాలిపోతే** = విసుగుతో వచ్చిన పలుకుబడి

**కర్రపెత్తనం** = పనిచేయకుండా పెత్తనం చెలాయించడం

**కలకలం పుట్టింది** = సందడి

**కలగాపులగం** = గందరగోళం

**కలగుండు పడిపోవడం** = కలత చెందడం / ధైర్యం సన్నగిలడం

**కలగూరగంప** = ఒకదానికొకటి సంబంధం లేని వస్తువుల గంప / ఏదీ విడమర్చి చెప్పలేని సందర్భం

**కలవరపడడం** = కంగారు పడడం.

**కలికానికైనా దొరకదు** = బొత్తిగా దొరకని (వస్తువు). కండ్లలో పెట్టే సుర్మాలాంటి పదార్థం - ఏ మిరియాల గంజితో నూరి తీస్తారు. ఆ ఆవగింజంత వాటు కాని అదికూడా దొరకనప్పుడు ఇలా అంటారు

**కలుపుగోలుతనం** = కలిసిమెలిసి ఉండే నైజం

**కల్లబొల్లి కబుర్లు** = దొంగ మాటలు / మోసపు మాటలు

**కల్లాకపటంలేకపోవడం** = నిర్మలమైన మనస్సుతో ఉండడం

**కలో అంబలో కలో గంజో** = కడుపు చిచ్చు ఆర్పుకోడానికి ఎంతో కొంత

**కల్పవృక్షం** = కోరికలను తీర్చేది / తీర్చేవాడు / కల్పతరువు / కల్పలత / కల్పశాఖ

**కవిలెకట్ట** = పాత కాగితాల కట్ట

**కసవూ గడ్డా** = చెత్తా చెదారం

**కసితీరా అనడం** = పగతీరా మాటలనడం

**కళ్ళప్పగించి కూర్చోడం** = దిగాలుపడి కూర్చోడం

**కళ్ళలో దుమ్ముకొట్టు** = మోసగించు

**కాందారి మాందారి పొద్దు** = అర్ధరాత్రి / చీకటి సమయం (రాత్రి కావడం వల్ల దారితెలియని వేళ, చెట్టేదో, పుట్టేదో, గుట్టేదో తెలియనివేళ)

**కాకతాళీయంగా** = యాదృచ్ఛికంగా / అనుకోకుండా

**కాకి ఎంగిలి** = చిలక కొట్టుడు లాంటిది పైపైన ఎంగిలి చేయడం

**కాకి గోల** = వినపడకుండా గోల చేయడం

**కాకి చావు చస్తావు** = దిక్కులేని చావు చస్తావు

**కాకి ముక్కుకు దొండపండు** = సరిపడని సంబంధం (పండంటి అమ్మాయికి లేదా అబ్బాయికి నల్లటి వ్యక్తితో సంబంధం కుదిరినప్పుడు వచ్చిన పలుకుబడి)

**కాకి వ్రాత / కోడి గీత** = పిచ్చిరాతలు / పిచ్చి గీతలు

**కాకులు దూరని కారడవి చీమలు దూరని చిట్టడవి** = దట్టమైన అరణ్యం / చొరరాని ప్రాంతం

**కాగల కార్యం గంధర్వులు తీరుస్తారు** = మనం చేయవలసిన పని ఇంకొకరి ద్వారా నెరవేరుతుంది (దుర్యోధనుడ్ని పట్టుకోవడం ఎవరికీ సాధ్యం కానప్పుడు బంధించినవాళ్ళు గంధర్వులే).

**కాకులు పొడిచినట్టు** = తలా ఒక మాట అని వేధించడం

**కాటికాపలా** = వృద్ధుల (తన్ను ఉద్దేశించి) (బతికినంతా బతికేశాం ఇక పోయింది ఇంకేముంది కాటి కాపలా అని చెప్పేమాట)

**కాటికి కాళ్ళు చాపడం** = చచ్చిపోవడానికి సిద్ధం కావడం, మరణం ఆసన్నం కావడం

**కాడి కింద పడేయడం** = బాధ్యతలను వదిలి ఉద్యోగం మానుకోవడం

**కామధేనువు** = కోరికలు తీర్చే దేవతల ఆవు. మనోరథం నెరవేర్చేవాడని అర్థం ("అతను ఆశ్రితులపాలిట కామధేనువు)

**కాయా పండా?** = పనయ్యిందా? లేదా?

**కారాలు మిరియాలు నూరడం** = కోపించడం

**కారుకూతలు కూయడం** = తిట్టడం

**కాలగర్భంలో కలిసిపోయిన** = నశించిపోయిన / ఏనాటిమాటో

**కాలదోషం పట్టడం** = కాలం గడిచిపోవడం / పనికిరానిదని చెప్పడం కార్యానికైనా ప్రామిసరీ నోటుకైనా కాలాతీతం అయిపోతే ఎందుకూ పనికిరాదన్న అర్థంలో

**కాలాంతకుడు** = అసాధ్యుడు (కాలాంతక, దేవాంతక, నరాంతకుడని ఒక పలుకుబడి)

**కాలం చేయడం, కాలధర్మం చెందడం** = మరణించడం

**కాలికింద బలాదూరు** = తీసికట్టు / ఎందుకూ పనికిరాదని ఈసడించడం

**కాలికి బలపం కట్టుకొని తిరగడం** = కార్యం సాధించడంకోసం అదే పనిగా తిరగడం

**కాలికివేస్తే మెడకు, మెడకు వేస్తే కాలికి వేయడం** = వాదులాటలో తికమకలుగా వ్యవహరించడం ఆకుకు అందక పోకకు పొందక వాదించడం

**కాలిగోటికి దీటురాదు** = ఏ మాత్రం సరిపోలదు

**కాలు జారడం** = తప్పుదారి తొక్కడం / వ్యభిచరించడం

**కాలు తొక్కడం** = వివాహమాడడం / కాలుతొక్కి కంకణం కట్టడం (వివాహ తంతు భాష)

**కాలుపెట్టే సందులేదు** = కిక్కిరిసి ఉండడం / అవకాశం లేదు

**కాసావాడు** = ఊడిగం చేసేవాడు

**కాళ్ళబేరానికి వచ్చాడు** = లొంగి వచ్చాడు

**కాళ్ళాడడం లేదు / కాళ్ళూ చేతులూ ఆడడం లేదు** = ఏమీ తోచడం లేదు

**కింవదంతి** = పుకారు

**కిక్కురుమనకుండా కూర్చోడం** = నోరు మూసుకొని కూర్చోడం

**కిటకిటలాడు** = కిక్కిరిసి ఉండు

**కిమన్నాస్తి** = ఏమీలేదు

**కిమ్మనకుండా** = ఎదురు ప్రశ్నించకుండా

**కిలాడీ** = మోసకారి / సంగినాటి

**కిస్తీబంది** = వాయిదాల ఏర్పాటు

**కుక్కజెట్టీలు** = పెనుగులాటలు

**కుక్కతోక (వాడి బుద్ధి)** = వంకర / వక్రం

**కుక్కిన పేనులాగా** = ఎదురు మాట్లాడకుండా పడి ఉండడం

**కుచేల సంతానం** = గంపెడు పిల్లలు

**కుడితిలో పడ్డ ఎలుక** = సంకట స్థితిలో ఉన్న వ్యక్తి

**కుదిమట్టంగా** = లావుకు తగిన ఎత్తు

**కుప్పతెప్పలుగా** = సమృద్ధిగా

**కుప్పనూర్పిళ్ళు** = మాసూళ్ళు / పంట రాల్చుకునే సమయం

**కుప్పిగంతులు** = కాళ్ళ కుదురులేని వాళ్ళకు వర్తిస్తుంది / చిన్న చిన్న గంతులు

**కుంచాలతో మంచుకొలవడం** = అసాధ్యం

**కుంటి సమర్థన** = పనికిమాలిన సమర్థన

**కుంటి సాకు** = అందీ పొందని కారణం చెప్పడం

**కుండపోతగా వర్షం** = జోరుగా వర్షం పడడం

**కుండమార్పిళ్ళు** = ఒకటిచ్చి మరొకటి తీసుకోవడం / వాడి చెల్లెలిని వీడికి, వీడి చెల్లెలిని వాడికి ఇచ్చి పెళ్ళి చేయడం

**కుందేటికొమ్ము సాధించడం** = అసంభవం / అసత్యం (కుందేలుకు కొమ్ముండదు) దీన్ని "శశ విషాణం" అని కూడా అంటారు

**కుంభకర్ణ నిద్ర** = మొద్దు నిద్ర

**కుక్కకాటుకు చెప్పుదెబ్బ** = దెబ్బకు దెబ్బ తీయడం

/ చెడుగుకు చెడుగే చేయడం
కుక్కగొడుగులు = పుట్టగొడుగులు / క్షణికాలు (పార్టీలు కుక్కగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి)

**కూకటివేళ్ళు పెల్లగించు** = ఆచారాలు తొలగించు
**కూడూగుడ్డకురాని** = పనికిరాని
**కూతవేటు దూరంలో** = కొంచెం దగ్గరలో
**కూనిరాగం** = చిన్న రాగం
**కూరగాయ కవిత్వం** = స్వలాభం కోసం పొగుడుతో చెప్పే కవిత్వం
**కూరగాయ వైద్యం** = నాటువైద్యం
**కూర్చుంటే తప్పు లేస్తే తప్పు** = అయినదానికీ కానిదానికీ తప్పు పట్టడం
**కూలినాలి** = కూలిపని
**కృష్ణార్పణం** = ఇతర్లకు దక్కడం / ఇస్తే తిరిగి రాకపోవడం (పుస్తకం)

**కైదండ** = చేయూత
**కొంగమెడ** = పొడవైన మెడ
**కొంగల మల్లయ్య** = డాబు మనిషి
**కొంగజపం** = దొంగజపం
**కొంగు బంగారం** = దగ్గరలోనే ఉన్న / తేలిగ్గా లభించే ధనం (కొంగున కట్టుకొన్న బంగారం అని)
**కొంగున కట్టుకొని తిరుగు** = వెంటబెట్టుకు తిరుగు / విడవకుండా తిరుగు (భార్యకుమాత్రమే వర్తింపజేసే ఈ సామెతను భర్తకు కూడా వర్తింపజేయవచ్చు)
**కొంటెకోణంగి** = కొంటివాడు
**కొండనాలుక** = చిరునాలుక
**కొండను తగరు ఢీకొన్నట్టు** = పెద్దవాడిమీదికి చిన్నవాడు విజృంభించినట్టు (తగరు = పొట్టేలు)
**కొండను తవ్వి ఎలుకను పట్టు** = చేసిన కృషి పెద్దది, పొందిన లాభం అల్పం అని చెప్పడం
**కొండమంగలి క్షౌరం** = సగం సగం పనిచేయడం / ఎగుడు దిగుడుగా చేయడం.
**కొండమల్లయ్య** = శ్రీశైల మల్లిఖార్జునుడు
**కొండవీటి చేంతాడు** = అంతూపొంతూలేని ఉపన్యాసానికీ ఎత్తిపొడుపుగా చెప్పే మాట.

**కొంప కూల్చడం** = పాడు చేయడం / నష్టం తేవడం
**కొంప గుండమవడం** = అంతా నాశనమైపోవడం / గుల్లయి పోవడం
**కొత్తనీరు వచ్చి పాతనీరు కొట్టుకుపోయినట్టు (కొత్తవింత - పాతరోత లాంటిది)** = ఉన్నవాళ్ళని ఉద్యోగంనుంచి తొలగించి కొత్తవాళ్ళను తీసుకొన్నప్పుడు వాడే పలుకుబడి
**కొనితెచ్చిపెట్టుకొన్న తద్దినం** = అనవసరంగా నెత్తిమీదకు తెచ్చుకున్న చిక్కు
**కొమ్ములు చూపి గేదె బేరమాడడం** = మంచి - చెడూ తెలుసుకోడానికి అవకాశంలేకుండా నాటకమాడడం - చెర్వులో గేదెను అలాగే ఉంచి, పైకి కన్పించే కొమ్ములు చూపితే బేరం కుదురుతుందా?
**కొమ్ములు తిరిగినవాడు** = పేరు గడించినవాడు
**కొరకొరలాడు** = చిరచిరలాడు (కోపంగా)
**కొరవితో తలగోక్కున్నట్లు** = బాధ తగ్గించుకోడానికని వెళ్ళి మరింత బాధను కొని తెచ్చుకొన్నట్లు అనడం
**"క్వొశ్చెన్ మార్కు మొగం"** = ప్రశ్నార్థకంగా చూడ్డం
**"షేక్స్పియర్ మొగం"** = దిగాలుగా మొగం పెట్టడం
**కొల్లేటి వ్యవసాయం** = లాభం లేనిది / పనికి మాలినది

**కోకా కాకా** = బట్టా పాతా
**కోటలో పాగా వేయడం** = ప్రభువుల / అధికారుల ప్రాపకం సంపాదించడం / కార్యానుకూలతను సాధించుకోడం
**కోటికి పడగెత్తినవాడు**= కోటీశ్వరుడు
**కోటేరులాంటి ముక్కు** = చక్కని ముక్కు (భూమి సాగు సమయంలో 'కోటేరు' వేసినప్పుడు చాలు తిన్నగా పడుతుంది దానినుంచి వచ్చిందీ పలుకుబడి)
**కోణంగి చేష్టలు** = కోతి పనులు
**కోడె వయసు** = పడుచుదనం
**కోతలరాయుడు** = డంబాచారి
**కోతికి కొబ్బరికాయ దొరికినట్టు** = అనుభవించలేని తనం
**కోతి పుండు బ్రహ్మరాక్షసి** = చిన్న పుండును పెద్దదిగా చేయడం.

'క్యాకేసిస్తా' = ఏమిటయ్య ? నీదెంత?
కోరలు తీసిన పాము = ఏమీ చేయలేనివాడు
క్రీగంట చూడడం = ఓరగా చూడ్డం / కటాక్షించడం
క్షీరనీర (క్షీరనిర) న్యాయం = పాలు నీళ్ళూ కలిసినట్లు కలిసిపోవడం (పెరుగూ పప్పూ కలిసినట్లు అన్నది ఇందుకు విరుద్ధం కలవని అర్థం)

ఖరారునామా (కరారునామా) = ఒప్పందం
ఖరారు మదారు = ఒడంబడిక (ఏనుగుల వీరాస్వామి "కాశీయాత్ర")
ఖరీదుకట్టు = వెలకట్టు ("మర్మజలానికి ఖరీదుకట్టే షరాబు లేడోయ్" - శ్రీశ్రీ)

గంగవెర్రులెత్తడం = ఆవేశపూరితుడు కావడం
గంగిరెద్దు వేషాలు = ఆడంబరాలు
గంజితాగేవాడికి మీసాలు ఎత్తిపట్టేవాడొకడా! = కొస్తంత పనికి ఇంకొకరి సహాయం అర్థించడం దేనికన్న అర్థంలో
గండం గడిచి పిండం బయటపడింది = ఆపద తప్పింది
గండపెండెరం = కవులు, వీరులు కాలికి తగిలించుకొనే బిరుద భూషణం
గండరగండడు = బిరుదు / గొప్ప వీరుడు
గంతకు తగిన బొంత = దేనికి తగినది దానికి
గంధర్వ నగరం = వట్టిది
గంధోళిగాడు = వెర్రివాడు / చవట / హాస్యగాడు
గంపంత బలగం = ఊరంత బలగం
గగనమైపోయింది = ఎంతో కష్టమైపోయింది
గగ్గోలుపడు = గందరగోళమగు
గజిబిజిగా ఉంది = గందరగోళంగా ఉంది
గజ్జెకట్టు = సభలో నిలబడడం
గట్టెక్కిపోయాడు = కష్టాలనుంచి బయటపడ్డాడు
గడుసు పిండం = గడుగ్గాయి / చాలా గడుసరి
గడుసు బుర్ర = తెలివైనవాడు
గడ్డిపోచతో సమానం = లెక్కలేదనడం
గతజలసేతు బంధనం = వ్యర్థం (అయిపోయిందేదో అయిపోయింది దాన్నిప్పుడు తలచుకోవడం వ్యర్థం)

గతానుగతికం = గొర్రెదాటుగా పోవడం
గతానుగతికోలోక = జనం గొర్రెదాటుకం
గతిమాలిన పనులు = పనికిమాలిన చేష్టలు
గప్పాలు కొట్టు = డంబాలు చెప్పు / ఊసుకోలు కబుర్లు చెప్పు

'గాజులలంకదున్న' = సోమరి / స్వేచ్ఛా విహారి
గాడిద చాకిరి = అతిచాకిరి
గాలి మేసిరావడం = షికారుకు వెళ్ళడం
గాలిలో మేడలుకట్టు = ఊహాలోకాల్లో విహరించడం
గాలిలో దీపం పెట్టడం = నిలవదని / ఆరిపోక తప్పదని చెప్పడం
గావుకేక = పొలికేక
గాసటబీసట = సంస్కారం పొందని భాష అన్న అర్థంలో (మార్గ దేశి కవితల్లో దేశి కవితల్ని ఈసడించిన రోజులున్నాయి దేశ్యాన్ని అవహేళన చేస్తూ సంస్కృతం ప్రచారంలో కొట్టుకుపోయిన పండితులు అన్నమాట "గాసటబీసటే చదివి గాథలు తవ్వ తెనుంగువారికిన్" ముది కవితలన్నా ఇలాంటిదే )

గిడసబారిపోవడం = పొట్టిగానే ఉండిపోవడం / ఎదుగుదల లేకపోవడం
గిలిగింతలుపెట్టు = చక్కిలిగింతలు పెట్టు
గిల్లికజ్జా పెట్టుకోవడం = పోట్లాటకు దించడం

'గీపెట్టినా' సరే = అరిచినా సరే
గీర బలిసింది = గర్వం / పొగరు బలిసింది

గుంటచిక్కులు = మధ్యలో వచ్చే అనేక చిక్కులు
గుంటపూలు పూయు = పనికిమాలిన పూలు
గుండువేస్తే అందకుండా వెళ్ళు = పత్తాలేకుండా పోవడం
గుండు సున్న అయింది = పని చెడిపోయింది
గుండె ఆగిపోయింది = ఆందోళనను తెలిపే పలుకుబడి
గుండె గతుక్కుమంది = భీతిల్లిన సందర్భంలో పలుకుబడి

**గుండె గొంతుకలో కొట్లాడు** = మాట చెప్పాలని ఉంటుంది గాని భావోద్రేకంలో పెగిలిరాకపోవడం (చూ: ఎంకిపాటలు)
**గుండె చెరువు చేసికొను / గుండె జల్లుమను / గుండె పగిలి** = భయపడు
**గుండెపై చేయివేసుకొని నిద్రపోవు** = దిగులు లేకుండా నిద్రపోవడం
**గుండె రాయి చేసుకొను** = ఎలాగోలా గుండె దిటవు చేసుకోడం
**గుండెలపై కుంపటి** = ఎంతకూ దిగని వేదన / బాధం (అమ్మాయిని కాపురానికి పంపించింది లగాయతూ దాని కష్టాలు చూస్తుంటే భరించలేకుండా ఉన్నా ఈ గుండెలపై కుంపటి ఎన్నాళ్ళు భరించాలో ఏమో!)
**గుండెలపై బరువుదించుకో** = దిగులు తగ్గించుకో
**గుండెలు జారిపోయాయి** = దిగులు పడడం / ధైర్యం కోల్పోవడం
**గుండెలు తీసిన బంటు** = ధీరుడు (గుండె ఉంటే కదా భయమన్నది తెలిసేది అది కూడా లేదని చెప్పడం)
**గుండెలు బాదుకొను** = దుఃఖాన్ని ఆపుకోలేక చేసే పని
**గుండెల్లో రాయిపడు** = నిరాశ కలుగు
**గుండెల్లో రైళ్ళు పరుగెత్తు** = అనుకోని సంఘటన జరిగినప్పుడు, విన్నప్పుడూ పడే వ్యాకులపాటు / భయపెట్టే సందర్భం
**(వాడికి) గుండా, చెరువా?** = అంత కలేజానా? అంత ధైర్యమా?
**గుంపులో గోవింద** = సందట్లో సడేమియా (అలజడి మధ్య ఇతర్లు ఎవరూ గమనించరని భావించి తన ప్రయోజనాన్ని గబగబా నెరవేర్చుకోవడం).
**గుటకలు మింగడం** = ఎదుటివాడు అనుభవించేది / తినేది తనకెప్పుడు దక్కుతుందా అని కాచుక్కూర్చోవడం.
**గుటకాయ స్వాహా**= మింగేయడం / అపహరించడం
**గుట్టుచప్పుడు కాకుండా** = ఎవరికీ తెలియకుండా
**గుట్టు మట్టు** = రహస్యం
**గుడిగుడి గుంజం** = చిన్నపిల్లల ఆట ("గుడిగుడి గుంజం గుంటానాదం..")
**గుడి మింగెవాడికి లింగం లెక్కా / గుడి మింగే వానికి నందిపిండి వడియం** = పెద్ద దొంగతనాలు చేసేవాడికి చిన్నవి ఒక లెక్కా అని
**గుడుగుడుగుంచం** = అక్కడక్కడే తిరుగు (పిల్లల ఆట)
**గుడ్డి గవ్వ చేయడు/గువ్వకు సాటిరాడు** = పనికి రానివాడు / విలువ లేనివాడు ('గవ్వకు సాటిరాని పలుగాకుల మూక / లసూయచేత ననెవ్విది దూరినన్ ననువరించిన శారద లెచిపోవునే " - జాషువా)
**గుడ్డి నమ్మకం** = అంధవిశ్వాసం
**గుడ్డిలో మెల్ల** = కొంత మేలు
**గుడ్డెద్దుచేలోపడ్డట్టు** = చాలూ మూలా తెలియకుండా / ఇష్టం వచ్చినట్టు
**గుడ్లు అప్పగించి చూడ్డం** = సమాధానం చెప్పలేక / ఏమీ చేయలేక
**గుడ్లు తేలేశాడు** = ఏమీ చేయలేక నిరుత్తరుడై ఉండిపోవడం
**గుత్తగొను / గుత్తచేలు** = సొంతం చేసుకోవడం / భూములను ఏడాదికి ఇంత డబ్బు అన్న ఒప్పందంపై భూములను సాగుకు తీసుకోవడం
**గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకోవడం** = ప్రాణభీతితో గడపడం
**గుమ్మడికాయల దొంగ / గుమ్మడికాయలంటే భుజాలు పట్టి చూసుకోవడం** = ఎవళ్ళో ఏదో అంటే తన భుజాలు తడుముకొనేవాడు
**గురుపరంపర** = వంశపారంపర్యంలాగానే, గురుత్వం పరంపరగా రావడం (గురువుకి గురువు, శిష్యునికి శిష్యుడు ఇలా)
**గురువుకు వంగనామాలు పెట్టు** = ఎవరిని గౌరవించాలో వారినే అగౌరవపరచడం / మోసగించడం
**గురువును మించిన శిష్యుడు** = వాడికంటే వీడు మరీ వెధవ (అని ఎత్తిపొడుపుగా వాడే పలుకుబడి)
**(వాడు) గుర్రమెక్కాడు** = గర్వపోతు / తాగినమైకంలో ఉన్నవాడు (వాడుకలో)
**గుసగుసలాడు** = మంతనాలాడు
**గూబలదరగొట్టు** = వాయించు / దండించు

**గొంతుమీద కూర్చున్నట్టు** = ఏదైనా అప్పటికప్పుడు కావాలని మొండిగా వేధించే సందర్భం

**గొంతుమీదికి రావడం** = ప్రాణాలమీదికి రావడం
**గొంతు మూగబోవడం** = మాట పెగలకపోవడం
**గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్టు** = ఏమీ అనలేనప్పుడు ఏర్పడే చిక్కు పరిస్థితి
**గొంతెమ్మ కోర్కెలు** = తీర్చలేని / అసాధ్యమైన కోర్కెలు
**గొడ్డలిపెట్టు** = వ్యాఘాతం (జాతీయ ప్రతిపక్షాల సమైక్య వేదిక ఇందిరాగాంధీ ఎమర్జెన్సీ పాలనకు గొడ్డలిపెట్టు అయింది)
**గొడ్డుపోలేదు** = పిల్లలు కలగరన్న దిగులక్కరలేదు / ఈ మందు ఇక్కడ గాకపోతే మరోచోట దొరుకుతుంది 'దేశమేమీ గొడ్డుపోలేదు'
**గొర్రెతోక బెత్తెడు** = ఎదుగూ బొదుగూ లేని పరిస్థితి
**గొర్రెదాటుడు** = గుడ్డిగా అనుకరించడం

**గోచిపాతరాయుడు** = దరిద్రుడు / సన్యాసి
**గోటితో పోయేదానికి గొడ్డలి దేనికి** = తేలిగ్గా అయ్యే పనికి అంత విరగబాటు దేనికి? గోటితో తుంచే దానికి గొడ్డలిదాకా ఎందుకు?
**గోడకు చెవులుంటాయి** = వక్కకు వెళ్ళి మాట్లాడుకుందాంరా, ఎవరైనా వినగలరు, గోడకు చెవులుంటాయి
**గోడమీద పిల్లి** = వాలునుబట్టి, వీలునుబట్టి ప్లేటు మార్చే రకం
**గోడుగోడున ఏడవడం** = ఎక్కువగా రోదించడం
**గోతులు తవ్వు / తీయు** = ద్రోహానికి తలపడడం
**గోముఖ వ్యాఘ్రం** = పైకి మంచిగా కన్పించడం లోపల్లోపల చెడ్డ ఆలోచనలుండడం
**గోరంతలు కొండంతలు చేయు** = చిన్నదానిని పెద్దగా చిత్రించడం (వ్యంగ్యార్థం)
**గోరంత దీపం కొండంత వెలుగు** = దీపం చిన్నదైనా వెలుగు కొండంత (వాస్తవార్థం). వాడు చిన్నవాడైనా ప్రతిభావంతుడని చెప్పడం
**గోరుచుట్టుపై రోకటి పోటు** = నిరుడు పంట అంతంతమాత్రంగా ఉంటే ఈ ఏడు ఉప్పెనవచ్చి పంటంతా ఊడ్చేసింది. గోరుచుట్టుపై రోకటి పోటులాగా అసలే గోరు కురుపు. దానిపైన రోకలి వచ్చి పడడం మరీ బాధ

**గ్రహచారంచాలని** = దురదృష్టపు రోజు
**గ్రుడ్లు మిడికించడం** = గుడ్లు మిటమిటలాడించడం

**ఘంటాపథంగా** = నిశ్చయంగా / బల్లగుద్ది చెప్పడం
**ఘటాఘటీలు** = హేమాహేమీలు
**ఘనాపాఠీ** = కూలంకషంగా చదువుకున్నవాడు (వేదంలో ప్రతి మంత్రానికి 'పద'మనీ, 'జట'మనీ, 'ఘనము' అనీ ఉంటాయి ఘనం ఆఖరిది కాబట్టి పూర్తిగా చదువుకున్నవాడని చెప్పడం )

**ఘోటక బ్రహ్మచారి** = వీలు చిక్కక బ్రహ్మచారిగా ఉండడం వ్యంగ్యార్థంలో దాన్ని వాడతారు (ఘోటక బ్రహ్మచర్యం, పింగళా జపం, పిల్లిశీలం, అజగరోపవాసం, నక్కవినయం - ఇత్యాదులన్నీ ఇలాంటివే)

**చంకనాకిపోవు** = చెడిపోవడం
**చంకలెగరేయడం / చంకలు కొట్టుకోడం** = సంబరపడిపోవడం
**చండశాసనుడు** = నిర్దాక్షిణ్యంగా తప్పును శిక్షించేవాడు
**చంద్రనిప్పులు** = భగభగమనే నిప్పులు
**చంద్రునికో నూలుపోగు** = అంతశక్తి లేకపోయినా ఉన్నంతలో చేతనైన కానుక ఇవ్వడం(చంద్రవంక కనపడగానే విదియనాడు వంటిమీద బట్టలోని నూలిపోగు తీసివేసి చంద్రునికి నమస్కరించడం కొందరికి ఆచారం).
**చంపుకు తినడం** = వేధించడం / బాధపెట్టడం
**చక్కట్లు దిద్దు** = వంకలు తీర్చు / చక్కదిద్దు
**చక్కనయ్య** = మన్మథుడు
**చక్కెరబొమ్మ** = అందకత్తె
**చచ్చీ చెడీ** = నానా ఇబ్బందులు పడి
**చచ్చీ చెడి చాయంగల విన్నపాలు** = నానా శ్రమపడి అన్న అర్థంలో
**చచ్చిన పాముని చంపొద్దు** = అసలే దెబ్బతిన్నవాడిని ఇంకా బాధించవద్దు
**చచ్చి సాధిస్తున్నాడు** = చనిపోయి కూడా పగతీర్చుకుంటున్నాడు.
**చచ్చుదద్దమ్మ / చచ్చు నాగమ్మ / చచ్చు పీనుగ** =

చేతకానివాడు (చిట్టి)

**చట్టుబండలగు** = పాడైపోవడం

**చతుర్వేది** = నాలుగు వేదాలూ చదువుకున్నవాడు ([illegible] పేరు) ఇలా విద్వత్త్వం సాధించిన వారెప్పటినుంచీ క్రమంగా వాళ్ళ ఇంటిపేరు కూడా అదే కావడం విశేషం "మూర్ఖుడైన చతుర్వేదికాదే" అన్నాడు కవి

**చదువవేస్తే ఉన్న మతి పోయినట్లు** = తెలివితేటలు పెంచుకోడానికి చదువు చెప్పిస్తే అవి పెరగకపోగా ఉన్న మతి కూడా పోయిందని చెప్పడం

**చతుష్షష్టి కళలు** = అరవై నాలుగు కళలు కళలు ఇంద్రియ గ్రాహ్యాలు కాబట్టి, కన్నుకు సంబంధించిన కళలను దృశ్య కళలనీ, చెవికి సంబందించినవి శ్రవ్య కళలనీ అంటారు ఈ రెంటికీ చెందనివి మిశ్రమ కళలు ఈ మూడు రకాల్ని కలిపి అరవై నాలుగు కళలుగా చెప్పారు అయితే 64 కళలనూ ఏ ఒక్క గ్రంధమూ ఒకే విధంగా పేర్కొనలేదు హస్తకళలు కూడా అందమైన కళలే కాని వీళ్ళెవరూ వీటిని ఈ కళల్లో చేర్చలేదు "కమ్మరికొలిమి, కుమ్మరి చక్రం, జాలరి పగ్గం, సాలెల మగ్గం, శరీర కష్టం స్ఫురింపచేసే' 'సహస్రవృత్తుల సమస్త చిహ్నాలూ కళాఖండాలే కాని వీటిని మినహాయించిన "గ్రంధసంజ్ఞా దర్పణమ్" అనే ప్రామాణిక గ్రంథం ప్రస్తావించిన అరవై నాలుగు కళలూ ఇవిః

1 అక్షర లక్షణ, 2 అలంకార, 3 ఇతిహాస, 4 మీమాంస, 5 తర్కశాస్త్ర, 6 స్త్రీ లక్షణ, 7 పురుష లక్షణ, 8 అశ్వ లక్షణ, 9 గజలక్షణ, 10 గోలక్షణ, 11 కన్యావాద, 12 విషవాద, 13 బలవాద, 14 రసవాద, 15 ధాతువాద, 16 బ్రహ్మవాద, 17 మృషావాద, 18 ముద్రారక్షక, 19 క్షాత్రకర్మ, 20 భూతశిలాపాత, 21 అశ్వవైద్య, 22 గజవైద్య, 23 పశువైద్య, 24 నరవైద్య, 25 ఇంద్రజాల, 26 మహేంద్రజాల, 27. గోకర్ణ, 28 గజకర్ణ, 29 తృణావధాన, 30 శబ్దావధాన, 31 భుజావధాన, 32 ఘంటావధాన, 33. హస్త చలన, 34 నయనసంజ్ఞ, 35 భాషా విశేష, 36. భ్రమణ, 37 పోషణ, 38. విద్వేషణ, 39 ఉచ్చాటన, 40 ఆకర్షణ, 41 అంజన, 42 అదృశ్యత్వ 43 వ్యాఘ్రమిత్ర, 44 వేతాళముల, 45 ఆయుర్వేదం 46 వాస్తుశాస్త్ర, 47 శిల్పశాస్త్ర 48 రతిశాస్త్ర, 49 యోగశాస్త్ర, 50 చిత్రక్రియ 51 రథారోహణ, 52 గజారోహణ, 53 అశ్వారోహణ 54 మోహస్తంభన, 55 వాయుస్తంభన, 56 అగ్నిస్తంభన 57 జలస్తంభన, 58 ఖడ్గస్తంభన, 59 ఘుటికాసిద్ధి 60 పాదుకాసిద్ధి, 61 మంత్రసిద్ధి, 62 పరకాయప్రవేశ 63 దూరదృష్టి, 64 దూరశ్రవణ

**చదువు సంధ్యలు** = చదువు సాములు / [illegible] సంతలు

**చప్పిడి ముక్కు** = అణిగిపోయిన / ఒత్తుకుపోయిన ముక్కు

**చమడాలూడగొట్టు** = చర్మం ఒలిచి చేతికివ్వడం

**చలికి జడిసి కుంపట్లు ఎత్తుకోవడం** = చిన్న బాధనుంచి విముక్తి పొందుదామని పెద్ద బాధ తెచ్చుకోవడం

**చలిమిడి ముద్దలాగా** = గుండుగా / నున్నగా నూనెకారుతూ (వ్యంగ్యార్థం)

**చలివేంద్రం** = బాటసారుల దప్పిక తీర్చేందుకు మంచినీళ్ళ కుండలు పెట్టి సేద తీర్చుకొనేందుకు వేసిన పందిర

**చల్లకువచ్చి ముంతదాచనేల** = ఏదో అడగడానికి వచ్చి సిగ్గుపడి ఏదో మాట్లాడ్డం దేనికి అన్నప్పుడు ప్రయోగం

**చల్లని కడుపు** = సంతానవతి

**చవితి చందురుడు** = చూడకూడనిది

**చాంగుబళా / చాంగురే** = భళిరే / సెబాసు

**చాకిరేవుపెట్టు** = ఇతరుల లోపాలను ఎత్తిచూపి గుట్టు కుష్టులన్నీ కడిగేయడం

**చాట భారతం** = అంతులేని ప్రసంగం (మొదట్లో భారత, రామాయణాలను పెద్ద సైజుల్లో ముద్రించేవారు అవి చాటల్లా కనిపించేవి కాబట్టి ఈ పేరు )

**చాంద్రాయణం** = ఒక వ్రతం

**చాతుర్మాస్యం** = ఒక వ్రతం (నాలుగు నెలలు చేసే యజ్ఞం)

**చాపకింద నీరులాగ** = తనకు తెలియకుండానే ఆపద

కలగడం / క్రమంగా అంతటా అలుక్కుపోయేలాగ
**చాపచుట్టగ చుట్టు** = ప్రపంచాన్ని చాపను చుట్టినట్టు చుట్టడం (జగమెల్ల చాపచుట్టగ చుట్టి మనశక్తి నెనగు హిరణ్యాక్షుడేమయ్యె?)
**చావు తెలివి** = ఉన్నదంతా పోయిన తర్వాత వచ్చిన జ్ఞానం / అతి తెలివి / పనికిరాని తెలివి
**చావు తప్పి కన్ను లొట్టపోయినట్లు** = కొద్ది నష్టంతో బయట పడడం
**చావు బతుకుల్లో ఉండడం** = అతి క్లిష్ట దశలో / మరణావస్థలో ఉండడం

**చింతనిప్పులు రాలడం** = కోపం వస్తే కళ్ళు నిప్పులు చెలరేగడం
**చిక్కురొక్కురుగా** = చిందర వందరగా
**చిగురులొత్తడం** = చిగురించు (అణగిన కోర్కెలు చిగురించడం)
**చిచ్చర పిడుగు / చిచ్చు పిడుగు** = అగ్గి పిడుగు
**చిచ్చికొట్టు** = జోకొట్టు
**చిటపటలాడు / చిటచిటలాడు** = కోపగించుకోడం
**ముటముటలాడు (మొగం)** = కోపంతో మొగం అలా పెట్టడం
**చిట్టుడుకు నీళ్ళు** = బియ్యం ఉడుకుతూండగా పైకి తేలిన నీళ్ళు (తాగితే ఆరోగ్యానికి మంచిదంటారు)
**చిత్తగించండి** = సావధానంగా వినండి / మనసులో తలచుకోండి / దయచేసి వినండి / ఏకాగ్రతతో వినండి
**చిత్తజల్లు / చిత్త వాన** = అధికవాన / చిత్తకార్తివాన గబగబా పడి ఆగిపోతుంది
**చిత్తం వచ్చినట్లు** = తోచినట్లు / యథేచ్ఛగా
**చిత్తు చిత్తయిపోవడం** = బాగా దెబ్బతినిపోవడం
**చిదంబర రహస్యం** = అవగతం కానిది / తెలియరానిది (చిదంబరంలో శివలింగానికి 'ఆకాశ లింగం' అని పేరు వచ్చిన భక్తులకు తెర తొలగించి చూపిస్తారు కాని అక్కడేమీ ఉండదు ఏమీ కనపడదుట ఎందుకని? అసలే 'ఆకాశ లింగం' కదా! కనక కనపడదని చెప్పుకోవడం )
**చిన్నచూపు చూడడం** = చులకన చేయడం
**చిన్నబుచ్చడం** = అవమానించడం
**చిన్నబోవడం** = అవమానంతో మొగం చిన్నదవడం
**చిన్న మెత్తు పని లేదు** = ఏ పనీ లేదు / పనీ పంగా లేదు
**చిన్నారి పొన్నారి ప్రాయం** = చిన్నతనం / బాల్యావస్థ
**చిప్పమూతి** = ముఖం చిప్పంత కావడం
**చిమడబెట్టు** = ఉడికించు / కలతపెట్టు ("చింతచే నీ మనసు చిమడపెట్టేవు ")
**చిర్రుబుర్రులాడు / చిర్రుమను** = కోపించు
**చిలవలు పలవలు చేయు** = ఒకటి ఉంటే నూరు కల్పించు
**చిలుక కొట్టుడు** = చిలుక కొరుకుడు (ఎంగిలి కాకుండా పిల్లలు ఏ జామకాయమీదనో బట్ట కప్పి కొరికి ముక్కలు నలుగురికీ పంచుతారు )
**చిలుక కొయ్య** = బట్టలు తగిలించుకునే కర్ర ముక్క
**చిలుకా గోరింకల్లా** = అన్యోన్యంగా
**చిలుక పలుకులు** = విన్నమాటలే అన్న మాటలు
**చిల్లర వెచ్చాలు** = బియ్యం, పప్పు, ఉప్పు వగైరా
**చికాకు పరచు** = కలతపెట్టు

**చీటికీ మాటికీ** = మాటి మాటికి / ప్రతి చిన్న దానికి/ చిన్న విషయాలక్కూడా
**చీడపురుగు** = పంటను దెబ్బతీసే పురుగు / కొరగాని వాడు / వేరుపురుగు లాంటివాడు.
**చీపురుకట్ట సరసం** = మోటు సరసం
**చీమ చిటుకనకుండా** = శబ్దం రాకుండా
**చీమ కుట్టినట్లయినా లేదు** = ఏమాత్రం బాధ కూడా లేదు
**చీమునెత్తురు ఉంటే** = స్వాభిమానం ఉంటే, పౌరుషం కలవాడివైతే
**చీము నెత్తురు లేని** = ఆత్మ గౌరవం లేని

**చుక్కెదురు** = ప్రతికూలం కావడం
**చుక్కల్లోకి చూడడం** = గర్వం ప్రదర్శించడం.
**చుట్టపక్కాలు** = బంధువులు
**చుట్టపు చూపుగా రావడం** = బంధు మర్యాదగా రావడం
**చుట్టాల సురభి** = బంధు ప్రీతి కలవాడు

**చూరచుర చూచు** = కోపంతో చూడ్డం
**చూరుపట్టుకొని వేలాడ్డం** = పట్టు వదల్కుండా ఉడుంలా పట్టుకుపోవడం ('మెడపట్టి గెంటితే చూరుపట్టుకొని వేలాడాడు')

**చెంపకు చారెడు కళ్ళు** = అంత విశాలమైన కళ్ళు అని
**చెక్కు చెదరక** = ఉన్నాడున్నట్లు
**చెట్టపట్టాలు** = ఆప్యాయంగా ఒకరి చేతులొకరు ఎట్టుకొను
**చెట్టుకొకడూ పుట్టకొకడూ** = చెల్లా చెదురు కావడం / దిక్కులు పట్టి పోవడం
**చెడి బతికినవాడు** = తక్కువ స్థితిలో ఉంటూ పైకి వచ్చినవాడు
**చెత్తాకానీ రకం** = చౌకబారు రకం
**చెప్పుల్లో కాళ్ళు పెట్టుకొని** = వచ్చినవాడు వచ్చినట్టే వెళ్ళిపోవడానికి సిద్ధం కావడం
**చెయితప్పిపోవు** = చేజారిపోవు
**చేయ్యి కాల్చుకొనడం** = సొంత వంట చేసుకోడం
**చెల్లుచీటి ఇవ్వడం** = వదిలివేయిడం
**చెల్లు చీటి** = బాకీలో కొంత జమచేసి ముట్టినట్టు ఆ మేరకు చెల్లు రాయించుకోడం
**చెవిటిమాలోకం** = చెవిటి

**చేకూలి** = రోజుకూలి / దినకూలి (నెలజీతపు కొలువు కాదు)
**చేజేతులా చేసుకొను** = స్వయంగా చేసుకొను
**చే తడి ఆరలేదు** = పని పూర్తయి కొద్దిసేపు కూడా కాలేదు పని ముగియగానే చేతులు కడుగుకోవడం
**చేతికి ఎముక లేదు** = 'దానపరుడ'ని (ఖ్యాతి)
**చేతులాడించుకొంటూ రావడం** = పనికాకుండా ఉత్తిచేతుల్తో తిరిగి రావడం
**చేతుల్టు కావు, కాళ్ళనుకో** = పని సానుకూలం చేసుకోడానికి ప్రాధేయపడడం చేతులే కాళ్ళనుకొమ్మని వేడుకోవడం.
**చేతులు కడుగుకొను** = సంబంధం తెంచేసుకొను.
**చేతుల్టు ముడుచుకొని కూర్చో** = ఏమీ చేయొద్దు

**చేతులెత్తి మొక్కు** = భక్తితో మొక్కు 'ఇకనైనా నన్ను విడిచిపెట్టు నాయనా నీకు చేతులెత్తి మొక్కుతా' (ప్రాధేయపడడం)
**చేదోడు వాదోడుగా** = చేతి సహాయమూ మాట సహాయమూ
**చేయాడక** = చేయి రాక
**చేయిచాచు** = యాచించు
**చేయిదాటిపోవు** = మించిపోవు / తన వశం తప్పిపోవు
**చేయిముసగ పాడి** = ఇబ్బడిముబ్బడిగా పాడి

**ఛత్రచామరాలు** = గొడుగు, వింజామరాలు

**జండా ఎత్తేశాడు / జండా పీకేశాడు** = మకాం ఎత్తేశాడు / పరారయ్యాడు
**జగజెట్టి** = జగదేకవీరుడు
**జగడాలమారి** = పోట్లాటకు కొట్లాటకు సిద్ధమైనవాడు
**జట్టు కట్టు** = సావాసం చేయు
**జడకుచ్చులు** = జడలో కొసాన పెట్టుకొనే ఆభరణం
**జడివాన** = వదలకుండా కురిసేవాన
**'జన్మకొక శివరాత్రి'** = అరుదుగా బిరుదువచ్చినప్పుడో సన్మానం జరిగినప్పుడో చెప్పడానికి ప్రయోగించే పలుకుబడి
**జమా ఖర్చులు** = ఆయ (ఆదాయ) వ్యయాలు
**జమాబందీ** = పన్నులను ఖరారు చేయడానికి గ్రామ కరణాలను తాశీల్దారు పిలిచి జరిపే తతంగం
**జల్లి మాటలు** = వట్టి మాటలు / ఊసుపోని మాటలు
**(మాట) జవదాటు** = హద్దుమీరు

**జాజెరకత్తె, జాజెరకాడు** = మాయలాడి, మాయగాడు
**జాడించి తన్ను** = గట్టిగా కాలుతో తన్ను
**జాతకర్మ** = పుట్టిన బిడ్డకు చేసే సంస్కారం.
**జాతివార్తలు** = జాతీయాలు ('జాతివార్తలు తొలక రనంబు గులుక, కవిత రచియించు కల్పించి కతలునుడువు" - కదిరీపతి)
**జాను తెనుగు** = తేటతెనుగు, మంచి తెలుగు
**జాబుజవాబు** = ఉత్తరాలు
**జావకారిపోవడం** = భయపడిపోవడం / దిగాలుపడడం

**జిత్తులమారివాడు** = మాయోపాయం చెప్పేవాడు / ఉపాయంగలవాడు
**జిరాయితీ హక్కు** = సేద్యం చేసుకొనే హక్కు
**జిలుగు రాత** = గొలుసురాత
**జిహ్వచచ్చు** = రుచిపోవు

**జీతనాతాలు** = జీతం, బత్తెం
**జీతప్పురాళ్ళు** = జీతంగా వచ్చే రూపాయిలు
**జీవగర్ర** = ప్రాణాధారం
**జీవచ్ఛవంగా / జీవన్మృతుడు** = బతికినా చచ్చినవాడితో సమం అని చెప్పడం
**జీవనాధారం** = బతుకు తెరువు

**జున్నుగడ్డ** = జున్నుపాలు కాచినగడ్డ
**జున్నుపాలు** = గెదెగానీ, ఆవుకానీ ఈనిన వెంటనే కొన్ని రోజులదాకా వచ్చే పాలు
**జుర్రుకోడం** = ఇష్టంగా తాగేయడం (రసాలు, ద్రవాలు)
**జులుం చేయడం / చెలాయించడం** = పెత్తనం వెలగబెట్టడం
**జుట్లు ముడిపెట్టడం** = తంపులు పెట్టి తమాషా చూడ్డం
**జెట్టవెధవ** = దరిద్రపుగొట్టు
**జేబులు ఖాళీ అవడం** = ఉన్నడబ్బంతా పోవడం
**జేబులు నింపుకోడం** = సంపాదించుకోడం (అన్యాయంగా ఆర్జించిన దానికే ఇది వర్తింపు)

**ఝుంఝూమారుతంగా సాగు** = బ్రహ్మాండంగా / నిరాఘాటంగా / అడ్డులేకుండా వాడి మాట సాగిపోవడం
**ఝల్లను** = గుండెలు దిగాలుమను
**ఝాడించిపెట్టు** = బాగా నాలుగు తిట్టు

**టంగుతెగు** = ప్రాణం పోయినంతపనవడం (తిరపతి కొండమెట్లు ఎక్కుసరికి నా టంగులు తెగిపోయాయి)
**టకటొంకులు / టక్కుటమారం చేయు** = మోసాలు / మోసం చేయు
**టలాయించు** = ఏదో మాయమాటలు చెప్పి తప్పించుకోడం
**టిస్సాదింపేయు, టస్సా చెప్పు** = తిప్పివేసేయు

**టీకాలు తెగు** = లావెక్కడం
**టీలాటోలీ మాటలు** = అబద్ధాలు / మోసపు మాటలు
**టెక్కులు పోవడం** = డంభాలు పోవు
**టోకరా కొట్టు / టోపీ పెట్టు / టోపీ వేయు** = మోసగించు

**ఠంచనగా** = సరిగ్గా / సకాలంలో

**డంగయిపోవు** = బిత్తరపోవడం
**డగ్గుత్తిక పడు** = మనసులో దిగులుతో గొంతు బొంగురు పోవడం / స్వరం జీరబోవడం (అన్నాళ్ళు పెంచిన తర్వాత శకుంతల అత్తవారింటికి వెడుతూంటే కణ్వ మహర్షి గొంతు డగ్గుత్తిక పడిపోయింది)
**డబ్బా వాయించు** = హద్దులు మీరి పొగడు
**డబ్బూ దస్కం** = ధనం

**డాలూడవాలుబిగించు** = సన్నద్ధుడగు

**డింకీకొట్టు** = తలకిందులైపోవు
**డిప్పకాయ** = శుంఠ / అల్లరివాడు

**డీలాపడు** = నష్టంవల్ల చితికిపోవు / బలహీనపడు

**డుబడుక్కవాడు** = బుడబుక్కలవాడు
**డూడూ బసవన్న** = ప్రతిదానికీ తల ఊపేవాడు

**డెబ్బై పసకొండు** = అనేకం అని చెప్పడానికి వాడే పలుకుబడి

**డేగపదనుగ భోజనం** = మితంగా భుజించడం
**డేరా ఎత్తివేయు** = ఆ ఊరినుంచి ఉడాయించడం.

**డొంకతిరుగుడు** = సూటిగా కాకుండా తిప్పి తిప్పి మాటలు చెప్పడం / సరైన రాదారి లేనప్పుడు అడ్డదారుల్లో వెళ్ళడమూ

**డొక్కచీల్చి డోలుకట్టు** = కోప్లాం మదిరితే ఇలా అంటారు
**డొక్క శుద్ధి ఉన్నవాడు** = చదువుకొన్నవాడు
**డొల్లు పుచ్చుకాయ** = ఒకచోట నిలవనివాడు (ఎకడ పట్టుమని నాలుగు రోజులు ఉండడు)

**డోకువచ్చు** = అసహ్యం కలుగు

**ఢంకామీద దెబ్బకొట్టి / ఢంకా భజాయించి** = గట్టిగా / బాహాటంగా
**ఢక్కామొక్కీలు తిను** = కష్టనష్టాలను అనుభవించడం
**ఢోకాలేదు** = లోటులేదు

**తండోప తండాలుగా** = గుంపులు గుంపులుగా
**తందనాలు తొక్కు** = చిందులు తొక్కు (తాగినవాళ్ళపట్ల వాడకం)
**తగుదనమ్మా అని .** = పని చేతగాకపోయినా తగుదునమ్మా అని ప్రతిదాన్లోనూ వేలు పెట్టడమని (ఎత్తిపొడుపు)
**తడికి దాసరి** = దొంగ దాసరి (అడుక్కు తినడానికి వచ్చి ఇంట్లో ఎవరూ లేరని తెలుసుకొని తడిక తోసి దొరికింది ఎత్తుకొని పోయేవాడు)
**తడిగుడ్డతో గొంతు కోయు** = మెత్తని మాటలు చెప్పి, కొంపలు తీయడం / ద్రోహానికి తలపడడం
**తడిపొడిగా** = కొంచెం తడిగా
**తత్తరబిత్తర అవడం** = తొట్రుపాటు చెందడం / భయపడడం
**తనదాకా వస్తేగానీ. .** = ఏదైనా వొడ్డునుండి కబుర్లు చెప్పడం కాదు తనదాకా వస్తే గాని తెలిసిరాదన్న అర్థంలో.
**తన్ని తగులవేయు** = తరిమికొట్టు
**తన్నుకు చచ్చినా ..** = గింజుకున్నా (రూపాయిచ్చేది లేదు)
**తప్పటడుగులు వేయు** = (చిన్నపిల్లలు) తడబడుతూ వేసే అడుగులు
**తప్పుల తడక** = కుప్పతెప్పలుగా తప్పులుండడం
**తరకట బు(బ)రకట** = ఇంద్రజాలం / మాయ / మోసం ("కల్లకాదు కైలాటకము గాదు తరకట బరకటగాదు, తబ్బిబ్బు కాదు, తనుకు గాదు")
**తరితీపు సేయు** = సంతోషపెట్టు / బాధించు
**తరిపాలు** = అప్పుడే పిండిన పాలు
**తరిమజ్జిగ** = అప్పటికప్పుడు చిలికిన మజ్జిగ
**తరివెన్న** = అప్పుడే తీసిన వెన్న
**తర్జన భర్జన సేయు** = తర్కించుకొను
**తరపి వెన్నెల** = కొదమ వెన్నెల
**తలంబ్రాలు** = వధూవరుల పెండ్లిలో ఒకరి తలపై ఒకరు పోసుకునే పసుపు కలిపిన బియ్యం
**తల తాకట్టు పెట్టయినా** = చేసిన అప్పు తీర్చాలి అన్న పట్టుదల సందర్భంగా వాడకం (ఎలాగోలా అవస్థపడైనా సరే వాడి డబ్బులు కట్టేస్తాను)
**తలకాచు** = రక్షించు
**"తంజావూరు సత్రం"** = సోమరిపోతులంతా తిండికిమాత్రం చేరుకునే సత్రం
**తంబళ జోస్యం** = పనికిమాలిన జోస్యం ("నంబి కవిత్వంలో తంబళ జోస్యంబు" - వేణుగోపాల శతకం)
**తగిలించి తమాషా చూడు** = ఇద్దరి మధ్య తగవు బెట్టి తాను తప్పుకోవడం
**తంగెటి జున్ను** = అందుబాటులో ఉన్న అమూల్య పదార్థం ("ఎంత గంధవహన మెంత తంగెటిజున్ను" - జాషువా) తంగెడు చెట్టు పొట్టిగ ఉంటుంది అందరికీ అందుబాటులో ఉంటుంది
**తడిసి మోపెడగు** = మోయలేని బరువు మోయవలసి వచ్చినప్పుడు, ఖర్చులు అనుకోకుండా పెరిగిపోయినప్పుడు వాడకం 'తడిసి ముప్పందుమైంది' అంటే అదే
**తత్తరబిత్తరపడు** = కంగారుపడు / విభ్రాంతి చెందు
**తలకు మించిన పని** = అతి బరువైన వ్యవహారం
**తలకు వేస్తే మొలకు మొలకు వేస్తే తలకు** = ఏదో రూపంలో వాదం పెంచేవారిపట్ల ఇది ప్రయోగం
**తలకెత్తుకొను** = నెత్తిమీద భారం వేసుకోడం
**తలకొకమాటగా** = నోటికొకమాటగా
**తలకొరివిపెట్టే దిక్కు** = చనిపోయినప్పుడు కొడుకో, మనుమడో, కాష్టానికి తలవైపున కొరివిపెట్టడం
**తలచినపుడే తాత పెండ్లి** = 'లేడికి లేచిందే పరుగు'

తప్పుష్టు ఉపయోగించే పలుకుబడి ('దేనికైనా సమయం రావాలి తలచినప్పుడే తాత పెండ్లి ఎలా కుదురుతుంది?')

**తలతీసి మొలేస్తాడా?** = వాడేమీ చేయలేడన్న ఒరోసా

**తలదించుకొను** = (అవమానంతో) తలొంచుకొను

**తలపట్లకు సిగపట్లకు దిగు** = కొట్లాటకు దిగు / తగవులాటకు దిగు

**తలవని తలంపుగా** = అకస్మాత్తుగా వచ్చే ఆలోచన

**తలప్రాణం తోకకు వచ్చు** = చచ్చినంత పనయిందనడం - "వాడిని ఒప్పించే సరికి నా తల ప్రాణం తోకకు వచ్చినట్టయింది"

**తలబిరుసుతనం** = పొగరు / అహంకారం

**తలమానికం** = తలదాల్చదగినది / శిరోభూషణం / శ్రేష్ఠుడు / శ్రేష్ఠురాలు

**తలబొప్పికట్టు** = విసుగెత్తు

**తలమాసినవాడు** = ఏబ్రాసివెధవ (తిట్టు)

**తలమునకలగు / తలమున్కలగు** = ఊపిరి సలపనంత పనిలో ఉండు / అధికమైన ('ఈరోజు రావడం పడదు, అసలే ఆఫీసు పనుల్లో తలమున్కలుగా ఉన్నాను బాబూ')

**తలమొత్తింది** = అనిష్టత (తీపి తిని తినీ తలమొత్తింది)

**తలెత్తి తిరుగు** = సగర్వంగా / అభిమానంతో తిరుగు

**తలలు మార్చు** = మోసగించు

**తలరాత** = దురదృష్టం

**తలలో నాలుకలా మెలగు** = అన్యోన్యంగా మెలగు

**తలవంపులు తెచ్చు** = అవమానం తెచ్చు

**తలవాచేట్టు తిట్టు (పెట్టు)** = చావదిట్టు

**తలాతోకా లేదు** = మొదలేదో, చివరేదో తెలియకపోవడం

**తలా తోకా తెలీదు** = మంచి చెడ్డలు తెలియవు

**తల్లికి బిడ్డ బరువండీ?** = ఎంత లేనిది అయితే మాత్రం తల్లికి బిడ్డ బరువా?

**(వాడు) తల్లికి మొగుడు** = అసాధ్యుడు / మించినవాడు అనడంలో పలుకుబడి (పోలీసువాడికి అందరినీ అనుమానించే గుణం ఉంటుంది కాబట్టి లొంగని ఘటం అన్న అర్థంలో 'పోలీసువాడు తల్లికి మొగుడు' అని కూడా విమర్శనార్థంలో వాడుక)

**తల్లి పుట్టిల్లు మేనమామకి చెప్పాలా?** = నీ సంగతి నాకు తెలియదా' అనడం పలుకుబడి

**తవ్వి తలకెత్తుకొను** = భారం అనుభవించు

**తవ్వుకోవడం పూడ్చుకోవడంగా** = అప్పులు చేయడం, తీర్చడంగాఉందనడం

**తస్సదియ్యా! / తస్సగొయ్యా!** = తస్సదియ్యా! వాడి మాటలే వినాలిరా ఎంత ముద్దొస్తాయో! (ఊతపదం)

**తహతహలాడు** = ఆదుర్దాపడు

**తాజా** = సరికొత్తగా / (తాజా సరకు / తాజా వార్తలు)

**తాటలొలిచేస్తా** = చర్మం ఒలిచి డోలు కడతా అన్నట్టు

**తాటాకు చప్పుళ్ళకు దయ్యాలు జంకుతాయా** = బెదిరింపులతో ఏ పనీ కాదని హెచ్చరిక

**తాటాకులు కట్టు / చెవికి చాటలు కట్టు** = ఎగతాళి చేయడం / అపహాస్యం పట్టించడం

**తాడూ పేడూ లేనివాడు** = చిల్లిగవ్వ కూడా లేనివాడు / ఆధారం లేనివాడు

**తాడూ బొంగరం లేనివాడు** = ఏమీ లేనివాడు

**తాడితన్నే వాడుంటే తలదన్నే వాడుంటాడు** = ఎవడికి వాడు తానే గొప్ప అనుకోవడం తగదన్న అర్థంలో ఎప్పటికప్పుడు ఒకరిని మించినవాడు మరొకడుంటాడని

**తాడో పేడో తేల్చు** = అటో యిటో పరిష్కరించడం

**తాతకు దగ్గులు నేర్పడమా?** = వాడి అనుభవం ముందు వీడి అనుభవం ఎంత అన్న అర్థంలో

**తాతలనాటినుండి** = తరతరాలుగా

**తానా అంటే తందానా అనడం** = వంత పాడడం / తాళం వేయడం / డబ్బాకొట్టడం

**తాబేలు నడక (పరుగు)** = నెమ్మది నడక

**తామరతంపరగా** = పరంపరాభివృద్ధిగా

**తారక మంత్రం** = ఉపాయ మంత్రం

**తిక్కమేళం** = వెర్రిబాగులతనం

**తిక్క శంకరయ్య** = వెర్రిబాగులవాడు

**తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టు** = ఉపకారం చేసిన

వాడికీ ప్రహారం వేయు
**తిప్పరాయు** = పెంకి / అరిరాయి
**తిరుక్షవరం** = పూర్తి నష్టం
**తిరుపతి క్షవరం** = [illegible] ([illegible]) ముఖ్యం కళ్యాణకట్టలో క్షురకులు తలనీలాలు ఇవ్వడానికి వచ్చిన వారికి క్షౌరం పూర్తిచెయ్యకుండా తలా ఒకరికి కొంచెం కొంచెం గొరిగి కూర్చోబెడతారు భక్తులు ఇంకో చోటుకి వెళ్ళడానికీ వీల్లేదు, అక్కడ పనీ పూర్తి కాదు ఇలాంటి పనికి ఇదీ పేరు
**తిలతండుల న్యాయం** = పాలూ నీళ్ళూ కలుస్తాయిగాని, బియ్యం నువ్వులు కలవవు అలా కుదరని సాంగత్యం గురించి చెప్పినప్పుడు ఈ ప్రయోగం
**తిలోదకాలు విడుచు** = తర్పణం చేయడం / పూర్తిగా వదిలేసుకోవడం
**తిష్టవేయు** = పీఠం వేయు
**త్రికరణ శుద్ధిగా** = మనస్ఫూర్తిగా (మనసా, వాచా, కర్మణా అని)

**తీర్చిదిద్దినట్లుగా** = అందంగా
**తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం** = దేనికదే
**తీసికట్టు** = తక్కువదని చెప్పడం ('ఎవరెన్ని చెప్పినా ఇప్పటికవులు శ్రీశ్రీకి తీసికట్టే')
**తీసిపోవు** = చిక్కిపోవు

**తుళ్ళిపడు** = అదిరిపడు / మండిపడు
**తుంగలోతొక్కు** = తీసిపారేయ్ / లెక్కించ వద్దు / ధ్వంసం చేయ్
**తుండూ తుపాకీ ఎగరగొట్టు** = తగినశాస్తి చేయు (అక్కడేదైనా కాని పని ఏదైనా చేశావా నీ తుండు తుపాకీ ఎగరగొడతారు సుమా!)
**"తునితగవు" (కోస్తా) / పామిడి పంచాయతీ (రాయలసీమ) / భట్టిప్రోలు పంచాయతీ (కోస్తాంధ్ర)** = స్థానిక సమస్యల విషయంలో ఒక్కొక్క చోట ఒక్కొక్క తీరున ఇలా సామెతగా వాడతారు. అటూ ఇటూ గాకుండా తెగకుండా మధ్యరకంగా చెప్పే తీర్పును అలా అంటారు "యజ్ఞం" కథలో శ్రీరాములు నాయుడి తీర్పులాగా!!
**తుర్రుమని పోవు** = ఉన్నట్టుండి ఇట్టే లేచిపోవు

**తూ చా తప్పకుండా** = పూర్తిగా (సంస్కృతంలో ఈ రెండు వర్ణాలను ప్రత్యేక అర్థం లేకపోయినా ఒకే సందర్భంలో వాడడం అలవాటుగా వచ్చింది అలాంటి నిరుపయోగ వర్ణాలను కూడా వదిలిపెట్టకుండా అన్న అర్థంలో వచ్చిన పలుకుబడి )
**తూ నా బొడ్డు** = చేసిన తప్పిదాన్ని ఇంతటితో సరి అని చెప్పుకోవడం
**తూరుపారబట్టు** = పొల్లు పోవడానికి ధాన్యాన్ని గాలికి ఎగురబోయు
**తూర్పూ పడమరా తెలియని** = ఏమీ తెలియనివాడు
**తూలనాడు** = అవమానించు / మాటలను (వాడు నన్ను అనవసరంగా తూలనాడాడంటే)

**తృణమో పణమో** = ఏ కొంచెమో / ఏ కొద్దిపాటైనా

**తెంపు చేయడం** = ధైర్యం చేయడం / తెగించడం
**తెగదెంపులు చేయు** = తెగించడం / వదిలించుకోడం
**తెగవేసి చెప్పు** = ఖచ్చితంగా / ఖండితంగా చెప్పు
**తెగిన గాలివటంలా** = స్వేచ్ఛా విహారిగా వ్యవహరించడం
**తెగేదాకా లాగొద్దు** = పట్టు విడుపులు ఉండాలని హితవు (ఏ సమస్యనయినా సామరస్యంగా పరిష్కరించుకోవాలిగాని తెగేదాకా లాగకూడదు)
**తెనాలి రామలింగని పిల్లి** = పాత అనుభవాన్నిబట్టి జాగ్రత్తగా వాళ్ళు దగ్గర పెట్టుకొనవలసిన సందర్భంగా ఉపయోగించే పలుకుబడి (దొరలానే కనిపిస్తాడుగాని వాడికి జేబులు కొట్టడం అలవాటు కాని ఓసారి పట్టుబడి బాగా తన్నులు తిన్నాడు మళ్ళీ జేబు కొట్టాలని ఉన్నా ఈ అనుభవం జ్ఞాపకం వచ్చి వాడు జేబుల వంక చూడ్డం మానేశాడు వాడి వాలకం అంతా తెనాలి రామలింగని పిల్లి వ్యవహారం (దీనికో కథ ఉంది: రాయలవారిచ్చిన పిల్లికి వేడిపాలు పెట్టి పాలంటేనే దానికి హడలెత్తించాడట రామలింగడు)
**తెరచి రాజను** = తోసిరాజను (చదరంగ భాష)
**తెరచిన కన్ను మూయలేదు మూసిన కన్ను తెరవలేదు** = వాడికి నాలుగు రోజులుగా ఆసుపత్రి డ్యూటీయే సరిపోయింది తెరచిన కన్ను మూస్తేనా!

**తెరమరుగైపోవు** = కనపడకుండా పోవు
**తెరవెనుక బాగోతం** = లోపల్లోపలి సాగే తతంగం / వ్యవహారం
**తెలివి తెల్లవారు** = తెలివిమాలి (వచ్చిన పని మరిచి తెల్లమొగమేసుకొని వెళ్ళిన చోటునే ఉండిపోయాడు వాడి తెలివి తెల్లవారా!)
**తెల్లనివన్నీ పాలనుకోవడం** = అమాయకత్వానికి నిదర్శనంగా వాడే పలుకుబడి
**తెల్లమొగము వేయు** = వెలా తెలా పోవు

**తేటతెల్లంగా** = స్పష్టంగా
**తేటలూరగ** = రసవంతంగా ("తేటలూరగ వింత పాటపాడు")
**తేనె పూసిన కత్తి** = 'నోట్లో ఎక్కెర కడుపులో కత్తెర' లాగా పైకి సౌమ్యుడుగా కనిపించినా దుర్మార్గుడని చెప్పే సందర్భంగా వాడకం
**తేనెలుట్టిపడేట్లు పలుకు** = మధురంగా మాట్లాడు
**తేరుకోడం** = కోలుకోడం (స్వస్థత)
**తేలు కుట్టిన దొంగ** = కుక్కిన పేనుమాదిరి పడి ఉండేవాడు / గప్ చిప్‌గా ఉండిపోయేవాడు (దొంగతనానికి వెళ్ళినవాడు కన్నంలో తేలు కుట్టినా గుట్టు చప్పుడు కాకుండా బాధను అనుభవించడం)

**తైతిక్కలాడు** = ఉత్సాహంలోగాని / కోపంలోగానీ ఎగిరెగిరి గంతులు వేయు
**తైరుకొట్టు** = పొగడు

**తొంటి చెయ్యి చూపు** = 'ఇదిగో చేస్తా, అదిగోచేస్తానని ఇప్పటిదాకా ఊరించి చివరికి తొంటిచెయ్యి చూపాడు' అన్న సందర్భంలో
**తొక్కు పలుకులు** = పిల్లల ముద్దు ముద్దు మాటలు
**తొట్రుపాటు** = తడబాటు
**తొడ పాయసం పెట్టు** = కొంచెంగా గట్టిగా తొడను నులిమేయడం (పంతులుగారు ఎన్ని చెప్పినా మాట వినలేదని శిష్యుడికి తొడపాయసం (తొడపాశం) పెట్టారు
**తొత్తుకు బడితొత్తు (తొత్తు కింద తొత్తు)** = బానిస కింద బానిస (ఒకడి కింద పడి ఉండేవాడు - ఒప్పులతో ఆత్మాభిమానంతో వాడికి సంబంధం లేదు )
**తొలి కోడి కూయగానే** = తెల్లవారిజామునే
**తొలుమాపు** = సాయంకాలం

**తోకకోసి సున్నం పెట్టు** = శాస్తి చెయు (వాడి ప్రవర్తన సరిగా లేదుగాని తోకకోసి సున్నం పెట్టండి )
**తోక తెగిన నక్కలా** = జిత్తులమారిలాగా (అవమానం పొందిన నక్క అది కనపడకుండా ఉండడంకోసం ఇలా తెగడం కూడా లాభమేనన్నట్టు బింకంగా తన గుంపులో గప్పాలు కొడుతూందట 'తోక తెగిన నక్క మూక కొలువు"
**తోక పీకుడుగాడు** = ఎటూ తేల్చుకోలేనివాడు వ్యవహారాన్ని ఎటూ తేల్చలేనివాడు
**తోక ముడుచుకుని** = మళ్ళీ నోరెత్తకుండా (వెళ్ళడం)
**తోడుదొంగలు** = చెడు పనిని ఇద్దరు కలిసి చేసినప్పుడు ప్రయోగించే పలుకుబడి
**తోడునీడ** = ఒకరికొకరు అండగా ఉండడం
**తోప రేగగొట్టు** = తోట వలిచేస్తానన్నట్టు "వాడిజోలికి వెళ్ళావా తోప రేగగొట్టేస్తాడు, జాగ్రత్త!"
**తోమి వదలిపెట్టు** = అదే పనిగా విసిగించేయడం

**దండోరా వేయు** = చాటింపు వేయు / చాటు
**దగుల్బాజి / దగాకోరు** = మోసగాడు
**దత్తపుత్రశోకం** = దొంగ ఏడుపు
**దత్తు తీసుకొను / దత్తత వెళ్ళు / దత్తుడు** = "సుబ్బారావుగారి రెండో అబ్బాయిని రామారావు దత్తత తీసుకొన్నాడు" / లక్ష్మీనర్సయ్య వెంకటనరసయ్యకు దత్తత వెళ్ళాడు / అలా దత్త స్వీకారం అయిన వాడిని ఇలా అంటారు
**దప్పి తీర్చుకోడం** = దాహం తీర్చుకోవడం / శ్రమ తీర్చుకోవడం
**దబాయింపులు** = బెదిరింపులు
**దమ్ముచేయు** = పొలంగా తడితడిగా ఉన్నప్పుడు బాగా దున్నడాన్ని ఇలా అంటారు
**దమ్ముపట్టు** = పొగపీల్చడం / ఊపిరిబిగపట్టడం
**దమ్ములు లేవు** = కలేజాలేదు / ధైర్యం లేదు
**దరీ దాపూ లేని** = అంతూ పొంతూ లేని

**దరిద్రనారాయణుడు** = పరిశ్రముడు
**దరిద్రుడి పెళ్ళికి వడగళ్ళ వాన** = ఏకీ కోరి వ్యవసాయం వేసే కాడీ మేడీ దొంగలు ఎత్తుకు పోయారన్నట్టుగా, వాడికి లేక లేక పెళ్ళి కుదిరితే ఆ పెళ్ళినాడె వడగళ్ళ వాన పడిందన్న అర్థంలో వాడే పలుకుబడి
**దరిమిలా** = (ఆ) తరువాత
**దర్యాప్తు చేయడం** = విచారణ జరపడం
**దవన పున్నమ** = శ్రీశైల మల్లికార్జుననిపై దవనం రెమ్మలు పోసి పూజించె రోజది ఇది చైత్రమాస పూర్ణిమ
**దవుడు తీయు** = పరుగుపెట్టు
**దశావస్థలు** = పది రకాల అవస్థలు : 'ప్రేమనిచ్చిన ప్రేమనిలుచును' అన్నట్టుగా ప్రేమ పరిధిలోని దశలివి అని ఆలంకారికుల అభిప్రాయం ఇవి: తలచడం, చూడడం, సంకల్పించడం, జాగరం చేయడం, కృశించడం, ఇతర వస్తువుల పట్ల విముఖత చూపడం, సిగ్గులేకపోవడం, ఉన్మాదం కలగడం, మూర్ఛిల్లడం, మరణించడం
**దస్తరం విప్పు** = సంభాషణ క్లుప్తంగా ముగించకుండా సోదిగా మాట్లాడేవారిపట్ల వర్తించే పలుకుబడి: "అదెందుకు అలా జరిగిందిరా" అన్నామంటే చాలు సొల్లు బసవయ్య ఇంక దస్తరం విప్పేస్తాడు"
**దస్తావేజు** = పరస్పరం రాసుకునే ఒప్పంద పత్రం

**దాకంత ముఖం / దాగరమంత ముఖం** = ముఖం ఇంత వెడల్పగు (సంతోషం ప్రకటించినప్పుడు వాడే పలుకుబడి )
**దాగుడు మూతలాట** = చిన్న పిల్లలాట ఒకళ్ళు కళ్ళుమూసుకోవాలి, మిగిలిన వాళ్ళంతా దాచుకొంటారు వాళ్ళను కళ్ళు మూసుకున్న దొంగ పట్టేసుకోవాలి ఎవరికీ చిక్కకుండా తప్పించుకొనే ఆట.
**దానివేలు తీసి దాని కన్నే పొడవడం** = ఎదుటి వారికి చెడుపు తలపెట్టినపుడు వాడే ప్రయోగం
**దామాషా లెక్కన** = రావలసిన మొత్తంలో భాగాన్నిబట్టి.
**దాయాదిపోరు** = తీరని పగ / వైరం
**దాసుడి తప్పులు దండంతో సరి** = ఆశ్రయించినవాడి తప్పులు క్షమించుగినవన్న అర్థంలో
**దాష్టీకం చేయడం** = జులుం వెలాయించడం

**దింపుడు కళ్ళం ఆశ** = చివరి ఆశ (ఒకవేళ పొంపాటున కొన వూపిరి ఎక్కడైనా ఉండి పోయిందేమో నని శవాన్ని కాటికి చేర్చే ముందు ఒకటికి రెండుసార్లు మధ్యలో దించి పరిశీలిస్తారు)
**దిక్కున్నచోట చెప్పుకో** = నీవేమీ చెయిలేవన్న ధీమాతో అహంకారంతో పలికేటప్పటి పలుకుబడి
**దిక్కులు చూడడం** = ఏం చెప్పాలో తెలియక ఎగాదిగా చూడ్డం (దిగ్భ్రాంతితో)
**దిక్కులు పిక్కటిల్లు / దిక్కులు ముట్టా** = అన్ని దిక్కులా ధ్వనించడం (నినాదాలిచ్చే సందర్భంలో, పెండ్లి బాజాలు మోగుతున్నప్పుడూ వాడే పలుకుబడి)
**దిగదుడుచు** = 'దిష్టి' తీయు (ఎదుటివారి అసూయా దృష్టి వల్ల చెడు జరుగుతుందని కొందరు భయంతోచేసే క్రియ )
**దిద్దుబాటు** = సరిచేయడం / సరిచేసుకోవడం (గురజాడ "దిద్దుబాటు" అనే మంచి కథ రాశాడు)
**దినబత్తెం** = రోజుకూలి
**దినవహి** = జమాఖర్చు
**దినవారాలు (దివసాలు)** = అంత్యక్రియలు
**దిబ్బడవేయు** = జలుబుచేసి ముక్కు, చెవులు మూసుకుపోయినట్టు ఉండడం
**దిమ్మతిరిగిపోవు** = తల తిరిగిపోవు
**దిష్టిపిడతలు** = నిష్ప్రయోజకుల గురించి చెప్పేప్పుడు వాడకం (పంటకళ్ళాల్లో పంట చూసి ఇతరుల కళ్ళు కుట్టకుండా దృష్టి దోష నివారణ కోసం బొమ్మల పిడతలు పెడతారు)

**దీర్ఘనిద్రపోవు** = చనిపోవు

**దుంపతెంచు** = అమితంగా కష్టపెట్టు
**దుంపనాశనం చేయు** = పూర్తిగా నాశనం చేయు
**దుకాణం కట్టిపెట్టు** = (ఇక) పనిముగించవయ్యా అన్నప్పుడు పలుకుబడి
**దుక్కిటెద్దు** = దున్నే ఎద్దు

**దున్నపోతుమీద వాన కురిసినట్టే** = లెక్కలేనితనం (పోలీసిపోలుసు ఏమన్నా / రాజకీయ వేత్తను ఏమన్నా దులుపుకుపోతారన్న సందర్భంలో వాడె పలుకుబడి)
**దుబారా మనిషి** = ఖర్చులు ఎక్కువ చేసేవాడు
**దుమ్మురేగకొట్టు** = కిందామీదా చూడకుండా కొట్టడం/ "ఈవెళ సభలో మాట్లాడుతూ ప్రత్యర్థుల్ని మావాడు దుమ్మురెగ కొట్టైశాడు" (విమర్శ దృష్టితో)

**దూర్వాసమహాముని** = కోపిష్ఠి "మీ నాన్నతో ఏగలేకపోతున్నారా మహా దూర్వాసుడ్రా"

**'దేవతాపులుసు'** = జైళ్ళలో నాల్గవ (సి) తరగతి ఖైదీలకు పోసే పులుసు నాసిరకం పులుసు
**దేవతా వస్త్రాలు** = కనపడనివి / లేనివి / కేవలం ఊహా మాత్రాలు
**దేవ రహస్యాలు** = చెప్పకూడని విషయాలు
**దేవుడిచ్చినా పూజారి వరమీడు** = కామందు పిలవనంపినా కాపలావాడు వదలనట్టు

**దొడ్డి సంభావనలు** = అంతగా చదువు సంధ్యలు లేనివాళ్ళకు దొడ్లోకి పిలిచి ఇచ్చే కానుకలు, గట్రా (వెనకటి రాజులు ఈ పనిచేసేవారు)

**దోమాడకరణం**=జిడ్డులా వదలనివాడు ('ఆ పని ఇప్పుడు కాదు, తర్వాత చూస్తాలెమ్మని చెప్పినా వాడు విడవకుండా దోమాడకరణంలా వెంటబడుతున్నాడు')
**దోరపండు (దోర కాయ)** = మాగీ మాగని పండు / కాయ

**ధగధగద్ధగలు** = మిరుమిట్లుకొలిపే వెలుగు / ప్రకాశం
**'ధనియాల జాతి'** = మొండి మూక / చెడ్డవాళ్ళు చెప్పుదెబ్బలు పడితే తప్ప వినేరకం కాదన్న సందర్భంలో వాడుక (ధనియాలను చెప్పుతో నలిచిగాని చేలో చల్లరు అప్పుడుగాని అవి మొలకెత్తవని అర్థం) అయితే దీన్ని జాతివాచకంగా వాడకూడదు అసలలాంటి జాతి లేదు కేవలం మొండి ఘటాల విషయంలోనే ప్రయోగం

**ధర పలుకు** = గిరాకీ హెచ్చు
**ధర్మ పన్నాలు చెప్పు** = తనను మినహాయించుకొని ఇతరులకు నీతులు చెప్పడం / శ్రీరంగనీతులు చెప్పు
**ధర్మ పిండం** = ఉచితంగా అమరిన తిండి
**ధర్మకాహాళపట్టు** = యుద్ధం ఆగిపోయినట్టు సూచిస్తూ బాకా ఊదడం
**ధర్మరాజు** = ఉత్తముడు / ఎవరిజోలికీ పోనివాడన్న అర్థంలో
**ధర్మ సందేహం** = నిర్ణయించడంలో ఎదురయ్యే క్లిష్ట పరిస్థితి ("వాడు చెప్పినవన్నీ బాగానే ఉన్నాయి గాని ఒక్క విషయంలోనే ధర్మ సందేహం ఉంది")
**ధర్మ సత్రం** = ఉచితంగా భోజన వసతి స్థలం (దీన్ని సదుద్దేశంతోనూ వాడొచ్చు వాళ్ళింట్లో అతిథుల్ని ఆదరిస్తారు లేదా వ్యంగ్యంగానైె వాడొచ్చు 'ఇదేమన్నా ధర్మ సత్రం అనుకున్నావా, ప్రతివాడినీ ఆదుకోవడానికి'

**ధాంధూంలు చేయడం** = కోపంతో ఎగరడం / జబర్దస్తీ చేయడం
**ధారాదత్తం చేయు** = దానం చేయడం (మంచి అర్థంలో) / వాడికి అంతా ధారాదత్తం చేసి ఇప్పుడు ఏడిస్తే లాభం ఏమిటి? (వ్యంగ్యార్థంలో)
**ధారాపాతంగా** = కుండపోతగా (వాన)

**ధుమధుమలాడడం** = కోపించడం (ధూ / సలక్షణం)

**నంగనాచి** = పైకి అమాయకంగా కన్పించడం, తను చేసే పని చేసేయడం (దెప్పేటప్పుడు ప్రయోగం)
**నంగనాచి టుంగుబుర్ర** = (ఎత్తిపొడుపుగా అనడం : "నీకేం తెలియదే నంగనాచి టుంగుబుర్ర"
**నం దంటే నంది పం దంటే పంది** = మొండివాడు రాజుకంటే ఘనుడన్నట్టు వాడిమాటే వేదవాక్కుగా చెలామణీ అవుతోంది అని చెప్పే సందర్భంలో ప్రయోగం
**నందిని పందిని చేయు** = మంచిని చెడుగాను, చెడును మంచిగానూ చిత్రించడం
**నకనకలడు** = ఆకలితో బాధపడు.

**నక్కజిత్తులు** = దొంగ యుక్తులు / కుయుక్తులు
**నక్కను తొక్కి రావడం** = అదృష్టం కలగడం (నక్క జిత్తులు కుయుక్తులైనప్పటికీ నక్కను తొక్కి రావడం సమస్త్రీ ఎలా అయిందో తెలియదు. ఏదో విధ్యాపం "పిల్లకి ఇంత కట్నం పెట్టినవాడు వాడికి అయిదు బహుమతులిచ్చాడు వాడెవరో నక్కను తొక్కి వచ్చి వుంటాడు )
**నక్క వినయం** = వట్టి నటన
**నఖశిఖ పర్యంతం** = పిలువెల్లా (పరిశీలించడం) "పిల్లకి తగిన పిల్లవాడో కాదో అని పిల్ల తండ్రి పిల్లాడ్ని నఖశిఖపర్యంతం చూశాడు) - కాలిగోటినుంచి తలదాకా పరిశీలించడం
**నగనట్రా** = ఆభరణాలు / సొమ్ములు
**నలుగురిలో నగుబాటు** = అపహాస్యం / అవమానం
**నట్టేటముంచు** = మధ్యలోనే ముంచు (నమ్మిన వాడిని నట్టేటముంచు)
**నడమంత్రపు సిరి** = మధ్యలో వచ్చిన సిరి / సౌభాగ్యం (ఎద్దేవగా వాడకం)
**నడిపద్దు** = మధ్యాహ్నం
**నడిరేయి** = అర్ధరాత్రి
**నడివీధికెక్కు** = నలుగురి ఎదుటా పడడం (తేలికవడం)
**నడుం వాల్చు** = విశ్రాంతి తీసుకొను
**నడుం బిగించు** = పనికి సిద్ధం కావడం
**నడ్డి విరగదన్ను** = చావబాదు
**న భూతో న భవిష్యతి** = అరుదు (ఇంతకు ముందు లేదు, ఇకపైన ఉండోదు) "వరుసగా పాలికేళ్ళ పైబడి జైలులో గడిపిన నెల్సన్ మండేలా లాంటి వాళ్ళు నభూతో నభవిష్యతి" )
**నన్ను చంపొద్దు** = విసిగించకు / వేధించకు
**నమిలి మింగుదామని ఉండడం** = అతికోపంగా ఉండడం "ఆ చూపులేమిట్రా నాయనా నన్ను మిలి మింగుదామని ఉందా ఏమి?"
**నమ్మించి గొంతుకోయు** = విశ్వాసఘాతుకుడు కావడం
**నమ్మినబంటు** = విశ్వాసం వున్నవాడు
**నయానా భయానా** = బుజ్జగించో, బెదిరించో ఎలాగొలా
**నరం లేని నాలుక** = మాట నిలకడ లేకపోవడం ("వాడు చెప్పే మాటలు నముమతున్నావా? వాడి నాలుకకు ఎంత తెగులురా నాయనా')
**నలభీమ పాకం** = మంచి వంట (నలుడు, భీముడు ఎరిగిన వంటవాళ్ళు అన్న అభిప్రాయంపై వచ్చిన పలుకుబడి
**నలుగురితో నారాయణ** = అందరి వాటే మన వాటి అనుకోవడం
**నలుగురి నోళ్ళలోపడకు** = చెడ్డపేరు తెచ్చుకోకు
**నలుగురి నోళ్ళలో నాను** = చెడ్డపేరు తెచ్చుకొను
**నలుగురిలో తలెత్తుకు తిరుగు** = సగర్వంగా బతుకు
**నల్లపూసగు** = అరుదుగా కనిపించడం ("వాడు ఈ మధ్య నల్లపూస అయిపోయాడు మా ఇంటికే రావడం లేదు")
**నల్లెరుతో నలుగుపెట్టు** = బాదించడం (నల్లేరు దురదపెడుతుంది ఎత్తిపొడుపుగా ఇలా అంటారు)
**నల్లేరుపై బండి నడక** = ఆటంకం లేకుండా సాగిపోవడం (వాడికి అశుకవిత్వం అంటే నల్లేరుపై బండి నడకే)
**నవరత్నాలు** = తొమ్మిది రకాల రత్నాల్లాగా విక్రమార్కుని ఆస్థాన కవులకు ఈ పేరు పెట్టారు వారు: అమర సింహుడు, ధన్వంతరి, క్షపణకుడు, శంకరుడు, బేతాళభట్టు, ఘటకర్పరుడు, కాళిదాసు, వరాహ మిహిరుడు, వరరుచి
**నవరాత్రులు** = తొమ్మిది రోజులు చేసుకొనే ఉత్సవాలు
**నవ్వితే నవరత్నాలు రాలు** = అంత అపురూపమైన నవ్వు / అందమైన నవ్వు
**నవ్వుతా(టా)లకు నవ్వులాటకు** = హాస్యానికి "అంత కోపం ఎందుకయ్యా, నవ్వుతాలకంటే!"
**నవ్వు నాలుగిందాల నష్టం** = అతి అపహాస్యం మంచిది కాదనడం
**నవ్విన నాపచేనే పండింది** = ఎందుకూ కొరగాడను కున్నవాడే అభివృద్ధి చెందినప్పుడు యిలా అంటారు
**నసాళానికి అంటు** = (అ)"ఆకూరేమిటి? ఆ వంట ఏమిటి అంత కారమా? నసాళానికి అంటింది"
(ఆ) "అన్నీ విని వాడికి నసాళానికి అంటేట్టు పెట్టవలసిన నాలుగూ పెట్టాడు"

**నాపసాని (నాగపసాని)** = పెళ్ళిళ్ళలో నాగవల్లి నడిపే

ముత్తైదువ అంటే నాయకురాలు లాంటిదని (అయితే ఆడపిల్ల చిన్నతనంలోనె పెద్ద పెద్ద కబుర్లు చెబుతున్నప్పుడు కూడా ఏమిటా నాపసాని కబుర్లు" అనడం అలవాటు) పెండ్లిలో ఆఖరి అంతు నాగవల్లి

**నాథుడు లేడు** = దిక్కులేడు ('ఆ కొంపలో ఇవతలపుల్ల అవతల పెట్టే వాళ్ళు లేరు అక్కడ మాసె నాథుడు లేడు")

**నానా గడ్డీ కరచి** = ఎటువంటి నీచానికైనా పాల్పడి

**నాసుడువాన** = పొడిచినుకులు / బట్టతడుపు వాన

**నామాలు పెట్టు**= మోసగించు

**నాలుక కరచుకొను** = తప్పు తెలుసుకొను / పొరపాట యుందని గ్రహించు

**నాలుక పిడచ కట్టుకొని పోవు** = విపరీతంగా దాహం అగు

**నాలుక పీక్కున్నా** = ఎంతగా బాధపడినా

**నాలుకా తాటిపట్టా** = నాలుకకు నరం లేదన్నట్టుగా ఇతరులు అబద్ధమాడినప్పుడు ప్రయోగించవలసిన పలుకుబడి "డబ్బు అనుకున్న సమయానికి అందిస్తానని మాట ఇచ్చావు అయినా లాభం లేకపోయింది అదేం నాలుకా, తాటి పట్టా?"

**నాలుగు కాయలు కాయు** = సంతానవతి కావడం / కడుపు పండడం

**నాలుగు రాళ్ళు సంపాదించు** = ఎంతో కొంత డబ్బు సంపాదించు.

**నాలుగూ పెట్టి పంపించు** = తిట్టి పంపించు

**నిండుకుండలా** = గంభీరంగా

**నిండుకొను** = ఖాళీ అగు

**నిండు మనిషి** = గర్భిణి (ఇటీవలనే మా అమ్మాయి నిండు మనిషి అయింది మంచి ముహూర్తం చూసి ఇంటికి తీసుకొచ్చాం.)

**నిక్కీ నీల్గీ** = ఆలస్యంగా (అల్లుడొచ్చేదాకా అమావాస్య ఆగదన్నట్టు. పనివాడు నిక్కీ నీల్గీ వచ్చేదాకా ఎక్కడి మాలోకం అక్కడే ఉండాలా?)

**నిజం నిలకడ మీద తెలుస్తుంది** = నిష్కారణంగా అపవాదు వచ్చినప్పుడు భరోసాతో అనేమాట

**నిత్యకళ్యాణం పచ్చతోరణం** = ఎప్పుడూ హాయిగా సుఖశాంతులతో సిరి సౌభాగ్యాలతో వర్ధిల్లుతూ ఉండడం

**నిదరమొగం** = తెలివిమాలినవాడు

**నిద్రాహారాలు లేకుండా** = ఒకటే దీక్షతో

**నిప్పుకు చెదలంటుతుందా?** = పవిత్రమైనవాటికి మైల అంటదనడం

**నిప్పుతో చెలగాటం** = ప్రమాదకరం

**నిప్పులుకక్కడం** = క్రోధం వెళ్ళగక్కడం

**నిబద్ధత** = మాటకు కట్టుబడి వుండడం / ఒక సిద్ధాంతానికి కట్టుబడి వుండడం

**నిబద్ధిమనిషి** = సత్యవాది (పెన్నేటిపాటలో విశ్వం: 'పత్తినారపరెడ్డి నిబద్ధిమనిషి ')

**నిమ్మకు నీరెత్తినట్లు** = నిమ్మచెట్టుకు ఎంత నీరుపోసినా పోసినట్టుండదు బాగా పీల్చేస్తుంది పీల్చినకొద్దీ ఏపుగా ఉంటుంది చెట్టు (ఈ పలుకుబడిని పొగడ్తగా వాడతారు "వాడ్ని పొగిడావా నిమ్మకు నీరెత్తినట్టు అవుతుంది" తెగడ్త "వాడికి ఎంత లప్ప వచ్చిపడ్డా బహు ప్రశాంతంగా ఉంటాడు" ఉలకడు, పలకడన్న అర్థంలో

**నిర్ధూమధామం చేయు** = సర్వ నాశనం చేయడం

**నిర్వాకం** = ఉద్ధరింపు (వ్యంగ్యార్థంలో వాడకం: "పెళ్ళిపెళ్ళంటూ చేసిన నిర్వాకం చాలు నాయనా! మళ్ళీ ఏ మొగం పెట్టుకొని వచ్చావ్?"

**నిలుగుడ్లుపడు** = చావు దగ్గరపడడం / కనుపాపలు కదలకుండా నిల్చిపోవడం

**నిలుచున్నపాళాన రమ్మన్నాడు** = త్వరగా / వెనువెంటనే

**నిలువు జీతం** = నిలబడిపోవడం కూర్చోమన్నా కూర్చోకుండా అలా నిలబడి వున్న వాడ్ని 'ఎంత ఇస్తున్నార్రా నీకు నిలువు జీతం' అనడం కద్దు )

**నిలువు దోపిడీ** = సర్వస్వం దోపిడీ చేయడం

**నిలువునా నీరైపోవు** = నిర్విణ్ణుడైపోవు

**నిలువునా పాతివేయు** = ఓ తిట్టు ('నిన్న చేసినట్టే మళ్ళీ ఇవాళ అదే పని చేశావంటే నిన్ను నిలువునా పాతేస్తా')

**నివురుగప్పిన నిప్పు** = పైకి సాదాసీదాగా కన్పిస్తాడు. గాని ఆయన చాలా లోతైన మనిషి "నివురుగప్పిన

నిప్పు"లాంటివాడు
**నీ ఇల్లు దొంగలు దోల** = ప్రేమపూర్వకంగా "నీ ఇల్లు బంగారంగాను" అనడం
**నీటముంచినా, పాలముంచినా** = ఏమి చేసినా నీవే దిక్కని అనడం
**నీటిమూట** = అనిత్యం / అసంభవం
**నీ నొసటనే పొద్దు పొడిచిందా ?** = నీవే గొప్పదానివా? నీదే పెత్తనమా?
**నీ ముఖం నా మోర** = 'నీ ముఖం నా మోర' - నీ పిచ్చిగాని ఆ పని అప్పుడే అయి చచ్చిందటలే'
**నీరుకారిపోయాడు** = దిగాలుపడిపోయాడు / ఉత్సాహం కోల్పోయాడు ('మాటంటే చాలు అంత నీరుగారిపోయే వాడివి, ఏం నిర్వాకం చేస్తావురా')
**నీలాటిరేవు** = స్నానాల రేవు
**నీలాపనిందలు** = లేనిపోని అపవాదులు
**నీలివార్త** = గాలివార్త / అసత్యం
**నీళ్ళునములు** = అడిగిందానికి బదులు చెప్పలేక గుటకలు మింగడం ("తీసుకెళ్ళిన డబ్బు ఏం చేశావురా అంటే అలా నీళ్ళు నములుతావేమిటిరా")
**నీళ్ళు పోసుకొను** = గర్భిణి అగు
**నీళ్ళు వదులుకున్నాడు** = ఆశవదులుకున్నాడు

**నుడికారం** = జాతీయం / పలుకుబడి (పదబంధం వల్ల కలిగే విభిన్నార్థ స్ఫూర్తి )

**నూటికొకరు, కోటికొకరు** = అరుదు
**నూరిపోయు** = బోధించు / పారం వచ్చేదాకా రుద్దు
**నూలు వాసిలో తప్పిపోవు** = కొద్దిలో తప్పిపోవు

**నెత్తికి కళ్ళు వచ్చు** = పొగరెక్కు
**నెత్తికెక్కు** = 'గారం చేసినకొద్దీ వాడు నెత్తికెక్కుతాడు' (గారంతో అధికారం చెలాయించజూడ్డం / పెత్తనం చేయ చూడడం)
**నెత్తిన గుడ్డవేసికొనిపోవు** = గతిలేక దిక్కులేక ఎటో పోవడం.
**నెత్తిన నోరు పెట్టుకొని** = 'ఎన్ని చెప్పాను వాడికి జాగ్రత్తగా ఉండరా బాబూ అని - నెత్తిన నోరు పెట్టుకొని, అయినా లాభం లేకపోయింది'
**నెత్తి నోరు బాదుకొను** = తాను తప్పు చేయలేదని వాడు నెత్తినోరు బాదుకొని చెబుతున్నాడు
**నెత్తిపైన చేతులు పెట్టు** = మోసగించు
**నెత్తి వాచేట్టు చీవాట్లు** = గట్టిగా మందలించడం
**నెత్తురుపొద్దు** = మధ్యాహ్నం
**నెత్తురుగుడ్డు** = పసిపాప
**నెమరుకు రావడం** = గుర్తుకురావడం
**నెరజాణ** = నేర్పరి
**నెలకూన** = బాలచంద్రుడు (నెలవంక)

**నేలపొడుపు** = చంద్రోదయం
**నేతిబీరకాయ** = సారం లేనిది / సార్థకం కానిది
**నేలకూ నింగికి ముడివేయడం** = అసాధ్యమైన పనులు చేయగలడనడం
**నేలజూచు** = "అడిగిందానికి సమాధానం ఇవ్వకుండా అలా నేలకేసి చూస్తాదేమిటి?" (అవమానంతో తలదించడం)
**నేలనాలుగు చెరగులా** = దేశం నలుమూలలా / దేశమంతటా
**నేలపాలు చేయు** = నాశనం చేయు / పాడుచేయు
**నేలమట్టమగు** = కూలడం / ధ్వంసం కావడం
**నేలమీద నూకలు లేవు** = ఆయుస్సులేదు
**నేలయీనినట్లు** = ఎక్కువ సంఖ్యలో / విపరీతంగా (జనం పోగుబడడం / సభకు రావడం)
**నేలవిడిచిన సాము** = ఆధారం లేనిది

**నొసటి రాత (వ్రాలు)** = విధి / దైవలిఖితం (ఎలా జరిగేది అలా జరుగుతుందన్న నిరాశతో అనే మాట )

**నోచినవారు** = అదృష్టవంతులు / కలిసివచ్చినవారు
**నోటికాడ కూడు** = 'ఉద్యోగం తీసేసి వాడి నోటికాడ కూడు పడగొట్టావుగదయ్యా!" / జీవనం
**నోటికి తాళం వేయు** = మారుమాటాడకుండా నోరు మూయించు
**నోటిలో నాలుక లేదు** = అమాయకుడు మాట్లాడలేనివాడు.

**నోటిలో వేలుపెట్టినా కొరకలేడు** = (వ్యంగ్యార్థంలో) 'పాపం వాడొట్టి అమాయకుడు రయ్యా! నోట్లో వేలుపెట్టినా కొరకలేడు!'
**నోట్లో నువ్వుగింజ నానదు** = (వాడెవ్వరి) రహస్యం దాచడు
**నోరార మాట్లాడు** = మనసారా / సంతృప్తిగా మాట్లాడు
**నోరుతెరిస్తే ఒట్టు** = ఎన్నోత్రి మాట్లాడకపోవడం

**పంగనామాలుపెట్టు** = తిరిగబడడం / మాట వినకపోవడం ("గురువుకే పంగనామాలు పెట్టాడు వాడు నీకూ నాకూ ఎందుకు పెట్టడు?")
**పంచతన్మాత్రలు** = శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు
**పంచప్రాణాలు అప్పగించు** = అమితమైన ప్రేమతో చూడడం
**పంచబంగాళమగు** = చెల్లా చెదరగు
**పంచ'భూతాలు'** = పృధ్వి, ఆపస్సు, తేజస్సు, వాయువు, ఆకాశం
**పంచాగ్నులు** = జ్ఞానాగ్ని, కాలాగ్ని, క్షుధాగ్ని, శీతాగ్ని, కోపాగ్ని (ఈ అయిదు అగ్నులు అర్క, పాద, నాభి, హృదయ, నేత్రాలలో ఉంటాయని ప్రసిద్ధి )
**పండా? కాయా?** = వెళ్ళిన పని అయిందా లేదా? కార్యం నెరవేరితే పండు, నెరవేరకపోతే కాయ అని విశ్వాసం
**పండొలిచి చేతికిచ్చినట్లు** = స్పష్టంగా చెప్పడం (ఆయన శాస్త్ర విషయాలు పండొలిచి చేతిలో పెట్టినట్టే చెబుతాడు )
**పండ్లు పీకి చేతికిస్తా** = శిక్షించు
**పందిని నంది చేయడం** = తారుమారు చేయడం / తలక్రిందులుచేయడం
**పక్కలో బల్లెం** = (గుండెలో గాయం లాంటిది ) నిరంతర భయ కారణం
**పటాటోపం** = డాబు / దర్పం
**పటాపంచలగు** = చెల్లాచెదరులగు
**పట్టపగ్గాలు లేవు** = పట్టశక్యం కాదు (ఏ సంతోషం వచ్చినా వాడికి పట్టపగ్గాలుండవు)
**పట్టాలు తప్పాడు** = మార్గం తప్పాడు / స్థిరత్వం కోల్పోయాడు

**పట్టినదెల్ల బంగారం** = 'వాడు ఏ పనులు పెట్టినా, పట్టిందెల్లా బంగారంలా వాడికి కలిసొస్తోంది' అన్ని [illegible] వున్నాయి
**పట్టిపల్లార్చు** = నాశనం చేయు
**పట్టుగొమ్మ** = ఆధారం (ఆ కుటుంబానికి తాతగారే పట్టుగొమ్మ, లేకపోతే ఈ పాటికి ఏమైపోయేదో ఏమో!")
**పట్టుమని పదికాలాలపాటు** = కొంతకాలంపాటైనా
**పట్టువిడుపులు** = మొండితనం లేకుండా సమయ సందర్భాన్నిబట్టి, పట్టు, విడుపూ ఉండాలని
**పడికట్టురాళ్ళు** = (ఎత్తిపొడుపుగా వాడకం) ముందే ఏర్పరచుకున్న భావాలు / మాటలు 'వాడు సిద్ధాంతాలు బాగానే వల్లిస్తాడుగాని వచ్చే కొన్ని పదాలు అలా ఎప్పుడూ పడికట్టురాళ్ళలా వాడుతుంటాడు'
**పడిగాపులుకాయు** = వేచియుండు
**పడుగు పేకలా** = కలగలిసిపోవడం ('వాళ్ళ దాంపత్యం పడుగుపేకలా పొరపొచ్చాలు లేకుండా ఉంది')
**పదిమందినోళ్ళలో పడడం** = ఎకసెక్కాలకు / దూషణకు గురికావడం
**పనసపండులాంటి బిడ్డ** = అందమైన / దృఢంగా వున్న బిడ్డ
**పప్పుజారినట్లు జారు** = జావజావయిపోవు / నీళ్ళుగారిపోవు
**పప్పులో కాలువేయు** = తప్పుచేయు / పొరపాటుచేయు
**పరగడుపు** = అన్నం తినకముందు (మందు ఎప్పుడూ పరగడుపున వెనుకోకూడదు)
**పరమానందయ్య శిష్యులు** = పనికిమాలినవాళ్ళు / బుద్ధిలేనివాళ్ళు
**పరశుప్రీతి అగు** = కాలిపోవు ("రాత్రికి రాత్రి పాటిమీద ఇళ్ళన్నీ పరశురామ ప్రీతి అయిపోయాయి")
**పలాయనం చిత్తగించు** = అయిపు లేకుండా పారిపోవు / ఉడాయించు
**పలుకే బంగారమగు** = మాట్లాడడమే అపురూపం.
**పస బయటపడు** = బంగారం బయటపడు.
**పసిడిపలుకులు** = మంచి మాటలు / సుభాషితాలు
**పసుపు కుంకుమలకుగాను** = కూతురు పెళ్ళి సందర్భంగా లేదా ఆ తర్వాత ఆమెకోసం ఇచ్చే ఆస్తి

**పాచికపారు** = ఎత్తు ఫలించడం / పన్నుగడ సఫలం కావడం

**పాతికో పరకో** = ఏ కొంచెమో!

**పాతాళ ప్రశ్న** = అంతు తెలని (లోతు తెలీని) ప్రశ్న

**పానకంలో పుడక** = అడ్డుపుల్ల / విఘ్నం

**పాము చెవులు** = ఎంత మెల్లగా మాట్లాడినా వినగల శక్తి ఉందనడం 'వాడివా! అమ్మో! పాము చెవులు జాగ్రత్తగా మాట్లాడుకోండి'

**పాలబుగ్గలు** = పసితనం / లేతబుగ్గలు

**పిండికొలది రొట్టె** = శక్తికొలది / ఉన్నదానిలోనే సరిపుచ్చుకోవడం

**పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం** = పుల్లాకుని బల్లెంతో తూటుగా పొడిచినట్టుగా చిన్న పనికి అంత పెద్ద ప్రయత్నం అనవసరం / లేనివాడిమీదికి ఉన్నవాడు ఒంటికాలుమీద ఎగబడినప్పుడు ఇలా అంటారు

**పిడతముఖం** = మందమతి / తెలివితేటలు కొరవడినవాడు

**పిడివాదం** = మొండివాదం

**పిదప బుద్ధులు** = కొంచెపు (నీచ) బుద్ధులు

**పిప్పళ్ళు బస్తాలా అగు** = బలిసిపోయాడని చెప్పేటప్పుడు వాడకం

**పిరికిమందు పోయు** = భయపడేట్లు చేయడం

**పిలువని పేరంటం** = ఆహ్వానం లేకుండా వచ్చేవాళ్ళకి వర్తింపు / అడక్కపోయినా తగుదునమ్మా అని సలహాలిచ్చేటప్పుడు కూడా వాడకం

**పిల్లకాకికేం తెలుసు?** = చిన్నవాడికేం తెలుసు (అనుభవం లేదని చెప్పడం)

**పిల్లి అంటే మార్జాలం** = (హేళనగా వాడకం) అర్థంగాని ఒక మాటకు అంతకంటే అర్థంకాని మాటలో పదాన్ని చేర్చడానికి ప్రయత్నించినప్పుడు వాడే పలుకుబడి

**పిల్లినడక** = చడీ చప్పుడూ లేకుండా నడిచే నడక.

**పిల్లిజపం** = దొంగజపం.

**పిల్లికి భిక్షం పెట్టడు** = పిసినారివాడు.

**పిల్లి కళ్ళుమూసుకొని పాలు తాగినట్లు** = ఇతరులు చూడడం లేదనుకొని తప్పుడు పనులు చేసినప్పుడు వాడకం.

**పిల్లి పిల్లలను మార్చినట్టు** = ఎప్పటికప్పుడు కాపురం మార్చేవాళ్ళ గురించిన పలుకుబడి (పిల్లి తన పిల్లల్ని ఒక్క చోటనే ఉండనీదు మారుస్తూ ఉంటుంది)

**పీకమొయ్యాతిను** = కుతికివరకూ మెక్కడం

**పీకిపాకాన పెట్టు** = ఏడిపించడం

**పీనుగుతో జాగారం** = నిష్ప్రయోజనమని చెప్పడానికి పలుకుబడి

**పుంఖానుపుంఖంగా** = ఎడతెరిపి లేకుండా / వరస వరసనే

**పుక్కిటపట్టు** = ఆపోశనపట్టడం (అన్నీ ఆకళింపు చేసుకొన్నాడని చెప్పినప్పుడు ప్రయోగిస్తారు)

**పుక్కిటి పురాణం** = వృథా కాలక్షేపం / లోకాభిరామాయణం

**పుట్టి మునగడం** = ప్రమాదానికి లోనుగావడం / ప్రాణంమీదికి రావడం (పుట్టి అంటే పడవ లేదా బల్లకట్టు)

**పుణికి పుచ్చుకోవడం** = తనదిగా స్వాయత్తం చేసుకోవడం (వాడు మేనమామ గుణాలన్నీ పుణికిపుచ్చుకున్నాడు)

**పుణ్యమా, పురుషార్థమా** = ఇహమా, పరమా అన్నట్టు

**పురాణం విప్పడం** = గతించిన కథ / గాథ తవ్వడానికి ప్రయత్నించడం

**పురుగు తొలచడం** = వాడి బుర్రలో ఎప్పుడూ ఏదో ఒక పురుగు తొలుస్తూనే ఉంటుంది

**పుర్రు పుర్రు** = బురద బురద

**పులితేపులు** = అజీర్తివల్ల వచ్చే తేపులు

**పులిబిడ్డ** = సాహసవీరుడు / ధైర్యశాలి

**పులుగడుగు** = శుభ్రం చేయడం (పుళి = చింతపండు చింతపండు పులుసుతో తోమిన పాత్రలు శుభ్రంగా ఉంటాయి )

**పుల్లయ్య వేమవరం పోయివచ్చినట్లు** = ఏదో వెళ్ళొచ్చాడు, అంతే. ఎందుకు వెళ్ళమన్నారో తెలుసుకోకుండానే వెళ్ళాడు, వచ్చాడు అన్న సందర్భంలో వాడే వ్యంగ్యోక్తి.)

**పుల్లవిరుపు మాటలు** = ఎత్తిపొడుపు మాటలు

( వాళ్లేవయ్యా నీ పుల్లవిరుపు మాటలూ, నీవూను')
**పువ్వులమ్మిన చోటనే కట్టెలమ్మడం / పువ్వులమ్మిన చోటనే పుల్లలమ్మడం** = ఒకప్పుడు బాగా బతికి అర్వాత చితికిపోయి నానా కష్టాలు పడే మనుషుల ప్రస్తావన వచ్చినప్పుడు వాడే పలుకుబడి

**పూర్ణానుస్వారం** = శూన్యం (వాడి చదువు వానాకాలపు చదువన్నట్టుగానే వాడికి చదువు పూర్ణానుస్వారం, అంటే శూన్యమని చెప్పడం )
**పూర్ణాహుతి కావడం** = ప్రాణత్యాగం
**పూవుల్లో పెట్టి పూజించు** = ఎంతో ఆదరంతో గౌరవించడం
**పూసల్లో దారంలా** = అన్యోన్యంగా కలిసిమెలసి

**పెంకితనం** = మొండితనం 'వాడి పెంకితనం మూలంగానే కొంపకింత నష్టం దాపురించింది'
**పెండ్లీ పెటాకులు లేవు** = బ్రహ్మచారి గురించి నిరసనగా అనేమాట "వాడికి పెళ్ళా పెటాకులా? ఎక్కడ చూచినా వాడే"
**పెట్టిపుట్టు** = "వాడికేం? ఇవతల పుల్ల అవతల పెట్టకపోయినా చెల్లుబాటవుతుంది దేనికైనా పెట్టిపుట్టాల్రా నాయనా!"
**పెట్టుపోతలు** = పోషణ (వాడి మేనమామ గొప్ప మనసున్నవాడు వాడికి పెట్టుపోతలకేమీ పికరు లేదు)
**పెడచెవిని పెట్టు** = పట్టించుకోకపోవడం (నీవు ఎన్నిచెప్పు, వాడు పెడచెవిని పెడతాడు)
**పెడసరపు మనిషి** = మూర్ఖుడు / ఎవరి మాటా వినడు
**పెద్ద మనసు చేసుకొని** = ఉదార బుద్ధితో ఉండడం ("మరీ అంత పీనాసిగా ఉండకు, కాస్త పెద్ద మనసు చేసుకో").
**పెప్పెపె మెమ్మెమె అను** = ఏమీ చెప్పలేక నంగినంగిగా మాట్లాడడం. (నిరసనగా వ్యంగార్థంలో ప్రయోగం).
**పెరుమాళ్ళకెరుక** = దేవుడికెరుక (వాడు ఆ కార్యం ఎలా సాధించాడో బాబు, ఆ పెరుమాళ్ళకెరుక).
**పెళ్ళినడకలు మాను** = నత్తనడకలు మాను

**పేదవాడి కోపం పెదవికి చేటు** = అసమర్థుణ్ణి ఉద్దేశించిన ప్రయోగమే అయినా నిజంగా నిరుపేదకు కోపం వస్తే మాత్రం ఎవడు పట్టించుకుంటాడు, వ్యర్థం అన్న అర్థంలో కూడా వాడతారు
**పెదరుపులు వద్దు** = దీనాలాపాలు వద్దు
**(నిండు) పేరోలగం** = నిండు సభ
**పేలపిండిగా** = అవలీలగా 'వాడు ఏ పుస్తకం చదివినా వాడికి అదో పేలపిండి లెక్క'

**పైత్యరోగికి పంచదార చేదు** = ఎదుటివాడి దృష్టిలో దోషమేగాని తాను చెప్పింది నిజమన్న సందర్భంలో వాడకం
**పైప్రాణాలు పైనే పోవు** = నిశ్చేష్టుడైపోవు (అక్కడ నీవు ఏమి చేసి వచ్చావో అదంతా మీ నాన్నకు చెప్పేస్తా అనేసరికి వాడి పై ప్రాణాలుపైనే పోయాయి)

**పొగరుబోతు** = గర్విష్ఠి
**పొట్ట చీలిస్తే అక్షరం లేదు** = నిరక్షరకుక్షి / నిరక్షరాస్యుడు
**పొట్ట చేతబట్టుకొని** = "ఏం చేస్తారు, అక్కడ పనుల్లేక పొట్ట చేతపట్టుకుని ఈ ప్రాంతం వలస వచ్చారు" (భుక్తికోసం వెతుకులాట)
**పొట్టకొట్టడం / కడుపుకొట్టడం** = జీవనం పడగొట్టడం (నోటికాడ కూడు లాక్కున్నట్టు)
**పొట్టి బుడంకాయ** = పొట్టివాడు / మరుగుజ్జువాడు
**పొడగిట్టదు** = పొత్తు గిట్టదు / వాసన కూడా పడదు
**పొడుపుకథ** = లోతైన అర్థాలతో కూడిన సమస్య ("మా పిల్లవాడు పొడుపుకథలంటే చెవి కోసుకుంటాడు")
**పొద్దుబోక** = కాలక్షేపార్థం (చెప్పే కథలు, గాథలు, ముచ్చట్లు)
**పొయ్యిలో పిల్లి లేవలేదు** = వంటచెయ్యలేదు (మా వాళ్ళింట్లో ఈ ఒక్కరోజేమిటి, నాలుగు రోజులనుంచీ పొయ్యిలో పిల్లి లేవలేదు
**పొరపొచ్చాలు** = తగాదాలు / కపటాలు
**పొరుగింటి పుల్లకూర రుచి** = ఇంట్లో చేసింది పనికిరాదు వీధిలోది పనికొస్తుందన్నట్టు.
**పొలికేకలు** = పొలాల చుట్టూ తిరుగుతూ పశువుల్ని,

[illegible] (వాడికి [illegible])

**పొచిపోత అయ్యలు / పోసుకోలు (కబుర్లు) రాయుళ్ళు** = కబుర్లరాయుళ్ళు
**పోడుగొట్టు** = పోడు వ్యవసాయం అంటే ఇదే. అడవిలో ఉన్న చెట్లను కొట్టేసి భూమిని సేద్యానికి వీలుగా మలచడం
**పోతురాజు** = తిండిపోతు (వాడా! తిండికి పోతురాజు గాని పనికి కాదు నాయనా)

**ప్రత్యుత్థానం చేయడం** = పెద్దలు వచ్చినప్పుడు గౌరవంతో లేచి నిలబడడం శిష్టాచారం
**ప్రథమ కోపం** = చిరుకోపం (అయితే వెంటనె చల్లపడి పోయే వ్యక్తులపట్ల వర్తింపజేసే పలుకుబడి కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధాన్లుకి ప్రథమ కోపం వుంటుంది)
**ప్రస్థాన భేరి సరచు** = ప్రయాణ సూచకంగా భేరి వాయించడం

**ప్రాణం గుప్పెట్లో పెట్టుకొని** = భయం భయంతో ఉండడం (కామయ్య గారితోపు దాటేదాకా నేను ప్రాణం గుప్పెట్లో పెట్టుకున్నాను)
**ప్రాణం లేచివచ్చినట్లు** = ఆందోళనతో ఉన్న మనస్సు తేరుకోవడం (వాడు అమెరికా వెళ్ళి నాలుగేళ్ళయింది వాడ్నావేళ చూసేసరికి నా ప్రాణం లేచివచ్చింది)
**ప్రామినాకులు** = వేదాలు

**పొద్దుక్రైవాలడం** = సాయంకాలం కావడం
**ప్రోదివెట్టు / ప్రోతిసేయు** = పోషించు / అభివృద్ధి పరచు.

**బంగారంలాంటివాడు** = మంచివాడు / బుద్ధిమంతుడు
**బండచాకిరి** = మొద్దు చాకిరి.
**బండారం బయటపడు** = గుట్టురట్టగు.
**బంతికూడు** = పంక్తి భోజనం
**బంతిలో పక్షపాతం** = తగదని చెప్పడం.

బంతులు సాగు = పంక్తులు సాగు (హవాపుడి ఎవరంప యిరు వచ్చే బంతిలో కూర్చుండరుగాని, ఇప్పుడె వాళ్ళు బంతులు సాగిస్తున్నాయి )
బట్టలమప్పువాన = కొద్దిపాటి చినుకులు
బట్ట ఎగురవేసాడు = దివాళా తీసిన వాడ్ని గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు వాడకం
**బట్టతలకు మోకాలుకు ముడివేయు** = అసాధ్యమైన పనులను చేయడానికి ప్రయత్నించే బాపతును ప్రస్తావించినప్పుడు వాడకం (వాడే నాయనా! జాగ్రత్త, బట్టతలకూ, మోకాలుకూ ముడివేయగల సమర్థుడు)
**బడితపూజ** = దేహశుద్ధి (రెండు పీకడం మాటవిననప్పుడు!)
**బతికి బట్టకట్టు** = కష్టాల్నుంచి తేరుకొని హాయిగా జీవించడం
**బమ్మకైన పుట్టు రిమ్మ తెగులు** = ఎంతటివాడైనా సందు దొరికితే చాలు బుద్ధి వక్రిస్తుందని చెప్పడం
**బయకాడు** = సంగీత విద్వాంసుడు (బయకారు లొనర్చినట్టి ప్రావేశిక మంగళ ధ్రువలు )
**బరితప్పి వ్యవహరించు** = హద్దుమీరి ప్రవర్తించడం
**బలాదూరు** = తీసికట్టు / దిగదుడుపు (నీవు లక్ష చెప్పు, వాడి ముందు వీడు బలాదూరు)
**బలుసాకు తిని బతుకు / ఊపిరుంటే ఉప్పమ్ముకొని తినవచ్చు** = ఎలాగోలా జీవించు (మా కష్టం మాకు చాలు బలుసాకు తినైనా బతుకుతాంగాని మీ మాటలు, దౌర్జన్యాలు భరించలేం)

**బాదరాయణ సంబంధం** = అసలు సంబంధం ఏదీ ఉండదు కానీ ఎలాగొలా ఏర్పడిన కాకతాళీయ స్నేహాన్ని లేదా సంబంధాన్ని ఇలా అంటారు
**బాసలు చేయు** = ప్రమాణాలు చేయు
**బాసీపెట్టు / బాసికపెట్టు** = పద్మాసనం

**బిక్కమొగం వేయు** = తెల్లమొగం వేయు
**బియ్యం నిండుకున్నాయి** = బియ్యం లేవని చెప్పడం
**బిర్రబిగిసి కూర్చోడం** = గర్వంతో నీలగడం
**బిళ్ళబొట్టు** = చుక్కబొట్టు
**బిసిబిసి మాటలు** = జిలిబిలి పలుకులు

**బీజాక్షరాలు** = తొలి అక్షరాలు (కాళిదాసు నాలికమీద కాళికాదేవి బీజాక్షరాలు వ్రాసిందని కథ)
**బీజావాసనం చేయడం** = శంకుస్థాపన చేయడం / ప్రారంభించడం / విత్తనాలు చల్లడం
**బీరకాయ చిక్కు** = చాలా చిక్కైనది

**బుజాలు తడుముకోవడం** = ఎవరో ఏదో అన్నప్పుడు ఎవడికి వాడు తనను గురించే అన్నారేమో అనుకొని విచారించే వారికి వర్తింపు
**బుట్టదాఖలు చేయు** = నిర్లక్ష్యం చేయడం / లెక్క చేయకపోవడం / పనికిరాని కాగితాన్ని చెత్తబుట్టలోకి తోయడం
**బుట్టలో వేసుకోవడం** = తన వశం చేసుకోడం
**బుర్ర రామకీర్తనపాడు** = తిట్టడం / తన్నడం (వాడు చెప్పిన పని చేయనదుకు తండ్రి వాడి బుర్ర రామకీర్తన పాడాడు)
**బుర్రమీసాలు** = గుబురైన (లావాటి) మీసాలు

**బేరసారాలు** = వ్యాపారం (బేరం ఆడితే సారం కూడా వుండాలన్న అర్థంలో) ''సంగీతముచేత బేర సారములుడిగెన్'' అని చింతామణిలో సుబ్బిసెట్టి అంటే సంగీతం మరిగి వ్యాపారం దెబ్బతిన్నదని అర్థం

**బొందితో కైలాసం చేరు** = ముక్తి పొందడం అన్న అర్థంలో అయితే బొంది అంటే శరీరం. అంటే శరీర ముక్తి అన్నమాట అసాధ్యాన్ని సాధించడానికి యత్నించడం
**బొడ్డూడనివాడు** = వయస్సురానివాడని / పసిపిల్లాడేననడం ('అంత బొడ్డూడనివాడు మీవాడు నాకేం చేతకాదంటాడు ఏం చెప్పినా.)

**బోళా మనిషి** = అరమరికలు లేనివాడు / అల్ప సంతోషి / ఉబ్బిపోయే మనిషి (పరంధామయ్య అంత బోళా బోళా మనిషి ఇంకొకడు మనకు దొరకడడంటే నమ్మండి).

**బ్రహ్మకళ** = గొప్ప వర్చస్సు
**బ్రహ్మచెవుడు** = అంతులేని చెవుడు
**బ్రహ్మముడి** = ఒక పట్టాన ఊడని ముడి / జందెంలోని పోగుల ముడిని ఇలా అంటారు పెండ్లిలో నూతన దంపతుల కొంగుముళ్ళు కలిపి వేసిన ముడిని ఇలా అంటారు ఏ బంధానికైనా వర్తింపచేసుకోవచ్చు
**బ్రహ్మరాత / బ్రహ్మ లిపి** = అర్థంకాకుండా రాసే రాతని ఇలా అంటారు
**బ్రహ్మవిద్య** = క్లిష్టమైన విద్య అని
**బ్రాహ్మణ వ్యవసాయం** = పట్టించుకొని వ్యవసాయం/ ఫలసాయం లేని సాగు (ఇప్పుడు అన్ని పల్లెల్లోనూ ఈ బాపతు ఉంది)

**భగీరథ ప్రయత్నం** = మహా ప్రయత్నం
**భరతవాక్యం** = ఆఖరిమాట / ఆఖరి వాక్యం
**"భట్టిప్రోలు పంచాయతీ"** = ఎటూ తేల్చని పరిష్కారం (''యజ్ఞం'' కథలో శ్రీరాములు నాయుడి తీర్పులాగా సగమటూ సగమిటూ చెప్పే తీర్పు
**భట్రాజు పొగడ్త** = అతిగా పొగడటం
**భారతం** = అదో పెద్ద కథ (వాడు చేసిన పనులు చెప్పాలంటే అదో పెద్ద భారతంలే!)

**భుజాలు రాసుకొని తిరుగు** = అతి స్నేహంగా వుండడం

**మంకుపట్టు పట్టు** = మొండిపట్టు పట్టడం (టిక్కెట్టు రాకపోయినా సరే ఇండిపెండెంట్‌గానయినా ఎన్నికల్లో పోటీ చేస్తానని వాడు మొండిపట్టు పట్టుకొని కూర్చున్నాడు)
**మంచికిపోతే చెడు ఎదురగు** = ఉపకారానికి మారు అపకారం జరగడం.
**మంచినీళ్ళప్రాయంగా** = వాడు ఉపన్యాసం మంచినీళ్ళ ప్రాయంగా దంచేస్తాడు / సులభంగా.
**మంటగలయు** = నాశనమైపోవడం.
**మంత్రాంగం** = మంత్రిత్వం / తంత్రం
**మందీ మార్బలం** = హంగు / పరివారం
**మక్కికి మక్కిగా** = అసలుకు దీటైన నకలుగా (వాడు పరీక్షల్లో అంతకు ముందు భట్టీయం

వేసినవీన్నీ మక్కికి మక్కీగా దించేశాడు )

**మడమలు తొక్కుకుంటూ** = తొక్కి ఎలాటగా వెళ్ళడం / వెన్నంటి తరమడం

**మధుపర్కం** = పెండ్లిలో పిల్లనిచ్చిన మామ పెండ్లికొడుక్కి అందిచ్చే పదార్థం పెరుగు, నెయ్యి, నీరు, తేనె, పంచదార అనే అయిదు పదార్థాల సముదాయాన్ని ఇలా అంటారు

**మనసిచ్చి మాటాడు** = ఆప్యాయంగా / ఆదరంగా మాట్లాడు

**మనసు రాయి చేసుకొను** = గుండె దిటవు చేసుకొను

**మనుగుడుపులు** = పెళ్ళి అయిన తరువాత నూతన వధూవరులను సరదా చేసే సంప్రదాయం ఇంగ్లీషులో 'హనీమూన్'కు ఇది సరిపోతుంది వివాహం తరువాత జాలీ ట్రిప్ వెళ్ళడం ఇందులో భాగమే విందులారగించడానికి ఇది మరో పేరు

**మనుగుడుపు పెండ్లికొడుకుల మాదిరి** = అత్తవారింట బాగా తిని బలిసిన వాళ్ళను ఇలా అంటారు

**మనుషులు పోయినా మాట నిలుస్తుంది** = మాట తప్పరాదనడం

**మట్టిగొట్టుకుపోవు** = నాశనమైపోవు

**మభ్యపెట్టు** = నమ్మించి మోసం చేయడం (వాడన్ని విషయాలూ తెలిపివుంటే ఇంత కష్టం రాకపోను నన్ను మభ్యపెట్టి దొంగచాటుగా పనులు చేసుకొచ్చాడు )

**మీరుసంజ (మలిసంజ)** = సాయంసంధ్య (ఒక దీవి తొలునంజ ఉన్మేషమున బొందు ఉదయించు మరుసంజ యెండు దీవి - శ్రీనాథుడు) తొలిసంజ ఉదయం, మలిసంజ సాయంత్రం

**మల్లగుల్లాలు పడు** = విషయం తెగక గుంపుచింపులు పడడం

**మసిపాత కప్పిన మాణిక్యం** = మాణిక్యం మాణిక్యమే దాన్ని ఎక్కడ దాచినా దాని విలువ దానిదే. మసిగుడ్డలో పెట్టినంత మాత్రాన దాని విలువ తరగదు అంటే, మనిషికి మంచి గుణం ప్రధానంగాని కులమూ, కాసులూ కావని అర్థం

**మహాప్రసాదం** = పెద్దలేదైనా ఇచ్చినపుడు, లేదా ఆదేశించినపుడు అంగీకార సూచకంగా ఇలా అనడం సంప్రదాయం

**మహాప్రస్థానం** = పెద్దల నిర్యాణానికి సాధారణంగా ఇలా అంటారు అంటే లోకాంతర యాత్రను ఇలా ప్రస్తావిస్తారు కానీ, మహాప్రస్థానం అంటే సుదీర్ఘ యాత్ర అన్న పాజిటివ్ అర్థం కూడా వుంది శ్రీశ్రీ "మహా ప్రస్థానం" అలాంటి ఆదర్శ లోకానికి ఆహ్వాన గీతిక

**మాటపడకూడదు** = తప్పు పట్టడానికి మరొకరికి అవకాశం ఇవ్వకూడదు

**మాటమాత్రాన** = క్షణంలో / ఇలా చెప్పానో లేదో అన్నట్టు

**మాటమిగులు** = ఎక్కువ తక్కువగా మాట్లాడడం

**మాటలతో కడుపు నిండు** = ఎవరైనా ఉత్తుత్తి కబుర్లు చెబుతున్నప్పుడు ప్రయోగం

**మారుబేరం** = వస్తువును ఒకరిచ్చిన ధరకు వేరొకరు మరొక దర చెప్పి చేసే బేరం (ఒక చోట కొనడం, మరోచోట లాభానికి అమ్మడం )

**మింగలేక కక్కలేక** = ఎటూ పాలుపోని పరిస్థితి / ఏమీ చేయలేక

**మింజుమలె** = సుమారు (కోర్టు పరిభాషలోనూ వ్యాపారంలోనూ వాడకం)

**మింటికి మంటికి ఏకధారగా** = అవిశ్రాంతంగా (ఏడ్వడం)

**మిట్టిపడు / మిడిసిపడు** = మిడిసిపడు / గర్వించు ("నాలుగు రాళ్ళు సంపాదించాడో లేదో మిడిసిపడు తున్నాడు")

**మిడిమిడి జ్ఞానం** = స్వల్పజ్ఞానం

**మిడిమేళం** = మిడిసిపడేవాడు ("మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్"సుమతీ కారడు)

**మిన్నూ మన్నూ తెలియక** = ఒళ్ళు తెలియక

**మిన్ను విరిగి మీదపడినా** = ధైర్యం కోల్పోకుండా వుండడం / తొణక్కుండా బెణక్కుండా వుండడం

**మీనమేషాలు లెక్కపెట్టడం** = అనుమానించడం ("ఇంత వివరంగా చెప్పింతర్వాత కూడా ఇంకా మీనమేషాలు లెక్కిస్తున్నావేమిట్రా")

**మీసం తిప్పుతున్నాడు / మీసాలు దువ్వడం** = సవాలు చేస్తున్నాడు / పౌరుషం ప్రదర్శిస్తున్నాడు
**మీసం మీద చెయ్యివేసి** = అడ్డు నిలిచేదెవరో చూస్తాం అప్పట్టు చూడ్డం
**మీసముంటే రా** = కలేజా ఉంటే కాసుకో
**మీసాలపై నిమ్మకాయలు నిలుపు** = అంత పెద్ద మీసాలని అర్థం వీటినే వెనుకటికి బోయదొరలు మీసాలపై నిమ్మకాయలు నిలిపి సందా చేసేవారు

**ముంగిట పెన్నిధి** = దగ్గరలోనె ఉన్న నిధి
**ముంగిలాగా** = మూతి ముడుచుకున్నట్టుగా
**ముంజీతం** = పనికాలం పూర్తి కాకుండానే ముందుగా ఇచ్చె జీతం
**ముంజేతి కంకణానికి అద్దమెందుకు?** = చేతి కంకణం అందరికీ కనిపించదే మళ్ళీ దాన్ని అద్దమెత్తి చూపాల్సిన అవసరం లేదనడం స్పష్టంగా ఉన్నదానికి సాక్ష్యం దేనికి?
**ముళ్ళపై కూర్చోడం** = ఎప్పటికప్పుడు ఎప్పుడు లేచిపోదామా అన్నట్టు అశాంతిగా కూర్చోడం (వాడొచ్చి అరగంట కూడా కాలేదు ముళ్ళపైన కూర్చున్నట్లు వెళ్ళిపోతా, వెళ్ళిపోతా అంటాడు)
**ముందటేడు** = నిరుడు గాక అంతకు పూర్వపు సంవత్సరం
**ముందొచ్చిన చెవులకంటే వెనుకొచ్చిన కొమ్ములు వాడి** = పాత స్నేహాలు, చుట్టరికాలు మరిచి కొత్త స్నేహాలు చేసే వాళ్ళను ఎద్దేవాగా ఇలా అంటారు
**ముక్కోపి (ముక్కుకు ముందు మూరెడు కోపం)** = అమితమైన కోపం (వాడు మాటంటే పడడు, అసలే ముక్కోపి జాగ్రత్త!)
**ముక్కుపుటాలదురు** = కోపంతో ముక్కుగూటాలు పెరగడం / కందగడ్డ కావడం
**ముక్కద్దాలు** = కళ్ళజోడు / కంటి అద్దాలు
**ముక్కుకు సూటిగా పోవడం** = న్యాయనమ్మతంగా పోవడం.
**ముక్కుదూలం ఎగిరిపోతుంది** = పగలగొడతానని బెదిరించడం
**ముక్కుపచ్చలారని** = లేతవయస్సులో వున్న వయస్సు రాని
**ముక్కుపుడక** = ముక్కుకు తగిలించే ఆభరణం
**ముక్కూమొగం తెలీకుండా** = ఎన్నడూ చూడని మనుషుల పట్ల జాగ్రత్త కోసం తెలిపే హెచ్చరిక
**ముక్కులోకి రాదు / సరిపోదు** = ఇచ్చిన పదార్థం అంత తక్కువని చెప్పడం
**ముక్కూ చెవులూ కోసి** = అవమానించి పంపడం (శూర్పణఖ కథ)
**ముఖం వాచేట్టు పెట్టడం** = బాగా తిట్టి పంపించడం
**ముఖం ముడుచుకున్నాడు** = అయిష్టంగా అసంతృప్తిగా ముఖం పెట్టడం
**ముత్యాల పందిరి / ముత్యాల ముగ్గు** = జానపద కథలు ఆధారంగా వచ్చిన పలుకుబళ్ళు
**ముద్దులు మూటగట్టు** = ముద్దువచ్చేట్టుగా ముచ్చటగా వుండడం
**మునికోల / ములుకోల** = కొరడా / ముల్లుకర్ర
**మునిమాపు వేళ** = సాయంత్రం వేళ / సంజ
**ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించు** = నానా ఇబ్బందులు పెట్టడం
**ముసలం పుట్టడం** = ప్రమాదం కలగడం / గందరగోళం ఏర్పడడం (నిన్నటిదాకా ఐక్యంగా ఉన్నట్టు కన్పించిన పార్టీలో నేడు ముసలం పుట్టింది)
**ముసుగు తన్నిపెట్టి పడుకోడం** = జబ్బు చేసినప్పుడు గాని, అసంతృప్తిగా వున్నప్పుడుగాని మనిషి ముసుగు తన్నిపెట్టి పడుకోడం

**మూగచెవిటి ముచ్చట** = ఎవరికీ బోధపడదని చెప్పడానికి ఇదో పలుకుబడి.
**మూటగట్టుకొని పోతావా** = "ఏం అంత ఆస్తి ఏడిచిందిగదా, నాలుగు డబ్బులు వాడికి సర్దితే ఏం పోయింది. ఆస్తినంతా మూటగట్టుకొని పోతావా?
**ముమ్మాటికీ** = తప్పకుండా
**మూడుముళ్ళూ పడితే** = పెండ్లి అయితే (ఆ మూడు ముళ్ళూ పడితే అమ్మాయి తండ్రి కాస్త తేరుకుంటాడు).
**మూడో కంటికి తెలీకుండా / మూడో చెవిన పడకుండా** = అతి గోప్యంగా ("నేనేది పురమాయించినా

వేసివిప్పి మక్కికి మక్కీగా ఒప్పచెప్పాడు )

**మడమలు తొక్కుకుంటూ** = తోపులాటగా వెళ్ళడం / వెన్నంటి అనుసరించు

**మధుపర్కం** = పెండ్లిలో పిల్లనిచ్చిన మామ పెండ్లికొడుక్కి అందిచ్చే పదార్థం పెరుగు, నెయ్యి, నీరు, తేనె, పంచదార అనే ఐదు పదార్థాల సముదాయాన్ని ఇలా అంటారు

**మనసిచ్చి మాటాడు** = ఆప్యాయంగా / ఆదరంగా మాట్లాడు

**మనసు రాయి చేసుకొను** = గుండె దిటవు చేసుకొను

**మనుగుడుపులు** = పెళ్ళి అయిన తరువాత నూతన వధూవరులను సరదా చేసే సంప్రదాయం ఇంగ్లీషులో 'హనీమూన్'కు ఇది సరిపోతుంది వివాహం తరువాత జాలీ ట్రిప్ వెళ్ళడం ఇందులో భాగమే విందులారగించడానికి ఇది మరో పేరు

**మనుగుడుపు పెండ్లికొడుకుల మాదిరి** = అత్తవారింట బాగా తిని బలిసిన వాళ్ళను ఇలా అంటారు

**మనుషులు పోయినా మాట నిలుస్తుంది** = మాట తప్పరాదనడం

**మట్టిగొట్టుకుపోవు** = నాశనమైపోవు

**మభ్యపెట్టు** = నమ్మించి మోసం చేయడం (వాడన్ని విషయాలూ తెలిపివుంటే ఇంత కష్టం రాకపోను నన్ను మభ్యపెట్టి దొంగచాటుగా పనులు చేసుకొచ్చాడు )

**మీరుసంజ (మలిసంజ)** = సాయంసంధ్య (ఒక దీవి తొలుసంజ ఉన్మేషమున బొందు ఉదయించు మరుసంజ యెండు దీవి - శ్రీనాథుడు) తొలిసంజ ఉదయం, మలిసంజ సాయంత్రం

**మల్లగుల్లాలు పడు** = విషయం తెగక గుంపుచింపులు పడడం

**మసిపాత కప్పిన మాణిక్యం** = మాణిక్యం మాణిక్యమే దాన్ని ఎక్కడ దాచినా దాని విలువ దానిదే మసిగుడ్డలో పెట్టినంత మాత్రాన దాని విలువ తరగదు అంటే, మనిషికి మంచి గుణం ప్రధానంగాని కులమూ, కాసులూ కావని అర్థం

**మహాప్రసాదం** = పెద్దలేదైనా ఇచ్చినపుడు, లేదా ఆదేశించినపుడు అంగీకార సూచకంగా ఇలా అనడం సంప్రదాయం.

**మహాప్రస్థానం** = పెద్దల నిర్యాణానికి సాధారణంగా ఇలా అంటారు అంటే లోకాంతర యాత్రను ఇలా ప్రస్తావిస్తారు కానీ, మహాప్రస్థానం అంటే సుదీర్ఘ యాత్ర అన్న పాజిటివ్ అర్థం కూడా వుంది శ్రీశ్రీ "మహా ప్రస్థానం" అలాంటి ఆదర్శ లోకానికి ఆహ్వాన గీతిక

**మాటపడకూడదు** = తప్పు పట్టడానికి మరొకరికి అవకాశం ఇవ్వకూడదు

**మాటమాత్రాన** = క్షణంలో / ఇలా చెప్పానో లేదో అన్నట్టు

**మాటమిగులు** = ఎక్కువ తక్కువగా మాట్లాడడం

**మాటలతో కడుపు నిండు** = ఎవరైనా ఉత్తుత్తి కబుర్లు చెబుతున్నప్పుడు ప్రయోగం

**మారుబేరం** = వస్తువును ఒకరిచ్చిన ధరకు వేరొకరు మరొక ధర చెప్పి చేసే బేరం (ఒక చోట కొనడం, మరోచోట లాభానికి అమ్మడం )

**మింగలేక కక్కలేక** = ఎటూ పాలుపోని పరిస్థితి / ఏమీ చేయలేక

**మింజుమలె** = సుమారు (కోర్టు పరిభాషలోనూ వ్యాపారంలోనూ వాడకం)

**మింటికి మంటికి ఏకధారగా** = అవిశ్రాంతంగా (ఏడ్వడం)

**మిట్టిపడు / మిడిసిపడు** = మిడిసిపడు / గర్వించు ("నాలుగు రాళ్ళు సంపాదించాడో లేదో మిడిసిపడు తున్నాడు")

**మిడిమిడి జ్ఞానం** = స్వల్పజ్ఞానం

**మిడిమేళం** = మిడిసిపడేవాడు ("మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్"సుమతీ కారదు)

**మిన్నూ మన్నూ తెలియక** = ఒళ్ళు తెలియక

**మిన్ను విరిగి మీదపడినా** = ధైర్యం కోల్పోకుండా వుండడం / తొణక్కుండా బెణక్కుండా వుండడం.

**మీనమేషాలు లెక్కపెట్టడం** = అనుమానించడం ("ఇంత వివరంగా చెప్పింతర్వాత కూడా ఇంకా మీనమేషాలు లెక్కిస్తున్నావేమిట్రా")

**మీసం తిప్పుతున్నాడు / మీసాలు దువ్వడం** = సవాలు చేస్తున్నాడు / పౌరుషం ప్రదర్శిస్తున్నాడు
**మీసం మీద చెయ్యేవేసి** = అడ్డు నిలిచేదెవరో చూస్తాం అన్నట్టు చూడ్డం
**మీసముంటే రా** = కలేజా ఉంటే కాసుకో
**మీసాలపై నిమ్మకాయలు నిలుపు** = అంత పెద్ద మీసాలని అర్థం వీటినే వెనుకటికి భోయదొరలు మీసాలపై నిమ్మకాయలు నిలిపి సందా చేసెవారు

**ముంగిట పెన్నిధి** = దగ్గరలోనే ఉన్న నిధి
**ముంగిలాగా** = మూతి ముడుచుకున్నట్టుగా
**ముంజీతం** = పనికాలం పూర్తి కాకుండానే ముందుగా ఇచ్చె జీతం
**ముంజేతి కంకణానికి అద్దమెందుకు?** = చేతి కంకణం అందరికీ కనిపించదె మళ్ళీ దాన్ని అద్దమెత్తి చూపాల్సిన అవసరం లేదనడం స్పష్టంగా ఉన్నదానికి సాక్ష్యం దేనికి?
**ముళ్ళపై కూర్చోడం** = ఎప్పటికప్పుడు ఎప్పుడు లేచిపోదామా అన్నట్టు అశాంతిగా కూర్చోడం (వాడొచ్చి అరగంట కూడా కాలేదు ముళ్ళపైన కూర్చున్నట్లు వెళ్ళిపోతా, వెళ్ళిపోతా అంటాడు)
**ముందటేడు** = నిరుడు గాక అంతకు పూర్వపు సంవత్సరం
**ముందొచ్చిన చెవులకంటే వెనుకొచ్చిన కొమ్ములు వాడి** = పాత స్నేహాలు, చుట్టరికాలు మరిచి కొత్త స్నేహాలు చేసే వాళ్ళను ఎద్దేవాగా ఇలా అంటారు
**ముక్కోపి (ముక్కుకు ముందు మూరెడు కోపం)** = అమితమైన కోపం (వాడు మాటంటే పడడు, అసలే ముక్కోపి జాగ్రత్త!)
**ముక్కుపుటాలదురు** = కోపంతో ముక్కుగూటాలు పెరగడం / కందగడ్డ కావడం
**ముక్కద్దాలు** = కళ్ళజోడు / కంటి అద్దాలు
**ముక్కుకు సూటిగా పోవడం** = న్యాయసమ్మతంగా పోవడం
**ముక్కుదూలం ఎగిరిపోతుంది** = పగలగొడతానని బెదిరించడం
**ముక్కుపచ్చలారని** = లేతవయస్సులో వున్న వయస్సు రాని
**ముక్కుపుడక** = ముక్కుకు తగిలించే ఆభరణం
**ముక్కూమొగం తెలీకుండా** = ఎన్నడూ చూడని మనుషుల పట్ల జాగ్రత్త కొసం తెలిపె హెచ్చరిక
**ముక్కులోకి రాదు / సరిపోదు** = ఇచ్చిన పదార్థం అంత తక్కువని చెప్పడం
**ముక్కూ చెవులూ కోసి** = అవమానించి పంపడం (శూర్పణఖ కధ)
**ముఖం వాచేట్టు పెట్టడం** = బాగా తిట్టి పంపించడం
**ముఖం ముడుచుకున్నాడు** = అయిష్టంగా / అసంతృప్తిగా ముఖం పెట్టడం
**ముత్యాల పందిరి / ముత్యాల ముగ్గు** = జానపద కథలు ఆధారంగా వచ్చిన పలుకుబళ్ళు
**ముద్దులు మూటగట్టు** = ముద్దువచ్చేట్టుగా ముచ్చటగా వుండడం
**మునికోల / ములుకోల** = కొరడా / ముల్లుకర్ర
**మునిమాపు వేళ** = సాయంత్రం వేళ / సంజ
**ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించు** = నానా ఇబ్బందులు పెట్టడం
**ముసలం పుట్టడం** = ప్రమాదం కలగడం / గందరగోళం ఏర్పడడం (నిన్నటిదాకా ఐక్యంగా ఉన్నట్టు కన్పించిన పార్టీలో నేడు ముసలం పుట్టింది)
**ముసుగు తన్ని పెట్టి పడుకోడం** = జబ్బు చేసినపుడు గాని, అసంతృప్తిగా వున్నపుడుగాని మనిషి ముసుగు తన్నిపెట్టి పడుకోడం.

**మూగచెవిటి ముచ్చట** = ఎవరికీ బోధపడదని చెప్పడానికి ఇదో పలుకుబడి
**మూటగట్టుకొని పోతావా** = "ఏం అంత ఆస్తి ఏడిచిందిగదా, నాలుగు డబ్బులు వాడికి సర్దితే ఏం పోయింది. ఆస్తినంతా మూటగట్టుకొని పోతావా?
**ముమ్మాటికీ** = తప్పకుండా
**మూడుముళ్ళూ పడితే** = పెండ్లి అయితే (ఆ మూడు ముళ్ళూ పడితే అమ్మాయి తండ్రి కాస్త తేరుకుంటాడు).
**మూడో కంటికి తెలీకుండా / మూడో చెవిన పడకుండా** = అతి గోప్యంగా ("నేనేది పురమాయించినా

మా వాడు మూడో కంటికి తెలియకుండా వెళు కొస్తాడు")
**మూడో కన్ను తెరిచాడంటే** = అంత కోపిష్ఠి అన్నమాట
**మూతులు నాకేరకం** = ఇచ్చకాలు ఆడె బాపతును ఇలా అంటారు
**మూతివిరుపులు** = అయిష్టతను ప్రకటించడం / అసంతృప్తిని వెల్లడించడం
**మూణ్ణాళ్ళ ముచ్చట** = స్వల్పకాలిక ఆనందం
**మూర్ధాభిషేకం** = పట్టాభిషేకం
**మూల ముట్టుగనరుకు** = మొదలంటా నరుకు
**మూలవిరాట్టు** = ఈ అనర్థాలన్నిటికి వాడే మూలవిరాట్టు (కారణం)
**మూసిన కన్ను తెరవలేదు** = జ్వరం వల్లనో,దెబ్బవల్లనో స్పృహలేకుండా పడి ఉన్నప్పుడు వాడుక
**మూసిపెడితే పాసిపోతుంది** = దేన్నీ దాచి కంపు చేసుకోరాదని హితవు (మీవాడి చేష్టలు నీవు చెప్పకపోతే నాకు తెలియవా? మూసిపెడితే పాసిపోతుంది )

**మెచ్చి మేకతోలు కప్పు** = వ్యంగ్యార్థంలోనే ఈ పలుకుబడిని వాడతారు ("పరంధామయ్యా నీకు చేసిన మేలేమిటి నాయనా, నష్టం నెత్తిన రుద్దడం తప్ప? మెచ్చి మేకతోలు కప్పాడా?")
**మెచ్చక మెచ్చుకొను** = ఎవరినైనాసరే అతిగా పొగడకుండా తగిన మేరకే మెచ్చుకోవడం మంచిదన్న అర్థంలో ప్రయోగం ("మెచ్చక మెచ్చితి మంచు గ్రుచ్చులై మెచ్చుకు డిచ్చమెచ్చుగని మెచ్చుడు మెచ్చొక మానమైనచో మెచ్చియు మెచ్చకుండకయు మెచ్చుడు సత్కవులార మ్రొక్కెదన్") - దశకుమార చరిత్ర
**మెడకాయపైన తలకాయ నిలవడంలేదు** = "కాస్త ఆస్తి కలిస్తే చాలు వాడి మెడకాయపైన తలకాయ నిలవదు" (అంత తలపొగరు)
**మెట్టిన ఇల్లు** = కాలుపెట్టిన చోటు / అత్తవారిల్లు (వారి అమ్మాయి పుట్టినింటికీ మెట్టినింటికీ పేరు తెచ్చింది.)
**మెడమీద కూర్చున్నాడు** = "ఇప్పటికిప్పుడు ఇస్తావా చస్తావా అని నా మెడమీద కూర్చున్నాడు"
**మేకపోతు గాంభీర్యం** = ధైర్యంలేకపోయినా ధైర్యంగా ఉన్నట్టు కన్పించడం
**మేడిపండు మేలిమి** = "మేడిపండు చూడ మేలిమై యుండు / పొట్టవిప్పి చూడ పురుగులుండు" (వేమన )
**మేలమాడు** = హాస్యమాడు ("వాడికి వావివరసలతో సంబంధం లేదు ప్రతివాడితో మేలమాడడం నేర్చాడు ")

**మొగమొగాలు చూచుకోవడం** = సమస్యను పరిష్కరించలేక వాళ్ళు మొగమొగాలు చూసుకోవడంతో సరిపెట్టుకున్నారు ఒకరి ఎదుట మరొకరుండే అవకాశం వచ్చినప్పుడు కూడా ఇలా అంటారు
**మొగమాటాలొద్దు** = కనికరం వద్దు / దాక్షిణ్యం చూపనక్కర్లేదు "చెప్పేదేదో మొగంమీదనే చెప్పెయ్యండి మొగమాటమొద్దు"
**(వాడి) మొగాననే పొద్దు పొడిచిందా?** = వాడే గొప్పా? వాడివల్లనే అంతయిందా?
**మొరిగే కుక్క కరవదు** = మాటకారేగాని చేతకారి కాదనడం / అపాయకారి కాదనడం

**మోచేతికింద నీళ్ళు తాగు** = పరాధీన బతుకు / ఒకరి కింద బతకడం "వాడు మన దగ్గర కబుర్లే, వాడిది రాజాగారి మోచేతికింది నీళ్ళు తాగే బతుకే ఈ రోజుకీ ఎవడికి తెలియదు?"
**మోడు బతుకు** = నిరర్థకమైన జీవితం

**'యం బ్రహ్మ'** = వాడా! 'యం బ్రహ్మ' (తిట్టు) వాజమ్మ / తెలివి తక్కువవాడు
**యక్షప్రశ్నలు** = అంతులేనన్ని ప్రశ్నలు
**యుగంధర ప్రజ్ఞ** = అసాధారణ ప్రతిభ

**రంధ్రాన్వేషి** = ఎప్పుడూ తప్పులు వెదకడమే విద్యగా ఉన్నవాడు
**రచ్చకీడ్చు** = బయటికి ఈడ్చు / వీధిలో నిలబెట్టు / కలహానికి దించు
**రచ్చపట్టు / రచ్చబండ** = ఊరు మధ్య ఓ చెట్టు, ఆ చెట్టు చుట్టూ అరుగు, అక్కడ ఊళ్ళోవాళ్ళు ఉబుసుపోక

వెరి కయిక్షాపడం
రివరవలు పుట్టడం = మనస్తాపాలు కలగడం

రాకొట్టు = ..వాయి వేయడం
రాచిరంపాన పెట్టు = అదేపనిగా బాధించడం
రామండాడిగా = అసంఖ్యాకంగా
రామబాణం = సురుక్కైన / గురితప్పిపోని
రామరాజ్యం = సుభిక్షంగా ఉన్న దేశానికి సంప్రదాయంగా వచ్చిన పేరు
**రాలుగాయి** = పోకిరీ
**రావణ కాష్టం** = ఆరిపోనిది

రివ్వు రివ్వున పరుగెత్తు = వడిగా / వేగంగా పరుగెత్తు

రుద్రభూమి = స్మశానం
రుద్రాక్షపిల్లి = కపట నాటకంగాడు / దొంగ వేషాలమారి
**రూకరుద్రు** = ధనం
**రూపురేఖలు** = అందచందాలు అన్నట్టుగా "వాడి రూపురేఖలు" చక్కగా ఉన్నాయని వాడుక

**రెంటికీ చెడిన రేవడి** = అటూ ఇటూ కాకుండా పోవడం.
**రెండు కళ్ళు చాలవు** = చెప్పనలవిగాని దృశ్యాలు అన్న అర్థంలో (సాలార్‌జింగ్ మ్యూజియం చూడ్డానికి రెండు కళ్ళు చాలవు)
**రెండు చేతులా** = చేతికి ఎముక లేకుండా / పుష్కలంగా (వాడు ఖర్చుకు వెనకాముందాడడు రెండు చేతులా వదులుతాడు)
**రెండు నాల్కలు** = మాట నిలకడలేని వాడికి వర్తించే పలుకుబడి
**రెండో మనువు** = రెండో వివాహం
**రెక్కల కష్టం** = శరీర కష్టం / కాయకష్టం
**రెక్కలు వచ్చు** = తన కాళ్ళపై తాను నిలబడగల స్వతంత్ర శక్తితో బతకగలగడం
**రెడ్డొచ్చె మొదలాడు** = "పాడిందే పాడరా పాచిపళ్ళ దాసరీ" అన్నట్టుగా కొంత కథ నడిచిన తరువాత తిరిగి అదే చెప్పవలసి వచ్చినప్పుడు వాడే పలుకుబడి

"రేగుచెట్టు భాగవతం" = అసలు విషయం తెలియదు అయినా అంతా తెలిసినట్టే నటించే బాపతు గురించి ప్రస్తావన వెనుకటికి ఓ గుడ్డివాడు భాగవతం చూడ్డానికి వెళ్ళాడట హాస్య ఘట్టం వచ్చినప్పుడల్లా తనను గింమని ప్రక్కన ఉన్నవాడికి చెప్పి, వాడు గీరినప్పుడల్లా నవ్వసాగాడట )
**రొట్టె విరిగి నేతిలో పడినట్లు** = 'పాయసం పైన నేతిచుక్కలు ఒలికినట్టు'గా నష్టం వస్తుందని అనుకొంటుండగా ఇట్టే లాభం జరిగిన సందర్భంలో ప్రయోగం
**రొష్టుపెట్టు** = అల్లరి పెట్టడం
**రొమ్ముల (మీద) కుంపటి** = తాళలేని వ్యథ / తీవ్ర బాధ (పెళ్ళయి అయిదేళ్ళయింది భర్త వచ్చి తీసుకు వెళ్ళడు అమ్మాయీ తనుగా వెళ్ళదు నాకీ వయస్సులో ఈవిడ వ్యవహారం రొమ్ములమీద కుంపటిగా తయారైంది.)

**లక్షణంగా మాట్లాడు** = పద్ధతిలో మాట్లాడు / చక్కగా మాట్లాడు
**లింగులిటుకులు** = ఎచ్చులు పోవడం
**లేత సొరకాయలు నరుకు (కోయు)** = కోతలు కోయు
**లేనిపోని వాదాలు** = పనికిమాలిన ఆరోపణలు / గిల్లికజ్జాలు
**లొటలొటగాడు** = వాగుడుగాయ
**లొడలొడవాగు** = బడబడా మాట్లాడడం / అర్థం లేకుండా వాగడం
**లోకాభిరామాయణం** =
**లోన లొటారం పైన పటారం** = పైపై డాబులే కాని వాడి దగ్గర సరుకు లేదనడం

**వంకలు తీర్చడం** = సరిదిద్దడం.
**వంటియింటి కుందేలు** = చేతిలో చిక్కినది, అన్న అర్థంలో / వంట ఇంటికి అంకితమైపోయిన స్త్రీ (ఆ స్థితినుంచి బయట పడాలని హితోపదేశం)
**వంతపాట పాడడం** = 'డూడూ' బసవన్నలా తలూపడం
**వట్టిగొడ్డు తాకట్టు** = వ్యర్థం. పాలివ్వని గొడ్డును

తాకట్టు పెట్టినా దండగేగదా!
**వడ్డించిన విస్తరి** = ఆర్జికలావ్సి పెట్టిన సిద్ధాన్నం ("వడ్డించిన విస్తరి మీ జీవితం")
**వడ్లగింజలో బియ్యపుగింజ** = అతి సామాన్య విషయం ఇది అయినా కొందరు అనవసరం తగాదాలకు, వాదాలకు దిగుతారు "ఇంతకూ ఏమిట్రా వాళ్ళ తగాదా అంటే వడ్ల గింజలో బియ్యపుగింజ" అంటే తీరాచూస్తే ఏమీ లేదని
**వదరుబోతు** = వాగుడు కాయ
**వర్షాకాలపు చదువు** = పైపై చదువులు / విలువలేని చదువు

**వాగ్ధాటి** = మంచినీళ్ళ ప్రాయంగా గడగడా మాట్లాడగలనేర్పు
**వాతప్పు** = మాటతప్పు
**వాపోవు** = ఏడవడం / విలపించడం (నిరసనార్థంలో, "తనను అదే పనిగా అందరూ ఆడిపోసుకుంటున్నారని వాడు నా దగ్గర వాపోయాడు")
**వావి వరుసలు లేకుండా** = "వాడి మాటలకేం! వావి వరుసలు అక్కర్లా? మేనత్త కూతుర్ని కాదని పిన్నమ్మ కూతుర్ని చేనుకుంటానంటాడేమిటి, లోకం నవ్విపోదూ?"

**విగ్రహపుష్టి (నైవేద్య నష్టి)** = (నిరసనార్థంలో) మనిషి ఆకారం ఒడ్డూ పొడుగూ అన్నీ బాగానే ఉన్నాయి. "వాడు విగ్రహపుష్టే కాని పొట్ట కోస్తే అక్షరం ముక్క లేదు".
**విధి విరామం లేకుండా** = నిర్విరామంగా
**విర్రవీగు** = గర్వపోతుగా వ్యవహరించు
**విశ్వామిత్ర సృష్టి** = కృత్రిమ సృష్టి
**విశ్వామిత్రుడు** = కోపిష్ఠి.
**విస్సన్న చెప్పిందే వేదం** = మారుమాట పనికిరాదు, ఆయన మాటే వేదవాక్యం అనడం.

**వీపు విమానం మోత మోగుతుంది** = బాగా దెబ్బలు తింటావనడం.
**వీర తాంబూలం** = లక్ష్యం సాధించి తీరుతానని ప్రతిజ్ఞ చెప్తూ వీరుడు తీసుకునే తాంబూలం
**వీరభద్ర పళ్ళెరం** = ఇదో శైవాచారం అశ్శరభ శ్శరభ అంటూ పళ్ళెరం పుచ్చుకొని విందంగం వేయడం
**వీరమద్దెల** = వీరత్వం చాటించే సాధనం
**వీసం కూడా తప్పులేదు** = ఏమాత్రం తప్పులేదు

**వెంట్రుకవాసిలో తప్పిపోయింది** = కొద్దిలోనె తప్పిపోవడం: "వద్దన్నా కారు స్పీడుగా పోనిచ్చాడు అయినా వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పిపోయింది"
**వెంట్రుక ముక్కతో సమానం** = ఖాతరు చేయకపోవడం "మంత్రి అయ్యేది, ముఖ్యమంత్రి అయ్యేది వాడికి వాళ్ళ మాట వెంట్రుక ముక్కతో సమానం."
**వెకిలి నవ్వు** = వెర్రిబాగుల నవ్వు
**వెట్టిచాకిరి** = కష్టానికి ప్రతిఫలం ఇవ్వకుండా గొడ్డు చాకిరీ చేయించడం. (వాడు వాళ్ళింట్లో ఇన్నేళ్ళు చేసిందంతా వెట్టిచాకిరియే)
**వెనకా ముందూ చూడకుండా** = తొందరబాటుగా చేసే పనికి వర్తించే పలుకుబడి అలాగే లాభనష్టాలు గణించకుండా చేసే పనికి కూడా ఈ పలుకుబడి వర్తింపు
**వెన్నతో పెట్టిన విద్య** = పుట్టుకతో అబ్బిన విద్య "కవిత్వం వాడికి వెన్నతో పెట్టిన విద్య"
**వెన్నుపోటు పొడువు** = వంచించడం (ఇప్పటిదాకా నాతో కలిసి వుంటానని చెప్పి ఎదుటివాడితో చేతులు కలిపి నాకు వెన్నుపోటు పొడిచాడు)
**వెన్నెముక లేదు** = సొంత కాళ్ళపై నిలబడలేని స్థితి / బలహీన మనస్తత్వం
**వెన్నెముక విరిగిపోయింది** = "తీరా అమ్మాయి పెళ్ళి మహూర్తం సమయానికి పెళ్ళి రద్దు చేసుకున్నామని వియ్యాలవారు చెప్పేసరికి వెన్నెముక కాస్తా విరిగిపోయిందిరా నాయనా"
**వెర్రి కుదిరింది రోకలి తలకు చుట్టమన్నట్లు** = తనమాట తప్పని తానే తెలుపుకుంటున్న సందర్భంగా వాడే పలుకుబడి.
**వెర్రిమాలోకం** = అయోమయం.
**వెలలేని సొమ్ము** = ధరకట్టలేమని చెప్పడం / అమూల్యం

